# ఆంధ్రపత్రిక



వెల రు.2 దుర్ముఖి సంవత్సరాది సంచిక. 1956-57

# ఉగాది

---

ధాత, విధాత
"పగలు" "రేయి" అనే
తెలుపు నలుపు దారములతో
"దిన"మనే వస్త్రాన్ని నేస్తున్నారని
భారతపురాణము చెప్పుచున్నది -

నేటి -

లక్షకు పైగా
నేర్పరులైన
ఆంధ్ర చేనేత పారిశ్రామికులు
చేనేత సహకార సంఘములలో
సుందరమైన వస్త్రాలను
మీ కొరకు నిర్మిస్తున్నారు.

— * —

మా వస్త్ర ధారణ ద్వారా
ఈ "ఉగాది" సర్వులకు
శుభప్రదము కావలెనని
ఆశిస్తున్నాము.

* * *

[illegible]

[illegible]

1956-57






# జయం మనదే

N.T. రామారావు · అంజలి · జానకి · రేలంగి · సి.యస్.ఆర్.
R.నాగేశ్వరరావు · గుమ్మడి నటించిన అద్భుత చిత్రము

నిర్మాత......
సుందర్‌లాల్ నహటా



దర్శకుడు......
టి.యస్.ప్రకాశరావు




# ఆంధ్రపత్రిక

(నలుబది ఏడవ ఉగాది సంచిక)

దుర్ముఖి సంవత్సరాది సంచిక
(1956-57)

*

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

[వెల రూ. 2]

ఏ. దామోదరం.

47
సంచిక

# ఆంధ్రపత్రిక

సంవత్సరము
1956-57

## దుర్ముఖి ఉగాది సంచిక

### విషయానుక్రమణిక

నవయౌవన
ఉజ్వలజీవనానికి
విశ్వసనీయమార్గము

పండిత. డి. గోపాలాచార్యుల వారి

# జీవామృతం

బిగువైన కండరములతో
ప్రవిమలమైన ఉష్ణరక్తముతో
తేజోవంతమైన వర్చస్సుతో
నాదంపుట్టించే నరములతో
సుఖమయ జీవనమును
ప్రసాదించేది,
జీవామృతం.

ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్
మదరాసు 17.

---

## మంగళకరమైన నూతన సంవత్సర అభినందనలు

ఓంతత్సత్

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

# "మేల్మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతిగాంచిన మేహ, కుష్టురోగ నివారిణి
భయంకరమైన మేహవ్యాధివల్ల కష్టపడు వారలకు పునర్జన్మమిచ్చు
అద్భుత సంజీవి మేహరోగ నివారణ మాత్ర, లేహ్యము.

వల్లమేహ, ఎఱ్ఱమేహ, పొడలు, మేహరణములు, తిమ్మర్లు, మతిమాంద్యము, కుష్ఠములు, పిత్తకారికము, మూత్ర వ్యాధులు, వాతము, గుల్మము, తెలుపు, ఉష్ణం, గ్రంధి, కాళ్లచేతుల మంటలు, రక్తబలహీనం, గజ్జి, దురద, వీర్యనష్టం, మూలవ్యాధి, మలబద్ధకము మొదలైన అన్ని విధముల దుర్ధీర వ్యాధులను అతి సులభముగా పోగొట్టును.

40 రోజులు (1 మండలము) మాత్ర. లేహ్యము 6-0-0 తపాల్ ఖర్చు వేరు వివరములకు లేబ్లాగులో చూడవచ్చును.

**శ్రీపరమాత్మ తైలము** (స్నానమునకు శ్రేష్ఠమైనది)
కండ్లు మంట, కనుచూపు తప్పుట, మెదడు ఉష్ణం, ముక్కులో రక్తము కారుట, కామాల, దగ్గు, గసదగ్గు, శ్వాసకోశమునందు గలుగు అన్ని వ్యాధులను నివృత్తి చేసి రక్తశుద్ధిని కలిగించి దేహమునకు సుఖము నిచ్చును.

★

**K. T. KRISHNAMOORTHI ACHARI'S**
**MELMAYIL MARUNDHU**
*For:*
Blood-Purification, Constipation, Gleet, Leprosy, Gonarrhoeo, Venereal, and all kinds of Skin Diseases.

**K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు, 5/22, మేల్మాయిల్ పోస్టు (N. A. Dt.)**

# ADVERTISERS' INDEX



అప్సర నాట్యం—లేపాక్షి శిల్పం
చిత్రకారుడు: శ్రీ టి. కేశవరావు

ఓమ్

# ప్రస్తావన

హృదయం ప్రధానంకాని రూపాన్ని అశంకించవలసిన పనేమిటి? అనంత దయామయుడు ఆదిక్రోడమూర్తి భూదేవిని సముద్ధరించాడు. అతిపాటలాననుడు ఆంజనేయుడు రఘువంశ సముద్ధారకుడైనాడు; భగవంతుడు హయగ్రీవుడు లోకకళ్యాణం చేకూర్చాడు; 'అహిపతి దుష్కృతాంతకు డనంతుడు' జ్ఞాన స్వరూపుడై మనకు ప్రసన్నుడైనాడు. అలానే 'దుర్ముఖ' సహితం ఆత్మవిశ్వాస పరాయణులమైన మనకు శుభప్రతిపాదిని అయితీరుతుంది. అస్తు.

ఇది సంవత్సరాది పుణ్యదినం. ఈ రోజున మనం గత చరిత్రను కొంత సింహావలోకనం చేసుకుని, తద్వారా తగిన ఆత్మవిశ్వాసాన్ని చేకూర్చుకుని భవిష్యత్తువైపు చూచుకోవటం ఇది సహజం.

మనది, కష్టాల ప్రమేయం లేకుండా కేవలం సుఖాలే కావాలని వాంఛించే తెలివిమాలిన జాతికాదు. కష్టం ద్వారా సుఖాన్ని సాధించాలని మనకు తెలుసు. సుఖంతోపాటు కష్టాన్ని కూడా ఆనందంతో స్వీకరించగలం. ఈ పండుగనాడు శర్కరపానకంతోపాటు వేపపువ్వును కూడా కలుపుకుని సంతోషంగా భుజించుతున్నాం. మనం తినటమేగాకుండా ఈ సత్యం బోధపడేలాగు మన పిల్లలచేత కూడా తినిపించుతున్నాం.

ఈ సత్యాన్ని అవగతం చేసుకుని మనం దినదినం పురోగమించుతున్నాం. అనేక యిడుములుపడి స్వాతంత్ర్యాన్ని సముపార్జించుకున్నాం. స్వాతంత్ర్యలబ్ధిఅనంతరం, తొలిపంచవర్షప్రణాళికను చేపట్టి శక్తి వంచనలేకుండా కృషిచేసి కొంత విజయాన్ని సాధించాం. ఈ విజయం, శతాబ్దాల బానిసత్వాన్నుంచి ఒక్క ఉదుటున బయల్పడి అత్యంతౌత్సుక్యంతో వున్న దేశీయప్రజలకు అంత తృప్తికరంగా లేకపోయినా, ఇంత స్వల్పకాలంలో ఇంతటి మహోన్నత కార్యక్రమం సాధించటం చూచి ప్రపంచానికంతకు విభ్రాంతిగానే వుంది. దేశదేశాలనుంచీ అనేకమంది మహనీయులు వచ్చి మన కార్యక్రమాన్ని అవగతం చేసుకుని ఆనందించి వెడుతున్నారు. ఇప్పుడు మళ్లీ రెండవ పంచవర్ష ప్రణాళికను చేపట్టి ముందుకు సాగుతున్నాం. ఇతరత్రా శాంతిభంగకరములైన యీతిబాధలేవీ చుట్టుకోకుండా వుంటే ఈ అయిదు సంవత్సరాలు నిర్మాణ కార్యక్రమంలో నిర్విరామంగా కృషిచేసి మనం ఒక క్షేమంకరమైన ఉన్నత స్థితిని అందుకోగలం. ఆనాడు మన్ని తేరిపారజూడటానికి యెవ్వరికీ ఆస్కార ముండకపోవచ్చు. మనం ఈ స్థితిని అందుకోకుండా వుండడానికి ఈర్ష్యాళువులైన కొందరు, మన త్రోవలో లేనిపోని అడ్డంకులు కలిగించి కొంత చికాకుపెట్టటానికి ప్రయత్నించుతున్న విషమస్థితి మనకందరకూ తెలుసు. కాని యింతమాత్రంచేత ఆవేశవివశులమై, మనం—గత్యంతరం లేకపోతే తప్ప—మన కార్యక్రమానికి విఘాతంగా వుండే యెట్టి కల్లోలాలకూ దిగబోవటంలేదు. నిజానికి ఇది మన ఆత్మసంయమనానికీ, కార్యదీక్షకూ పరీక్షాసమయమే. ఈ సత్యం భారతదేశంలోని ఏ ఒక్క ప్రాణీ విస్మరించరానిది.

దేశంలోని ప్రజ ఈ పరిస్థితిని సమగ్రంగా అవగతం చేసుకున్నట్టే కనుపించుతోంది. ఈ నాడు దేశంలో రాజకీయపు జంజాటాలనుగురించి సామాన్యప్రజ లెవ్వరూ యోజించుతున్నట్లు లేరు. ఏ ఒక్కరిని కదిలించినా ఏదోఒక పని సాధించాలనే ఆవేశంలోనే కనుపించుతున్నారు. నిజానికి యిది చాలా ఆరోగ్యకరమైన పరిణామం.

ప్రజలలో ప్రభవించుతున్న ఈ కార్య ఘటనావేశాన్ని ఫలితానికి తేవటానికి ప్రభుత్వం కావలసిన

వాతావరణాన్ని కల్పించటానికి సర్వవిధాలా ప్రయత్నించుతున్నది. ఏ ప్రజాసేకం దేశసంపదను సృష్టించ బోతున్నదో ఆ ప్రజాసేకానికి, దాన్ని అనుభవించే అవకాశాన్ని, అధికారాన్ని కలిగించ బోతున్నామని పూచీయివ్వటమే ఈ వాతావరణ కల్పన. హామీని కేవలం వాగ్రూపంలో యివ్వటం కాకుండా, అనేక నూతన శాసనాలను అమలు జరిపి కార్యరూపంలో చూపుతున్నారు.

నియంతృత్వాధికారంతో నిమిత్తం లేకుండా, ప్రజాస్వామిక విధానం ద్వారానే సామ్యవాదాన్ని సాధించి సంక్షేమసామ్రాజ్యాన్ని స్థాపించటానికి అనువైన ఒక నూతన విధానాన్ని భారతదేశం ఊహించి స్వీకరించింది. ఈ ప్రయోగాన్ని (Experiment) ఇప్పుడు ప్రపంచ ప్రజలందరూ అంత్యంతౌత్సుక్యంతో గమనించుతున్నారు. ఈ విధానంలో మనం తప్పక విజయాన్ని సాధించబోతున్నాం. ఈ మన విజయం అంతర్జాతీయ ఆర్థిక రాజకీయ సాంస్కృతిక విధానాలన్నిటిని మూలమట్టంగా మార్చివేయ బోతున్నది. ఆ విధంగా మనం ప్రపంచానికంతటికీ మార్గదర్శులమై చరితార్థులం కాబోతున్నాం. ఈ ఆదర్శాన్ని దృష్టిలో వుంచుకునే మనం కష్టనిష్ఠురాలన్నిటికీ ఓర్చి సంతోషాతిశయులమై కృషి చేయవలసి వుంది.

ప్రభుత్వం ఇటీవల రాజ్యాంగానికి మెడనెడా కొన్ని సవరణలు చేస్తూవచ్చారు. ఇలాంటి సవరణలు ఎందుకు చేస్తున్నారాఅని ఆదిలో కొంతమంది ఆశ్చర్యపడుతూ వచ్చారు. ఈ నూత్నసిద్ధాంతాన్ని అమలు జరపటానికి ఆటంకాలుగా వున్న న్యాయశాస్త్ర సమస్యలను తొలగించివేయటానికే ఈ సవరణలు చేశారని ఇప్పుడు సర్వులకూ తెలిసిపోయింది. ఈసవరణల అనంతరం దేశంయొక్క ఆర్థికాభ్యుదయానికి ప్రధానాంగాలైన అనేక వ్యవస్థలను జాతీయసంస్థలుగా మార్చుచేసుకు వస్తున్నారు. ఈస్థితిలో దేశంలోని ఆర్థికసంపదను ప్రజాబాహుళ్యం యొక్క అనుభవానికి తెచ్చే విషయంలో, ప్రభుత్వ ఆశయాన్ని గురించి యెవ్వరికీ ఏవిధమైన ఆశంకలూ, అనుమానాలూ వుండటానికి ఇక ఎట్టిఅవకాశమూ లేదు.

మనం సహజంగా శాంతికాముకులం. 'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు'–అన్న నినాదం, అనాదికాలంనుంచీ నేటివరకూ మన సంస్కృతికంతకు పునాదిరాయిగా వుంది. మానవజాతిలో ప్రభవించే కల్లోలాల నన్నిటినీ శాంతిమార్గాన పరిష్కరించవచ్చునని మన పరమవిశ్వాసం. స్వాతంత్ర్య సముపార్జనకు ఆయుధవిప్లవం వినా, మార్గాంతరం లేదని ప్రపంచమంతా మూఢవిశ్వాసంలో కొట్టుకుంటున్న తరుణంలో మనం శాంతివిప్లవాన్ని చేపట్టి బ్రిటిష్ మహాసామ్రాజ్యంవంటి మహాశక్తితో తలపడి విజయాన్ని సాధించాం. ఇప్పుడు ప్రపంచశాంతికి ఈ సమరస విధానమే ఏకైకమార్గమని మనం బాహాటంగా చాటి చెప్పుతున్నాం. గత సంవత్సరారంభంలో జరిగిన 'బాండుంగ్' సమావేశంలో ఈమహాధర్మాన్నే 'పంచశీల' రూపంలో ప్రతిపాదించాం. అంతర్జాతీయ రాజకీయరంగంలో 'బాండుంగ్' సమావేశం, భారతదేశానికి చరిత్రాత్మకమైన ఒక మహావిజయం. 'పంచశీల' ఈనాడు ప్రపంచం నలుమూలలా మంజుగీతమై ధ్వనించుతోంది. విశ్వశాంతిని సాధించటానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా, భారతదేశం వహించుతున్న పాత్ర పునీతమైనది. అగ్రరాజ్యాలు పరస్పరం ఒకరి మీద ఒకరు ద్వేషాలు కక్కుకుంటున్న తరుణంలో ఉభయవర్గాలకు నచ్చచెప్పి జనీవా శాంతి సమావేశాన్ని సాధ్యంచేశాం (జూలై 55). ఈ సమావేశంతో అంతర్జాతీయంగా వున్న మత భేదాలను అంతరింపచేయటానికి ఒక మార్గం సుగమమై నేడు గోచరిస్తున్నది. ఈ సమావేశాన్ని సాధించిన నెహ్రూ, మీనన్‌లకు శాంతికాముకులైన ప్రపంచ ప్రజలందరూ ఎంతో ఋణపడివున్నారు. విశ్వశాంతిని సాధించగలమనే అభినివేశంతో మనం వ్యవహరించుతున్నాం. సాధించి తీరాలి. విశ్వశాంతికి

భంగం కలిగితే మన జాతీయ నిర్మాణ కార్యక్రమమంతా కూడా విచ్ఛిన్నమై పోతుంది. భారత ప్రజల భవిష్య దభ్యుదయమేకాక, ఆసియా ప్రజల భవిష్యత్తు యావత్తూకూడా విశ్వశాంతిమీద ఆధారపడివుంది.

అంతర్జాతీయ వ్యవహారాల విషయం అటుంచి జాతీయంగా, గతసంవత్సరం భారతప్రభుత్వం సాధించిన మహాకార్యాలలో 'భాషారాష్ట్రపునర్నిర్మాణం' అత్యంత ప్రధానమైనది. అనేక సమస్యలను గంభీరమైన ఆత్మవిశ్వాసంతోనూ సాహసంతోనూ ఎదుర్కొని ఈకార్యాన్ని సర్వులకూ ఆనందదాయకం కాగలరీతిని సాధించారు. దీనివల్ల పరమప్రయోజనాన్ని పొందబోతున్న వారిలో ఆంధ్ర ప్రజలు ప్రథములు.

ఈమహాకార్యాన్ని సాధించిపెట్టిన అగ్రనాయకులకు, ముఖ్యంగా భారత ప్రధానికి ఈ తెలుగు సంవత్సరాది పర్వదినాన, యావదాంధ్రప్రజలు ఆనందోత్కంఠులై అభినందనలు తెలుపుతున్నారు. ఎనిమిది వందల సంవత్సరాల క్రితం, ఛిన్నాభిన్నమై పోయిన తెలుగుజాతి ఈ నాడు తిరిగి యేకజాతిగా సంఘటితమై సర్వతోముఖంగా పురోగమించే ఆస్కారం కలిగింది. ఆ కారణంగా ముక్కోటి ఆంధ్రులకూ ఇది మహా పర్వదినం.

ఆంధ్రాభ్యుదయంలో ఒక ప్రధాన ఘట్టమైన 'నాగార్జున సాగర' శంకుస్థాపన గత సంవత్సరమే జరిగింది. ఈ నిర్మాణం ఆంధ్ర భూమిలోని విశిష్ట ప్రాంతాన్ని సంపత్సముపేతంగా చేయబోతున్నది. వీలైనంత త్వరలో దీన్ని ఫలితానికి తెచ్చుకోవలసిన బాధ్యత ఆంధ్రప్రజలమీద, ఆంధ్ర ప్రభుత్వంమీదా వున్నది.

ఇలాంటి మహాపరిణామాలెన్నో వస్తున్నా ఆంధ్రనాయకులలో కొందరు ఇంకా ప్రాంతీయ దురభిమాన కశ్మలాన్ని విడువలేకుండా వున్నారు. ఇది శోచనీయం. విశాలమైన ఆంధ్రసీమ! కనకగర్భ! తల్లి హృదయపులోతులు తడవిచూచుకుంటే కనకరాసులను వెలార్చుతుంది! చిన్నచిన్న స్వార్థాలను మనస్సులలో పెట్టుకుని చిన్నపిల్లలలాగు వ్యవహరించి అంతఃకలహాలతో కాలాన్ని వృథాపుచ్చుకోవటం కేవలం అజ్ఞానం.

తెలుగుతల్లికి పుట్టిన ప్రతిఒక్కడు, కార్యఘటనాదక్షుడై, మహదాంధ్రభాగ్యోదయాన్ని సాధించటానికి నడుముకట్టాలి.

విశిష్టాశయులైన, మహదాంధ్రప్రజలకూ, పాఠకులకు, అభిమానులకు ఈసంవత్సరాది పర్వదినాన మా అభినందనాలు.





దారుకావనంలో శివుని భిక్షాటనం—లేపాక్షి శిల్పం

చిత్రకారుడు : శ్రీ టి. శేషరావు.

# అచుంబితం

దాశరథి

మాట్లాడని మల్లెమొగ్గ
మాదిరిగా నడచిరా
నిశ్శబ్దం ఎరుగనట్టి
నిమ్నగవలె విడిచిపో.

దేవుడు కన్నీటిబొట్లు
చిందిన చప్పుడులు విను,
వాదింపగరాని మనసు
పరివాదిని లోతు కను.

మూగి పుస్తకాలలోని
రాగాలను పాడుకో,
గాలివోలె కనుపించే
ఆలోచన వాడుకో.

కడుపులోని దుఃఖంవలె
కనుల్లో త్రిపజాడు కద్దలి,
నచ్చని లోకమును చెరచ
వచ్చెడి శైశిర పిశాచి.

నిదుర పొదలలో చొరబడి
పొదలిడు మలిసంజగాలి,
గాలికంటె తేలికగా
కదలాడు కవి మనసుజాలి.

భీముని గదలా బరువై
భీతిగొల్పు ఋషి శాపం,
రాముని బాణానికంటె
ప్రబలమైన జనకోపం

ఆకులేని మోడుగుపై
కాకలెత్తు కూముంటలు,
ఎరువులేక నీరులేక
ఎగసివచ్చు ఎద పంటలు.

మనసుకే కనరాని రూపు,
మాటకు వినరాని ధ్వని,
తలకందని క్రొవ్వాసన,
బుద్ధికందనట్టి సొత్తు.

ఆలోచనలంత లేత
పైన అంగుళుల కొనలు,
స్పర్శింపగ లేనంతటి
పలచని అర్థాల ఒడలు.

కోర్కెలు చుంబించ లేని
కోమలి ఆశల పెదవులు,
గగనము మాత్రమె దర్శిం
చగల విశాల మనస్సులు.

ఉగాదిలో దీపావళి
కాముడి పున్నమకు వాన
భాద్రపద మహాంధకార
పథములలో చిలుక పిలుపు.

రత్నాల్లో నాల్గురాళ్లు,
ప్రేమల్లో బ్రతుకు బాటలందు.
అప్పుడప్పుడవి పూయుట.
మరల అంతలో మాయుట.

తలలు వాల్చి యున్న జనం
గళాలెత్తి పాడుట,
కదలలేని ఎద నెమళ్ళు
కండ్లు విప్పి ఆడుట.

మఱ్ఱి ఆకుపై విష్ణువు
మాదిరి శబ్దమున శక్తి,
సముద్రాన పాలవోలె
సరిగమలో సంగీతం.

మనకున్న నిఘంటువులు
విననట్టిది కననట్టిది,
నది తరగలలో, భావుకు
మదిలోపలి వింత పలుకు.

మెట్లు లేని మేడమీద
మేలి నీలి ముసుగు తీసి
నవ్వే అందాల తరుణి-
నవ శారద నిశాశశి.

ముసలి భావుకుని చూపుల
మసకలలో తప్పి పోయి
కనుపించని కాలాంశం
కవి చూపుల కనుపించుట,

అర్థమగునె నగం నగం?
అచుంబితం మనోజగం.
అందుకొరకె కలం ముక్కు-
సందు సందు చేసుకో.

భావించుము నీలోనీ
ఎవరిని మేల్కొల్పబోకు,
విచ్చిన ఎదకంటిచూపు
విశాలమై క్రమ్మనీ!

---

# తొండిపంపు

**“కంఠీల”**

“తొండిపంపులో తెపుట్టాక క్రాష్టావు వెయ్యడం ఎరగను. మా నాన్నగారూ వారి తండ్రిగారూ కూడా కొలతలేదుట దీన్ని” అంటూ సూరన్నతో గ్రామకరణం అని “లాగండ్రా తెలైను-పగ్గం పగడ్బందీగా పట్టుకోవాలి. ఒక్క లింకు తేడా రాగూడదు” అదలించాడు వెట్టికొండడినీ చాకలి నూకాలునీని. ఆరో నెంబరుకీ, బీమొరాలకీ కొత్త అలవాటు ఆ గ్రామ నవుఖర్లకు పాతికేళ్ళనుంచి. ఫాల్గుణం సెలవు ఇచ్చుకుంటూ మన్మథవసంతం తొంగిచూస్తున్న గిరువేసవి యెండ చిత్రతింపడానికి చీకాకుపడుతోంది. గుబురుగా కోడువార కటేరం అక్కడ్లేకండావున్న చింతినీడన నిలబడ్డ ఖామందు సూరన్న, మేనల్లుడు వెంకట్రాజు నవ్వుతున్నారు కరణంగారి మాటలు విని. పిడిగోయ్యలాంటి తొండకి జనుపట్టే కుండ్రాయివంటి నూకాలు యిందురుగొమ్ము పగ్గంలాగుతుంటే చెమటలు చిమ్ముతున్నాయి.

చిరుమువ్వల కొత్తగిత్తలగట్టిన సవారీబండి చప్పుడు విని కరణం వూరు మొగవుంతివైపు చూపునిగుడించాడు — “బండెవరిదోయ్” సూరన్నను అడిగాడు సిరా చిట్లంగట్టి అంకె రాయనంటూ మారాం పెట్టే వ్రాటకలం విదిపి. చేతులు కళ్ళకడ్డంచి సూరన్న ఎదురెండలోకి పరకాయించి “రాములూ! చూడు—ఎవరిదో? అన్నాడు. “మా చెయ్యి! అమ్మొస్తోంది — చేనికొత్త జాడ్డానికేమో” మేనల్లుడు రెండోవాడు సందేహం సన్నగా వెలిబుచ్చుతున్నాడు. వీళ్లలా ఆలోచిస్తా వేవున్నారు, నాలుగుకాళ్ల సవారీమీద ఒక్క ఉరుకులో గిత్తలు బండితో అమ్మాయిని చింత క్రిందకు తీసుకొచ్చి పాలికాపు తల్లతాళ్లు లాగి పట్టడంతోనే ఆగిపోయాయి. “పెడగా నీసిన విప్పెయ్యరా” పాలేరును ఆజ్ఞాపించి “నీవ్రా రావాలేంటే మధ్యాహ్నం పని గట్టుకుని చేను చూడానికి” చెల్లెల్ని అడిగాడు సూరన్న. “ఇంతకాలానికి పంపకాలౌతున్నాయిలేవా అన్నా— అంతరాద్ధాంత సిద్ధాంతాలయ్యాయిగదా! ఇంటిదగ్గిర ఏకులొడికి విసిగివిసిగి ఇలాగొచ్చాను” యాధియోవ్యపడి సమీపిస్తున్న అమ్మాయి అన్నతో నివేదించి నుదుటిమీది చెమట బిందువుల్ని మల్లురేకు చెరగుతో చెరుపుకుంది.

రెండు జాములు కొత్త వడిచింది. చప్పొకం సేల...పాటి కంపు—గట్టుపుట్ట అడ్డురాలేదు—కోడువారదంప—కరణం ఖచ్చితంగా లెక్క తేల్చాడు. “వెరసి యాభైరెండెకరాల నలభైఅయిదు సెంట్లు”అన్న ఆయన్ను రెట్టించి “సరిగ్గా చూశారా బాబూ! అన్నదమ్ముల పంపకాలు. తేడా రాగూడదు” అన్నాడు సూరన్న. అమ్మాయి సీమవెండి తప్పేలాతో తెచ్చిన వెన్నతీసినమజ్జిగ రెండు గ్లాసులు కరణంగారికిచ్చింది ఉపచారంగరించి. మిగిలింది మేనమామా మేనల్లుళ్లూ త్రాగారు. “కట్రాబండి” అన్న ఖామందుల మాటందుకుని కమతగాడు గడ్డిపరకలు వొల్ల బండిలో పర్చి గిత్తల పిర్రలకంటుకొన్న పేడను దించి కొంత వాటిని తెత్తిన మోపి “ఎక్కండమ్మా” అన్నాడు. “నాన్నగారూ! మీరు ముందెక్కండి” అని అమ్మాయి కరణాన్ని కోరింది. ఆయన యెక్కాడు. సూరన్నా వెంకట్రాజూ, శ్రీరాములూ వారి వెనకాలనే ఎక్కారు. పాలేరు గోలుగర్రతెల్పి బండిని వెనక్కు వంచాడు—అమ్మాయియెక్క దండిమీద కాలుమోపి బండిలో కూర్చుని “ఊఁ—పోనియ్” అంది. మువ్వల గలగలతో సవారీబండి వూరివైపు సాగింది.

“మాశారా! నాన్నగారూ! వాళ్లొకళ్లు రాలేదు పంతం బట్టినట్టు. ఏంటో ప్రేమలూ అభిమానాలూ అని పెద్దకబుర్లు చెబుతారు. చూస్తూ చూస్తూ మైనర్ల ఆస్తి పంచిపెట్టలేక పోయాడు వీళ్ల పెదబాబు. ఎండకన్నెరగని ఆడముండని వీళ్లింటికొచ్చి వీళ్లకి ముండామోసి కోర్టుకెక్క పకుస్తూ జప్తులూ చేయిస్తేగదా ఈ కాపికి తేకిందివ్యవహారం. ఎన్నోసార్లు వర్లైవేసిన పాతమే పాడుతోంది అమ్మాయి ఉబక ఆపుకోలేక.

“పోన్లెద్దూ వాళ్లూ వీళ్లూ ఒక్కటే గాదుటమ్మా. ఈ పదేళ్లూ తిన్నాదే అనుకో. పై వాళ్లదేం వచ్చేసుకోలేదు” ‘కాదన్నవాడు కరణం’ అని తన పైజం మానుకోలేదు.

“అలాగంటారేం ముట్టితోవుడుగా గడిచినవాళ్లు తిన్నాడు. కన్నగాడి పెళ్లాం గారిదేవి అని అతరసని ఆవిడ నగలెట్టుకు తిరుగుతోంది. పోనీ బాబూ! వాళ్లూ మీగడ పెరుగూ సన్నబియ్యం పన్నమూ చాయపప్పు తింటూంటే మా కింత గంజికేనా గింజలు పారెయ్యాలా వొద్దా చెప్పండి. చేరిసగం వాటాగదా తొండిపంపు దంపా, వందయాభై యెకరాల పైచిలుకు మెరకా చేసుకుంటున్నాడు. పోలెదు కందిగింజలికీ, పీసెదు మిరపకాయలకు నోచుకోలేదా? పిల్లలకు చదువులకి గాయకపు రోజుల్లో ఎంత ఖర్చౌతుందో చెప్పండి—తినీతినకా, అలాగే చిరిగిన చింకిపాతలతోనే బళ్లోకి పంపుతున్నానే—ఫలానావారి తమ్ముడు కొడుకులంటే నా మొహానికియేనా వుండొద్దూ. తిన్నారు తిన్నారు ఇంకెంతకాలం వూరుకుంటాను కోర్టుకెక్కాను—సిగ్గూ శరమూ అనుకుంటే ఈ కొండ్రకూడా హరించి పోతుందని—ఏమనుకున్నారో యీ పట్టాల వాటాల కాపీలు రాసెయ్యాల్సిందే—ఇంక వూరుకునేదిలేదు—ఎప్పటికప్పుడు మంచిది కాదనీ, కరణం లేడనీ, కాపులేడనీ తగవు లున్నాయనీ పేచీలు పెట్టడం—ఇంతలో తరి రావడం అదునుకి పదును చేసుకోవడం. చివరకడగానే తొండిపంపూడ్చెయ్యడం—పంటలు పండవిచ్చి మళ్లీ మామూలు భాగోతమే మొదలు. కంఠశోష వెళ్లగ్రక్కుతోంది అమ్మాయి. అప్పుడప్పుడు ఆమెకళ్లు చెమ్మగిల్లాయి కూడాను—“ఊళ్లోకొచ్చాం ఊరుకో—రాత్రికి పరిష్కారం అయిపోతుందిగా. ఈ లోగానే

గోలచేసుకోవడ మెందుకూ! అయిందేదో అయిపోయింది" ఓదార్చాడు సూరన్న చెల్లెల్ని. కరణంగారింటిముందు బండి ఆగింది— ఆయన దిగి "ఇవాళ కానిచ్చేద్దాం" మళ్ళీ వాళ్లతోఅని బండిని పోనిమ్మన్నాడు పెద్దవీధికి!

* * *

## 2

"పొలం కొలిచారాండి" వీర్రాజు కొత్త పాటాకు చుట్టకాగుస్తూ వచ్చి కదిపాడు లెఖ్ఖలు రాసుకుంటున్న కరణాన్ని.

"ఆఁ" తలెత్తకుండానే సమాధాన మిచ్చాడు కరణం.

"ఎంతొచ్చింది?"

"యాభైరెండు యకరాల నలభైఅయిదు సెంట్లు"

"బాగా లెఖ్ఖ కట్టారా"

"ఆ"

"ఎవరెవరొచ్చారు పొలందగ్గరకి?"

"ఊళ్ళో వాళ్లెవరూ రాలేదు"

"ఈపాటిమీద నేనుండగా అందులో గొలుసులాగడం జరగదనుకున్నాను. మీరూ కొలతకు వెళ్లకుండా వుండివుండవలసింది"

"మరి నాకు చెప్పేవా" సూటిగా తప్పుకున్నాడు కరణం.

"వాళ్ళే వచ్చారన్నమాట!"

"ఔను-అమ్మాయీ-కొడుకులూ, సూరన్నా వచ్చారు"

"వాడు తోడుండాలిలెండి దానికి"

"సరే-జరిగిందేదో పోనిండి. తొండిపంపు మైనర్లకు రాకుండా చూడాలి. మీ లిటిగేషనంతా కనుపించాలి" వీర్రాజు కరణాన్ని గిలిపాడు.

"వాటాలు నీవేగా వేసేది. గమక ఆలోచించు. వాళ్ళు తీసుకుంటారు"

"ఎప్పుడూ ఎవళ్ళూ నన్ను తప్పుకిద్దులేదు. వీళ్ళు కోర్టుకెళతాం భూపించారు. దప్పుగట్టుకు తెగబాటుతున్నారట. పెదబాబు మైనరాస్తి తినేస్తున్నాడని, తెగులు కుదిరిపోవాలు దీనితో"

కరణం పూర్తికొట్టడంతక్క మరేమీ మాట్లాడలేదు—

"కాగితం కలం పుచ్చుకోండి—చెబుతున్నా" అంటూ వీర్రాజు ప్రారంభించాడు—

కరణం జాబితాలు వ్రాస్తున్నాడు—

"'A' వాటా—కుర్విటిలెంక పల్లం శేర్పురా. జమ్మిచేను అనే మెరక కేవడి పూరా. పాటిచెల్కలో వాటా బమ్మిరెడ్డివారి కట్టలుసహా. పెన్నపూసచేలో లంక పూరా. గోతలగర్వ చెల్లాయివద్ద కొన్నది. మావ్యంబీసు అనే దంపపూరా. మొత్తం మెరకపల్లం కలిసి నూట ఇరవై యకరాలు—

'B' వాటా—చింతలపోడు మున్నుసహా, తొండిపంపు పూరా. నివేశ్నస్థలం పాడి, దొడ్డి, చినవీరాయిచెర్వు కొమ్ముమట్లు వెరశి మెరకపల్లంలు అరవైనాలుగెకరాలు మగూరు.

'A' వాటా వాడికి 'B' వాటా తీసుకున్నవాడు యాభైవేల రూపాయలు ముదరా యివ్వ నిర్ణయం—" ముగించాడు వీర్రాజు.

"తొండిపంపు విసిరేస్తుందనా మూడువేలుంచావు?" కరణం ప్రశ్నించాడు.

"అంత వారడి వుంటేనేగాని ఇవతల భాగంమీదికి వాళ్ళు పసరు."

కిమ్మనకుండా కరణం జాబితా వ్రాశాడు. వీర్రాజు లేస్తూ "కరణంగారూ! మీ ప్రజ్ఞ చూపించాలి. తొండిపంపు వాళ్లు వదిలేస్తే అరపంచి రూపాయలు మీకు ధరాతం - చూసోకోండి" అశ పాడిగించాడు. కరణం నవ్వుకున్నాడు.

రాత్రి రామకోవెలలో సమావేశమయ్యారు—అమ్మాయీ, వెంకట్రాజూ, శ్రీరాములూ, సూరన్నా ఒకప్రక్క కూర్చున్నారు. వీర్రాజూ మేజరుకుమార్లూ మరోకమూల నున్నారు-మధ్య పెద్దమనుషులు జంబుఖానామీద బైటాయించారు.

"అమ్మాయీ! వీర్రాజు వాటాలువేస్తే తీసుకోడానికి మీ కిష్టమేనా?" కరణం అడిగాడు.—

"నాన్నగారూ! అలాగంటారేం—వెయ్యమనండి. వారడి వుంటే, లేక మాకు నచ్చకపోతే యేం చేస్తాం—ఆయన తీసుకుంటారు" అమ్మాయి గడుసుదనం చూపింది.

"మీరు నేకారనుకో—వీర్రాజుకు నొప్పకపోతే" కరణం లౌఖ్యం ధ్వనించింది.

"అదేంటండీ—ఇద్దరికీ ఒకరి పంపకా లింకొకరికి నచ్చకపోతే పెద్దమనుషులచేత వేయించి అర్థం కర్థం యెరగని చంటిబిడ్డచేత చీటి తీయిస్తాం" సూరన్న మద్దతిచ్చాడు చెల్లెలికి.

"సరే—వీర్రాజూ! వాటాలు వెయ్యి" ఏమీ యెరగనట్లు ప్రశ్నించాడు కరణం—మధ్యాహ్నం కరణమూ తనూ కలసి గూడుపుఠాణీ చేసుకు తయారుచేసిన జాబితాప్రకారం వల్లించాడు వీర్రాజు—అమ్మాయి ఓపిగ్గా వింది.

"విన్నావా అమ్మాయ్! ఏఁవోయ్ సూరన్నా నీవు?" ముదలకించాడు కరణం—

అమ్మాయి అందుకుంది. పెద్దలు ఆలకిస్తున్నారు—

"సరే...బాబూ—చరాస్తులు బళ్లు. దుక్కిటెడ్లు బాగళ్లు వస్తేరా?" వీర్రాజే ప్రత్యుత్తరం యిస్తున్నాడు—

"ఏమీ రావు"

"లోగిలిలో వాటా?"

"అదీ లేదు"

"నెరళ్లు"

"ఊహూఁ"

"పెద్దలందర్నీ ఒక్కటి పలుకు చెప్పమంటున్నా—కత ఫలం మాటే?" అమ్మాయి యింతటితోనైనా చాలిస్తుందా అని వీర్రాజుకు గొంతుమడి ఆగడంలేదు—పెద్దలుమాత్రం 'అసుకైతే

కేంరా—తెగేవి అడిగి కడిగేస్తోంది కాపగార్ని—వీర్రాజు యింత కర్కోటకుడై పోతాడనుకోలేదు కల్లోగూడా' అనుకుంటూ మానంగానే వ్యాఖ్యానించుకుంటున్నారు.

వీర్రాజు కాస్సేపాగి "నేను పడిపోయివున్నాను—అదీ లేనట్లే" ఆయాసంతో అన్నాడు—అమ్మాయికి ప్రాణుపోను కొచ్చినంత కోపం వచ్చింది. పెద్దలేమీ అనకపోవడం ఆమెకు ఆశ్చర్యం ఆవేశంగూడా కలిగించింది. అంతా వీర్రాజుకు జడిసి మూగనోము పట్టారు.

"కరణంగారూ-తొండిపంపు వాటా నాకు రేపే వ్రాయించి పారీఖత్తు రిజిష్ట్రీ చేయించండి" అని లేచింది—సభలో అంతా స్తంభీభూతులైపోయారు. కరణం గజ గజ వణికాడు.

* * * *

# 3

"మిత్తానికి వీర్రాజు గట్టివాడే. అమ్మాయికి ఆవేశం ఎక్కించి మెరుగువాటా తనకే వచ్చేటట్టు చేశాడు. అది తెంచేత అవలేకపోయిందో 'నే వాటా లేస్తా నీవు తీస్కో' మని? తొండి పంపు ఒకే ఒక్క ముక్క వుంచెయ్యడంలో వీర్రాజు తెలివి వుపయోగించాడు. మైరావణుడంతవాడు మిత్తానికి. ఇలాగే నోరు మూలివ మైనరు కుర్రాళ్లి ఆస్తులు వదేసుకుంటారు. నోరుంటే తిలగాస్తుంది" రామకోవెలలో రచ్చంతైనా పెదిమ మెదపలేకపోయిన పెద్దమనుషుల మాటలు మాటుమణగినపల్లెవీధుల్లో, స్వంతకొంపల్లో, ఒండోరుల మధ్య వృథాగా ప్రతిధ్వనించి వూరుకున్నాయి.

మన్మథచైత్ర శుద్ధ విజయవాడు పారీఖత్తు రిజిష్ట్రీ. వీర్రాజు ముఖం ఏదీ కలిమిడిగాలేదు. కారణం తాను యెంత చెయ్యదాట



సంతాల్ జాతి కుటీరం (లినోకట్)

చిత్రకారుడు: శ్రీ వేలూరి రాధాకృష్ణ.

పెట్టగూడదనుకున్నా తొండిపంపు జారిపోవడమే. రిజిష్ట్రారు ఆఫీసునుండి బళ్లుమళ్లుతున్నాయి. "మూదరామాట అడగండి" కరణాన్ని భుజం తాటించాడు వీర్రాజు.

"ఏంవంటావ్ ? అమ్మాయీ?" ప్రశ్నించాడు కరణం.

"తొండిపంపు మినహాయించి చిల్లర ప్రతులు తేరం కట్టించండి" చదరంగపు బెత్తులో నదురూ బెదురూ లేకుండా పావులు నడిపే గజాటకాడు కూడా యింత నైశిత్యం ప్రదర్శించలేదు. మరి అమ్మాయి దిలాసా ఏమిటో !

ఈ ముక్క చేరింది వీర్రాజుకు. వూళ్లో కాలు పెట్టడంతోనే ప్రచారం ప్రారంభించాడు చింతలపోడు, చిన్న వీరాయి తెక్క కొమ్ము మళ్లా యెవరూ కొనగూడదని. పెద్దకాపుగారికి త్రీక అడ్డు లేదు—ఊరంతా ఒకటే కట్టు. "ఎవరూ కొనడంలేదు" అన్న కరణం గారి మాటలు వినివిస్తుపోయింది. "ఈ వూళ్లో దంప తిష్టకగదా అంది మళ్లచేస్తాయి జాలుగుపేలు" అని కరణం వంక చూసింది అమ్మాయి. "పాటపెట్టి స్తేనో" అడిగింది. "అమ్మాయీ ఏమిటి నీ వెర్రి—పట్ట పగలు చెయ్యబట్టుకుంటే రాని దానికి రాత్రి కన్నుగీటేట్టు" పామెరన్నాడు కరణం. అమ్మాయి తెగించింది "ఏమైతేగానీండి. ఆ మూడువేలకు పూటా బెడుతున్నా" ఆమె సాహసానికి కరణం ఆశ్చర్యపోయాడు. ఎలాగోలాగా వరకుటమై తనకు మూడువందలు కమీషనువచ్చే షరతుమీద ఒకక్షి రహస్యంగా లాక్కొచ్చి రాత్రికి రాత్రే అగ్రిమెంటు పూర్తిచేశాడు-అయితే అతి జాగ్రత్తతో ఒకషరతు మాత్రం ఇరికించాడు "మాకుగాని మా స్థావీరయుల్కగాని వీరు



జీవయాత్ర (లినోకట్)

చిత్రకారుడు: శ్రీ వేలూరి రాధాకృష్ణ

కోర్టువార్కిగాని నా అభ్యంతరం యేమీ లేకుండా దస్తావేజు వ్రాయించి యివ్వగలదానను" అన్నాడు. అగ్రిమెంటు సంతకం పూర్తి అయిందో లేదో అగ్గి అంటుకున్నట్టు వుప్పు అందింది వీర్రాజుకు. కొన్నవాడికి కబురంపి కస్త్రైర్ చేశాడు. వాడు ఓటి మనిషి. జవజవలాడేడు—దొంగతనంగా తమ మళ్లకు చెరువు వాలుకు ఒడ్డు తేసుకు నీరు మళ్లించుకున్నాడు. పోరంబోకు వుంత పాడుగునా యేటికేటికి రెండుకంచాలు గలుపుకున్నాడు—ఆరోసెంబరులో ఆరెకరాలు తడుపుకున్నా మూడెకరాలే రాయించుకుంటున్నాడు. పివళ పెద్దకాపు తనకొడుకు పెళ్లికి వెయ్యిరూపాయలు సాయం జేశాడు. పెద్దకాపుగారి కమతం కలుగ జేసుకోకపోతే కంచెగాలుగురించి తను తగవుపెట్టె పొరుగువాడితో కోర్టాటకు దిగినపుడు తన పని వుట్టాసీదా అయిపోయేది. ఇవన్నీ తల్చుకుని క్రయదారుకు గిజగిజలాడేడు. వాటిని వరసవారీగా పెద్దకాపు వల్లిస్తుంటే. అగ్రిమెంటు తుదకంటా చదివాడు వీర్రాజు—"నీ యిష్టం వచ్చినవాడికి రాసిస్తానంటోంది. అట్టై మిడక్క—కావలిస్తే సంచిరూపాయలు లాభం దీసుక్కుని నాకు రాయించెయ్" అన్నాడు.

తీరా రిజిస్ట్రీనాటికి తేలింది తన బావగారి ముజరా సొమ్ము క్రింద మెరక్కపల్లం, మాగాణి చెక్కలు రాయించుకుంటున్నాడని. దస్తావేజుమీద సంతకం చెయుతూంటే అమ్మాయి చేతులు గడగడ వణికాయి—దౌర్జన్యం భూమిమీదనుంచి ఆకాశానికంటా సుడిగాలిలో లేస్తోంది. దీన్ని చూసి భూదేవి నవ్వుతోంది. కంచె చేన్ను మేసేస్తోంది కాల వైపరీత్యంవల్ల. అమ్మాయి కనుకొలకునుండి రెండు వేడి నీటి బిందువులు రాల్లి ఆమె జాలిగుండెను బండరాయిగా మార్చాయి. ఆమె ముఖం తీవ్రరూపం ధరించింది. "ఇంక మిగిలింది తోండిపంపు—పోనీండి నా అదృష్టంపండి గొడ్డుగేదె సింహలక్ష్మి ఎందుక్కాగూడదు" అని మాత్రం అంది కరణంతో. వీర్రాజు వగిడే యిత్తులన్నీ సాగిపోతూంటే విర్రవీగి మిన్నుమన్ను అనకండావుంది. "కాపూ కరణం నావాడైతే కట్టేసి కొట్రా" అన్నారు పూరికేనా?

వచ్చిన్మథ నవ్యవసంతంలోనే సోకరించింది. వీర్రాజు మెంబరు కొడుకుల్ని, పెద్ద పాతేళ్లని హెచ్చరించి మెండలకడనే వ్యవసాయంపని ఖచ్చితంగా ప్రారంభించాడు. కుర్రెటిపక్క పల్లంలో ఆకుమడికి దుక్కి దున్ని, మందయెగత్తు చేయించాడు. పాటిచెల్క, చింతలపోడు పూరాగా నువ్వు పెట్టించాడు కత్తిరిలో. జమ్మిచేను ఇరవై యెకరాలూ మిరపతోటకు బాగా దున్నిస్తాడు—యాభైవేళ్ల పెంటగుట్ట వేయించాడు దానిలో. చిన్నపూస చేలో లంక పూరా బుష్మచేను జల్లాడు కంది గలిపి. గోతల గర్వుకు తేరు తేసగ, కొర్ర కంది కలిపి పెట్టాడు. మాన్యం బీట్లో గోర్రవ వరి వేయించాడు. జ్యేష్ఠమాసం వచ్చేసరికి కలకలలాడుతోంది వీర్రాజు వ్యవసాయం—రోజూ చెంబుతో నీళ్లు పుచ్చుకొని తెల్లవారు ఝామునే తోండిపంపుకు వెళ్లుతున్న అమ్మాయి పంపు పల్లగిలిస్తున్నట్టు తన్ను వెక్కిరిస్తుంటే నవ్వుకునేది. దేవుడు గూడా కనిగడ తోడా నామీద అని ఆమె అనుమానం—ఎటొచ్చీ ఆమె యీ యేడు మారన్నతో **చేయించిన వ్యవసాయంకాని అతుకుల్లో కుక్రం** చేయించి అక్కళ్లు విత్తనాలు పోయించటం—నావగారి ధర్మమా అని తడికి చెర్వునీరు సవ్యంగా పారుకోవడం మూనివేసింది. 'భూమిమీద వున్నంతమటుకు. ఊళ్లో మనుషుల్ని కట్టేసుక్కున్నాడు వీర్రాజు—ఇంతకు తాను చేసిన నేరం యేమిటీ? తన కొడుకులకు న్యాయంగా వాటా యిమ్మని అడగడం. సబుతుగా మైనరాస్తి పంచమనడం—మరి శ్రీకృష్ణులవారూ ఇదే చేశాడే—తుదకు వాటా యివ్వకపోతే చెడ్డవాళ్లతోబాటు మంచివాళ్లనుగూడా చంపేటంతటి దారుణం గూడా నిర్దాక్షిణ్యంగా చేసేశాడే—కాలం మారిందంటున్నారు—ధర్మం మారదని తాత తండ్రులనాటినుండి అంతా చెబుతున్నారు—మరి ధర్మంగానైతే దేవుడు తన్నెక చూపు చూడడూ' అంటూ ఆలోచిస్తూ ప్రొద్దుటినుండి సాయంత్రానికీ సాయంత్రంనుండి ప్రొద్దుటికి గంటలు లెఖ్కపెడుతూ కళ్లు పెద్దవి చేసుక్కుని కాలాన్ని సాగదంపుతోంది అమ్మాయి.

మన్మథుడు పూలబాణాలు మానుకున్నాడు. కలకలలాడుతూ చిలకరించిన తొలకరి ఆరుద్రతో ఆగిపోయింది. మళ్ళీ చుక్కపడితే ఒట్టు. నువ్వుచేలు వెర్రితలలేశాయి—బుడ్మచేను పొట్ట విరుసుకుపోయింది. వేరుశెనగ వెర్రిమూలం బెట్టింది. నోదురుగాలి పిట్టుల్లో బూడిదనూ చేటలతో చెరిగినట్టు ఎగరబోస్తోంది. దబక లాతే చెరువులు ముమ్మారు తీసుకుని అకుమళ్లు మాత్రం చాలీ చాలకుండా తడుపుకున్నారు. ఈయేడు కరువేమో అని భయపడ్డారు ప్రజ—"దురంతాలకు దిగితే ఏమవుతుందీ? ఈపాటివాడ చెప్పేవాడూ లేడు చెబితే వినేవాడు లేడు. అన్యాయం అగ్గి బుగ్గి పోతోంది. కొన్నాళ్ళకు కొల్లేరయి పూడుకుంటుంది" చాటునా మాటునా గొణుక్కున్నారు గ్రామ కోడెలు. అమాయికలయిన ఈ త్రీటూయిల్లాళ్లు. దీనికిగదరగా—ఇంకా తోండిపంపు వెక్కిరిస్తూనేవుంది అమ్మాయిని.

# 4

ఆరుద్రనుండి ఆశ్లేష అయిపోయిందాకా వున్న పోరుపు నేలను వడిదిప్పింది. "ఆరుద్ర బిందించిందిరా—ఆర్నెల్లు పోరుపు" ఊరికే పుట్టా యిట్టా సామెతలు? అని తలకెరసిన కాపులు వ్యాఖ్యానించారు. ఈ నాలుగు కార్తెలూ కురవకపోవడంతో మెరక్కచేల్లు మొట్టెక్కాయి. పాతగింజలైపోయి గంజికి గిజగిజ మొదలైంది. సెరియులు దీసిన గరువులు, బీటలువారిన చేవళ్లు మాని రైతులకళ్లు చెమ్మగిల్లుతున్నాయి. గొప్ప తప్పులకు, కలుపుతీతలకు నాదారు రైతులు చేబదుళ్లు దెచ్చి, నోట్లుప్రాసి పెట్టుబళ్లు పెట్టి దిక్కుమొగా లేశారు.

మన్మథుడు మహారాజా—ఏ దేవతలలో మునీశ్వరులతో గాలి వల్లి పూలవానలు కురిపించడానికి వెళ్లాడా అన్నట్లు మఖకార్తె ప్రవేశించేదాకా తుల్చుపట్టలేదు—ప్రథమపాదం అడుగుపెడుతూనే ఆకాశాన్ని హైరాయిగప్పింది మేఘం—శ్రావణ మేఘం అపురూపరంగా అపూరు రావడంతో ఆనందం మహోత్సవంగా గ్రామమంతా వెల్లువిరిసింది. రైతుబిడ్డ కళ్లు మిల మిలలాడాయి మెరుపుతీగెలతో

సరాగాలాడుతున్నట్లు. లేగదూడలు తోకలెత్తి వీధులన్నీ తామే అయి దుమ్మురేపుతున్నాయి. గిత్తల చురుకు మరీని. వీర్రాజు కాళ్ళు వడి చావుదప్పి కన్ను లొట్టపోయినట్లయింది.

తొండిపంపు చూసి అమ్మాయికి సంతోషం తొణికిసలాడింది. వానకురిసింది. కుంభవృష్టిగా కుమ్మరించింది. ఆకాశం చిల్లులు పడ్డదేమో అని జనం అదిరిపడింది. ఒకరాత్రల్లా తెగపడింది వర్షం. రేవటివాళ్లు నిలువెత్తిపారాయి. మర్నాటి ప్రొద్దుటికి దబకలాటి చెరువుల్లో తేలుతూ చిరుకప్పలు రొదపెట్టడం ప్రారంభమైంది. తొండిపంపు నిండా గట్లుమొయ్యా నీరుపట్టింది. సూరిన్న అరకలు మళ్లించాడు. ఆనంద సందోహంతో పరవశమైన ఆకుమడి చూసి అమ్మాయి ముఖం విప్పారింది. నారుమడిని పెట్టింది. వూడ్పుకు— వాల్గుకట్టల ముట్టలు, గూడచాపలు, తాటాకుగొడుగులు తానే వప్లయి చేసింది ఉడుకుగంజితో. పైన ముస్తాబు—వొంటివట్టి పట్టుకొని జనపగూడలు, నోట్లో చుట్ట, వొరిసిన చేతుల్లో వరినారు, పదాలు పాడుతూ, సరాగాలాడుకుంటూ, సైఁ అంటే సై. అంటూ మధ్యాన బాడిలో నిలబడే తూటతో అగ్గి అందిస్తూ సూరన్న అదిలిస్తూంటే తొండిపంపులో వూడ్పుసాగింది. కాపు పంపుమీద వరిచేను పరిగెత్తింది. దంపవ్యవసాయమే అంత. నిన్న బీడు నేడు చేను. 'గాడిద గంపెడు ఊక మేసిం'దని మొక్క ఎంతవుంటే అంత బండిగింజలయ్యే పంపుక్రింద బాగామూరు.

వూరంతా తొండిపంపు ఊడ్పు గురించినదే—వీర్రాజు చెవులు వినలేక తూట్లుపడ్డాయి—కాలక్రిందినుంచి రెండువేల చిల్లర అప్పు రూపాయలు తెచ్చిన అమ్మాయి ముదిరాప్పకని వూళ్ళి రెట్టించింది. కూలిజనమంతా వారంరోజులు తొండిపంపు నిండానే వున్నారు. ఆకు బొబ్బమోపుగా పరిపోయింది. గట్లు వెల్లకుండా వేయించి చెంగలు వరికి పెడలన గప్పించాడు సూరన్న. 'ఆపది ఆవేశంలో తీసుకుందీ పంపు' అని ముదిటో అనుకున్న సూరన్న అంబలి లాగా జవసత్వాలతో బంగారంపండే తొండిపంపులో మెరిమట్టి చూసి యకరం గరిసె రాలాలి అని గుణించుకున్నాడు.

ఎకరం గరిసె పండాలనుకొన్న బుడెమలు నాలుగూ, మూడూ ఏకుంటై వూడుకున్నాయి. నువ్వుచేల రాలిక లెక్కలోకి రాలేదు. చెరుకొన్న అంతా తప్పకాయే. నీవు లేకపోతే నేనుమాత్రం చావనా! అని కొర్రకొరకొరలాడింది. పాపం! కందిమొక్కలు బుడ్మ, వేరుశెనగ తీసేసిన చేలలో ఒంటరి బ్రతుకు అనుభవిస్తూ మఖవానకు మళ్లీ సంతోషాన్ని ప్రకటించాయి. వీర్రాజు తాపువెట్టుబడి లెఖ్ఖలు వికృతంగా వెక్కిరించాయి. షావుకార్ని అదలించి తిరిగి రెండువేలు ఇచ్చాడు తొలకరిపోతే పోయింది పైరెక్కడికి పరుగెడుతుంది. ముందుంది మేపాస్ అని కొడుకుల్ని పాలేళ్లనీ హెచ్చరించాడు.

కాని కాలాన్ని కట్టగలవాడీనాటివరకు పృథ్విమీద ఎవడూ పుట్టలేదు. మరచిపోయిన వానంతను అదేపనిగా ఏనుగుతొండాలలో వొంపుతున్నట్లు మన్మథుడు కుమ్మరిస్తుంటే దాన్ని భూదేవి కందియ్యడానికి ఆకాశం ఆయాసపడుతోంది. మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి వానలు కురిశాయి. విశాఖ విసిరేసింది.

రేవకు వూడెక్కాయి. చెరువులు కరటాలేశాయి. కళింగలుదాడ బల్లల్ని త్రోసిరాజని గంగనాట్యమాడింది. వొంతునీరు యివ్వగూడదనుకున్న వీర్రాజును "నీ నీరెవరికెక్కావాలోయ్—" అని వెక్కిరిస్తున్నట్లు తొండిపంపు ఏపుగా పెరిగే వరికర్రలతో తోగ కన్నె విరిసినట్లు చూసింది. ప్రతిరోజూ నీరే—వీర్రాజుకు ఊలవ చేనుకుపదును కొరకలేదు—"నేవసలే కరువుపంటను. కాలంనాడు లాభంలేదు' అంది ఉత్తరలో జల్లినా, ఊపెక్కిపోయిన జొన్న చేను. దీనికితోడుకరువులో అధికమాసమని విశాఖవిసురుకున్న వాల్గు కర్రల్ని వొరగబెట్టింది. అందుకేగాబోలు జొన్నచేను హామీ యిచ్చిందట రైతుకి "స్వాతిచల్లగావుంటే విశాఖ విసరకుండావుంటే బుట్టతో వెళ్లి బళ్లతో ఇళ్లకొస్తానని"—మరి యీ యేడు స్వాతి కురిసింది. విశాఖ విసిరింది. వీర్రాజుముఖం ఎలా విరుస్తుందీ? మిరప తోటలకు యెర్ర తెగులుబట్టింది. ఎంతిపెబ్బు పెట్టి మందులుకొని జల్లినా ముడతాకు విడలేదు, యెర్రదనం పోవలేదు—మిరప మొక్క లేవలేదు—వ్యవసాయ డిపార్టుమెంటు వారికిమాత్రం వేయిరూపాయలకు పైగా మందుల అమ్మకంవల్ల లాభించింది.

మంచి పెంచుకుంటూంటే చెరు సిగ్గుతో ముఖంతించుకుంటోంది. రోజురోజు క్రొత్తరంగుతో నవలెత్తుగా నిలువెత్తు పైగా వల్లగా తొండిపంపులో వరి పెరిగిపోతుంటే జమ్మిచేను, పాటిచెల్క, చిన్నపూసచేలోలంక, గోతిలగవ్వ దగ్గరా వీర్రాజు క్షేత్రల్లో జొన్న, మిర్చి, ఉల్వ, చోడి మూడలేక గుడ్లలో నిప్పు పోసుకుని ఏడుస్తున్నాయి. విశాఖ విసురుకుగూడా విరగబండిన తొండిపంపులో వరికర్ర వాలకపోవడంతో రైతులు ఆశ్చర్యపడ్డారు. "అమ్మాయి అదృష్టం—పుట్టాక పంపులో ఇంత వరి వేమాపలేదంటే—గొడ్డుగేది సింహాలక్ష్మి అయిందిరా. చెరపకురా చెడేవు అన్నారిందుకే" ఇలాగ్గా దారివబోయిన ప్రతివాడి వ్యాఖ్యనూ వినలేక విసిగిపోయింది తొండిపంపు. కార్తీకమాసంలో కోడిపుంజునుకోసి పాతిపెట్టించాడు సూరన్న. మఖకార్తెలో వూడిస్తే మగురమీద కర్రగూడా పండుతుందన్న సామెత అక్షరాలా ఋజువయ్యింది.



## 5

పుష్యం అంతంలో వీర్రాజు లెఖ్ఖవేసుకుంటే తేలిన వరకి మెరక ఫలసాయం పుట్టెడు జొన్నలు. ఎనభైముక్కలు మిర్చి. వోట్లోవి పదిగోన్లు చోళ్ళు. కందులు మూడువేల మోపుగలిసి గరిసె. ఉలవలు పాతిక ఏడుంలు. ధాన్యం నాలుగుగరిసెలు. తొండిపంపు గోసి అంభీరాళ్లాగ వరుసగా ఇరవైకుప్పలు వేశారు. యకరం లేదంటే గరిసె అని అందనా వేసుకున్న వీర్రాజుకి నిద్రబట్టలేదు. ఆ ధాన్యం ఎలాగైనా వాళ్ళకు దక్కనియ్యగూడదనుకున్నాడు. ముదతపేచీ లేవదీశాడు.

రాత్రింబవళ్ళు కాపలా కాసి కాని సూరన్న సూర్పిడికి బంతులు మాట్లాడాడు—ఎగరబోతకి ఇరవై జోళ్ళ క్రొత్త చేటలు కొంది అమ్మాయి. కళ్ళాలు చెక్కేశారు. రేపు ప్రొద్దున్న కొంత

కడకొదు నూర్పిడి అవగా కోర్టు అమీనా జప్తు ఆర్డరు పట్టుకొచ్చి అమ్మాయి కందించాడు. అందలి సంగతులు చూసుకుని అమ్మాయి నిశ్చేష్ట రాలైంది. వీర్రాజు వాటాలో కొస్తుందనీ, మళ్ళీ వేయించాలనీ అప్పటిదాకా అయితేజా ఆపు చేయించాలనీ పిటీషను పెట్టాడు కోర్టుకు. తలపెట్టిన పనికి ఇలా విఘాతం కలిగించేమిరా దేవుడా అనుకుంది. కప్పలకు కొపాలాపుంచి పూరంతా టముక్కు వేయించి మాదిగాడికి రూపాయి బత్తెం యిప్పించి మధ్యవర్తుల యెదుట రశీదు వ్రాయించి నిశానీ వేయించి వీర్రాజు కాపుదగ్గర కాలంట్రీ పడుక్కుని వెళ్ళిపోయాడు అమీనా.

రాత్రి అంతా అమ్మాయికి ఆలోచన తట్టలేదు. జప్తు ఆపు చేయించవలసిందిగా కోర్టుకు అర్జీ పెట్టుకొంది. కాని అది అంత త్వరగా తేలుతుందా. రెండువందల రూపాయలు తగలేసి అంచీల మీద ఆర్డర్లు పుట్టించుకొచ్చేసరికి కెలా పదిహేను రోజులు గడిచిపోయింది. నూర్పిడి సాంతం అయ్యేటప్పటికి నెలరోజులు పట్టింది. "అయితేనేం సాధించిందిరా అమ్మాయి" అన్నారు అంతా. తొండి పంపు మొత్తం యాభై గరిసెలూ రాలడంతో మెరక పదెకరాలుంటేనేం యీ పంపులాంటి పల్లం యెకరంవుంటే చాలదు! అనుకున్నారు. మనిషికొమాట చొప్పున చెప్పి మన్మథ గడచిపోయింది. వీర్రాజు అన్ని ఎత్తుల్లోను నెగ్గాడుగాని యీ ఆఖరి పన్నుగడలో గెలవలేకపోయాడు. ఎందుకోకూడా తెలుసుకోలేకపోయాడు. అమ్మాయి అద్దె కుచ్చుకున్న కొట్లు చాలలేదు ధాన్యానికి. అటుకులు గొట్టుకోవడానికి కుంచెడూ కుంచెడూ పంచిపెట్టింది ముత్తైదువులకు—కరణంగారికి రెండు కాటాలు బాగు చేయించి బహుమతీ యిచ్చింది. దేవుడున్నాడని నేను దిలాసా చిక్కింది ఆమెకు.

జొన్నలకు బేరగాళ్లు రావడంలేదు—మిర్చి మణుగు పాతిక కమ్మంది పదహారుకి పడిపోయింది. కందులు రూపాయికి రెండు గుంచాలిస్తాం కొనమని ఖాయిదాదారుడు ఎంత బతిమాలినా పావు కొళ్ళు కరెక్కడంలేదు. ధనియాలు నూటయాభైకి అడిగిపోయారు పుట్టి, పొల్లు మూలబడి ముక్కుతూ మూల్గుతున్నాయి—ధరలకు ఎగుమతీ రావాలని ఎదురుచూస్తున్నారు. ధాన్యం బస్తా పాతిక రూపాయలు చేసి మిల్లుదార్లు విల్వకని అడిగితే అమ్మాయి ఖాయపెట్టింది నలభై గరిసెలూ నూరు రూపాయల నోట్లకట్టలు క్రొత్తవి బ్యాంకునుంచి అప్పుడే వచ్చినవి లెఖ్ఖపెట్టుకుంది అమ్మాయి.

మన్మథుడు సెలవు పుచ్చుకున్నాడు దుర్ముఖికి ప్రవేశమిచ్చి. ఇవాళ సంవత్సరాది. చిరిగిన చొక్కాలు తొడుక్కొని, చాలని గంజితో అంటిపెట్టుకున్న కడుపులతో 'ఈ పంపు మాదే అయితేనేం మా రాత ఇలా గయింది' అని తొండిపంపును చూస్తూ దారిన యీడిగలబడుతూ బడిలోకి వెళ్ళే అమ్మాయి కొడుకులు వెంకట్రాజూ, శ్రీరాములూ క్రొత్తచొక్కాలు తొడుక్కుని మువ్వలగట్టిన వరెడ్ల సవారీబండిలో కొండ్రకోట మాకాలమ్మ తీర్థానికి వెడుతున్నారు. మల్లురేకు సరిక్రొత్తది గట్టుకొని, మెడలో జగినీసాను, చేతికి మురుగులు పెట్టుకొని బండిలో కొసన కూర్చున్న అమ్మాయి దారివారనే వున్న తొండిపంపుకేసి తొంగిచూసింది. వారిబండికి వెనకనే వచ్చి కలసుకొంది వీర్రాజుగారి సుగాల కోడెల్ని గట్టిన పెట్టిబండి. మువ్వలు సవ్వడిచేసి అమ్మాయి దృష్టిని అటు లాక్కున్నాయి. లోపలికి చూసింది. వీర్రాజూ, భార్య మంగమ్మా, కొడుకులిద్దరూ వున్నారూ—"తప్పించరా బండి" అదలించాడు తొట్టిలో గూర్చున్న కొడుకును వీర్రాజు—క్షణంలో సుగాలకోడెలు పెడగా బండినిలాగి కూరన్న తోలుతున్న అమ్మాయి గారి పెట్టిబండిని తప్పించాయి—"తప్పుకోమా? వయ్యా" అని రోషంతో రెండువరెడ్లవీపులమీదా బరువుగా దరిచాడు వెంకట్రాజు—అంతే. వాటికి రెచ్చింది. తోకలెత్తి పెట్టి నాలుగుకాళ్ల సవారీ దీశాయి. రెండు అంగల్లో వీర్రాజు బండిని దాటేసింది. వీర్రాజుకు అరవయ్యోపడిలో కాటికి కాళ్లు చాచుకొన్న గ్రామీణ నిరంకుశత్వానికివలె కోపంవచ్చింది. గిత్తల్ని తోకలు మెలేయించాడు పెద్దకొడుకు చేత—తొండిపంపు మళపులో నాటిన సర్వేరాయి, కొట్టవచ్చినట్టుండి త్రోవపోయే వాళ్లను వెక్కిరించే నల్లకాటేయరాయికి తాకింది సవారీబండి చక్రం. బండి తొరిగింది. పంపుగట్టుకు కొట్టేసింది ఇవతలి చక్రాన్ని దాపటిది. క్షణంలో బోల్తాకొట్టింది వీర్రాజుబండి. నిలువుకు పైగా యెత్తునపెరికి ఇరవై వేలకట్టుకు లొక్కరాదని ఈర్ష్యతో ఇప్పటిదాకా వీర్రాజుమనసులో విసవిసలాడిన జనుముచేను పరుపులాగుండి వాళ్లను అదుకోకపోతే ఎంతో ప్రమాదంలోబడిపోయివుండురు. చేనునిండా విరగబూసిన పూలతో బంగారు పొప్పులా మెరుస్తున్న జనుముతో పకాలున నవ్వింది వీర్రాజు పొటును చూసిన తొండిపంపు.

---

# ముఖాల ముచ్చట

శ్రీ చదలవాడ వెంకటరామయ్య

కన్ను, ముక్కు, నోరు, చెవి—ఇత్యాదులను అందరికీ ప్రసాదించినవాడు పరమేశ్వరుడు. వాని ప్రయోజనాలున్నూ అందరికీ ఒకటే. కాని, వాటి పొడవు వెడల్పులు, పొందికలలో సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ విభేదాలు కల్పించి తత్ఫలితంగా ఎవరిముఖం వారికి ఏర్పరచడంలోనే చతుర్ముఖుని చతురత ఇమిడివుంది. ఈ ముఖాల వైవిధ్యమే లేకుంటే, "నక్కలు, కుక్కలు, గోవులు, కాకులు" అన్నట్లే నరజాతికూడా "మనుష్యులు" అని కలిపికట్టుగా వ్యవహరింపబడి, "రాము, సోము, ఎల్లయ్య, పుల్లయ్య" అంటూ మనిషికొక పేరు, పేరుకు తగ్గ ప్రఖ్యాతి కలగడానికి ఆస్కారం వుండేదికాదు. కొన్ని సందర్భాలలో అటువంటి వైవిధ్యం లోపించి కొన్ని పోలికలు ఎక్కువైనందువల్లనే, రాజు పేదగాడు కావడం, పేదగాడు రాజుగా మారడం, తప్పుల తమాషాలు (Comedy of errors) జరగడం, తబ్బిబ్బులు పడడం మొదలగు నిదర్శనాలు లేకపోలేదు. కాబట్టి మానవ శరీర నిర్మాణంలో ముఖం అనేది విధాత చేసిన వింతసృష్టి అని చెప్పక తప్పదు. ఈ ముఖం ప్రత్యేకావయవమూ కాదు. కొన్ని అవయవాల వింత సమ్మేళనం అంతకన్నా కాదు. పై చెప్పిన నేత్రాదికావయవాలలో ఏదైనా లోపించినా, చివరకు "సొట్ట మొహం" అనే పేరుతోనైనా ఒక ముఖమంటూ తప్పకుండా వుండడమే ఇందుకు తార్కాణం. ఏది ఎట్లున్నా ముఖాల ప్రభావం మాత్రం మన జీవితాలలో "బహుముఖా"లుగా వ్యాపించి వుండేమాట మాత్రం నిజం.

"ఏమండీ! హనుమంతరావుగారూ?" అంటూ ఒకానొకారినిగారయే దానయ్యను ఎవరో హెచ్చరిస్తే, అందుకు హనుమంతరావుగారు ఆశ్చర్యం ప్రకటిస్తూ, "నా పేరు మీ కెలా తెలిసిందని ఎదురుప్రశ్న వేయగా" తమ ముఖమే తమ పేరు చెప్తోందని మొదటివ్యక్తి జవాబిచ్చిన గాథ అందరికీ తెలిసినదే. అటువంటి సార్థక నామధేయాలు మాని తత్వానికి, ఆకారానికి విరుద్ధంగా ఎంత మంచిపేర్లు పెట్టుకొన్నా చివరకు కొందరికి "చప్పిడి మొహం, దేబిరిగొట్టు మొహం, మొద్దుమొహం, కోతిమొహం (తమిళం కొరంగుమూంజి-వాయుపుత్రి అని కన్నడంలో కొంధరు అమ్మాయిలను కూడాఅంటారు) Castor Oil Face, అళుమూంజి, (ఏడుపు మొహం) శిడుమూంజి (వసపోతుకు పేరు) వెడియామూంజి (దేబె మొహం) మొదలైన బిరుదులుమాత్రం తప్పడంలేదు. అందులోనూ "వెడియా మూంజికి వేలై వరాదు వేలైవందా కూలి వరాదు" (దేబెమొగానికి ఉద్యోగం చిక్కదు—ఉద్యోగం చిక్కినా జీతంవుండదు) అనే అభిప్రాయంకూడా అరవంలో కద్దు.

మనలోని అమాయిక జీవులను "వెర్రిమొహాలు" అంటారు. కొందరి "ముఖాలలో దరిద్రం తాండవమాడుతూ" వుంటుంది. మరి కొందరి ముఖం శోభాయమానంగా "కళకళ" లాడుతూ వుంటుంది. కోరినకోరిక తీరకపోతే, దగ్గరిచుట్టం దూరంపోతే, ఆశించిన వస్తువు అందకపోతే మనం మొగంవాచిపోతాము. అంగరంగ వైభోగాలైనా అధికమైతే మనకు "మొగం మొత్తిపోతుంది" అవమానంతో మనం "ముఖం వేలాడవేస్తాము." ఆశ్చర్యంతో "తెల్లమొగం" వేస్తాము. ఆనందంతో "ముఖం చేటంత" చేసుకొంటాము. కోపంతో "ముఖం చిట్లిస్తాము." దీనికి Wry Face అని కూడా అంటారు. ఆ కోపమే మరీ ఎక్కువైపోతే "మొహం మాడిపోతుంది" ఆ సమయంలో "మొహంలో వడ్లగింజవేస్తే పేలాలై పెట్లిపోతుంది" కూడా. నీచకృత్యాలుచేస్తే లోకులు "ముఖాన వుమ్మేస్తారు." అంతేకాదు; నలుగురూచేరి "మూతిమీదకొట్టడం" కాక "ఛీని మొగమీజ్వా" అని తిడుతూ, "ముఖావలోకనంచేస్తే పాపం" అని అసహ్యించుకొంటూ బహిష్కరిస్తారు కూడా.

తిండివిషయంలో కొందరు "మొగమాటం" పెట్టుకోరు. వ్యాపారస్తులు వ్యవహార విషయాల్లో "నిర్మొగమాటంగా" మాట్లాడుతారు. కొందరు ఏవో "ముఖంతుడుపు" మాటలు చెప్తూ చేసే కీడుచేస్తూనే వుంటారు. "ముఖస్తుతి" (ముఖప్రీతి అనికూడా మరొక పేరుకద్దు) మాటలకు లొంగిపోయి వంచకుల వల్లో పడిపోతారు కొందరు. "ముఖవర్చస్సు," "ముఖకళ"ననుబట్టి వ్యక్తుల మనోభావాలు తత్వాలు కూడా నిర్ణయించవచ్చు. ఆ సందర్భంలోనే Face is the index of the mind అనే సామెత పుట్టింది. "అగత్తిన్ అళగు ముగత్తిలే" అన్న తమిళం సామెతకూ అదేభావం.

కొందరికి క్రొత్తవారితో మాట్లాడడానికి "ముఖం చెల్లదు." వారికి "ముఖరాశి" ఇల్లదని అందరూ హేళన చేస్తారు. అందుకు వారు సిగ్గుతో "ముఖం ముడుచుకొంటారు." ఆడినమాటలు తప్పి అప్పులు ఎగగొట్టేవారు సాధారణంగా "ముఖం తప్పించుకు" తిరుగుతారు. పరస్పర విరోధాలతో "ఎడమొఖం పెడమొఖం" గా వుంటూ వున్న వారికి ఆఖరు రోజుల్లో "ముఖం చూపులకు" కూడా ఆస్కారం వుండదు. మంచివారి "ముఖంచూచి" వారి తాలూకువారు కొందరుచేసే దురంతాలకు కొంతమటుకు సహించడం జరుగుతుంది. తర్వాత తన్నులు తగలడం పరేసరి. కొందరు ఏ విషయమైనా "ముఖాముఖి" గా చర్చించి తేల్చుకొంటారు.

మనమధ్య చాలామంది "గోముఖ వ్యాఘ్రాలు, పయోముఖ విషకుంభాలు" సంచరిస్తూ వుంటారు. వారిని కేవలం ముఖాలను

# భీమా కంపెనీల శాసనం

శ్రీ గోపాద సత్యారావు

**1956** సంవత్సరం జనవరి 19 వ తేదీ సాయంత్రం జారీ చేయబడిన రాష్ట్రపతి ఆర్డినెన్సు ప్రకారం, తక్షణం భారతదేశంలో విదేశీ కంపెనీలు చేస్తున్న జీవితభీమావ్యాపారం, విదేశాలలో భారతదేశపు కంపెనీలు చేస్తున్న భీమావ్యాపారంతో సహా, భారతదేశంలోని జీవితభీమా వ్యాపారం భారతప్రభుత్వ పరమయింది. అప్పటికివున్న జీవితభీమావ్యాపారం చేస్తున్న కంపెనీలకు "కస్టోడియన్లను" (అధికార్లను) ప్రభుత్వం నియమించింది. జీవితభీమావ్యాపారం పూర్తిగా జాతీయం చేసి యికముందు జరగవలసిన కార్యక్రమం తయారయ్యేలోగా కంపెనీల వ్యవహారాలు నడుపుటకుగాను వీరు నియమింపబడ్డారు.

రాష్ట్రపతి ఆర్డినెన్సు జారీచేయటం అకస్మాత్తుగా జరిగింది. అకస్మాత్తుగా అనడానికి గూడ వీలులేదు. కారణం గత సంవత్సరంలో జీవితభీమాను జాతీయం చేసే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, నూచనప్రాయంగా మంత్రులు హెచ్చరికలు చేస్తూనే వున్నారు. వ్యవహారాలు సరిగా కాని కంపెనీలకు ప్రభుత్వము "అడ్మినిస్ట్రేటర్ల"ను నియమించింది. తప్పులు చేసినవారిని అరెస్టు చేసింది. సరిగా నడుచుకోకపోతే ప్రభుత్వం వశపరచుకోవాల్సి వస్తుందని హెచ్చరికలు చేసింది. అయితే వీటిలో అంతర్యం, వీటివలన వ్యక్తమయ్యే ప్రభుత్వఉద్దేశ్యాలు ఎవరూ లక్ష్యం చేయలేదు.

ఈ జీవితభీమావ్యాపారాన్ని జాతీయం చేయడానికి ప్రభుత్వం నిర్ణయించినప్పుడు పార్లమెంటులో శాసనం చేయించి ఆతర్వాత స్వాధీనం చేసుకోవాలని కొందరు విమర్శించారు. రాష్ట్రపతి ఆర్డినెన్సు జారీచేసే అధికారం సక్రమంగా వినియోగించలేదని ఆరోపించారు. కాని ఇటీవల జరిగిన సంఘటనలు, ప్రభుత్వ ప్రకటనలు చూస్తే జాతీయం చేయడానికి నిర్ణయించిన తర్వాత నిర్ణయం అమలు చేయడంలో ఒక్క క్షణం వృథాకాకుండా, ఈ నిర్ణయం అమలు జరిగేలోగా అది ఇతరులకు తెలియకుండా వుంచటం ఎంత అవసరమో బోధపడుతుంది. ఈ నిర్ణయం ముందుగా కొన్ని రోజులయినా—తెలిస్తే కొందరు ఇల్లు చక్కబెట్టుకొనేవారే! ఈ నిర్ణయం బయటకు పొక్కకుండా ఉంచినందులకు ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ అభినందనీయులు.

## జాతీయం చేయకమునుపు

1955 అక్టోబరు నాటికి దేశంలో 317 కంపెనీలు భీమా వ్యాపారం చేస్తున్నవి. వీటిలో 210 భారతీయులవి; 107 విదేశీయులవి. వీటిలో 109 భారతీయ కంపెనీలు, 8 విదేశీ కంపెనీలు జీవితభీమావ్యాపారంమాత్రం చేస్తున్నవి. 40 భారతీయ కంపెనీలు, 13 విదేశీ కంపెనీలు మిగతా భీమావ్యాపారంతోపాటుగా జీవితభీమా వ్యాపారంగూడ చేస్తున్నవి. 1945 నుండి 1954 వరకు ఈ కంపెనీలు చేసిన వ్యాపారం వివరాలు క్రింద ఇవ్వబడినవి.

| | అమలులోవున్న మొత్తం వ్యాపారం కోట్లలో | | | శాతము | | కొత్త వ్యాపారం | |
|---|---|---|---|---|---|---|---|
| సంవత్సరం | భారతీయకంపెనీలు | విదేశీ కంపెనీలు | మొత్తం | భారతీయ | విదేశీ | భారతీయ | విదేశీ |
| 1945 | 462 | 95 | 557 | 82.5 | 17.5 | 128.7 | 12.6 |
| 1946 | 550 | 101 | 651 | 84.5 | 15.5 | 140.9 | 12.9 |
| 1947 | 606 | 108 | 706 | 85.4 | 14.6 | 126.5 | 13.1 |
| 1948 | 621 | 103 | 724 | 85.8 | 14.2 | 121.7 | 12.9 |
| 1949 | 662 | 103 | 765 | 86.8 | 13.2 | 130.0 | 12.2 |
| 1950 | 671 | 109 | 780 | 86.0 | 14.0 | 125.8 | 13.7 |
| 1951 | 755 | 118 | 873 | 86.5 | 13.5 | 131.4 | 16.5 |
| 1952 | 796 | 126 | 922 | 86.3 | 13.7 | 130.3 | 16.4 |
| 1953 | 833 | 133 | 966 | 86.2 | 13.8 | 133.2 | 17.0 |
| 1954 | 922 | 137 | 1059 | 87.0 | 13.0 | 213.3 | 16.2 |

ఈ లెక్కలనుబట్టిచూస్తే గత 10 సంవత్సరాలుగ జీవితభీమా వ్యాపారంలో విదేశీయుల పలుకుబడి సన్నగిల్లిందని తెలుస్తున్నది. దేశంలో మొత్తం అమలులోవున్న జీవితభీమాలో విదేశీ కంపెనీల ఆధ్వర్యంలో 13% మాత్రమే ఉంది. భారతీయులలో జాతీయతత్వం నానాటికి ప్రబలుటవల్లనేమి, భారతీయ కంపెనీలు వ్యాపారపద్ధతులను సమర్థంగా నిర్వహించుటవల్లనేమి యీ జీవితభీమారంగంలో భారతీయకంపెనీలు విదేశీయుల పోటీకి తట్టుకొని ప్రముఖస్థానం ఆక్రమించుకున్నవి.

గత 5 సంవత్సరాలలో భారతీయ భీమాకంపెనీల ఖర్చులను చూస్తే కొంత దుబారాఖర్చు లున్నట్టు బోధపడుతుంది. భీమాకంపెనీలలో వచ్చే ప్రీమియం మొత్తానికి—అయిన ఖర్చులకు వుండే నిష్పత్తి ఇలా వుంది:

| | భారతీయ కంపెనీలు | విదేశీ కంపెనీలు |
|---|---|---|
| 1950 | 28.9% | 21.8% |
| 1951 | 27.2% | 23.0% |
| 1952 | 27.2% | 22.4% |
| 1953 | 27.4% | 20.4% |
| 1954 | 29.8% | 21.0% |

భారతీయ కంపెనీలలో కొన్ని కంపెనీల ఆదాయం-ఖర్చుల నిష్పత్తి (Fxpense Ratio)ని చూస్తే ఆదాయాన్ని ఎలా దుబారాగా ఖర్చుచేసినవో తెలుస్తుంది: భాస్కర్ భీమాకంపెనీ (41.2%) ఐడియల్ మ్యూచువల్ (43.2%), క్రెసెంట్ భీమా కంపెనీ (68.7%).

మరికొన్ని పెద్ద కంపెనీలలో ఉదాహరణకు ఓరియంటల్ జీవితభీమాకంపెనీ (25.4%), బొంబే జీవితభీమాకంపెనీ (25.9%) ఖర్చులు తక్కువ.

ఈ నిష్పత్తినిబట్టి కంపెనీల సామర్థ్యం, పొదుపరితనం, ఆర్థికస్తోమతు, వాటాదార్లకు, పట్టాదార్లకు పంచే లాభాలు ఆధారపడి ఉంటయ్యి.

భారతీయ కంపెనీలలో ఈ ఖర్చుల నిష్పత్తి ఇంత వ్యత్యాసంగా వుండుటవలననే ఎన్నో ప్రమాదాలు ఏర్పడినవి. గత పది సంవత్సరాలలో 25 కంపెనీల వ్యవహారాలు చిక్కులలో పడిపోయినవి. మరో 25 కంపెనీల నిధులు దుబారా కావటంతో ఆ వ్యాపారం ఇతర కంపెనీలకు మార్చవలసివచ్చింది. అంటే వాటాదార్లకు పట్టాదార్లకు తీరనినష్టం కలిగింది.

“భీమావ్యాపారం ఎట్టిపరిస్థితులలోను నష్టంరానట్టి వ్యాపారం. అయినప్పటికీ ఇన్ని అవకతవకలు సంభవించినవంటే ఆకంపెనీల వ్యవహారాలు ఎలా నడిచినవో ఊహించుకోవచ్చు” అని శ్రీ దేశ్‌ముఖ్ అన్నారు.

ఈపరిస్థితులలో జీవితభీమావ్యాపారాన్ని జాతీయం చెయ్యాలని భారతప్రభుత్వం నిర్ణయించింది. సంపూర్ణంగా జాతీయం చేయటానికి నాందిగా భీమావ్యాపారాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొనుటకు ఆర్డినెన్సును జారీచేయించి, కస్టోడియన్లద్వారా వశం చేసుకుంది.

ఇకముందు జీవితభీమావ్యాపారం నడిచేపద్ధతిని నిర్ణయిస్తూ పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టబడింది.

భీమాకంపెనీల నిధులు వినియోగించే విధానాలను 1938 భీమా చట్టం నిర్ణయించింది. చట్టంలోని నియమాలను ఉల్లంఘించిన సమయాలు చాలవున్నందున, ఇంచుమించు ప్రతిసంవత్సరం వీటిని కట్టుదిట్టం చేయవలసి వస్తూవుండేది. ఎంత కఠినమైన నియమా లున్నప్పటికీ మొత్తం 165 జీవితభీమాకంపెనీలలో 51 కంపెనీల నిధులు సక్రమంగా వినియోగంకాలేదు. ఇప్పుడిప్పుడు బయటపడుతున్న అక్రమాలు మరికొన్ని.

**1938 సం. భీమా చట్టంలోని నియమాలు:**

కనీసం 50% భీమానిధులు ప్రభుత్వఋణాల రూపేణా వుండాలి. మిగతా నిధులు చట్టంలో పేర్కొనబడిన కొన్ని రకాలైన, కంపెనీల వాటాలు, డిబెంచర్లు స్థిరాస్తులు మొదలగు వాటిలో వుండవచ్చు.

భారతీయ కంపెనీల నిధులు 1954 సం॥ లో రు 1645 కోట్లు (మొత్తంలో 54.8%) ప్రభుత్వ ఋణాలు, రు 48.5 కోట్లు (16.1%) ప్రైవేటు కంపెనీలలోను పెట్టుబడి పెట్టబడినవి.

విదేశీ కంపెనీల నిధులు రు 30.1 కోట్లు (59 2%) ప్రభుత్వ ఋణాలలోను, రు 6 7 కోట్లు (13%) ప్రైవేటు కంపెనీలలోను పెట్టుబడి పెట్టబడినవి.

ఈ పెట్టుబడులు మొత్తంలో కొంత సరిగానే వున్నప్పటికీ, 7 కంపెనీల వ్యవహారాలు చూచుటకు ప్రభుత్వం అడ్మినిస్ట్రేటర్లను నియమించవలసి వచ్చింది. అవి. (1) East and West Insurance Co. Ltd., (2) Empire of India Insurance, Co. Ltd., (3) Jupiter General Insurance Co., Ltd., (4) Servant of India Insurance Co Ltd., (5) Tropical Co Ltd., (6) Union Life and General Insurance Co Ltd., (7) Bharat Insurance Co Ltd.

భారతదేశంలోని జీవితభీమావ్యాపారం — విదేశీయుల వ్యాపారంతోసహా — జాతీయంచేయబడినందున, ఇకముందు విదేశీ పెట్టుబడులపై ఈ ప్రభావం వుండగలదని కొందరు విమర్శిస్తున్నారు. కాని ఈ చర్యవలన ప్రభుత్వపరమైన విదేశీ పెట్టుబడులు నిజంగా స్వల్పమేనని చెప్పాలి. అదీగాక పైన వివరించినవిధంగా గత కొన్నాళ్లుగా భారతదేశంలో విదేశీ కంపెనీలు చేస్తున్న జీవిత భీమావ్యాపారం భారతీయ కంపెనీల వ్యాపారంతో పోల్చి చూస్తే, సన్నగిలుతూ వచ్చింది. 3 విదేశీ కంపెనీలు మాత్రం—జీవిత భీమా వ్యాపారం మాత్రం చేస్తున్నవి—పూర్తిగా అంతరించిపోతయ్యి, కాని మిగతా కంపెనీలు ఇతర భీమావ్యాపారం చేస్తూనే వుంటయ్యి. జీవితభీమాలో వచ్చిన స్వల్పనష్టాన్ని ఇతర భీమావ్యాపారంలో పూడ్చుకొనుటకు అవకాశం వుంది. గనుక ఇందువలన విదేశీ పెట్టుబడుల ప్రమాణం తగ్గుతుందని మనం భయపడనక్కరలేదు.

ఇక ముందు మన దేశంలో జాతీయం చేయబడిన భీమా వ్యాపారం ఎలా కొనసాగుతుందో సూచిస్తూ పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టబడింది. దాని ప్రకారం భారతదేశం మొత్తానికి ఒకే “కార్పొరేషను” వుంటుంది. దీనిలో 15 మంది సభ్యు లుంటారు. వీరిలో 5 గురు సభ్యులుగల కార్యవర్గం వుంటుంది. ఒక మేనేజింగు డైరక్టరు వుంటారు.

కార్పొరేషను వ్యవహారా లన్నీ కార్యవర్గనిర్ణయాలకు, మేనేజింగు డైరక్టరు అమలుజరుపుతాడు. మద్రాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలో ప్రాంతీయ కార్యాలయాలు, ప్రాంతీయ మేనేజరు ఆధ్వర్యంలో నెలకొల్పబడుతయ్యి. ఆయా ప్రాంతాలలో అవసరాన్నిబట్టి డివిజనల్ కార్యాలయాలను నెలకొల్పేహక్కు ప్రాంతీయ మేనేజరుకు వుంటుంది. కేంద్రప్రభుత్వ అనుమతితో, కార్పొరేషను కొన్ని కొన్ని అధికారాలను ప్రాంతీయ మేనేజరుకు దఖలుపరచవచ్చు.

ఈ కార్పొరేషను వ్యాపారసరళిలో నడుపబడాలని బిల్లులో పేర్కొనబడింది. కాని “కేంద్రప్రభుత్వ అనుమతి పొంది వ్యవహారం సాగించవలసినవి చాల పను లున్నవి. అందువలన కార్పొరేషను (Autonomous nature) స్వయంనిర్ణయాధికారం కొంతవరకు దెబ్బతినగల ప్రమాదం వుంది. ఇది కొంతవరకు తగ్గించినచో కార్పొరేషను వ్యవహారములు సాఫీగా జరుగుటకు, అవకాశం వుండగలదు.

ఇక ముఖ్యమైనది. మొత్తం 165 కంపెనీలలోని భీమాపట్టాలు ఒకపద్ధతికి తీసుకొనివచ్చుట. విభిన్నషరతులతో, ప్రీమియములతో, వున్న లక్షలాది భీమాపట్టాలను ఒకే షరతులతో ఒకే ప్రీమియం రేట్లతో వుండునట్లు చేయుట చాల కష్టమైనపని. పట్టాదార్లకు నష్టంలేనివిధంగా చేయుటకు కష్టోడియన్లు తక్షణం పూనుకోవాలి.

ఇంతవరకు హెచ్చుతగ్గులువున్న ప్రీమియములను సరిచేయుటకు తాత్కాలికంగా ఓరియంటల్ లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీ ప్రీమియం రేట్లను షరతులను ఆధారంగా తీసుకొని నిర్ణయించారు. ఈ విషయంలో వీలైనంతత్వరలో సమగ్రనిర్ణయం చేయుట అవసరం.

భీమావ్యాపారం సమర్థంగా నడుస్తున్న దనటానికి నిదర్శనములు రెండే! హెచ్చు బోనసులు, సత్వరంగా క్లెయిముల చెల్లింపు. ప్రస్తుతం కొన్ని కంపెనీలలో వున్న హెచ్చు ఖర్చులను తగ్గించుటకు పూనుకోవాలి. అప్పుడే హెచ్చు బోనసులు పంచుటకు అవకాశం వుంటుంది.

మనదేశం చాలవరకు వ్యవసాయంమీద ఆధారపడివుంది. ప్రజల జీవనప్రమాణం చాల తక్కువ. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా కార్మికులసంఖ్య హెచ్చుతున్నది. కార్మికుల జీవనప్రమాణం మిగతావారికంటె హెచ్చుగా వుందనే చెప్పాలి. జీవితభీమాను కొంత కనీస ఆదాయంకలవారందరికీ నిర్బంధం చేయాలి. అప్పుడు భీమావ్యాపారం అభివృద్ధిచెంది ప్రభుత్వం ఆశించిన రు 8000 కోట్ల మొత్తం భీమావ్యాపారం అమలులో వుండుటకు అవకాశం వుంటుంది.

త్వరపడి ఒక్కసారిగా వ్యవసాయదారులలో జీవితభీమాను ప్రచారం చేయుటకు పూనుకొనుట మంచిదికాదేమో! ప్రారంభంలో దీనివలన ఖర్చులు ఎక్కువ, వ్యాపారం తక్కువ, ఆ కారణంగా కార్పొరేషను ఖర్చులు ఎక్కువై పట్టాదార్లకు వచ్చు బోనసులు తగ్గిపోగలప్రమాదం వుంది. గ్రామీణప్రాంతాలకు భీమాను అంచెలవారీగా అమలుజరపటం వాంఛనీయం.

జీవిత భీమాను జాతీయం చేసినందువల్ల, ఇంతకాలంగా వ్యక్తిరంగానికి లభిస్తున్న పెట్టుబడులు తగ్గిపోగలవని సందేహం కొందరు వ్యక్తపరిచారు. కాని అటువంటి తగ్గింపు ఉండదని ఆర్థికమంత్రి శ్రీ దేశ్‌ముఖ్ హామీనిచ్చారు. వ్యక్తిరంగంలో—కంపెనీలలో—పెట్టుబడులు ఉంచుట అవసరమే. ఆవిధంగా కంపెనీల వ్యవహారాలలో ప్రభుత్వమునకు పరోక్షంగా అజమాయిషీ ఏర్పడగలదు.

భీమావ్యాపారాన్ని సంపూర్ణంగా జాతీయం చేసింది ప్రపంచంలో ఒక్క భారతదేశంలోనే!

1949 లో ఇంగ్లండులో కార్మికప్రభుత్వం యీ పనికి పూనుకుంది, కాని చివరకు విరమించింది. న్యూజిలాండు, బ్రెజిల్, జపాన్, మెక్సికోలలో ప్రభుత్వంలో "భీమాశాఖ" వుంది. ఆ దేశాలలో భీమావ్యాపారానికి గుత్తహక్కు (Monopoly) లేదు.

భారతదేశంలో కొంతకాలంగా "పోస్టల్ ఇన్సూరెన్సు పథకం" అమలులో వుంది. ప్రభుత్వోద్యోగులు, స్థానికసంస్థలు మొదలగు(Semi Govt. Institutions)లలోని ఉద్యోగులకుమాత్రం ఇది పరిమితం చేయబడింది. దీనినిగురించి తగినశ్రద్ధ తీసుకోని కారణంగా చెప్పుకోతగిన అభివృద్ధి సాధించలేదని చెప్పాలి. 1952-58 సం॥ లో వ్యక్తిరంగంలో భీమావ్యాపారం రు. 154 05 కోట్లు కాగా, ఈ పథకంలో ఇది రు 2 4 కోట్లు మాత్రమే!

ఇంత విశాలమైన దేశంలో, విభిన్న జీవితప్రమాణం వున్న ప్రజలలో, శైశవావస్థలో వున్న భారత ప్రజాస్వామ్యంలో, ఇంత సాహసోపేతమైన చర్య జయప్రదం కావటానికి అందరూ సహకరించాలి.

ఇంపీరియల్ బ్యాంకు జాతీయం చేయబడింది. రాష్ట్రపతి ఆర్డినెన్సుతో జీవిత భీమావ్యాపారం జాతీయం చేయబడింది. ఇది భారతప్రభుత్వ లక్ష్యమైన "సామ్యవాద సరళి సంఘం" (Socialistic Pattern of Society) స్థాపనకు నాంది.

ఇటీవల ప్రభుత్వ ప్రతినిధులు చేస్తున్న ప్రసంగాలు, చేస్తున్న హెచ్చరికలు—అందుకు సంబంధించిన ఆయావర్గాలు సక్రమంగా నడుచుకొననిచో—మరికొన్ని పరిశ్రమలు త్వరలోనే జాతీయం చేయబడగలవన్న సూచనలు కన్పిస్తున్నవి.

—o—

# Read Soviet periodicals




| Subscriptions: | One Year | Half Year | Single Copy |
|---|---|---|---|
| SOVIET UNION | Rs 6/12 | Rs. 3/6 | As. 13/- |
| SOVIET WOMAN | Rs. 4/4 | Rs. 2/2 | As. 8/- |
| SOVIET LITERATURE | Rs. 6/- | Rs. 3/- | As. 10/- |
| NEW TIMES | Rs. 6/- | Rs. 3/- | As. 3/- |
| INTERNATIONAL AFFAIRS | Rs. 6/12 | Rs. 3/6 | As. 12/- |
| NEWS | Rs. 4/8 | Rs. 2/4 | As. 4/- |
| MOSCOW NEWS | Rs. 8/- | Rs. 4/- | As. 1/6 |

ఈ క్రింది కేంద్రాలలో చందాలు అంగీకరింపబడును.

న్యూ సెంచరీ బుక్ హౌస్, 199 మౌంట్ రోడ్, మద్రాసు 2.

న్యూ సెంచరీ బుక్ హౌస్, C/17, మెజెస్టిక్ సర్కిల్, బెంగుళూరు 2.

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

MK V/O MEZDUNARODNAYA KNIGA, Moscow 200, U.S.S.R.

# సర్వాంతర్యామి

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

"ఆయిన రభస చాలుకాని, యేదో వకటి తేల్చి చెప్పే సెయ్యండి, యింత కట్టమతం నే నెక్కడా చూడలేదు, మన యింటా వంటా లేదు...' శాంతమ్మ కంగారుగా చూస్తూ నిలబడింది.

యాజులు మౌనంగా వింటూ కూర్చున్నాడు.

'ఇంతకీ యేమి తేల్చుకున్నారో చెప్పండి.....ఇక్కడరూ మాట్లాడరే...' శాంతమ్మ మళ్ళీ అందుకుని అన్నది.

'నేను చెప్పేదేమిటో యిందాకనే చెప్పేశా...అనే మళ్ళీ వినాలంటే, యింకోసారి చెపుతా......' యాజులు తీవ్రంగా అన్నాడు.

'అయితే నాస్తికమతంలో కలిసిపోయినా వన్నమాట అంతేనా...' శేషయ్య గట్టిగా కసురుకున్నాడు.

'నువ్వు చెప్పినదానికల్లా 'ఊ' అనకపోతే నేను నాస్తికుణ్ణి అన్నమాట...' యాజులు బుసలుకొడుతూ అన్నాడు.

'ఎవరన్నా విన్నా నవ్విపోతారు కాని, వూరుకుందురు....' శాంతమ్మ వారిస్తోంది.

'చదువులు చెప్పించింది, యింత మన వంశాన్ని వుద్ధరిస్తావను కున్నాగాని, యిట్లా మారిపోయి, నా కంఠంలో వుదకం పొయ్యవని అనుకోలేదు...' శేషయ్య గొంతులో ఆవేశంగా అన్నాడు.

'మాట మాట్లాడితే తద్దినాలు, మనిషి పోయిన తర్వాత యేం చెయ్యాలి, యివే ఆలోచనలు, మనం బ్రతికివుండగా చెయ్యాలిసిం దేమిటో అది చూసుకోవటం లేదు...' యాజులు గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు.

'ఎక్కడికిరా వెళుతున్నావు...ఇంతకీ తేల్చి చెప్పెయ్యి నాయనా, మీ యిద్దరిమధ్య నేను నలిగిపోతున్నాను. వస్తావా రావా...' శాంతమ్మ గుమ్మంముందర నుంచుని గట్టిగా అరిచింది.

యాజులు వెనక్కు తిరిగి ఆగేశాడు.

'నేను ఎక్కడికీ వెళ్ళటంలేదు. ఇప్పుడే వస్తాను. ప్రయాణం ఖాయమే...' యాజులు ముందుకు సాగాడు.

'ఏమిటండీ వీడు పదేను వాడితో సమానంగాడు......' శాంతమ్మ కోపగించుకుంది.

'ఇదంతా నువ్వు నేర్పిందికాదూ?...' శేషయ్య కస్సుమన్నాడు.

'అవునండి...ఎన్నిసార్లనా అనండి. వీడూ పెద్ద చదువులు చదివి యింత సంపాదిస్తాడనుకొన్నాను గాని, యిట్లా తయారవుతా డనుకొన్నానా ఏమిటి...' శాంతమ్మ కంటతడిపెట్టింది.

ఇంతలో బండీ తీసుకుని యాజులు వాకిట్లో తయారయ్యాడు.

మొహం చిటచిటలాడించుకుంటూ శేషయ్య బండీలో ఎక్కాడు. శాంతమ్మ ఓమూట పట్టుకుని వెనకాలే బండీ ఎక్కింది. యాజులు మఫ్లర్ తలకు గట్టిగా చుట్టుకుని గభాలున వెళుతున్న బండీలోకి ఎగిరిపడ్డాడు. బండీవాడు ముందుకురావాలి అని గోలపెడుతున్నాడు. పెట్టెలు మూటలు సర్ది బండీబ్యాలన్సు సరిచేశారు. కంకరరాళ్లు బండీని ఎత్తెత్తికొట్టేస్తున్నాయి. శాంతమ్మ తల రెండుసార్లు బండీబద్దలకు గట్టిగా కొట్టుకుంది. శేషయ్య అచి కూర్చున్నాడు. యాజులు లెక్కలేనట్టుగా, నిరామయంగా అటూ ఇటూ వూగిపోతున్నాడు.

'ఊరోడ్డు ఇట్లా ఎంతవరకు ఉంటుంది నాయనా....' శాంతమ్మ బాధ భరించలేక బండీవాణ్ణి అడిగింది.

'వేదాద్రి వెళ్ళేదాక...' యాజులు వెంటనే సమాధానం ఇచ్చేశాడు.

'అయితే, ఇంతకంటే నడిచివెళ్ళితేనే బాగుండేటట్లుంది...' శాంతమ్మ విసుగ్గా అంది.

యాజులు గభాలున క్రిందకు దూకాడు.

'అన్నీ అఘాయిత్యపుపనులు, దిగాలంటే బండీ ఆపవూ!' శాంతమ్మ ఆపుకోలేక అంది.

'ఏం ఫరవాలేదులే...యీ బండీ దిగటంకూడా పెద్ద గొప్పేనేమిటి...' యాజులు బండీతోపాటు అడుగులు గబగబ వేస్తున్నాడు.

మధ్య మధ్య మట్టిరోడ్డు తగులుతోంది. శాంతమ్మ ప్రాణం ఎంతో హాయి అనిపించింది.

'అబ్బ కాళ్లు తిమ్మిర్లు ఎక్కినాయి. నేనుకూడా కొంచెం సేపు దిగి నడుస్తాను...కాస్త బండీ ఆపవయ్యా...' శేషయ్య కూడా బండీ దిగాడు.

'నేనుకూడా దిగుతానువుండండి...' శాంతమ్మ దిగబోతోంది.

'నువ్వు నడవలేవే అమ్మా...' యాజులు వద్దని వారించాడు.

బండీ గబగబ పోతోంది.

'నేను దిగుతానంటే దిగనీలేదు బ్రా, నాకు దిగుతేనే ప్రాణం హాయిగా వుంటుంది...' శాంతమ్మ మొర ఆలకించేవారు యెవరూ కనిపించలా.

యాజులు, ప్రక్కలప్రక్కల వున్న తంగేడుపూలను కోసి వాసన చూస్తూ వస్తున్నాడు.

శేషయ్య కొంచెం వెనకబడ్డాడు.

గుబురుగా చెట్లసందుల్లోంచి బండీ పోతోంది.

'ఒరేయ్ అబ్బాయి నాన్నగారెక్కడ...ఏమయ్యాడోయ్ నీకే చెప్పేది కాస్త బండీ ఆపు. వెనకవాళ్ళనుకూడా రానీ...' శాంతమ్మ గదమాయించింది పై స్థాయిలో.

మళ్ళీ ముగ్గురు బండిలో చేరారు.

'ఎక్కడెక్కడివాళ్లు వస్తారు నరసింహస్వామి పాదాల దగ్గరకు. ప్రత్యక్షంగా నాకు అనేకసార్లు నా అనుభవంలో ఆయన మహాత్మ్యం నిదర్శనంగా కనిపించింది...' రెండుచేతులు జోడించింది శాంతమ్మ.

'ఇప్పటినుంచీ మొదలుపెట్టావు...ఇంకా వేదాద్రిరాలా...' యాజులు యుద్వేగంగా అన్నాడు.

'ఒరేయి నా మాట వినరా అబ్బాయి. దేవుడికి మొక్కితే దోషమేమీ వుండదురా. మన భక్తిశ్రద్ధలే మనల్ని కాపాడతాయి' మళ్లీ మనం యింటికి తిరిగి వెళ్లేటంతవరకు నేను చెప్పినట్లు చెయ్యరా యాజులు...' యెంతో ఆప్యాయంగా ప్రాధేయపడింది శాంతమ్మ.

'నేను ప్రయాణం అయ్యేముందే నీకు చెప్పేశాను...మీరు వేదాద్రి వెళుతుంది ఒక పనికి, నేను వేదాద్రి వస్తుంది యింకో దానికి. చలిలో గజగజ వణుక్కుంటూ అన్ని మెట్లు దిగి ఆ కృష్ణా స్నానం చేసి, ఆ వికృతావతారానికి మొక్కటానికి రావటంలేదు. నేను వస్తుంది మానవుడు యెంత మూఢత్వంగా వుండగలడో ప్రత్యక్షంగా చూడటానికి, ప్రకృతిని చూసి ఆనందించటానికి...' యాజులు, శాంతమ్మ కళ్ళల్లోకి అదే దీక్షగా చూస్తూ అన్నాడు.

'అనొచ్చిన మాటలేదు అనరానిమాటలేదు. నోటి కెంతవస్తే అంతే...' శాంతమ్మ చీదరించుకుంది.

'నేను చెప్పటంలా పిడిబుద్ధి...' శేషయ్య అందుకున్నాడు.

'మీరు కాసేపు వూరుకోండి. ఈ రభస చైటవాళ్లకూడా చూడా లేమిటి. మనింట్లో యెట్లాగో వుండనే వుంది...' శాంతమ్మ శేషయ్య మాటకు అడ్డు తగిలింది.

శాంతమ్మ, పెదిమలు కదిలిస్తోంది.

యాజులు, శాంతమ్మ అమాయకత్వానికి, ఆశ్చర్యపోతున్నాడు. తన తల్లిని, తండ్రిని యింకా తాను యేవిధంగాను మార్చలేనని నిశ్చయానికి వచ్చేశాడు. వాళ్ళకు చెప్పినా అర్థంకాదు. వాళ్ళ జీవితాలు మూఢనమ్మకాలతో సుస్థిరమైన బాంధవ్యాన్ని యేర్పరచుకున్నాయి. ఎలాంటి నిదర్శనలు యిచ్చినా యెన్ని వుపమానాలు చెప్పినా, వాళ్ళ బుర్రలకు యెక్కవు. రాళ్ళను పూజించాలనేదే వాళ్ళ సిద్ధాంతం. దానికి ప్రతిఫలం యేమిటో అర్థంకాదు. శరీరాన్ని కష్టపెట్టితే, యెవరో మెచ్చుకుంటా డనుకోవటం కేవలం వెర్రి. తల్లీ, తండ్రీ మొహాల్లోకి కాసేపు చూసి, యిలాంటివాళ్ళకు కొడుకు నయ్యానే అని మానసికంగా బాధపడ్డాడు యాజులు.

'నరసింహస్వామీ! రక్షించు...' అంటూనే శాంతమ్మ బండీ దిగింది.

రామ రామ అంటూ శేషయ్య అడుగు క్రింద పెట్టాడు.

ఎంతో తీవ్రంగా ఆలోచిస్తూ, గుడిగోపురం చివర తన దృష్టిని పోనిచ్చి అట్లాగే నిలబడి పోయాడు యాజులు కొద్ది క్షణాలుదాక.

బండీవాడు పెట్టె మూట నెత్తిన పెట్టుకుని ముందు నడుస్తున్నాడు. వెనకాలే శేషయ్య, శాంతమ్మ, యాజులు వరసగా నడుస్తున్నారు.

దేవాలయప్రాంగణంలోకి వచ్చేశారు. ఎడమవైపు వరసగా గదులున్నాయి. అందులో చివరగదిలోకి వెళ్ళి పెట్టె, మూట పెట్టుకున్నారు. పేర్లు వ్రాయించుకున్నారు. వంటసామాగ్రి లెక్కపెట్టి ఒకాయన యిచ్చి వెళ్ళిపోయాడు.

'ముందర స్వామిదర్శనం చేసుకుందాం, నేను స్నానం చేసి వస్తా. మీరు యిక్కడ వుంటారా...' శాంతమ్మ భర్తను అడిగింది.

'మీ రిద్దరు వెళ్ళిరండి, నేను యీ సామానుకు కాపలా వుంటాలే...' యాజులు నిర్లక్ష్యంగా అనేశాడు.

'ఒరేయ్ మేము వచ్చినతర్వాత నువ్వుకూడా స్నానంచేసి రారా...' శాంతమ్మ, ఆప్యాయంగా యాజులువంక చూసింది.

'ముందర మీరు వెళ్లిరండి తర్వాతమాట చూసుకుందాంలే' యాజులు సూటిగా సమాధానం యివ్వలేదు.

కావలసిన బట్టలు తీసుకుని శేషయ్య, శాంతమ్మ స్నానానికి మెట్లదగ్గరకు వెళ్లిపోయారు.

యాజులుకు వంటరిగా పెట్టెమీద కూర్చోవటం, అతనికి కొంచెంసేపయినతర్వాత విసుగుపుట్టింది. మెల్లిగాలేచి ముందు పెద్ద హాలులోవున్న జనం దగ్గరకు వెళ్ళాడు.

ఓ పసుచుపిల్ల తలనిండా నీళ్లుపోసుకుని, తడిబట్టలతో గజగజ వణుకుతూ నుంచుంది. తడిబట్టలు ఆ అమ్మాయికి సిగ్గును తెచ్చిపెట్టాయి. ఇంకొంచెం మూలగా నక్కింది. యాజులు ఆ అమ్మాయిని చూసి జాలిపడ్డాడు.

'అమ్మా ఆకలే...అన్నం పెట్టవే...' ఇద్దరు పిల్లలు ఒకటే రాగం తియ్యటం మొదలుపెట్టారు.

'స్వామివారి ప్రసాదం రాగానే, మీకు అన్నం పెట్టేస్తాను. కాసేపు ఆగండి నాయనా! మా తండ్రికాదు...' ఆ అమ్మ బ్రతిమాలుకుంటోంది.

పిల్లలు ఆ మాట వినకుండా వెక్కివెక్కి యేడుస్తున్నారు. యాజులుకు ఆమెమీద ఎంతైనా కోపంవచ్చింది.

'ఏమిటి అట్లా పడుకున్నాడు...' ఓ ముసుగుపెట్టుకుని పడుకున్న మనిషిని చూసి యాజులు అడిగాడు.

'స్వామివారి కటాక్షం...ఇప్పుడు కొంచెం నెమ్మదిగావుంది నాయనా...నరసింహస్వామి నువ్వే మాకు దిక్కు నాయనా...' అక్కడ మనిషి రెండుచేతులూ పైకెత్తి నమస్కారం పెట్టాడు.

'ఈ స్వామివారు డాక్టరుపనికూడా చేస్తాడన్నమాట...' యాజులు వికటంగా నవ్వాడు.

'మాతో చలాకీ ఆడటానికి వచ్చావా పో పోవయ్యా...' ప్రక్కనాయన కసురుకున్నాడు.

యాజులు యింకా నవ్వుకుంటూ బైటకువచ్చేశాడు. లోపల వాళ్లు కోరచూపులు చూశారు.

'ఈ కోతులేమిటి అసహ్యంగా...' యాజులు చిరాకుగా విదిలించాడు దగ్గరకువస్తున్న ఓ కోతినిచూసి.

కోతి కస్సుమంది.

'రామబంటు నాయనా! ఏమీ అనకూడదు...అదేమీ చెయ్యదు...' చెంపలు వేసుకుని ఓ ముసలమ్మ, కోతుల గుంపు మధ్యనుంచి నిరామయంగా వెళ్ళిపోతోంది.

యాజులు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

'ఒరేయి అబ్బాయి, నువ్విక్కడ నుంచున్నావు. మన సామానుదగ్గర రావత్రా...' కాంతమ్మ స్నానంచేసి వస్తూ అడిగింది.

'నరసింహస్వామి...' యాజులు తెలివిగా నవ్వాడు.

కాంతమ్మ మాటాడకండా లోపలికివెళ్లి, బట్టలు మార్చుకుంది. శేషయ్య పట్టుబట్టలు కట్టుకున్నాడు.

'ఒరేయి యాజులు నువ్వుకూడా స్నానంచేసి రా....నా మాట విను...' కాంతమ్మ, యాజులువైపుకు, తల తుడుచుకుంటూ అడుగు వేసింది.

'ఎందుకూ...' కస్సుమన్నాడు యాజులు.

'నా మాట వినరా నీ మంచికే చెపుతున్నాను. నువ్వెళ్ళి కృష్ణలో స్నానంచేసి రా...' శేషయ్య రొంతో నిదానంగా బుజ్జగించాడు యాజుల్ని.

యాజులు మెదలకండా లోపలికివెళ్ళి తువ్వాల తీసుకున్నాడు.

'మమ్మల్ని యిక్కడ వుండమంటావా...' కాంతమ్మ యాజుల్ని పిలిచింది.

'మీరు, సామాన్ను కాస్త రెవరికైనా అప్పగించి గుళ్లోకి వెళ్లండి. నేను సరాసరి గుళ్లోకే వస్తాను...' యాజులు, తల్లివంక చూసి చిరునవ్వుమొహం పెట్టాడు.

కాంతమ్మకు రొంతో సంతోషం అనిపించింది. శేషయ్య, కాంతమ్మలు, గుళ్లోకి వెళ్ళిపోయారు. యాజులు మెట్లు గబగబ దిగేశాడు. మెట్లమీదవుండే స్నానాలు చేస్తున్నారు. కృష్ణపాయ చాలా చిన్నది. కాని చాలా లోతు. పై గట్టు రొంతో ఎత్తుగా కనిపిస్తోంది. అవతల వడ్డుమీద చెట్ల గుబుర్లన్నీ గంభీరంగా కనిపిస్తున్నాయి. సూర్య కిరణాలు నీళ్లమీద పడి చిందరవందరయిపోతున్నాయి. యాజులుకళ్లు మిరుమిట్లు గొలుపుతున్నాయి. యాజులు చెంపమీద చెయ్యిపెట్టుకుని అట్లాగే నిలబడి రేమిటో తీక్షణంగా ఆలోచిస్తూ నుంచున్నాడు కొద్ది క్షణాలు.

యాజులుకు అంతా అయోమయంగా వుంది. అక్కడకు వచ్చినవాళ్ళల్లో బుర్రవున్నవాళ్లు ఎవరూ కనిపించలా. మూఢ విశ్వాసాలకు, హేతుబద్ధవాదానికి పొత్తు కుదరదు. మానవుని ప్రకృతి ఇహంలో సాధించేకార్యాన్నిబట్టి నిర్ణయింపబడుతుంది కాని, నిశ్చింతగా కూర్చుని, కనిపించని దేవునిమీద భారంవేసి, తాను పోయినతర్వాత ఏంజరగాలో ఆలోచించుకునేవాళ్లవల్ల నిర్ణయింపబడదు. తాను ఎంతగా ఆలోచించినా, తన వాదానికి బలమైన నిదర్శనలు కనిపిస్తున్నాయి. ఇక్కడకు వచ్చిన జనంయొక్క మనస్తత్వం, తన వాదాన్ని ఇంకా బలపరుస్తోంది. అట్లాగే కాసేపు నిలబడి, కుడివైపు కొండరాళ్ళను నెట్టుకుంటూ నడుస్తూ పోతున్నాడు. గుండ్రాళ్లు పేర్చిపెట్టినట్లు కనిపిస్తున్నాయి. అహర్నిశలు నీళ్ళకు రాళ్లకు సంఘర్షణే, రాళ్లకు యీరూపు యిచ్చింది అనుకున్నాడు. తెల్లటిరాళ్లు, నల్లటిరాళ్లు, బంగారాదుంప రంగు రాళ్లు చిన్నచిన్నవి ముచ్చటగా చెల్లాచెదరుగా పడివున్నాయి. తనకంటికి ఇంపైనవి కొన్నింటిని ఏరుకుని జేబులో వేసుకున్నాడు. కొండరాళ్లు ఎక్కిదిగేటప్పటికి యాజులు అలసిపోయాడు. ఆ పళంగా అక్కడ కొంచెం ఎత్తుగావున ఓ కొండరాయిమీద చతికిలపడ్డాడు. కొంచెం చెమటకూడా పోసింది. ఎండ తీక్షణం అనిపించింది కాబోలు, పైచుకోసం, పాడుగుచేతులనోక్కా మడిచి కొంచెం పైకెత్తేశాడు. కళ్లు వాలిపోయినాయి ఒక్క క్షణంకాలం. కళ్లు విప్పుకుని చూశాడు. గడియారం ఆగిపోయింది. ప్రపంచం అంతా ఒక్క త్రుటిపాటు స్థంభించినట్లయిపోయింది. యాజులు గభాలున తల పైకెత్తిచూశాడు. సూర్యకిరణాలు తీవ్రంగా యాజులు కళ్లల్లోకి గుచ్చుకుపోయినాయి. మెల్లిగా లేచి, కాళ్లీడ్చుకుంటూ, నడక సాగించాడు. వెనకాలే ఓకోతి తోడుగా వెంటవస్తోంది. వెనకాలే ఏదో వస్తున్నట్లు చప్పుడవుతుందేగాని, వెనక్కు తిరిగి చూడటానికి ఏమిటో భయమనిపించింది యాజులికి. అంత నిరామయంగా వున్న ప్రదేశంలో తాను ఒంటరిగా వున్నానని తెలుసుకునేటప్పటికే, గుండెదడ మొదలుపెట్టింది. అడుగులు చక చక సాగిస్తున్నాడు. యాజులుభయం తగ్గలేదు. యాజులుకు ముందుకు పోవటానికి ధైర్యంలేదు. తప్పున ఆగేశాడు.

కోతి వచ్చి కాలును తాకింది. 'అమ్మో' అంటూ వులిక్కిపడి గాభరాపడిపోయాడు. ఆక్షణంలో నరసింహస్వామి విగ్రహం, తన తల్లి, తన తండ్రి, తన కళ్ళలో మెరిసి అదృశ్యమయిపోయారు.

'ఛీ...నువ్వా...పాడుకోతి...హడలగొట్టావు...' క్రింద ఓ రాయి తీసి కోతిమీదకు విసిరాడు.

కోతి కిచకిచమని నవ్వింది.

యాజులుకు మరింత కోపం వచ్చింది. తాత్కాలికంగా తన మెదడులోకి దూరిన కొన్ని ఆవేశాలను, వెంటనే తుడిచేసుకున్నాడు. తనమీద తనకే అసహ్యం కలిగింది. తన ఆలోచన యీ కాస్తలోనే పెడదోవన యెందుకు పట్టిందో అర్థం కాలేదు. ఏదో

విసుక్కున్నాడు. ఎంతో నిందించుకున్నాడు. మెట్లదగ్గరకు వచ్చేశాడు. అలసట తీర్చుకుని, కాళ్లుచేతులు మొహం కడుక్కుని కడుపు నిండా కృష్ణనీరు త్రాగి మెట్లు యెక్కాడు. కాళ్లు పట్టుకుపోతున్నాయి. సగం మెట్లు యెక్కేటప్పటికి కాళ్లు చచ్చుపడిపోయినాయి. ముసలమ్మలు కూడా 'నరసింహస్వామి నరసింహస్వామి' అనుకుంటూ తనకంటే ముందరగానే మెట్లు యెక్కేసి వెళ్లిపోతున్నారు.

యాజులుకు ఆవేశం వచ్చింది. పట్టు బలమంతా వ గబగబ, వయస్సు సహాయంతో మెట్లన్నీ యెక్కేసి సత్రంలో పడ్డాడు. అందరూ యెవరి పనుల్లో వాళ్లున్నారు. అక్కడ గడియారంకూడా తన పని తాను చేసుకుపోతోంది. ఆ గడియారం టైముతో తన గడియారాన్ని సరిదిద్దుకున్నాడు. ఆకలి మండిపోతోంది. ఈగుళ్లోంచి వీళ్లెప్పుడు బైటపడతారో తెలీదు. వాళ్లు వచ్చేదాకా కూర్చోటమా, లేక తానుకూడా గుళ్ళోకి వెళ్ళటమా ఏకంగా, యీ సందిగ్ధావస్థలో కొంచెంసేపు నలిగి, చివరకు, తానే గుళ్ళోకి వెడదామని లేచాడు.

మంటపానికిముందు చెప్పుల్ని వదిలేసి, మంటపంగాని దాటి గర్భగుడిలోకి వెళ్లాడు. అవిరళంగా మంత్రాలు చదువుతూ పూజలు చేస్తున్నారు. శేషయ్య కళ్లుమూసుకుని తలవూపుతున్నాడు. కాంతమ్మ రెండు చేతులు జోడించుకుని కదలక మెదలక కూర్చుని వుంది. ఇంకా అటూ ఇటూ, ఆడ, మగ బారులుతీర్చుకుని కూర్చుని వున్నారు. యాజులుకు అంతమందిలోను, 'అమ్మా అనిగాని, నాన్న అనిగాని' పిలవటానికి నామోషి అనిపించింది. అట్లాగే కొంచెంసేపు నిలబడిపోయాడు నరసింహస్వామివంక చూస్తూ. వెంటనే విసుగుపుట్టి, గభాలున వెనక్కు తిరిగాడు. చటుక్కున అందరూ లేచి నుంచున్నారు. హారతి కర్పూరం వెలిగించుకుని, ఆ పళ్లెం కాస్త పూజారి అందరకు చూపిస్తున్నాడు. ప్రతివాళ్లు ఎంతో భక్తి శ్రద్ధలతో కళ్లకు అద్దుకుంటున్నారు. యాజులు వెనక్కు తిరిగి చూడకుండానే గబ గబ మండపందాటి బైటకు వచ్చేశాడు.

'అయ్యా, అమ్మా, గుడ్డివాన్నండి, కుంటివాన్నండి. ఇంత ధర్మం చెయ్యండి బాబు, మీకింత పుణ్యం ఉంటుంది' అంటూ హాహాకారాలు వినిపిస్తున్నాయి.

'తల్లిలేని పిల్ల నాయనా, ధర్మం చెయ్యి నాయనా...' ఓ అభాగ్యురాలు యాజులు దగ్గరకువచ్చి అడిగింది.

గభాలున జేబులోంచి ఓ అణా తీసి యిచ్చేశాడు.

'నీ కెంతైనా పుణ్యం ఉంటుంది నాయనా...' బిచ్చగత్తె యింకా ఏమిటో అంటోంది.

యాజులు కొరకొరగా ఆమెకైపుకు చూసి ముందుకు సాగాడు.

శేషయ్య, కాంతమ్మ, 'అబ్బాయి యేడీ రాలేదేమిటి' అంటూ అటూ యిటూ చూస్తున్నారు.

యాజులుకి దూరంతో సిగ్గనిపించింది. తీసుకున్నాలే రమ్మని సంజ్ఞ చేశాడు.

'ఇందాకటినుంచి యెక్కడున్నావురా...' కాంతమ్మ యాజులు మొహాన కుంకం పెడుతూ అడిగింది.

'గర్భగుళ్ళోనే...' కుంకం చెరిపేసుకున్నాడు యాజులు.

శేషయ్య కూడా సత్రంలోకి వచ్చాడు.

ఇక వంటప్రయత్నం చేసి భోజనాలు అయ్యేటప్పటికి మూడు కొట్టారు.

యాజులు ప్రాణం కోపిల్లింది. మస్తుగా నిద్రపోయాడు. శేషయ్య మోతాదుగా కునుకుతీసి లేచి కూర్చున్నాడు. కాంతమ్మ కునికిపాట్లు పడుతూనే మేలుకు వుంది.

'ఒరేయ్...ఇంకా నిద్రేమిటిరా ప్రొద్దుకూకుతుంటే... విన్నే, లేవవే...స్వామిదర్శనం చేసుకుని, రెండు మెతుకులు నోట్లో వేసుకుని పడుకుందిగాని లే...' కాంతమ్మ యాజుల్ని నిద్రనుంచి లేపటానికి ప్రయత్నం చేస్తోంది.

యాజులు కళ్లు విరుస్తున్నాడేగాని లేవటంలేదు. కలత నిద్రలో యేవేమిటో అస్పష్టంగా అంటున్నాడు.

'స్వామివారిని మనసారా మొక్కితే మన కష్టాలు రాకుండా కాపాడుతూ వుంటాడు...' కాంతమ్మ తట్టి లేపుతోంది. యాజులికి యేమిటో అస్పష్టంగా వినిపించినాయి. గభాలున లేచి కూర్చున్నాడు.

'నా నిద్రంతా చెడగొట్టావు కాదు లే...' యాజులు కళ్లు తుడుచుకుని, చూశాడు.

'కాళ్లు, మొహం కడుక్కోరా, గుళ్ళోకి వెళ్ళొద్దాం...'

'మీరు వెళ్ళిరండే...నాకు నిద్రొస్తోంది...'

'మరీ వేషాలు కాని ఇప్పుడు నిద్రేమిటిరా. ఏదీ కాని లే...నా మాట విను...'

'ఏమిటో మత్తుగా వుంది...'

'అన్ని మత్తులు వదులుతాయి. లే...త్వరగా ఆలస్యం చెయ్యక, యిప్పటికే ఆలస్యం అయింది...' కాంతమ్మ కాలుగూ పట్టేసి, గుళ్ళోకి వెళ్లే ప్రయత్నంలో సిద్ధమయింది. శేషయ్య ఉత్తరీయం పూర్తిగా కప్పేసుకుని నిలబడ్డాడు. యాజులు నిక్కినీలిగి, మొహం కడుక్కుని బైటకు వచ్చేటప్పటికి ఆరయింది. ఆదరా బాదరాగా శేషయ్య, కాంతమ్మ గుడివైపుకు నడిచారు. వెనకాలే యాజులు కూడా నడుస్తున్నాడు.

రెండు మూడుసార్లు వెనక్కు తిరిగి కొడుకుని తొందరగా రమ్మనమని చెప్పి, కాంతమ్మ ముందుకు వెళ్ళిపోయింది. యాజులు నీటుగా నడుస్తూ మంటపానికి యెదురుగా వున్న ధ్వజస్తంభం గట్టు మీద చెప్పులతో అట్లాగే, మోకాళ్లను రెండు చేతులతో బంధిం

'అక్కడో కూర్చున్నాడు...ఓరేయ్ యాజులు ప్రసాదం చేసి కూర్చుండిపోయాడు. వెలుగుతున్న దుంపను చూసి కూడా లోప తీసుకున్నావుట్రా...' కాంతమ్మ బిగ్గరగా అరిచింది. లేమిటో అనుకుంటూ వెళ్ళిపోయారు.

ఒకాయన మాత్రం ధైర్యంచేసి, 'చెప్పులతో కూర్చుంటారటయ్యా యిక్కడ, నీ కెవరు చెప్పారు. చెప్పులు విడిచేసెయ్యి' అని గదమాయించాడు.

యాజులుకి ఆయనతో వాదనలోకి దిగాలని వుంది కాని, అక్కడవున్న జనం అంతా యాజులు కళ్లల్లో తొంగిచూశారు. యాజులు వెంటనే చెప్పులు జారవిడిచాడు.

కొంచెంసేపటికి, కాంతమ్మ బయటకువచ్చేసి ఇదిగో ప్రసాదం తీసుకోమని ఇచ్చింది.

చక్రపొంగలి నాకు బాగా ఇష్టమని, యాజులు తినేశాడు.

పండువెన్నెల. కోతులన్నీ, తమ శరీరాన్ని ముడుచుకుని, గుడిగోపురం చుట్టూ కాపలాగా పడుకున్నాయి. అప్పుడప్పుడు మాత్రం కిచకిచలు వినిపిస్తున్నాయి. ఇతర ఆసరాలేనివాళ్లు మంటపంలో బట్టలు పరుచుకుని పడుకున్నారు. సత్రంతలుపులు భార్లగా తీసి లోపల చాపలు వేసుకుని వరసగా పడుకున్నారు. అందులో ఏనియమాలూ ఎవరూ పాటించలేదు. ఒకళ్లమీద ఒకళ్లకు అనుమానంలేదు. అందరి మనస్సులు అనంతమైన శాంతితోను, అపూర్వమైన తృప్తితోను నిండివున్నాయి. అందరూకూడా భక్తి ప్రపత్తులతో కైమోడ్చి, నరసింహస్వామితో కైంకర్యం అయిపోవాలనే తాపత్రయంతో నిద్రలుపోతున్నారు. యాజులుకు మాత్రం నిద్ర పట్టటంలేదు. యాజులుకు ఎన్నెన్నో ఎక్కడెక్కడివో జ్ఞాపకం వచ్చేస్తున్నాయి. తన మనస్సుకు శాంతిలేదు. తన ఆలోచనలకు అంతంలేదు. అతని ఆలోచనల్లో నరసింహస్వామి విగ్రహం, గడిచినరోజు తడిబట్టలతో వున్న ఆ పడుచుపిల్ల, అమాయకపు తల్లిదండ్రులు, నిశిత విమర్శనాజ్ఞానంగల తన తెలివితేటలు, ఇంకా ఏవేవిటో జ్ఞాపకం వస్తున్నాయి. తానులేచి అంత సావిడిలోనూ, కళ్లు పెద్దవి చేసుకుని ఒక్కొక్కళ్లనే చూస్తున్నాడు. ఒకళ్లు ఇద్దరు ప్రక్కమీద మసలుతున్నారు. ధైర్యంచాలక మళ్లీ వెనక్కు వెళ్ళిపోతున్నాడు. చివరకు తన పిరికితనమే గెలిచింది. దానికి తోడు గడియారంకూడా నాలుగుదెబ్బలు కొట్టింది యాజులు గుండెమీద. కోడి కొక్కొరకో అంది. యాజులు నిద్రపోయాడు.

ఉదయకిరణాలు మెల్లిమెల్లిగా ప్రాక్కుంటూ కిటికీలోంచి యాజులు కప్పుకున్న దుప్పటిలోకి చొరబడ్డాయి. యాజులు అటూ ఇటూ దొర్లాడు. ఇంకా యెంత ప్రయత్నించినా నిద్రపోయే వాతావరణం కనిపించటంలేదు.

తప్పనిసరిగా లేచి, దుప్పటి అవతలకు గిరాటు పెట్టాడు. అప్పటికే శేషయ్య, కాంతమ్మ, స్నానాలు చేసేసి వచ్చేశారు. కాంతమ్మ మొక్కు ఆనాటితో తీరిపోయింది. ఎన్నాళ్లనుంచో వేదాద్రివెళ్లాలని, నరసింహస్వామి దర్శనం చేసుకోవాలని అనుకుంటూ వుండేది. ఏమేమిటో మొక్కుకుంది. యాజుల్ని గురించి యింకా తనకోర్కెలన్నీ యాజులులోనే కేంద్రీకరించి, యాజులు మీద గంపెడాశతో వేదాద్రి వచ్చేసింది. శేషయ్య, కాంతమ్మ పోరు పడలేక వచ్చినా, భక్తి శ్రద్ధలలో కాంతమ్మకు యేమాత్రం తీసిపోడు. ఇద్దరికీకూడ యాజులు అతిశ్రద్ధగా గుళ్లోకివచ్చి పూజ చెయ్యాలని ఉంది కాని అది జరగలేదు. ఆ కినుక కాంతమ్మకు పట్టుకు పీకేస్తోంది కాని ఆమె చెయ్యగలదేమీ లేదు.

యాజులు తొందర పెడుతున్నాడు, త్వరగా తెమిలిరమ్మని. ఓమూల బండివాడు కూడా రండిరండి అంటూ హెచ్చరిస్తున్నాడు. ఓపట్టాన వాళ్ళు రావటంలేదు. యాజులుకి యెంతైనా కోపం వచ్చింది. ఉన్నవాళ్లను ఉన్నట్లుగా తీసుకువద్దామని చకచక గుడివైపుకు నడుస్తున్నాడు. హడావిడిగా వెళ్ళటంలో కోతిపిల్ల కాలుక్రిందపడి కిచకిచమంటూ పరుగెత్తింది. ఎక్కడినుంచో దభాలున పెద్దకోతి వచ్చి యాజులుకాలును కరిచింది.

'అబ్బో!' అంటూ కాలు గట్టిగా పట్టుకున్నాడు. ఇంకా ఇంకా కోపంతో గుళ్లోకి వెళ్ళాడు.

శేషయ్య, కాంతమ్మలు విగ్రహాలులాగ చేతులు జోడించుకుని నిలబడివున్నారు.

యాజులు ఒక్క కేక పెట్టాడు.

ఇద్దరూ ఒక్కసారిగా వులిక్కిపడ్డారు.

'ఏమిటిరా...'

'ఎంతసేపు యిక్కడ ఓమూల బండీవాడు గోలపెడుతుంటే"
వెనక్కు తిరిగి కాలు పట్టుకుంటూ యాజులు బండీలోకి ఎక్కాడు.

'ఏమిటి బాబు కాలు...' బండీవాడు అడిగాడు.

'ఏం లేదు...కోతి కరిచింది...' కరిచినచోటు శుభ్రంగా తుడిచేసి, కుంకం అద్దేశాడు.

కొంచెం చురచుర మంటోంది.

శేషయ్య, కాంతమ్మలుకూడా బండిదగ్గరకు వచ్చేశారు.

'అబ్బాయిగారిని కోతి కరిచిందటండీ...' బండివాడు ఆపుకుంటూ ఆపుకుంటూ అనేశాడు.

'ఏరా నాయనా ఎక్కడరా...' పెద్ద ఆదుర్దాగా కాంతమ్మ కాలుకట్టు విప్పుతోంది.

'ఏం లేదులేవే, కోతి పట్టుకుంది. వదిలేశాను, అంతే... అయినా ఏమిటాలస్యం. తొందరగా రాక మీకోసం నేను గుళ్లోకి వస్తుంటే, యీ లోపల యిది జరిగింది...'

'ఏమన్నా చేశావా మరి...' శేషయ్య, చిరాకుగా అడిగాడు.

'అదే పోతుందిలే ... తొందరగా పోనియ్యవయ్యా...' యాజులు, కాలు పక్కకు తన్ని పెట్టి వుంచాడు.

'తిన్నగా మనం యింటికివెళ్ళక యిదేమిటంట...' కాంతమ్మ బండీలో మొదలు పెట్టింది.

'ప్రతిదానికి నువ్వేదో అనుకుంటూనే వుంటావు... ఏం భయంలేదు కాని నువ్వేమి మాట్లాడక...' యాజులు ఎంతో కోపంగా విసుక్కున్నాడు.

'ఇప్పుడు చేసేదేముంది. ఇంటికివెళుతున్నాంగా ఏదోమందు వేద్దాంలే...' శేషయ్య సమాధానపరిచాడు. ఇల్లు చేరేలోగా మాటల్లో ఏవో ఘర్షణపడుతూనే వున్నారు తల్లీ కొడుకూను.

యాజులు చిటచిటలాడిపోతున్నాడు. కాంతమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది. బండీ వాకిలిదగ్గరకు వచ్చి ఆగిపోయింది. యాజులు బండీచువ్వ పట్టుకుని మెల్లిగా దిగాడు. కాంతమ్మ దిగుతూనే, ఒరేయి అబ్బాయి ముందర నువ్వు ఆసుపత్రికివెళ్ళి ఏదైనా మందేయించుకు రా అన్నది.

యాజులు సరాసరి ఆసుపత్రికి వెళ్ళి కట్టు కట్టించుకు వచ్చాడు.

'ఏమన్నాడు డాక్టరు...'

'అనేందుకు ఏముంది. కట్టుకట్టేశాడు. దీంతో నయమయి పోతుందన్నాడు. ప్రతిదానికి నువ్వు భయపడుతూ వుంటావు...' యాజులు నిర్లక్ష్యంగా లోపలికి వెళ్ళిపోతున్నాడు.

'నరసింహస్వామి దయవలన త్వరగా నయమవుతే బాగుంటును' కాంతమ్మ అనుకుంటున్న మాటలు యాజులు విన్నాడు.

'ప్రతిదానికి నీ కోరకు దొరికాడు ఆయన, కోరికరించిన దానికి ఆయన రక్షే! ఇంకా డాక్టర్లెందుకు...' యాజులు విసుగ్గా అంటూనే గదిలోకి వెళ్ళిపోయాడు.

రెండుమూడు రోజులైంది, కట్లు మారుస్తున్నారు, పుండు నయం కావటంలేదు, నొప్పి యెక్కువగానే వుంది, యాజులుకు ఓ విధమైన చిరాకు, అహంకారం, కోపం యెక్కువయిపోతున్నాయి. మనస్సంతా గజిబిజిగా వుంది. ఏవీ చెయ్యటానికి తోచటంలేదు. పడక కుర్చీలో పడుకుని, మెల్లిగా కాలుఎత్తి, ఎదురుగట్టుమీద పెట్టాడు. ఆ కట్లు చూస్తుంటే యేమిటోగా భయమేస్తోంది. డాక్టరు యింజక్షన్ తీసుకోవాలి అన్నమాట అకాత్తుగా జ్ఞాపకం వచ్చింది. విషం యేదైనావుంటే వుండచ్చు అన్నాడు కూడా. మరీ భయంవేసింది. అపుకోలేని దుఃఖము వచ్చేస్తోంది. అసలు తాను ఆ వూరు యెందుకు వెళ్లానా అని పశ్చాత్తాపపడుతున్నాడు. మనస్సంతా ఒక్కక్షణంలో తనను కరచిన కోతిమీదకు పోయింది. ఆ కోతిమీద పట్టరాని కోపం వచ్చింది. తానెందుకు అటు వెళ్లాలిసివచ్చిందో క్షణంలో స్ఫురణకు వచ్చింది, తన తల్లితండ్రులు గుళ్లో పూజలు చేస్తున్నారు; కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. తన కళ్లు అప్రయత్నంగా నరసింహస్వామి విగ్రహంమీద పడ్డాయి. కళ్లు చెదరిపోయినాయి, ఒళ్లు వణికింది చప్పున కుర్చీలోంచి లేచాడు.

'ఎక్కడికిరా వెళ్లుతున్నావు...' కాంతమ్మ, యాజులు వంక చూస్తూ అన్నది.

'ఎక్కడికీ లేదులేవే...' విసుగ్గా, యెదురుగావున్న పెట్టెను విసురుగా ఒక్క తన్ను తన్నాడు.

'అయ్యో!....అయ్యో!...' కాంతమ్మ గుండె బాదుకుంటూ, పెట్టెలోంచి క్రిందపడిపోయిన బట్టల మడతలు, రెండు చిన్న డబ్బీలు తీసి కళ్ళకు అద్దుకుంది.

'వేదాద్రి ప్రసాదం...దీంట్లో పటాలు...' ఎంత పాడుపని చేశావురా...' కాంతమ్మ ఓ చిన్న డబ్బీని యాజులు చేతులో పెట్టింది.

యాజులు స్తంభించిపోయాడు. గుండె దడదడ కొట్టుకుంటోంది. కళ్లార్పకుండా తల్లివంక అట్లాగే చూస్తూ నిలబడిపోయాడు కొద్ది క్షణాలు.

'ఏమిటీ అట్లా నిలబడిపోయారు....' శేషయ్య వస్తూనే అడిగాడు.

యాజులు వులిక్కిపడ్డాడు.

'ఏం లేదులెండి...' కాంతమ్మ లోపలికి వెళ్లిపోయింది.

యాజులు బుర్ర గిర్రున తిరిగిపోతోంది. ఆ రాత్రంతా యాజులు మనస్సు కలవరపడిపోయింది. అతని ఆలోచనలు అనేక రకాలుగా పోతున్నాయి. కాని ఏ స్థానంలోకూడా కేంద్రీకరించలేకపోతున్నాడు. మనస్సు వూగిసలాడిపోతూనే వుంది.

భళ్లున తెల్లారింది.

యాజులు యింకా మంచంమీదే పడుకుని వున్నాడు. ఇంకా కళ్లు తెరవలేదు. మెల్లిగా కాంతమ్మ, యాజులుమంచందగ్గరగా వచ్చి చూస్తూ నిలబడింది. శేషయ్య ప్రక్కనుంచి వెళుతూ, ఆగాడు.

'ఇంకా నిద్రపోతున్నాడు...' కాంతమ్మ శేషయ్య మొహంలోకి చూస్తూ అన్నది.

'కోతిపుండు బ్రహ్మరాక్షసి అయిందే...' కాంతమ్మ, యాజులు మొహంలోకి చూస్తూ నివ్వెరపోతోంది.

'చెప్తే వింటాడా పెంకెవాడా...ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది...' శేషయ్య నిట్టూర్పు విడిచాడు.

'ఏమండీ, స్వామివారికి మొక్కుకుంటే పుండు నయమవుతుందని నాకు గట్టిగా వుందండి...వాడితో యీ మాటచెపితే కస్సుమంటాడని వూరుకుంటున్నాను. మీరన్నా చెప్పండి....' కాంతమ్మ ప్రాధేయపడింది.

'నేను చెపితే వింటాడు కనకనా...పాపభీతి లేదు, దైవభక్తి లేదు, వాడికే తెలిసివస్తుందిలే...' శేషయ్య అంటీఅంటకుండా అన్నాడు.

కాంతమ్మ మారుమాటాడలేదు. ఒక్కక్షణం అక్కడే నిలబడి వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

యాజులు కళ్లు తెరిచాడు.

కాళ్లీడ్చుకుంటూ నడుస్తున్నాడు. ఓపిక పూర్తిగా తగ్గిపోయింది. మానసిక బలహీనత యేర్పడిపోయింది. మానసిక బలహీనతతో శరీరస్థితికూడా యేమీ బాగా వుండటంలేదు. క్రమక్రమేణా చిక్కిపోతున్నట్లు కనిపిస్తున్నాడు. కట్లుకట్టటం, ఇంజక్షన్లు తీసుకోవటం జరుగుతూనే వుంది.

'అబ్బాయి ఇంకా రాలేదేమండీ ఏడుకూడా దాటింది...' కాంతమ్మ వాకిట గుమ్మంవైపు చూస్తూ అన్నది.

శేషయ్య ఏమీ మాట్లాడలేదు.

'అదుగో అంటుండగా వస్తున్నాడు, నూరేళ్ళాయుస్సు. ఎక్కడికెళ్ళావురా... సంధ్యచీకటి కూడా...' శాంతమ్మ ఆప్యాయంగా అడిగింది.

'ఎవరో స్నేహితుడు వస్తే మాట్లాడుతూ కూర్చున్నాను...' నిర్లక్ష్యంగా సమాధానం చెప్పేసి, కుంటుతూ లోపలికి వెళుతున్నాడు యాజులు.

ఇంతలోనే వాకిటితలుపు తీసుకుంటూ, ఒకతను వచ్చాడు.

'అయ్యగారు, గుళ్ళో మనీపర్సు మరిచిపోయారుట, యిచ్చి రమ్మన్నారండి' అంటూ అతను, యాజులు పర్సు శేషయ్యకు ఇచ్చాడు.

యాజులు విననట్టుగా నటించి, మొదలకుండా లోపలికి వెళ్ళిపోయాడు.

'మీ స్నేహితుడు ఈ పర్సు తెచ్చియిచ్చాడు. అక్కడ మర్చిపోయావుటగా' అంటూ ముక్తసరిగా శేషయ్య పర్సును అక్కడ పెట్టేశాడు.

యాజులుకు ఆత్మాభిమానం దెబ్బతిన్నట్లనిపించింది ఆ క్షణములో. ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆ రాత్రి అన్నం తింటున్నప్పుడుకూడా ఏమీ మాట్లాడలేదు. ఆరాత్రికూడా మనోవేదనతోనే తెల్లారింది యాజులుకి. ఆ పుండునుగురించిన ఆవేదన ఎక్కువయిపోతోంది యాజులుకి. తనమనస్సు కేమిటో అస్పష్టముగా మానవశక్తికి మించిన ఏదో పొరశక్తి వుందని తెల్సుల్తోంది. కాని తన మనస్సును సమాధానపరచుకోటానికి కష్టపడుతున్నాడు. అంతర్మథన తీవ్రంగా సాగిపోతోంది. తన మనస్సు సమాధానపడినా, ఇతరులయెదుటకు వెళ్ళటానికి ధైర్యం చాలటంలేదు. తన మనస్సు, గతానికి విరుద్ధంగా సమాధానపడటానికి ఒక బలవత్తరమైన కారణం ఉండివుంటుందని యాజులు తృప్తిపడ్తున్నాడు. కాని హృదయం విశాలమయినకొద్దీ మొహం చిన్నదయిపోతోంది. ఈ క్షోభ యాజులు భరించలేకపోతున్నాడు. ఓమూల పుండుబాధ తగ్గటంలేదు. మనస్సు సమాధానపడినతర్వాత, మానసిక సంక్షోభముతోపాటు, శారీరక దౌర్బల్యంకూడా కొంచెం కొంచెంగా తగ్గుతున్నట్లు కనిపిస్తోంది. తాను వూహించలేని హాయి ఎక్కడినుంచో వచ్చి యాజులును తృప్తిపరుస్తోంది.

మెల్లిగా కాలుకట్టు చూసుకుంటున్నాడు. అతనికి ఆవేదన ఎక్కువయిపోయింది. ఇక భరించలేకపోతున్నాడు. గభాలున లేచాడు. కాలు గట్టిగాఎత్తి ఒక అడుగువేశాడు. అడుగులు వేసుకుంటూ గదిలోకివెళ్ళి, పెట్టెలోకి నాలుగు బట్టలు కుక్కాడు. ఆదరాబాదరాగా అవీ ఇవీ సర్దేసుకుని పెట్టె పట్టుకుని సావిట్లోకి వచ్చేశాడు.

'ఎక్కడికిరా నాయనా వెళుతున్నావు...' అంటుతూనే శాంతమ్మ అడిగింది.

యాజులు ఏమీ మాట్లాడకుండా అట్లాగే నిలబడిపోయాడు.

శాంతమ్మ భయంగా ఇంకోసారి అడిగింది.

'అమ్మ!... వేదాద్రికి... స్వామివారి దర్శనానికి...' ఎంతో నిబ్బరంగా, పట్టుబలవంతాన అన్నాడు యాజులు.

యాజులు పెద్దగా ఆయాసపడిపోతున్నాడు.

'అయ్యో పిచ్చినాయనా... స్వామివారి దర్శనానికి, యిలా కుంటుకుంటూ, వేదాద్రి వెళ్తావుట్రా... స్వామివారిమీద భక్తిశ్రద్ధలు వుండాలిగాని, ఆయన లేనిచోటంటూ వుందిట్రా... ఇదిగో ప్రసాదం... ఇదిగో ఆయనపటం...' పెదిమలు తిపబడుతూ, శాంతమ్మ, యాజులు చేతిలో పెట్టింది.

యాజులు శరీరంలోకి విద్యుత్ లాగ ఒక నూతన ఆవేశం ప్రవేశించి, ఆయన హృదయంలోకి చొచ్చుకుపోయింది. చేతిలో పెట్టెను మెల్లిగా జారవిడిచేసి, నిలువునా కూలబడిపోయాడు యాజులు.



# అల్లసాని పెద్దన
# స్వారోచిషమనుసంభవము

శ్రీమతి మల్లాది వసుంధర

అల్లసాని పెద్దనార్యుఁడు ఆంధ్ర భోజుఁడైన శ్రీకృష్ణదేవరాయల వారి యాస్థానకవీంద్రుఁడు. అష్టదిగ్గజములలో ప్రథమ గణ్యుఁడు. ఈ విషయ మందరెరిఁగినదే. కాని కృష్ణదేవరాయలవారు తమ యాస్థానమున యష్టదిగ్గజములలో పెద్దనగారికే యేల 'ఆంధ్ర కవితా పితామహ' బిరుదము నిచ్చి కవిగండపెండేరమును స్వయముగ తన చేతితోనే ఆయన పాదమునఁ దొడుగవలసి వచ్చెను? అని. ధూర్జటి లేడా? పారిజాతాపహరణ కర్త లేడా? మరి భట్టుమూర్తి? ఎవరు లేరు? వారిలో నెవరు సామాన్యులు? అందరును నిజ కవిత్వ నిశితధారాపటు వేగన్యక్కృతాసురగురులు. ఒక్కొక్కరు ధీయుక్తివాగ్వైశోపమిత సలిలరత్నాకర సరిత్సముద్రులు; వారందరు నట్టివారే. వీన వారినందర విడిచిపుచ్చి రాయలు పెద్దన్న గారినే యేల పెద్దఁ జేయవలసి వచ్చినది? ఆస్థానకవు లందరిలో పెద్దవాఁడనియా? లేక యాంతరంగిక స్నేహితుఁడనియా? మరేమి కారణము? వీరినందర నధిగమించిన ట్లగుపింపఁజేసిన యా మహాశక్తి యెట్టిది? రాయలవారిచే గండపెండేరముఁ దొడిగించుకొనిన పల్లకి నెత్తి పట్టించుకొనిన యా కవితాశక్తి యెట్టిది? రాయలు సామాన్యుఁడా? ఆముక్తను ప్రబంధీకరించిన ఘటికుఁడు. ఆయన తన ప్రబంధమున నతి మానుషమైన విచిత్రపుఁ బోకడలు పోయినాఁడు. అట్టి యాయన గౌరవించినాఁడు. ఈయన గౌరవింపఁబడినాఁడు. ఆ వైశిష్ట్య మెట్టిది?

ఆంధ్రసాహిత్యప్రపంచమున నన్నయగారితరువాత కథాకథన శిల్ప మొక్క పెద్దనగారికే తెలిసినది. అట్టి కథాకథనవైఖరి 'నభూతో నభవిష్యతి.' నన్నయగారు పురాణకవి. పెద్దన ప్రబంధకవి. కాని కథాకథనమున నిరువురు నొకేమార్గమునఁ బోయిరి. ఏ శిల్పము రాజరాజనరేంద్రుని వశపరచుకొన్నదో ఆ కథాకథనశిల్పచాతుర్యమే రాయల సమ్మోహింపఁజేసినది. అట్టె మాటాడినచో నూడిగము చేయించుకొన్నది. ఆ శిల్పవైచిత్రి యెట్టిదో పరిశీలింతము. పెద్దన ప్రబంధకవితాపితామహుఁడనిగదా! అయినచో నాయనకుఁ బూర్వము ప్రబంధములు లేవా? ఉన్నవి. కాని ఈ పెద్దన సర్వతంత్రస్వతంత్రమహోత్కృష్టప్రబంధకల్పనామతియై రససముంచితముగ నీ మనుసంభవమును రచించినాడు.

అసలిది మనుచరిత్రము కాదు. స్వారోచిషమనుసంభవము. స్వరోచి కొడుకైన స్వారోచిషమనువుయొక్క జన్మపర్యంతమైన యుపాఖ్యానము. పెద్దనగారు మార్కండేయపురాణాంతర్గతమైన మూలకథ నాధారముగఁ గైకొని తన కల్పనావైచిత్రినిఁ దోడు పరచి స్వతంత్రమైన పోకడలు పోయి తెనుఁగు నుడికారపు సొంపు ముంపులలో దేల్చి కథాకథనశిల్పవైశిష్ట్యముచే మెరుఁగులు పెట్టి రాయలకు సమర్పించినాఁడు.

స్వరోచిపుత్రుఁడు కాఁగలమనువు. మనువనగా డెబ్బదియొక్క దేవయుగములను శాసింపఁదగినవాఁడు, అట్టివాఁ డెట్లుండవలెను? ఏయే గుణములచే నొప్పియుండవలెను? ఇట్టివన్నియుఁ బ్రశ్నలు. మనువు కాదగినవాఁడు బ్రహ్మతేజస్సంపన్నుడు. గోబ్రాహ్మణ గౌరవము కలవాఁడు, దేవతాంశ కలిగి మహా సౌందర్యవంతుఁడు, సమస్తశాస్త్ర పారంగతుఁడు, చతుష్షష్టి కళానిష్ణాతుఁడు, ఏకపత్నీ వ్రతుఁడు, ఆయుర్వేదము నెఱిఁగినవాఁడు, సర్వపశుపక్షి భాషలఁ దెలిసినవాఁడు, యోగవిద్యలు కలవాఁడు సకల సస్యవృద్ధిదాయకుఁడునై యుండవలెను. ఈ లక్షణములన్నియు స్వారోచిష మనువునందు పెద్దనగారు నిక్షేపించినారా? ఆయన సర్వము నెఱిఁగియే కథాకథనమున నుపక్రమించినాడు, ప్రథమమునఁ గావలసినది బ్రహ్మతేజము, దేవతాంశ.

ఇఁక కథ మొదలు పెట్టుటలోనున్న చమత్కారముఁ జూతము. మొదట అరుణాస్పదపుర వర్ణన, తరువాత నచటి నాలుగు జాతుల వారిని వర్ణించి చివరకు "అచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ గా సెకొంచున వారించి గడపగలరు" అని వ్రాసినారు. ఇచ్చట నా పట్టణము స్వర్గాతిశాయియై యున్నదని సూచితము. ఇఁక ప్రవరుని సృష్టి, ముందుముందు వరూధినిమనస్సున 'యక్షతనయేందు జయంత కంతులన్' మించిన సౌందర్యవంతుఁడు. "నేరెటేటి యసల్ దచ్చి నీరజాప్తు సానబట్టిన రాపాడి చల్లి మెదిపి పదను సుధ నిడి నేసెనో పద్మభవుఁడు" అని సంభావింపఁబడినవాడుగ కాదగినవాడు, కావున నే:

"ఆ పురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షా పరతంత్రుఁ డంబురుహ గర్భకులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై."

అని వెంటనే—

వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జారకామినులకు

భోగభాగ్య మయ్యె పూచిన సంపంగి
పొలుపు మధుకరాంగనలకువోలె.

అనినాడు. ఇక్కడ నాపట్టణమునందలి వేశ్యలందరా తనియందాబద్ధచేతస్కలైరి. కాని వారి కీయనపొత్తు మధుకరాంగనలకు సంపఁగి వలె పొదురనిదాయెను. ఇక్కడవేసిన, యీ పునాది ముమ్ముందు ప్రవరుని, వరూధినిని చూచినను చలించని చిత్తస్థైర్యమునకు నాందీభూతము. ఆ పట్టణములోనివారే రంభాదులను తిరస్కరించువారగుటచే వరూధిని యందము ప్రవరుని చకితునిఁ జేయఁజాలనితనమును భాసిల్లఁజేయును. అతఁడన్నివిషయముల సంపూర్ణత్వము ముద్దకట్టిన మూర్తియై 'సాలగ్రామము మున్నగా కొనని' వాడు. అతిథిసేవాతత్పరుడు. అగ్నిదేవునిఁ బ్రార్థించి యిలుసేరఁగల శక్తిశాలి. అట్టివాడు ప్రవరుడు. రూపొందిన బ్రహ్మతేజము. ఇట్టి ప్రవరునిపై వరూధిని చిత్తము సంలగ్నము కావలెను. కావుననే పెద్దనగారిక్కడ మరియొక నూతన మార్గమున కథ నడిపించుకొని పోయినాడు. ప్రవరుడు తీర్థసందర్శనాభిలాషి. ఇది కారణముగా సిద్ధాపదేశమున శ్రోత్రియబుద్ధిచే ప్రవరుడు హిమాచలసానువులఁ బడి పాదలేప లోపముచే వరూధిని భవనమును డగ్గరును. ఆమె కతనిపై మరులు కలుగుట ఈతని వర్జించుట తిరస్కృతి అంతయు కథ జరిగినటే యుండును. మరల కథ ఇచ్చటనె మెలిక తిరుగును. కథలో నింకొక క్రొత్తకథ వచ్చుచున్నది. ఇదివరకే వరూధినిని మోహించి తిరస్కృతుఁడైన యొకానొక గంధర్వుడున్నాడు. అతఁడు వరూధినీలగ్నచేతస్కుఁడు. అతఁడీ ప్రవరు తిరస్కృతి వరూధిని విరహమును చూచినాడు. తనవలపు ఫలోన్ముఖమైనదని కొని మాయాప్రవరుఁడై వచ్చినాడు. వరూధిని ప్రవరగతమానస కావున ప్రవరుఁడగుపించెనను ఆనందమునే పొందినది కాని ఎవిధమైన యనుమానమ్మామెకుఁ గలుగలేదు. పెద్దనగారీ గంధర్వగాథను ప్రవేశపెట్టుటయందలి యర్థమేమి? ఇచ్చటనే పెద్దనగారి కథ కొక చిక్కదన మేర్పడుచున్నది. వరూధిని మనస్సు ప్రవరాధీనమై తద్రూపముగ్ధయై యున్నది. కావున నీ కుహనాభూసురు ననుమానించకపోగా నాతఁడు పెట్టిననియమములను సత్వరమంగీకరించినది. ఇట్లు వరూధినీ గంధర్వుల రహస్యమాగమము జరిగినది. స్వరోచి జన్మించినాడు. స్వరోచిజన్మలో పెద్దనగారు సాధించినది రెండు. ఒకటి బ్రహ్మతేజోభావన, రెండు గంధర్వాంశ. ప్రవరునికే ఏల సంతానోత్పత్తిఁ గలిగింపఁజేయరాదు? కేవలబ్రాహ్మణాంశ చాలదు కావున! ఈ బ్రాహ్మణభావన కేవలము వరూధినీమనోగతమైనదే కాదు. గంధర్వుడు ఋతుసమయమున ప్రవరదేహ సమిద్ధశిఖిదీప్తిని శాంబరీ మహిమచే సంగ్రహించినాడు. రూపమున్మాత్రము ఆవరణరహితమై గాంధర్వమైనది. కావున మనుజన్మకారణభూతుఁడైనవాడు దేవతాంశసంభూతుఁడై యుండవలెను. బ్రహ్మతేజము గంధర్వాంశ రెండును ఫలించినవి. కాగా ఋషులాతని నుపనీతునిఁ జేసి శాస్త్రవిదునిగ నొనర్చిరి. తరువాత కథ మనోరమతోటి పెండ్లి. మనోరమ అస్త్రహృదయమును ప్రయోగోపసంహారములతో నొసంగినది. స్వరోచిచే, రాక్షసుడు శాపముక్తుఁడై గంధర్వుఁడై తన కూతురైన మనోరమను ఆయుర్వేదమును నొసఁగి పెండ్లియొనర్చెను. అట్లే విభావసి సకల పశు పక్షి జాతుల భాషల నెఱుఁగఁజాలిన విద్యను స్వరోచి కొసఁగి యాయనను వివాహమాడినది. కళావతి పద్మినీవిద్య నొసంగి భార్యయైనది. ఇప్పటికే కథ కొంత తెమలినది.

బ్రాహ్మణభావన, గంధర్వాంశ, ఆయుర్వేదము, పశుపక్షిభాషావేతృత్వము పద్మిని అస్త్రహృదయము మున్నగునవి లభించినవి. కేవలము వీని సమష్టి పూర్తికాలేదు. స్వరోచి యేకపత్నీవ్రతుఁడు కాడు. బహుపత్నీవ్యసనుఁడు. మనువు కాఁదగినవాఁ డేకపత్నీవ్రతుఁడై యుండవలయును. తరువాత సకల సస్యసంపన్న గతమతియై యుండవలయును. ఈ రెండును కొఱవడినవి. పెద్దనగారీ కొఱఁత నెట్లు తీర్చిరి? స్వరోచి తన ముువ్వురు భార్యలతో వనవిహారము సల్పుచున్నాడు. దాపున విహరించుచున్న చక్రవాకితో హంస యొకటి యనినది. 'చూచితివా! స్వరోచి యెంతటి యదృష్టవంతుడో! ఆయనకా భార్యలయం దెంత ప్రేమయో! వారలయందర కాయనయం దంత ప్రేమ యేకకాలమున నున్నది. పూవుఁదావివలె వాని కూడిక నాకెంతయు కుతూహలకరముగ నున్నది,' అని. చక్రవాకి యీ పలుకుల నిరసించినది.

"తత్ర స్త్రీపురుషయోః అన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తి విశేషః రతిః స్థాయీభావః"—కావున బహుస్త్రీగతబుద్ధి నిరసింపఁదగినది. "పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం డిలగల ధన్యు"డని యెలుఁగెత్తి యనినది. స్వరోచి సకల పశు పక్షి భాషల నెఱిఁగినవాడు కావున నిది విచారించి లజ్జించినాఁడు. కాని యాలజ్జ క్షణమాత్రమైనది. మరల పూర్వమువలె ముువ్వురఁ గూడియున్నాడు. అతనికి వరూధినీ గంధర్వ సమాయాతాధిక కామవికార మున్నది. అది యట్లు చేయుచున్నది. ఇది యిట్లుండగా మరల నొక సంఘటనము జరిగినది. ఒక దినమున క్రీడావిహారాయాత రాజదంపతులకు లేడిపిండు కనిపించినది. ఆడులేళ్లు శృంగారచేష్టలచే విసిగిన కృష్ణసారంగము

"హుంకారం బొనరించి వేతొలఁగు డోహో నేను స్వారోచి నే
పంకేజాక్షులతోడ నెల్లపుడు క్రీడింపఁ"—అని నిందించినది.

ఆ చక్రవాకి, యీ కృష్ణసారంగము మాటలు స్వరోచి మనస్సును కలచివైచినవి. కాని యీమారును భార్యానురక్తుఁడాయెను. వరూధినీసంతాన మాయెను! భార్యలయందు సంతానమును గని పద్మినీవిద్యాప్రభావమున వారికి పట్టణములఁ గల్పించి యొసఁగినాడు. ఇప్పటికాయన మనమున నేకపత్నీభావము వచ్చినది. స్వరోచి యొక్కడే వేటకు వచ్చినాడు. ఒక యడవిపందిని జంపఁబోవ వనదేవత లేడి యాకృతియై యడ్డుతగిలి నివారించినది. ఆమె తన యాగమనవృత్తాంతమును జెప్పి యాతని తేజమును ధరించి మనువును ప్రసవించినది.

ఇప్పటికి సర్వము సిద్ధించినది. తరువాత పెద్దనగారు వ్రాసిన దేమియు లేదు. "అట్లు జనియించి స్వారోచిషాఖ్య" వతడు తపం బాచరించెనని దశావతార వర్ణనఁ జేసినాడు. పెద్దనగారు చెప్ప దలఁచుకొనినది స్వారోచిషమనువుయొక్క పుట్టుక. కావుననే

ఆయన తన ప్రబంధమునకు స్వారోచిషమనుసంభవమని నామకరణ మొనర్చుకొనినాడు.

మనువు పుట్టుటకుఁ గావలసిన సర్వ సామగ్రియు సిద్ధపరచి కమ్మచ్చునుండి తీగ లాగినట్లు కారణమునుండి కార్యమును సూత్రపాతము కాకుండ నతి సుందరముగ శిల్పీకరించినాడు. ఆయన చెప్పదలచుకొన్నది ద్రాక్షాపాకమున ముంచియెత్తినాడు.

ఆయన కథాకథనరచనానైపుణిని సమగ్రముగ నెఱిఁగినవాడు కావుననే రాయలాయన నట్లభినందించినాడు. చాలమంది మనుచరిత్రము ప్రథమ ద్వితీయాశ్వాసములఁ జదివి ముగింతురు. కాని కథయొక్క పట్టంతయు ముందటి యాశ్వాసములందు ప్రతిష్ఠింపఁబడియున్నది. ఆయన యూహాకల్పనలయం దంతయు చిక్కనైన యాశ్వాసములవి. ప్రథమ ద్వితీయములు నాందీభూతములు. ఆసాంతముఁ జదివినఁగాని యాయన యేమి యుద్దేశించినది ఎట్లు నిర్వహించినది తెలియదు. ఆయన కార్యకారణసంబంధములో సోపానపరంపరగ నమర్చి వ్రాసిన యీ మహాప్రబంధమే యాయన కాంధ్రకవితాపితామహ బిరుదమును ప్రాపింపఁజేసినది.

ఇఁక పెద్దనగారి రచనాచమత్కృతి నవలోకింతము. సిద్ధుడు వచ్చినాడు. ప్రవరుఁ డాతనిఁ బూజించి యాతఁడు చూచిన స్థలమాహాత్మ్యములఁగూర్చి చెప్పుమని యడిగినాడు. ఇఁక నా సిద్ధుడు చెప్పినాడు.

'ఉ. చతురాస్యవంశకలశాదధిపూర్ణశశాంక తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులున్
జూచితి నందునందుఁ గల చోద్యములన్ గనుఁగొంటి నాపటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబులన్.'

"ఈ యా దేశం బననేల చూచితి సమస్తావకాశంబులన్"

ఈ రెండు పద్యములచే సిద్ధునియొక్క గర్వము వ్యంజితమగుచున్నది. సిద్ధుడు తిరుగుడు. కాని కొన్ని యోగసిద్ధులు కలవాడు. అంతియ. ముని కాడు. ఋషి కాడు. కావుననే స్వాతిశయమును చెప్పుకొనినాడు. ఈ చెప్పుటను పెద్దనగారతిచిత్రముగఁ జెప్పించిరి. సాధారణముగ లోకమున గర్వోక్తులందు చేతులు బారలు చాపుచు చెప్పుదురు. ఆ మాట్లాడునప్పటి బారలుచాచుటను ఆయన పద్యముయొక్క నడకయందు జొన్పించి "నాపటీరాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబులన్" అని యనిపించినాడు. తరువాతి ప్రవరునికి సిద్ధునియం దొకింత యలసభావ ముదయించినది.

"వెఱవక మీకొనర్తు నొకవిన్నప మిట్టివియెల్లఁ జూచిరా [పున్
దెలకలు గట్టుకొన్న మరి యేండ్లును బూండ్లును బట్టఁ బ్రాయ
జెలువితనంబు మీ మొగము సెప్పఁగ చెప్పెడు నద్దిరయ్య! మా
కెఱుఁగదరంబె మీ మహిమ లీర యెఱుంగుదు రేమిచెప్పుదున్"

అని పరిహాసగర్భితముగ ననినాడు. సిద్ధుఁ డూరకొనినాడా మరి! అతఁడును గడుసరియే! వెంటనే తనశక్తిఁ బ్రదర్శింపఁ దలఁచుకొనినాడు. పాదలేపముఁగూర్చి చెప్పఁదలఁచుకొని యూరించుచున్నాఁడు. "పరమంబైన రహస్య"మని మొదలు పెట్టినాఁడు.

ఇచ్చట మరల పెద్దనగారు లౌకికము నతిసుందరముగ నుపయోగించినారు. లోకములో రహస్యవిషయములనుగూర్చి చెప్పవలసివచ్చినప్పుడు ఆ విషయప్రాబల్యముకొఱకు 'అయిన' అనునది చేర్చుదురు. ఇది చాల రహస్యమైనదిసుమా! ఎవరితోనైన ననేవు! అందుము. కాని ఇది చాలరహస్య మనము. పెద్దనగారీ లోకవ్యవహారము నిచట పట్టించినారు. ఆ 'అయిన'లో నెంత గొప్పదన మున్నది. తరువాత—

'ఆ మందిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీ ఝరీ నిరీక్షాపేక్షన్'

ఈ పద్యంపునడకలో నొక సొగసున్నది. ప్రవరుఁడు హిమాలయము నధిరోహించుటలోని గతిని పద్యచాలనమునఁ గనిపింపఁ జేయును. నిమ్నోన్నతముల నధిగమించుచున్న యాయన నడక కనుగుణముగనున్న దీ 'తుహినభూధర శృంగ శ్యామల కోమలకానన హేమాఢ్యదరీ ఝరీ నిరీక్షాపేక్షన్'. ఇటువంటి విచిత్రముల నీప్రబంధమునిండ నతుకులు చేసినాడు. ఈయన యుత్ప్రేక్షలతిసుందరములు. వాలురెప్పలమపై కెగఁద్రోయుచున్న యామె కన్నుఁగవ సుఖమునుగూడ నాక్రమించు ననుభయమున మన్మథుఁ డానగీచిన గీతవలె కస్తూరితిలకము చిరుచెమ్మటచే చెక్కులఁ జారినదఁట!

"ఎంత తపంబు చేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కొంతు డవజ్ఞ చేసినను కాయము వాయుదు రేనమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గరితిన్ మృతి లేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపికయయ్యె నక్కటా!'

చంద్రోదయమగు వనగా తూర్పుననొక స్త్రీ తన మొగమున వ్రాసిన చీకట్లను కుంతలములఁ జెరగదువ్వుటకునై పైకెత్తిన దంతపు దువ్వెనవలె ధవళిమ తోచినదట. పెండ్లి చవికెమీఁద మనోరమా స్వరోచు లాసీనులైరి. తెఱఁ దీయుచునపుడు మనోరమకు సమీపముగ స్వరోచి మొగ మగుపించినది. అపుడామె తొట్రుపాటుతో గూడిన బెరుకుచూపులతో నాతనిఁ జూచెనట. ఆ చూపులు బెస్తవాని చేతులనుండి నేలమీఁదకు విదలింపఁబడి యటునిటు మిడిసి మిడిసి పడుచున్న చేపలవలె నున్నవఁట. ఆయన యుత్ప్రేక్షలిట్టి వసంఖ్యాకములు. ఇట్టి సొగసుఁదనముల నీ గ్రంథమునిండ గుప్పినాడు. ఈయన రచన గోస్తనీ ఫల పరిపాకపరిరమ్యమై సహృదయహృదయాస్వాదకరమై పండితజనానందకారియై యుండును. ఈయన పద్యగతి ఆకాశగఙ్గాస్వచ్ఛ తరంగ భంగికలవలె నృత్యము సేయుచుండును.

సద్యోవినిర్భిన్న సారంగ నాభికా
వ్యాప్తిమై పిసాళించు మృగమదంబు
కసటువో బీరెంపఁ గరఁగి కట్టలవంటె
గమగమ వలచు చొక్కపు జవాజి
సారలెత్తి ఘనసారతరువులఁ దనువాన
తొరఁగిన పచ్చకప్పురఁ పుసిరము

గొజ్జంగి పూఁజొబాల్ గురియంగఁ బటికంపు
కొనల నిండినయట్టి తుహినజలము.'

'రవిబింబపతితనదీర్ణపయోధిగర్భ ని
ర్గత శేషఫణిఫణారత్నరుచియొ.
దివసావసానసందీప్తాస్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతానాతపంబొ
తపన ఘర్షంపు నిర్దళిత దిక్తట దృశ్య
కమలజాండపు కటాహ కనకఘృణియొ
చండీశ తాండవోత్సవ సంభృతకృపా
హస్తాగ్రదీప గభస్తిచయమొ.'

ఇట్టి వర్ణనలు కానగును. గంధర్వుని జాణతనమును తెలుపుట కాతని స్వభావమును వేషాంతరముచే కప్పి వేయుటయందు గంధర్వుడు పడినబాధ నతి చమత్కరించి వ్రాసినాడు.

'కానవాగి కామినీగోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁ జూపుల తెప్పతుదల నాఁచి
కంతిసంబున ముఖాబ్జమునందుఁ జిలుకవ్వ
కంపళింపకయుండ డింపు పరచి
బంగారు మైఁ దోఁచు శృంగారచేష్టల
తమిఁ దెచ్చుకోలు మౌగ్ధ్యమున డాఁచి
బాడము రసావేశమున వచ్చు వక్రోక్తు
లాదిని నాలుకకు రాకుండఁ ద్రొక్కి
పుస్తకము వాంచి యుసురని మౌనముద్ర
నేల బొటనవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
సేపు వెసవడ చింతించి శిర సాకింత
యెత్తి సన్నంపు పలుకులతో నిట్టు లనియె.'

వరూథిని ప్రవరాఖ్యుని ప్రయాణవిముఖునిఁ గావించుట కను చున్నది. 'ఎక్కడియూరు?' అని, కాని యీయనుటలో నొక చిక్కున్నది. మొదటి రెండు పాదములు తేలికగఁ జెప్పివైచి తరువాత రెండు పాదములలో "ఇక్కడి రత్నకందరము లిక్కడి నందన చందనోత్కరం బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్" అన్నది. ఈ 'ఇక్కడి' అని ప్రతి పదమునకును వాడి యక్కడి యాధిక్యమును సూచించుచున్నది. ఆ 'ఇక్కడి' అంత యర్థవంతమైనది.

అసలు వరూథిని యప్సర. నర్మవాక్యచతుర. ఆమె మాటాడి నంతసేపును నర్మగర్భమైన యహంభావమును యాధిక్యముచే కనిపింపఁ జేసినది. సంభాషణ మొదలిడుచునే 'ఇంతలు కన్నులుండ' అని యాతనిపైని కామదృష్టి సెలుకపరచినది. తన యాధిక్యమును త్రిమూర్తుల యాలయములు తనకు నాట్యస్థలములని, రంభాదులు స్నేహితురాండ్రని, హిమాలయసానువు లుద్యానవనములని చెప్పకొన్నది. తరవాత 'భూసురకైతవ కుసుమశరాసన మాయింటి విందవైతివి' అని నర్మగర్భముగ నన్నది. ఈయనుటలోనే యామె కామభావము సూచితము. వరూథిని యట్లన్నది కావుననే ప్రవరునికి 'ఇందుండఁగ రా' దనిపించినది.

కథలో గంధర్వునిఁ బ్రవేశపెట్టు టవాంతరముగ నున్నదను కొనవచ్చును. వరూథినీప్రవరసమావేశ మాయన కెట్లు తెలియు నను కొనవచ్చును. అందులకు పెద్దనగారు మొదటనే జాగ్రత్తపడి, 'దేవజాతిత్వజనిత విమలజ్ఞానపాటవమునం దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటఁజేసి' అని వ్రాసినాడు.

'ద్రాగ్విద్రావచ్ఛదా విని ద్రాణమదిత
దంజనాలాన మూలశయ్యావిధాన
వారణా ధోరణా కల్పితోరు శోణ
వృత్తి కాంతారవో యన నెరసె సంధ్య'

మదజలధారలెక్కువయైన యేనుఁగులకు దప్పిక యతిశయించును. ఆ దప్పిక యెఱ్ఱమట్టిపై పడుట యుపశమించును. కాన నట్టి యేనుఁగులకు శయనస్థలమున నెఱ్ఱమన్ను పోయవలెనని గజశాస్త్రమున నున్నది. ఆ గజశాస్త్రమును పెద్దనగా రంతిగా పరిశీలించినా రన్నమాట.

పెద్దనగారు స్వరోచినిగూర్చి చెప్పవలసివచ్చినప్పుడు 'అని మిష కాంతాతనయుఁడని, వరూథినీ సుతుఁడని వరూథినీ సంబంధమైన ప్రాశస్త్యమునే సూచించుచు వచ్చినాడు. కాని ప్రవరాత్మజుఁడని గాని, గంధర్వకుమారుఁడని గాని యనలేదు. ఎందుకనగా స్వరోచి ప్రవర వేషధారియగు గంధర్వునికి జనించినాడు. గర్భధారణ సమయమున వరూథిని బ్రహ్మతేజస్సంపన్నుఁడైన ప్రవరుని మనస్సున నిలిపినది. కాన నెవరికుమారుఁడో నిర్ణయించుట కష్టమై పెద్దనగారు క్షేత్రప్రాధాన్యమును స్వీకరించి వరూథినీతనయుఁ డనినాడు. ఇట్లు చెప్ప మొదలిడుచో నెన్నియైనఁ జెప్పవచ్చును. సముద్రము నందలి మణిసంతతివలె ప్రయత్నించువారికి నిగూఢార్థములు లభించును. ఇంతటి మహత్తరప్రబంధము కావుననే రాయలవారి హృదయమున హత్తుకొనిపోయినది. రాయ లీ కవితాసమ్మోహితమానసుఁడై యేమి చేయలేదు!

పెద్దనగారి రచనావైశిష్ట్య మెట్టిదో రాయలవారి రసగ్రహణ పారీణత యట్టిది. పెద్దనగారి కథాకథనశిల్పగుంఫన మెటువంటిదో రాయల సవిమర్శక సమగ్ర కవితాదృష్టి యట్టిది. పెద్దన యలంకార చాతురి యెట్టిదో రాయల నిశిత గుణగ్రహణ చమత్కృతి యటువంటిది. కావుననే వారిద్దరట్లు ప్రబంధకవులలో నగ్రగణ్యులై నిలిచినారు. వారిరువురు సమకాలీనులై యొకే దేశమున ప్రభువు నాస్థానకవియు నై కలియుటాశ్చర్యము. అందులో నిద్దరును ప్రబంధనిర్మాతలగుట యతిచమత్కారము!

**కథానిక:**

# అరకు లోయలో కూలిన శిఖరం

"బుచ్చిబాబు"

ఆ పచ్చటి పర్వతశిఖరాలు నీలిఆకాశాన్ని నేలిముసుగులా కప్పుతున్న తెల్లమేఘాన్ని అన్వేషించి, అందుకోలేక అలిసి, క్రిందికి క్రుంగి లోయగా సాగారి నగ్నంగా పవ్వళించిన ఏకాంత కన్యలు. విషాదంలో జుట్టు విరబోసుకున్నట్లు చుట్టూ దట్టమైన అడవి — పెనవేసుకున్న ముంగురులులా వికృతిమైన చెట్ల మ్రానులు, విరిగిన మొదళ్ళు, వర్షపునీటికి చారలు తేరిన నల్లకొండరాతి గీటలు; ఆకలి భ్రమించి కళ్లు తెరిచినట్లు శిఖరాలమధ్య విడిన మబ్బునీడలు — జతోలమధ్య బాధతో జారిన కన్నీరుమాదిరి, వంకరలు తిరిగి అదృశ్యమయ్యే గోస్తని, సగం ఎండిన పిల్లనదీ — తన అందానికి సిగ్గుతో తలలువంచి పాదాలకేసి చూసుకున్నట్లు, క్రిందికి, యింకా క్రిందికి, యింకా యింకా క్రిందికి, అగాధలోకంలోకి దిగజారిపోతున్న ఆ దృశ్యం, ఆ అనుభవం, అరకులోయ.

సముద్రమట్టానికి రెండువేల అడుగుల ఎత్తునవున్న పల్లటి ప్రదేశం అరకులోయ. చుట్టూ పెద్ద కొండలు, అడివి, మధ్యగా ప్రవహించే పిల్లనది, సారవంతమైన నేల, సౌందర్యమైన ఆ దృశ్యాలు, విశాఖపట్నంనుండి మాచ్‌కండ్ జలవిద్యుత్ కేంద్రానికి వెళ్లే యాత్రికులను ఆకర్షించాయి. ఇక్కడ వ్యవసాయం సాగించి, విద్యుత్ సహాయంతో ఒక మహాపట్టణాన్ని నిర్మించాలని పథకాలున్నాయి. మలేరియాని అరికట్టాలి; వసతులేర్పాటుచెయ్యాలి; కాలవలు తవ్వాలి; ఇక్కడ స్థిరపడిపోడానికి సిద్ధపడ్డ వ్యక్తులు కావాలి; మాచ్‌కండ్‌నుండి విద్యుత్ యీ లోయకుండా నడిపి, వొక నాగరికత నెలకొల్పాలని ఎందరెందరో కలలుకంటున్నారు.

కాని కార్యానికి పూనుకున్నవారు లేరు; అది నిర్మానుష్యమైన అడవిప్రాంతం; కొద్దిమంది కొండజాతివారు అక్కడక్కడ కనబడి క్షణంలో మాయమవుతారు. సృష్టి ఆదిలో అల్లా వుండేదేమో అనిపిస్తుంది. చెట్లు, మనుషులు, కొండలు, మేఘాలు, మృగాలు — అన్నింటికీ ఒకే చైతన్యం. నాగరికతలో మరణించి, చరిత్రగతంలో జనించడంలాంటిది అరకులోయ సహవాసం.

అందుచేత ప్రస్తుతం అందరి దృష్టీ మాచ్‌కండ్ పై మరలింది. మాచ్‌కండ్ నది జలపాతంసహాయంతో పెద్ద జలవిద్యుత్ కేంద్రం నిర్మాణమవుతోంది. అది పూర్తి అయింతర్వాత అరకులోయ వలస స్థాపన.

అది పూర్తిచేసే పనిమీద మాచ్‌కండ్ వెడుతున్న ఇంజనీర్ వర్మ, పట్టాపొందిన తర్వాత, వొకటి రెండేళ్లు ఇంజనీరింగ్ కాలేజిలో లెక్చరర్‌గా పనిచేసి, స్కాలర్‌షిప్‌మీద మాన్‌చెస్టర్‌లో పైచదువు పూర్తిచేసి పెద్దడిగ్రీ పొంది రాగానే, మాచ్‌కండ్ నిర్మాణశాఖవారికి సలహాదారుగా నియమించారు. ఇదే అతను ప్రథమంగా మాచ్‌కండ్ రావడం. తను ముందుగా వెళ్ళి బంగాళా అదీ ఏర్పాట్లు చేసింతర్వాత, సామాన్లు, సిబ్బందితో ఆ మరుసటి దినం అతని భార్య రావడానికి ఏర్పాటుచేసుకొని ప్రయాణమై చక్కావొచ్చాడు.

స్టేషన్‌లో దిగగానే ఆశాభంగమైంది. మాచ్‌కండ్ అధికారులు తనకోసం పంపుతామన్న వాగన్ పంపలేదు. గుమాస్తా సోమయ్యనిమాత్రం ఆహ్వానానికి స్టేషన్‌కి పంపారు.

సోమయ్య మాచ్‌కండ్ వుద్యోగైనా విశాఖపట్నం రవాణా బ్రాంచిలో పనిచేస్తున్నాడు. వాగన్ ఎందుకు రాలేదో అతనికి తెలీదు. దోవలో చెడిపోయిందేమో? వర్మగారి వుత్తరం వారికి సమయానికి చేరలేదేమో? తన పలుకుబడితో వొక జీప్ సంపాదించాడు. ఉదయం ఆరుగంటలకి కొండరోడ్ మార్గాన, నూటముప్ఫైమైళ్ల జీప్‌ప్రయాణం సాగించారు.

వర్మ ఇంగ్లండులో పైచదువు పూర్తిచేసిన వ్యక్తి అంటే నమ్మడానికి వీలుగా కనబడతాడు. డబుల్‌బ్రెస్ట్ కోటు, టై, ఆకుపచ్చ కళ్లజోడు, సిగరెట్ టిన్, లెదర్ కేస్ — యీ వ్యక్తి పాపం జీప్‌లో ప్రయాణం చెయ్యాల్సివొచ్చింది, అనుకున్నాడు సోమయ్య వెనకసీట్లో. సాధారణ పంచకట్టు, ముతకచొక్కా, పైన కండువా, సోమయ్య వాలకంచూస్తే, చాలా అల్పుడైన వుద్యోగిలా వున్నాడు. అతనైనా, ఆహ్వానానికి మాచ్‌కండ్ అధికార్లు పంపవల్సింది? వెళ్లగానే అడగాలి. ఇంకానయం, భార్య స్నేహాలత తనతో వొచ్చిందికాదు. ఇదంతా చూసి, ఏమనుకునేదో? నలుగురైదుగురు బంట్రోతులు, రెండు కార్లు, పెద్దపెద్ద వుద్యోగులు, రైలు దిగగానే సిద్ధంగా వుంటారని వర్మ వూహించుకున్నాడు. కాసేపు కోపగించుకున్నాడు — ప్రమాదకరమైన మలుపులు, జీప్‌ముందు ప్రాణంకోసం పరుగెడుతున్న కుందేలు, వింజామరలు వీస్తున్న చెట్లకొమ్మలు, గార్డ్ ఆఫ్ ఆనర్ యిచ్చి సాల్యూట్ చేసి నిలిచిపోయిన రాతిబండలు — వీటిని గమనించనేలేదు వర్మ.

మలుపులో సూర్యకిరణం, కత్తిలా పొడిచింది. చెట్ల ఆకుల్నుంచి జారుతున్న మంచుకణాలు ఇంద్రధనస్సులా విరిగి, వెయిం కత్తుల వెలుగుతో బద్ధకించిన చూపుని చీలుస్తున్నాయి. వర్మ కోపల

---

అరుకులోయ దృశ్యాలు పరిసరాల వర్ణనకోసం పేర్కొనబడ్డాయి. ఈకథలో వ్యక్తులు, వస్తువు కల్పితాలు. మాచ్‌కండ్ జలవిద్యుత్ కేంద్రంలో ఏవ్యక్తినిగురించి కాదు.

నిగమించుకున్నారు. దేశానికి స్వతంత్రం వొచ్చింతర్వాత జరిగిన మార్పుకి అది చిహ్నం అనుకోకూడదు? పనికటి, వొంగిసలాములు, జోహార్లు, బందోబస్తు, పటాటోపం తను ఆశించకూడదు. ప్రజలలో నూతన వికాసం, వ్యక్తిత్వం, స్వతంత్ర జిజ్ఞాస ప్రబలినాయి.

కొండదిగుతున్నారు. కింద ఆకుపచ్చ చీర కొంగువిప్పి పరున్న లోయ—పచ్చరోడులోంచి మరింత పచ్చగా కనబడుతోంది. ఎండకి కొండలు విరిగిపడ్డట్లు, అదృశ్యమౌతున్నాయి. ముందుకు పడిపోకుండా గట్టిగా పట్టుకున్నాడు. కుప్పున చెమట పోసేసింది. డ్రైవర్ స్నానం చేసినట్లులేదు. కోటు విప్పాడు. పై వొదులు చేశాడు. జీపునిలిపి, సోమయ్యని ముందుకుపంపి, తను వెనకసీట్లో కూర్చున్నాడు. ఎనభైమైళ్లి ప్రయాణంతో వర్మ అలిసిపోయ్యాడు.

జీప్‌కూడా అలిసిపోయింది. కదలడంలేదు. ఏదో చెడింది. డ్రైవర్ రిపేరింగ్ సాగించాడు. అరకులోయలో యాత్రీకుల బంగాళా యింకా ఆరుమైళ్ళుంది. మాచ్‌కండ్‌నుంచి ఏదైనా వేగన్ రావొచ్చు. మరో పాసింజర్ బస్ తగలొచ్చు; కాసేపు ఆ చెట్టుకింద విశ్రాంతి తీసుకుందాం అన్నాడు సోమయ్య.

వర్మ ఫ్లాస్కులో టీకాస్త పోసుకు త్రాగాడు. సిగరెట్ ముట్టించాడు. చల్లగా గాలివీస్తున్నా అతని వొళ్లంతా వేడెక్కింది. చుట్టూ చూశాడు—అన్నీ గుట్టలు, పొదలు, పెనవేసుకున్న చెట్లు, ఆ రాళ్లమధ్య కింద, దూరంగా కొలను. బైనాకులర్స్ తీశాడు. అవును నీరే. ఎక్కడిదో? ఎక్కడినుంచి పుడుతుందో ఎవ్వరికీ తెలీదు—ఆదిగంగా అక్కడక్కడ జలం వూరుతుంటుంది, అదొక వింత, అన్నాడు సోమయ్య. వర్మ కిందికి రాళ్లల్లోకి దిగాడు. నీళ్లు స్వచ్ఛంగా వున్నాయి. అడుగు యిసిక, నాచు, కనిపిస్తున్నాయి. దోసిలితో తీసుకొని మొహం తుడుచుకున్నాడు. మళ్లా ఆ పచ్చటి నీడలమధ్య జారుతున్న నీటిని చూశాడు. ఇంకా కింద, యిరవై అడుగుల దిగువున మరొక కొలను. చుట్టూ రాతిబండలు, సూర్యరశ్మిని బంధించే అల్లికపొద-నగ్నంగా స్నానంచేస్తున్న వొక స్త్రీ బైనాకులర్స్‌లో కనిపించింది. తీక్షణంగా చూశాడు. నడుంకి కాస్తంత ఎర్రబట్ట వుందేమో—బలంగా, స్ఫుటంగా యవ్వనం తీరికగా తీర్చిదిద్దిన ఆమె అవయవాలు అతని అస్థిపంజరాన్ని కదిల్చాయి.

“ఆ నీళ్లుమాత్రం త్రాగమాకండి” అని పైనుంచి సోమయ్య కేక వేశాడు. వర్మ ఎందుకో వులిక్కిపడి పైకి వొచ్చేశాడు.

“నీళ్లు మంచివికావంటారండి” అన్నాడు సోమయ్య. ఒక రాతిమీద దులుపుకొని, కోటుసీటు తలకింద పెట్టుకుని వెన్ను వాల్చాడు వర్మ.

“ఈ ప్రాంతంలో మనుషులెవళ్లూ వుండరా?”

“ఉండకేమండి—కొండజాతివాళ్లు, మందులాళ్లు; అక్కడక్కడ మసులుతూనే వుంటారు. కొందరేమో మాచ్‌కండ్ పోయి కూలిచేసుకుంటారండి.”

“ఇక్కడేవీ ఇళ్లు కనబడవేం?”

“వాళ్లకి యిల్లెందుకండి—కొండగుహల్లోనూ, చెట్లకిందా తిరుగుతూ వుంటారండి” అన్నాడు సోమయ్య, ఆవులింతని ఆపుకుంటూ.

“మరి భుక్తి?”

“ఏదో పండించుకుంటారండి. వేటాడి మాంసం, తేనె తీయడం, మూలికలు అమ్మడం—అల్లాగే గడుపుకుంటారండి.”

సోమయ్య ఆవులింతల్ని ఆపలేక పోతున్నాడు. తనూ జీప్‌లోకెళ్లి, కన్నుమూశాడు.

మళ్లా బైనాకులర్స్‌తో కిందికి చూశాడు వర్మ. స్నానం చేస్తున్న స్త్రీ లేదు. నాలుగుమూలలా చూశాడు. ఎక్కడా కనబళ్లేదు. పాశ్చాత్య శిల్పకళలో తప్ప అతనెప్పుడూ అల్లాంటి శరీర సౌందర్యం చూడలేదు. మనవారి ఆచారాలు, బట్టకట్టు అలవాట్లు, సహజసౌందర్యాన్ని వికసించనీకుండా చేస్తాయని వర్మవూహ. పాశ్చాత్య స్త్రీల శరీరాలు కొంత మెరుగు. పొదల మధ్య, కాళ్లు నీళ్లలో మునుగుపడి, పూర్తిగా కనబడని అవయవాలతో యిందాక తను చూసిన స్త్రీ, వీనస్ డిమైలో శిల్పంలాగవుంది. ఛాయ, మామూలు నలుపే; మొహం సరిగ్గా కనపడలేదు. కాని ఆ బలమైన అవయవాలు, స్థిరపడిన కండరములు, యుగయుగాల రాపిడికికూడా చెదరని రాతి చెక్కడాలకి మల్లె, దేనికీ లెక్కచెయ్యని ఆ రొమ్ములు—యిసుకలో తలదూర్చి, సృష్టిసౌందర్యం భరించలేక ఏడవాలనిపించే ఆ మూర్తి, వర్మని వొక సహజమైన పురుషుణ్ణిగా మార్చింది. ఏవేవో వింతభావాలు, విపరీతమైన పులకరింపు అతను స్పృశించలేని సత్యానికిమల్లే వ్యూహంలో బంధించబడాల్సిందే!

సోమయ్య, డ్రైవరు అటుపోతున్న ఎడ్లబండినినిలిపి, దానికి జీప్‌నికట్టి, మళ్లా ప్రయాణం సాగించారు. బంగళాకి చేరుకునేప్పటికి, వొంటిగంటైంది. వారికోసం మాచ్‌కండ్‌లో బైలుదేరిన వేగన్ అక్కడ నిలిచింది. ఇద్దరువ్యక్తులు మందహాసం చేశారు. ఒకాయన ముందుకొచ్చి నమస్కారంచేసి, వొకచీటి యిచ్చాడు వర్మకి. రెండోవ్యక్తి దూరంగా నిలబడే తల వంకించాడు. అతడు నమస్కారం చెయ్యనందుకు వర్మ విసుక్కున్నాడు. చీటీ చదువుకున్నాడు. వేగన్ ఎందుకు సకాలానికి పంపలేకపోయ్యారో తెలిపి మాచ్‌కండ్ బంగళా వున్నాదుకాని ఖాళీ అవదుగనక, అంతవరకూ అరకులోయ బంగళాలో వుండవల్సిందని అధికారులు కోరుతూ వ్రాసిపంపిన వుత్తరం అది. వర్మకి పూర్తిగా కోపమొచ్చేసింది. కాని ఎవరిమీద, ఎల్లా ప్రకటించాలో అతనికింకా తెలీడం లేదు.

“నాకు మీ వేగన్ అక్కర్లేదు—రేపుదయం స్టేషన్‌కెళ్ళి—సరిగ్గా పదింటికి అమ్మగార్ని, సామాన్లు తీసుకురండి—మీతో సోమయ్యకూడా వొస్తాడు. ఇక్కడేమన్నా భోజనం దొరుకుతుందా?” అన్నాడు వర్మ.

“కారియర్ తెచ్చాముండి” అన్నాడు చీటితెచ్చిన వ్యక్తి, తమ్మయ్య.

సామాన్లు, వర్మ, బంగళాలో ప్రవేశించారు. దూరంగా వ్యవసాయశాఖవారి వొకటి రెండుయిళ్లు, టీ దుకాణంతప్ప, మనిషి

అలజడిలేదు. కోటు, జోళ్లువిప్పి, వర్మ భోజనానికని బల్లదగ్గర కొచ్చాడు. కారియర్ విప్పి, అన్నీ సిద్ధంచేసి వుంచారు. కాని కారియర్‌లో అన్నంమాత్రంలేదు. వర్మ వొళ్లు మండిపోయింది. ఏమిటిదని గర్జించాడు.

"కోతులు ఎత్తికెళ్ళినాయి కాబోలండి" అన్నాడు తమ్మయ్య చేతులు నలుపుకుంటూ.

"మీ ఏర్పాట్లు బాగున్నై. మాచ్‌ఖండ్‌లో పన్లు సాగడం లేదంటే ఆశ్చర్యమేముంది, మీకోటగాళ్లందరూ ఘనులున్నప్పుడు." ఆ వెటకారానికి, దూరంగా గేటుదగ్గర నిలబడ్డవ్యక్తి నవ్వాడు. అక్కడక్కడ చిరిగినలాల్చీ, నాలుగురోజులు కత్తి తగలని గడ్డం, ఖద్దరు పైజమా, చేతిలో రెండడుగులు పొడవుగల టెలిస్కోప్, దీనంగా, నిశ్చలంగాచూసే కళ్లు—అదీ అతని ఆకారం. నవ్వుకుంటూ వెళ్లాడు ఆ వ్యక్తి. వర్మ టీ కోసం ఫ్లాస్కు బోర్లించాడు. బుట్టలోవున్న బ్రెడ్ తీసుకొని, కొయ్యకుండానే తినడం సాగించాడు. మాసినగడ్డంవ్యక్తి, అరగంటలో వో కుర్రాడినెత్తిన అరటిపళ్లు, వొక సోడాకాయలో నీళ్ళు, మరొక సోడాకాయలో టీ, పెట్టించి, తీసుకువొచ్చాడు. ఇవన్నీ వర్మకి అందచెయ్యమని తమ్మయ్యతో చెప్పి వెళ్ళిపొయ్యాడు.

అందరూ తలో వైపుకూ వెళ్ళారు. సోడాకుర్రాడు గంగడు తప్ప. వాడు మండువాలో పడుకున్నాడు. వర్మ పడుకుని లేచేటప్పుడికి మూడు గంటలు దాటింది. గంగణ్ణిలేపి నీళ్లు తీసుకురమ్మన్నాడు. మొహం కడుక్కొని, కొత్తబట్టలు వేసుకుని, గంగణ్ణి వెనకాలసీటులో కూర్చోమని, వర్మ జీప్ నడపడం సాగించాడు. టీ దుకాణంలో యిద్దరూ టీ త్రాగి ప్రయాణం సాగించారు.

"మాచ్‌ఖండ్ అటుగాదండి. ఇటండి. అది మీ రిందాకా వొచ్చిందేనండి" అన్నాడు గంగడు.

"నాకు తెలుసులేరా."

నీరుబికిన రాతిబండల దగ్గరకొచ్చారు పావుగంటలో.

జీప్ ఆపుచేసి, వర్మ రాళ్లమధ్య నీళ్ళల్లోకి దిగి చూశాడు. ఎవ్వరూ లేరు. కొండపైకి చూశాడు. ఒక కొమ్మను ఆనుకుని గడ్డం పెరిగి లాల్చీ వేసుకున్న వ్యక్తి టెలిస్కోప్‌లోంచి చూస్తున్న దృశ్యం కనబడింది. బైనాక్యులర్స్‌లోంచి జాగ్రత్తగా చూశాడు. ఆ వ్యక్తికి గడ్డంలేదు. క్షౌరం చేసుకున్నాడు కాబోలు. అతనే సందేహంలేదు. తనొచ్చిన పనిమీదే అతనూ వొచ్చాడా? అతనెవరు?

కొండమీదికొచ్చాడు వర్మ.

"అదుగో ఆ రాయిమీద కూర్చున్న మనిషెవర్రా?" అని అడిగాడు గంగణ్ణి.

"అరు సచ్చితానందంగారండి—మేస్త్రీ కాబోలు. ఇక్కడే తిరుగుతూంటాడండి, గొట్టంలోంచి చూస్తూ. అదుగో తమ్మయ్య, ఆయనకి తెలుసుద్దండి." అని వారికేసి వొస్తున్న వ్యక్తిని చూపించాడు. ఆ వొచ్చిన వ్యక్తి, తనకి చీటి తెచ్చిన తమ్మయ్య. అతనొక మేస్త్రీ. నమస్కారం పెట్టాడు.

"మీకేదున్నా పండ్లు తెద్దామని బైలుదేరామండి. ఇక్కడ మంచి సపోటాలున్నాయి. అనాసకూడా వుందంటారండి." అని స్వగతంగా చెబుతున్నాడు.

"మిమ్మల్ని కుటుంబం, సామానుతో గనక వొస్తే యిక్కడ బంగళాలో యీ రాత్రి గడిపి, రేపు మాచ్‌ఖండ్ రమ్మన్నారండి. మీ రొక్కరే గనకనైతే యీ పూటే రమ్మన్నారండి—ఎక్కడో అక్కడ సర్దుకోవొచ్చునని. వెడదామాండి?"

"ఈ పూట యిక్కడే వుంటాను. రేపు అమ్మగారొచ్చిం తర్వాత, అందరం కలిసే వెడదాం." అన్నాడు వర్మ. జీప్‌లో ఎక్కమని సంజ్ఞ చేశాడు. తమ్మయ్య, ఎక్కాడు. లోయలో బంగళాకేసి పోతున్నారు.

"నీతో యిందాక వొచ్చిన మరో వ్యక్తి ఎవరు?" అని అడిగాడు.

"సచ్చితానందమని, మా గొప్ప తెలివైన మనిషండి. డిగ్రీ, చదువు లేదంట, పైపన్లు చూస్తూ మేస్త్రీగానే, జలపుట్ డామ్ కాడ వుంచారండి. మాప్‌లు గీస్తాడు; సర్వే చేస్తాడు; ఏవో కొత్త కొత్తవి కనుక్కొని, బలే చురుకుగా పని సాగిస్తాడండి. అక్కడ యింజనీర్లందరూ, యీనచేతే పన్లు చేయించుకుంటారండి..."

"అదిసరే—డిగ్రీ ఎందుకులేదు?"

"నాకు బాగా తెలవదండి. కాలేజీలో కొంతకాలం చదివాడంట. మరి, ఏంతిరకాసొచ్చిందో, పరీక్షకెడతానికి లేకుండా కాలేజీలోంచి పంపంచి వేశారుటండి..." అన్నాడు తమ్మయ్య. ఈ మాట వినగానే, వర్మకి, యింతవరకూ బాధిస్తున్న సందేహం తీరింది. సచ్చితానందాన్ని కాలేజీలోంచి పంపించిన సంవత్సరమే అతను అక్కడ లెక్చరర్‌గా చేరాడు. వివరాలు జ్ఞాపకంలేవు. సచ్చితానందం, లేబరటరీలోంచి రెండువేలు ఖరీదైన టెలెస్కోపుని తీసేసుకుని, పోయిందన్నాడన్న ఫిర్యాదుచేసి, డబ్బుకట్టమన్నారు అధికారులు. నేరమూ ఒప్పుకోలేదు. డబ్బూ కట్టలేదు. అందుచేత అతన్ని కాలేజీలోంచి పంపించి వేశారు. తరవాత ఏమయ్యాడో ఎవ్వరికీ తెలీదు. అతనికి తల్లి దండ్రులు లేరు. మేనమామ అతని కోసం అడుగుతూ, ఎక్కడేనా కనిపిస్తాడేమో అని వెదుకుతూండేవాడు. ఇంట్లోంచి పరారీ అయి యీ ఆశివిలో అవతరించాడన్నమాట! ఆనాడు దొంగిలించిన టెలిస్కోప్ అదే కాబోలు. ఈ విషయాలన్నీ తెలిస్తే, అతని మేస్త్రీ వుద్యోగం వుంటుందా? కాని దాచకుండా అందరిలోనూ చెప్తాడు, చిత్రం! నేరస్థుడి గర్వం, అహంభావం అట్లాంటివి కాబోలు! తనని గుర్తు పట్టాడా? తల పంకించాడుగాని, నమస్కారం చెయ్యలేదు.

ఎంత అహం?

బంగళా దగ్గర కొచ్చారు, నాలుగైంది. సూర్యుడు దూరాన కొండ కిందికి దిగుతున్నాడు.

"ఇక్కడేం చేస్తున్నాడింతకీ?" అని అడిగాడు వర్మ.

"అతను చేసేది వొకరకం పని కాదండి. అట్లా సైకిల్ మీద తిరిగి ఏవో పరిశోధన చేస్తూంటాడండి.

ఇసక, రాళ్లు, చెట్లు, తవ్వడం, కొలవడం—ఏదో ఒకటి. ప్రస్తుతం వొంతెన పిచ్చిలో పడ్డాడండి." అన్నాడు తమ్మయ్య.

"అంటే?"

"అటువేపు ఐదారుమైళ్లు వెళితే అతను కడుతున్న వొంతెన కనిపిస్తుందండి. అక్కడ వొక చిన్న నది వుందండి—పెద్దకాలవ అనుకోండి. వర్షాలుపడితే బాగా నీరుంటుందండి. లేకపోతే లేదు. కొండల్లోంచి జలపాతాలుగా పడుతుంటూ, తిరుక్కుంటూ ప్రవహిస్తుందండి. ఆ నది వొరిస్సావారికీ సరిహద్దండి. అక్కడ వొంతెన పడేస్తే, అటు జనం యిటు, యిటు జనం అటు సుళువుగా వెళ్ళి, రాకపోకలు బలిసి, ఐకమత్యంగా కూలి జనం ఎగడతారంటాడండి. ఈ వొంతెన విషయం ఎవళ్ళకీ పట్టదండి. తనే స్వయంగా చేస్తానని, చుట్టుపక్కల కొండజనాన్ని పోగుచేసి, పెద్ద చెట్లు కొట్టించి, వొంతెన మొదలుపెట్టాడండి...."

"పదండి, చూద్దాం" అన్నాడు వర్మ, జీప్ ముందుకి నడుపుతూ. ఐదారుమైళ్ల తర్వాత నది కనిపించింది. వొంతెన యింకా ఎగువున గుట్టలవెనక వుంది. అక్కడికి జీప్ వెళ్లదు. నడిచి వెళ్లాల్సిందే. మూడు ఫర్లాంగులు నడిచారు. వర్మకి ఆయాసంగావుంది; అలసేస్తోంది; దిగువున నది కనిపిస్తోంది; కాసేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాడు. రాత్రి భోజనం ఏర్పాటు చెయ్యడానికి తమ్మయ్య వెళతానని సెలవుతీసుకు వెళ్లాడు. గంగన్నీ, వెనక్కి బంగళాదగ్గర దుకాణానికెళ్ళి, టీ తీసుకురమ్మని పంపించాడు.

వర్మ మరో పడుగులు దిగింతర్వాత వొంగిచూస్తే, నీళ్లలో వొక స్త్రీ స్నానం చేస్తున్న దృశ్యం చూశాడు. బైనాకులర్స్‌లోంచి చూశాడు. తాను మధ్యాహ్నం చూసిన స్త్రీయే. దగ్గరగా వుండటం మూలాన, బాగా స్ఫుటంగా కనిపిస్తోంది. వక్షంలోతు నీళ్ళు—కాసేపు యీది, మళ్లా రాతిబండమీద కూర్చుంటోంది. చేతులకి ఎర్రగాజులు తప్ప, శరీరంమీద ఏ వొస్త్రమూ లేదు. కిందికి మెల్లగా దిగాడు. వొడ్డుకి చేరుకున్నాడు. ఆమె వెనక భాగం కనిపించింది. నడుంకి ఎర్ర లంగా బిగించివుంది. ఇంకేమీ లేదు. లండన్ ఆర్టుగేలరీలలో చూసిన పోతవిగ్రహాలు స్మరణకొచ్చాయి. వయస్సు పాలిశిల్పాలవు. పరిపూర్ణంగా వికాసంపొందిన యావ్వనం, నిర్మలమైన చర్మం, ఆ వొంపులు, వొయ్యారం, కుందాతనం అతన్ని ముగ్ధుణ్ణిచేశాయి. అదొక రాతివిగ్రహం అవుతే, ఆ వక్షంపై తల పగలకొట్టుకోవాలనిపిస్తుంది. వెనక్కి తిరిగింది. భయంతో వడేనకే కళ్లు చిట్లించింది. చూసుగున్నా తెలుసుకున్నట్లు కనబడే, పెద్ద కళ్లు. సృష్టి స్పృశించని యావ్వనం కళ్ళల్లో, వళ్లవరసలో మెరిస్తోంది. గోధుమరంగు జుట్టు, ఎండిన తుమ్మచెట్ల ఆకులు పెనవేసుకున్నట్లు, నుదుటని బిగించి, చిక్కుపడి గుబురుగా లేచింది. రెండు చేతులతో రొమ్ము కప్పుగుని బండమీద కూర్చుంది.

వర్మ మాట్లాడాడు, ఆ అమ్మాయికి అర్థంకాలేదు. చెవిటిగాదు; లోతుందా? అడుగున బురదా, యిసికా? చలేస్తోందా? సమాధానం లేదు. నవ్వుతోంది. ఏవో ధ్వనులు చేస్తోంది. చేతులు తిప్పుతోంది. నిండైన వక్షం, బలంతో పైకి నిట్టూర్చినప్పుడల్లా, లేచిపడుతోంది—వంపుతూముకోసం లేచిన సముద్రంలో కెరటానికి మల్లె. రెండుకొండల మధ్య లోయలాంటిది. అక్కడ నుదుటని ఆనించి, కన్నుమూస్తే, శాంతి దొరుకుతుంది.

తెలుగు, ఇంగ్లీషు, హిందీ - అన్నీ యత్నించాడు. అర్థం కాలేదు. తను నీళ్ళల్లోకి వెళ్లి అతన్ని రమ్మని సంజ్ఞచేసింది. అతను ఆమెకేసి తీక్షణంగా చూడలేక పోతున్నాడు. ఏ అవయవం చూడనం? నడుమూ, మెడా, జుట్టూ, అలలుగా చెదిరిన నీళ్ళలోంచి ప్రతిబింబించి కనబడీ కనబడని వక్షమా? నీటిలో సూర్యకాంతి మొహాన్ని వెలిగించి, కళ్లన్ని కలవర పెట్టిన నగ్ననీడనా? పెదవులు దగ్గరగా మూసుకున్నప్పుడు, చెక్కిటిమీద మిగిలిపోయి, కళ్లలో దాక్కుని రహస్యంగా పిలుస్తున్న చిరునవ్వునా?

రమ్మంటోంది. ఆ ధైర్యానికి వర్మ చకితుడయ్యాడు. అతనికి ఈత రాదు. నీళ్ళంటే భయం. అయినా, స్నానం చెయ్యాలనుంది. చొక్కా తీశాడు. బనీనుంది. తువ్వాలు లంగోటీలాకట్టి నీళ్ళలోకి దిగాడు. వేలుతో చూపించి నీ పేరేమిటన్నాడు. మూసా అంది. మోనాసో, మూనారో, మొన్నారో అతనికి తెలవలేదు. 'మ' 'న' రెండక్షరాలు గల ధ్వని ఆ పేరు. లియొనార్డోడావిన్సీ గీసిన మోనాలిసా చిత్రపటం జ్ఞాపకానికొచ్చింది. ఆ పటం, పారిస్ లూవ్రేలో వుంది. అది 1504 లో గీయబడింది. ఆ పటాన్ని 'ఫ్రాన్సిస్కో డి గయోకొండ' భార్య 'లీసా'ను చూసి వ్రాశాడు. వర్మ ఆ చిత్రం నకలుని ఇంగ్లండులో కొన్నాడు. ఈ దృశ్యం అట్లాంటిదే. వెనకాల, రాళ్లు, కొండలు - యుగయుగాలుగా నిలిచిన కొండల ప్రాచీన బలం, స్థిరత్వం ఆమె శరీరానికి అమరత్వాన్ని ఆపాదించినట్లు - ఆమె ప్రకృతిలో ఒక సజీవభాగం. చలనంలేని ఆ సౌందర్యాన్ని మనిషి దూరంగా ఆరాధించగలడు గాని తాకలేడు. స్వచ్ఛమైన కళతో పరిచయం పెరిగినకొద్దీ, యథార్థసంఘటన కళారూపాన్ని పొంది, స్వప్నంలాగ, స్పృశించలేనిదవుతుంది. కలని కెలికితే, కోటి తుంపరలుగా కదిలి కృశించి, కుంగి, వార్ధక్యంలో, మృత్యువులో మిళితమై, మరి కనబడదు. కాని శరీరం వున్నంతసేపూ తాకక తప్పదు. జీవితరంగంలో యీ పెనుగులాట తథ్యం. యథార్థ సౌందర్యాన్ని చూసి కలగంటాడా? కలలో చూసిన సౌందర్యాన్ని యథార్థ జీవితంలో చూసి తనది చేసుకుంటాడా? జీవితంపై ప్రభావంలేని కళకి ప్రయోజనం లేదు. ఆమె చెయ్యిపట్టుకుని రెండడుగులు వేశాడు. ఆమె దూరంగా లోతుకి వెళ్ళింది. సంధ్యలో వెలిగిన నీళ్ళకాంతి, వక్షంమీద పడి, మృదువైన చర్మంవెనుక రక్తాన్ని వెలిగించింది. అతను ముందుకు పడిపోయ్యాడు. చేతులు ఆమె మెడచుట్టూ పడ్డాయి. ముందుకు తోసింది. వెనక్కి పడ్డాడు. బండమీద కూర్చున్నాడు ఆమెకేసి చూస్తూ. వెనక్కి తిరిగింది. వేళ్ళతో నీళ్లు చిమ్ముతోంది. వొంగిన చెట్ల చిటారుకొమ్మల ఆకులు సంధ్య వెలుగులో ఎర్రగా మండుతూ, నీళ్ళల్లోపడ్డ నీడలు పచ్చగా, ఎర్రగా ఆమె శరీరాన్ని వెతికిస్తున్నాయి. అది మరపురాని సౌందర్యానుభవం. సంధ్యని, వెన్నెలని, కొండ శిఖరాన్ని చూసి ఆనందించినట్లు, చూసి పొందిన ఆనందంతో తృప్తిపడకూడదూ? సౌందర్యం మానవుణ్ణి తొందరగా చేస్తుంది కాని తనలో మానవత్వమే,

మళ్ళా మనిషిగా మార్చివేస్తుంది. ఏదో శక్తి, స్వప్నంలో మెదిలిన కోరిక, శరీరంలో ప్రజ్వరిల్లి అతన్ని ప్రాచీన ప్రాణిగా ముందుకు నెట్టి, తపస్సు నుండి కార్యానికి రగిల్చింది. కార్యం తపస్సు నాశన హేతువు. యవ్వనం వలపుకి, ప్రాణి బాపుకి, యీ ప్రాకులాట, ఈ ఉబలాటం, తపదిగా వుండుకోవాలన్న ఈ వాంఛ కారణాలు కాబోలు అనుకుంటూ ఆయాసం తీర్చుకుంటున్నాడు.

వర్మ నిలబడలేక పోతున్నాడు. నీళ్ళల్లో కూర్చుని ఆమె వొళ్ళో వరిగిపోయ్యాడు. చలిలో, అగ్ని కాలినట్లు, కొండ బ్రద్దలై నిప్పు వ్యాపించినట్లు ఆమె శరీరం అతనిచేతుల్లో, బుగ్గలమీద కాలింది. శరీరం కరిగినట్లు, ముద్దగా కాలినట్లు, నరాలు దోవతెలిని రక్తంలో తన్నుకులాడుతున్నాయి. గడ్డంకింద చెయ్యి పెట్టి ఒక్కతోపు తోసి వొడ్డుకి వెళ్ళింది మూసా. పొద వెనక వుంచిన తెల్లగుడ్డ తెచ్చి, మొహం తుడుచుకుని, వతంమీద కప్పుకుంది. తడిసి రొమ్ముమీద వస్త్రం బిగిసింది-కూర్చుని లంగా నీళ్లు పిండుతోంది. అతనూ వొచ్చేశాడు. బనీను ఆరబెట్టుకుంటున్నాడు. ఒక్కసారి ఆకాశం నల్ల మేఘాలతో చీకటైంది. చివరి సూర్యకిరణాలు విరిగిన కత్తులలా మేఘాలవెనక అదృశ్యమైనాయి. దట్టంగా నలుపుని పూరించుకుంటూ, శిఖరాల్ని తన్నుకుంటూ, మేఘాలు విజృంభించి ఆకసమంతా వ్యాపిస్తున్నాయి:

మేఘాలకేసి చూపించింది మూసా. ఇద్దరూ చరచరా నడిచి పోతున్నారు. వెనక మేఘాలు, సుడిగాలి, వూడిన ఆకులు, విరిగిన కొమ్మలు, వాకిడికి జారుతున్న పిల్లరాళ్ళ ప్రవాహం, అడవి కీటకాల కోలాహలం, మూసా శరీరంలోని వింతవాసన సుడిగుండంలా అతన్ని ముంచివేస్తున్నాయి. నడవలేక పోతున్నాడు. అతని చెయ్యి పుచ్చుకుని, పైకి లాక్కుని పోతోంది. మూడు పెద్ద రాళ్లమధ్య ఒక గుహలోకి చేరుకున్నారు. వర్మ ఆయాసం తీర్చుకుంటున్నాడు. కిందికి చూశాడు. నదీప్రవాహం కనబడింది. కాళ్లు తేలిపోతున్నాయి. అతనికి భయం సాక్షాత్కరించినట్లుగా వుంది. పాపం చేసినవాళ్లు ఎత్తునుండి కిందికి చూడలేరని ఏదో మానసిక శాస్త్ర పుస్తకంలో చదివాడు. కిందికి చూడలేని భయం అతన్ని అల్పుణ్ని చేసింది. గాలికి పడిపోకుండా వుంచేటందుకన్నట్లు ఆమె మెడ గట్టిగా పట్టుకున్నాడు. అతని నెత్తిమీద వున్న తేనెపట్టులో వేళ్లు పెట్టింది మూసా. కంతలలో కెలికి రాణి యీగను లాగింది. మిగత తేనెటీగలన్నీ జుయ్యిమంటూ సుడిగాలిలా బైటపడి అతన్ని ఆవరించి, కవ్వించి కుట్టేస్తున్నాయి. వర్మ పరుగులు సాగించాడు. అతన్ని నాగాలా చుట్టాయి తేనెటీగలు. మూసా నవ్వుతూ వెనకాల వొస్తోంది. అతని జేబులోంచి అగ్గిపెట్టె తీసింది. చిదుగులతో మంట చేసింది. పొగని తన నోట్లోకి తీసుకుని వాటిమీద వూదింది. వేళ్ళల్లో పట్టిన రాణి యీగను వాటిముందు ప్రదర్శించింది. దూరంగా తీసుకెళ్ళి కంతలో రాణి యీగను దాచింది. మిగతా యీగలన్నీ వర్మని విడిచి, దానిచుట్టూ కంతలోకి పోయాయి.

మూసా తొందరగా నడవమని సంజ్ఞ చేసింది. ఏదో పాట మొదలెట్టింది. ఆ పాట వికృతంగా భయంకరంగా వినిపించింది. ప్రకృతిలో ప్రాణి చనిపోయినప్పుడు, ప్రకృతంతా ఏడ్చినట్లు ధ్వనించింది. జీప్ కనబడటంలేదు. అతనికి దోవ తెలియటంలేదు. ఏదో తోవని ఎక్కడికో అడవిలోకి వొచ్చేశారు. అన్నీ పెద్దపెద్దరాళ్ళు, జుట్టు విరబోసుకుని, దయ్యాలకి మల్లే వల్లవ్రాసు చెట్లు, గాలిలో దగ్గరగా జరిగి బేతాళ నృత్యం సాగించాయి. ఆకాశంలో పిడుగులు ప్రతిధ్వనిస్తున్నాయి. రాళ్లు బ్రద్దలైనట్టు, శిఖరాలు కూలినట్లు, మెరుపులు వొక్కసారిగా దట్టమైన చీకటిని చీలుస్తున్నాయి. ప్రకృతి గాయపడి, రక్తం కాలవలుగా ప్రవహిస్తున్నట్లు, మెరుపులు, వురుములు, వాళ్ళని తరుముతున్నాయి. ఇంక అతను నడవలేడు. మరో గుహ, మరో మెరుపు, వురుము-అక్కడే వాలిపోయ్యాడు. ఆమె బుజంమీద తెల్లగుడ్డ తీసి అతని తలని కప్పింది.

క్షణంలో వర్షం ప్రారంభమైంది. రాతిబండలమధ్య వాళ్లున్న స్థలం కాస్తంత పొడిగావుంది. చీటలలోంచి, వర్షం ధారలావడుతోంది—దిక్కుతోచకుండా ఆకాశంలో నిర్మాణమైన ముళ్ల కరాతి గారంలోంచి పడినట్లు నలుదిక్కులా దుయ్యబడుతోంది. అతని తువ్వాలు, ఆమెపైబట్ట రెండువైపులా చీటలలో బిగించి కట్టింది. అతని చేతులు, కాళ్లు అరచేతులతో వేడికోసం రాస్తోంది. వర్షంలో వలికొచ్చి వణుకుతోంది. ఆమె మూలకి జరుగుతోంది. అతను ఆమెకేసి జరుగుతున్నాడు. అతని తల ఆమెవొడిలోపడి, చేతులతో ఆమెమెడని పెనవేసుకుని, దగ్గరగా వేడినికోరుతున్నా, యింకాదగ్గరగా వొస్తున్నాడు. ఆమె మోకాళ్ళమీద కూర్చుని గోడని ఆనింది. అతను గోడకి అదిమి, పైకి ఎగబాకుతున్నాడు. వేళ్లు ఆమె పెదవులను వెదుకుతున్నాయి. ఒక చెయ్యి అతని గొంతుపైన వేసి, రెండోచేతితో గోడని ఆనుకొని వొక్కసారి పైకిలేచి నిలబడింది మూసా. అతనితల తటాలున కింద రాతిమీదపడింది. 'అమ్మో' అన్నాడు. చిన్నగాయం తగిలింది. రక్తం చుక్కగా కారి వర్షంనీటిని ఎర్రగా మార్చింది.

వర్షం నిలిచింది. అతని తలకింద గుడ్డలుపెట్టింది. గాయాన్ని కడిగింది. లేచి బైటకువెళ్లింది. పదినిముషాల్లో వర్మ బైటకు వొచ్చాడు, గాయం తడిమిచూసుకున్నాడు. అంతా కారు చీకటి. జేబులో అగ్గిపెట్టె తడిసి వెలగడంలేదు. సిగరెట్టు కాల్చాలని వుంది—అవి తడిసి విడిపోయ్యాయి. దోవతెలియటంలేదు. ఎటోపోతున్నాడు. మూసా ఏవో కేకలువేసుకుంటూ వొచ్చింది. చెయ్యి పట్టుకుని నడిపించుకుంటూ తీసుకెళుతోంది. అక్కడంతా చదునుగావుంది. ఒక బండమీదకూర్చుని, అతనితల తొడమీద ఆనించి, తెచ్చిన ఆకులుపిండి రసం గాయానికిరాసి, ఆకులపైనవుంచి గుడ్డ చించి కట్టుకట్టింది.

జీప్ నిలిచినచోటు దగ్గరలోనేవుంది. గంగడు కేకలేసుకుంటూ వొచ్చాడు. ఇద్దరూ అతన్ని జీపులోకి చేరవేశారు. అతను డ్రైవ్ చేసేస్థితిలోలేడు. గంగడు తడిసి, చలికి వొణికిపోతున్నాడు. మూసా, పావుగంటలో ముగ్గురుమనుషుల్ని తీసుకొచ్చింది. వాళ్లు జీప్ లాగుతూ, తోసుకుంటూ, నడుస్తున్నారు. ఆమె తనగుడిసెకి వెళ్లింది.

జీపు బంగళా చేరేప్పటికి రాత్రి పదకొండైంది. వర్మ అల్లాగే మంచంమీద వాలిపోయ్యాడు. గంగడు [illegible], అతి నడుమూ

ఉపచర్యలు చేస్తున్నాడు. వర్మ కళ్లు తెరిచి, లేచి చూస్తున్నాడు. బాగ్‌లోంచి సిగరెట్ పాకెట్ విప్పాడు. సోమయ్య, తమ్మయ్య బాగన్‌లో విశాఖపట్నం వెళ్ళిపోయ్యారుట. వెళ్ళేముందు, భోజనం, వర్మ సామగ్రి, అన్నీ సిద్ధంచేసి వెళ్ళారు.

వర్మ ఆకలి తీర్చుకున్నాడు.

"ఎవర్రా ఆపిల్ల?" అని అడిగాడు గంగణ్ని. నిద్రమత్తులో తుళిక్కిపడి లేచి కళ్లు నులుముకున్నాడు గంగడు.

"నువ్వెరుగుదువా?" అని మళ్ళా ప్రశ్నించాడు.

"ఎరక్కేమండి—కొండజాతోళ్లు. తండ్రిలేడు. అవ్వుంది గుడిసికాడ. తనేమో యిన్నాళ్ళూ తేనెతీసి అమ్ముతుంటాది."

"ఇన్నాళ్ళూ అంటె?"

"ఇప్పుడింక సచ్చిదానందంగారున్నారంతే." అని మెల్లిగా అన్నాడు.

"ఉండటం అంటె?"

"ఆయన ఆమె ఎప్పుడూ తిరుగుతూంటారండి—నెలకి పది రోజులు మకాం, ఆమె గుడిసిలోనే."

"వాళ్ళ భాషేమిటి?"

"ఒరియా కాబోలునండి. కొండజాతోళ్ళభాష మన కర్థం కాదండి."

"మరి సచ్చిదానందాని కర్థమవుతుందా?"

"ఏమోనండి."

వర్మ ఆలోచనలు కొత్త తోవతీశాయి. వాళ్ళిద్దర్నీ, ఆ నల్లటి చెట్లనీడల్లో, సంధ్య వెలుగులో, పచ్చ గడ్డిలో వెన్నెలకింద ఊహించి బాధపడటంలో వొక ఆనందం పొందాడు. హెన్రీమూర్, రోడిన్, ఎప్‌స్టీన్, రాయ్‌చౌదరి శిల్పాలని స్ఫురింపచేసే మూగా శరీరం, ఆ వింతగర్వం, చిరిగిన లాల్చీ, దిగులతో మూసుకునే నేత్రాలతో సచ్చిదానందం పొందిన అనుభవం, అతనిలో కొంత ప్రవేశించినట్లయింది. వర్మ మనస్సు, వుద్రేకాలు, వుప్పొంగి, నీరసించాయి; కాని శరీరం వాంఛతో విజృంభిస్తోంది. దిండ్లకింద చేతులు, తల, దాచుకున్నాడు.

మరునాడు వర్మ నిద్రనుంచి లేచే టప్పటికి ఏడు దాటింది. ముందువాలో కొచ్చి చూశాడు. దూరాన మంచులో మసకగా మెరిసే పర్వత శిఖరాలు, విషాదకన్యలు ఆరేసిన ఆకుపచ్చ చీరలా, విశాలమైన బయళ్లు, చుట్టూ, వల్చటి ముసుగులా ఆవరించిన మంచు, మంచు తుంపరలని ఇంద్రధనస్సులుగా చీల్చిన సూర్యకిరణాలు, పరవాశ్మ గీసి, ప్రేమతో సహా అమర్చి, ఆకాశంలో తగిల్చిన తైల చిత్రం లావుంది అదృశ్యం.

ఉపహారం, స్నానం, కాఫీ ముగించి వర్మ వొంటిగా జీప్‌లో నదివైపు బైలుదేరాడు. తొమ్మిదైంది నదికి చేరుకునే టప్పటికి. రాత్రి వర్షానికి కాబోలు, నీరు వడిగా ప్రవహిస్తోంది, గట్లని కవ్విస్తూ సుడిగుండంలో నాట్యంచేస్తూ. గట్లమీద పచ్చిక, రాళ్ళు, పూలచీరలా వున్నాయి. జీప్ నిలిపి, రెండు ఫర్లాంగులు నడిచాడు. వొంతెన కనిపించింది. ఇంకా పూర్తికాలేదు. మరో నాలుగైదడుగులు మిగిలిపోయుంది అవతలి వొడ్డుకు. అడ్డంగా రెండు మూడు దూలాలు పెద్దరాళ్లతో కట్టబడి, మధ్య మధ్య పెద్ద కర్రలు నాటి, వాటిమీద అడ్డంగా మరికొన్ని కర్రలు అమర్చబడి వున్నాయి. గట్లమీద, బండలు, కొంచెం యిసక, దూలాలు, కర్రలు, గునపాలు, తాళ్ళు వున్నాయి.

వర్మ ఆగిపోయాడు. రాతి బండలమీద నీడలో, మూగా బుజాలపై తల ఆనించి సచ్చిదానందం పడుకున్నాడు. ఆమె శరీరంలోని తీక్షణశక్తి కొంతవిసి తన దగ్గరకొచ్చినట్లయింది. క్రితం సాయంత్రం, ఆమె చేష్టలు జ్ఞప్తికొచ్చాయి. అతని చర్యలను ప్రబలంగా నిరసించింది. ఎందుకు? అది కవ్వించడమా? వేటకి రగల్చడమా? పశ్చాత్తా? సచ్చిదానందం ప్రేమతో తృప్తిపడిన పాతివ్రత్యప్రకర్షా? కొండజాతి స్త్రీకి నీతివుంటుందా? అదంతా నటన. ఋజువు చేసుకోడానికి నిశ్చయించుకుని బంగళాకు వొచ్చేశాడు వర్మ.

పదకొండింటికి వొక ఉత్తరం వ్రాసి, సచ్చిదానందాని కిమ్మని, గంగణ్ని పంపించాడు.

తనకి సర్వే నిమిత్తం కొన్ని పరికరాలు, పనిముట్లు కావాలి కాబట్టి, అతను వెంటనే తన జీపులో మాచ్‌కండ్ వెళ్ళి వాటిని తీసుకురావాలని ఆజ్ఞాపిస్తూ వ్రాసిన ఉత్తరానికి సచ్చిదానందం జవాబు మధ్యాహ్నం రెండింటికి పంపించాడు. తను మాచ్‌కండ్ అధికారుల వుత్తరవు ప్రకారం, నది ఎగువన కొన్ని కొలతలు, పరిశోధనలూ జరపడానికి వెడుతున్నానని, మళ్ళా రాత్రికి కాని తిరిగి రాలేననీ, అంచేత ఆ పని తాను చెయ్యలేనందుకు క్షమించమనీ అతను పంపిన జాబులో ఉంది.

వర్మకి కోపం దిగమింగిన కొద్దీ తీవ్రమైపోతోంది. అతని విషయం మాచ్‌కండ్ అధికారులతో చెప్పెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. ఆ వొంతెన పూర్తి కావడానికి వీలులేదు. అది గట్టి వొంతెన కాదు. పదిమంది నడిస్తే కూలిపోతుంది. దాని వల్ల ప్రాణనష్టం కలుగుతుంది. దాన్ని పడగొట్టాలి....ఏవేవో భయంకరమైన ఆలోచనలు. కాని నిజంగా అవి ఆలోచనలు కావని అతనికి తెలుసు. ఆలోచనమండి ఇంద్రియాలు పారిపోతూ పడుతున్న తికమకలవి. ఊహ, ఆలోచన లేకుండా, వొక్క శరీరం వికసించి, వ్యాపించి, స్థాయి పడటం ఎంత గొప్ప అనుభవం! అదే సమాధి, అదే నిర్వాణం. తను, తన నాగరికత కృత్రిమం. ఈ దుస్తులు, వేషం, యీ భాష భావాలు, ఆచారాలు, నియమాలు—అన్నీ అసహజం. సహజమైన జీవితంకోసం ఎందరో యోగిపుంగవులు సంఘాన్ని త్యజించారు.

కవులు ప్రకృతిలో ఏకాంతాన్ని కామించారు. వర్డ్స్‌వర్త్, షెల్లీ, థోరో, టాల్‌స్టాయ్, విట్‌మన్, వీరున్న అల్లా ఏకాంతంలో సజీవులయినవారే! దాన్ని వెదుకుతూ లారెన్సు ఎన్నో దేశాలు తిరిగాడు. ఉలంగారి వాంటీకన్యల అన్వేషణ, చిత్రకారులు వాన్‌గో, గాగిన్‌ల అంతా ప్రవాసం—యివన్నీ ఆలోచనమండి పారిపోవడానికి చేసిన ప్రయత్నాల ఫలితాలే!

సచ్చిదానందం వొకప్పుడు దొంగతనం చేశాడు; సంఘం నుంచి పారిపొయ్యాడు.

ఈ అనంత విశ్వంలో దొంగెవరు? దొరెవరు? నిజాన్ని కొలిచే విలువలు లేవు. అబద్ధానికి వయస్సు లేదు. నియమాలు, ఆచారాలు, పాపపుణ్యాలు, రాళ్ళుగా, చెట్లుగా, నదులుగా, చిరస్థాయిగా మారిపోయాయి. వాటికి వయస్సు లేదు; పరిణామంలేదు. అందులో కొకడైపోయాడు సచ్చిదానందం—మోనాతో కలిసి. నగ్నంగా ఏడమ్, ఈవ్ లకిమల్లే. ఫలాలు, ఆకులు తింటూ, తేనె త్రాగుతూ, నదితో ఆడుకుంటూ, చల్లటి నీడలమధ్య, గడ్డిలో ఆమె గుండెపై చెవిని ఆనించి, విశ్వం పరిభ్రమిస్తున్న నాదాన్ని, లయని వింటూ, ఆలోచనని ఆమె మెడలో పారేసి, ఊహని ఆమె నడుంచుట్టూ తన చేతులతో కట్టేసి, ఋతువులతో మారుతున్న తృష్ణని ఆమె కను రెప్పలవెనక ముద్దులతో మూతపడేసి, ఆనందంలో భావని వెతుకుతూ బైటపడిన వాలుకని, ఆమె అధరంవెనక హత్యచేసి, నిశ్శబ్దంగా కాలాన్ని కామంతో బంధించి, వారి వునికే లోకానికి తెలీకుండా అనంతంలో లీనమైన ఆ వ్యక్తుల జీవితం వర్మకు కావాలి. కాని, సాహసం లేదు; ఆ త్యాగం చెయ్యలేదు.

సంఘాన్ని విడిచిపెట్టి యేకాంతంలోకి పారిపోయినవారు, నిజంగా అక్కడ ఆనందంపొంది, తృప్తిపడతారని విశ్వసించడం కష్టం. మరో పదిమంది నగ్నదంపతులు అరకులోయలో నివాసం యేర్పరుచుకుంటే, మళ్లా అదొక చిన్న సమాజంగా తయారవుతుంది. అక్కడ స్పర్థలు, అసూయలు, ద్వేషాలు, పగలు, రాజకీయాలు. అదొక తాత్కాలికానుభవం కాని జీవిత పరమావధి కాకూడదు. వీళ్లందరూ, ధైర్యం, త్యాగం అనుకుంటున్నది నిజానికి, పిరికితనమూ, అసహాయతానూ.

తనకా ధైర్యం లేదన్న చైతన్యం వర్మని కార్యానికి పురి గొల్పింది. రెండైంది. స్నేహలత, మామూల్గా సాయంత్రం ఐదు, ఆరుగంటలకి కాని రాదు. వొచ్చినా, రాత్రి యిక్కడే వుండి, మర్నాడు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. భార్యని తనతో తీసుకురానందుకు తన్నుతాను అభినందించుకున్నాడు. స్నేహలత మూర్తి ఊహలో మెదుల్తోంది. ఆమె సన్నంగా, నాజూకుగా, లతలా వుండి, తనని అల్లుకుంది. స్త్రీ అంటే, "నొక్క ఎముక, పిడికెడి జుట్టు, గుడ్డపీలిక"—అని బర్న్స్‌కవి వర్ణన జ్ఞాపకానికొచ్చి నవ్వుకున్నాడు. అతని అరిచేతికింద గట్టిగా తగిలిన ఆమె బుజాల ఎముకలు స్మరణ కొచ్చాయి.

గ్రహణంనాడు ఆమెతో సముద్రస్నానానికి వెళ్లిన ఘట్టం అతను మరిచిపోడు. నీళ్ళలోకి దిగగానే ఆ పల్చటి ఆకుపచ్చ చీర ఆమె తడిసిన శరీరాన్ని బిగించివేసి, అల్పమైన అవయవాల్ని ప్రదర్శించింది. నీటికి లంగ చుట్టుకుని, జుట్టంతా పిడికిటిలో అమరేటట్లుగా వుంది. నీటి బిందువులు బుజాల ఎముకవల్ల ఏర్పడిన వొంపులో నిలిచిపోయాయి. జూలు కత్తిరించిన గుఱ్ఱంలా, రెక్కలూడిన పక్షిలా, ఎండిన కొలనులా—ఎల్లాగో ఐపోయింది. నడుం లోతు నీళ్లే—పెద్ద కెరటం అతన్ని లోపలికి గెంటింది. చెయ్యి పైకెత్తి పట్టుకోమని సంజ్ఞలు చేస్తున్నాడు. ఆమె గమనించలేదు. తను యిసకలోకి వెళ్లింది, కూసం విడిచిన పాములా. మరో కెరటం ముందుకు తోసింది. తనూ బైటపడ్డాడు. హోటళ్లో అర్ధరాత్రి, 'ఫిఫ్త్ ఎవెన్యూ' పరిమళంలో, వాడు చేసుకున్న ప్రేమ ప్రమాణాల విలువ ఎంతటిదో అతనికి తెలిసొచ్చింది. అతనికి నీళ్ళంటే ఎంత భయమో, ఆమెతో నిజం చెప్పడంకూడా అంత భయం. ఆ రాత్రికూడా సిగరెట్ పొగ వొదుల్తూ, మళ్ళా ప్రమాణాలు. తెచ్చిపెట్టుకున్న ఉద్రేకంలోని పల్చటి కన్నీరు—అంతా అందమైన భ్రమ! మూడైంది. అప్రయత్నంగా జీపువద్దకు నడిచి వెళ్ళాడు. లోపలికి ఎక్కాడు. అతని వూహలో వెన్నెల నక్షత్రాలు కదుల్తున్నాయి—నక్షత్రాలకేసి టెలిస్కోపులోంచి చూస్తున్న సచ్చిదానందం. సాటర్న్ గ్రహం చుట్టూవున్న 'రింగ్స్' ఆ టెలిస్కోపులో కనిపిస్తాయి. దిగ్భ్రమగొల్పే ఆ వింత దృశ్యాన్ని 'మోనా'ని చూడమంటాడు. జ్యుపిటర్ గ్రహంచుట్టూ తిరిగే చిన్నగ్రహాల నీడలు, అందులోంచి కనిపిస్తాయి. విశ్వం నీలి పమిటలో దాచుకున్న వింతలన్నిటినీ చూస్తాడతను. చూసిసాధించేదేమిటి? వొంతెన కట్టడానికి, ఖగోళ శాస్త్రానికీ ఏ సంబంధమూ లేదు. కాని ఎందుకు అట్లా చూడటం? చెట్టుకొమ్మమీద కూర్చుని, సంధ్యవేళ పశ్చిమ ఆకాశంకేసి చూస్తూ కూర్చున్న సచ్చిదానందం అతని బుజంమీద తల ఆనించి నగ్నంగా కూర్చుని వీనస్ కేసి చూస్తున్న 'మోనా'—అరకులోయలో వొకదానిచుట్టూ వొకటి తిరుగుతూవుంటే, గోళాలు—'టెలిస్కోపిక్ బైనరీస్'—టెలిస్కోప్ లోంచి తప్ప కనుపించవు. అతని ఊహ టెలిస్కోప్‌లా ఆ దృశ్యాల రహస్యాన్ని బైటపెడుతోంది. పాత పత్రికలో ఆ నెలలో ఆకాశంతీరువును వర్ణించే పటాలు, వ్యాసం చూశాడు. అతనికేమీ బోధపడలేదు. వీనస్ పశ్చిమ ఆకాశంలో, సూర్యాస్తమయం అవగానే, ఎక్కువ కాంతివంతంగా మెరిసి, అరగంటలో మాయమవుతుందట.

జీప్ నడుస్తోంది. అతనెక్కడికి వెడుతున్నాడు? జీప్‌లో ఆకాశంలోకి ఎగిరి, కొన్నికోట్ల సంవత్సరాలు అనంతంలో తిరిగితే చివరికి యిదేస్థానానికి చేరుకుంటాడు. విశ్వం అనంతంకాదుట. దానికి పరిమితి వుందట. స్థలం—తనవైపుకే వొంకర తిరిగివుందట—తను ఎక్కడికీ వెళ్ళలేడు. తిరిగి యిక్కడికే రావాలి!

ఎక్కడికొచ్చాడు తను?

వొంతెన సమీపంలో కొచ్చాడు. జీప్ నిల్చిపోయింది. దిగువున లోయలో నది వడిగా ప్రవహిస్తోంది. నీటివడికి వొంతెన తెగలేదు. ఆ వొంతెన ప్రయోజనం ఏమిటి? ఎవరి అవసరాలకు వారు, తలో వొంతెన స్వయంగా వేసుకుంటే, ప్రభుత్వం ఎందుకు? పథకా లెందుకు? 'మోనా' ఒరియాపిల్ల—ఆ వొంతెన వేస్తే, ఒరిస్సాప్రాంతం పనివాళ్ళంతా యిటొచ్చి, పనులు సంపాదించుకుంటారు. మోనా బంధుకోటికి పనికల్పించడం తప్ప వేరే ప్రయోజనం ఏముంది? దానివల్ల నష్టంకూడా వుంది. ఇటువారు అటు, అటువారు యిటూ వెళ్ళి వలస ఏర్పరుచుకుంటారు. దానితో తగాదాలు బైలుదేరుతాయి. అంతేకాదు. వొక్కసారిగా దానిమీద వో యాభైమంది నడిచారో, అది కూలి అంతా నీటిపాలవుతారు; ప్రాణనష్టం కలుగుతుంది.

వొంతెన చేతులలో, కొంతమందికి వొచ్చేరాదు వర్మ

కొంత దూరంలో మరో ఎత్తుకొండ వుంది. దాని శిఖరానికి తిన్నగా దిగువున వొంతెన వుంది. అతని కొక భావం స్ఫురించింది. గబగబ ఆ కొండమీదికి వెళ్ళాడు. నాలుగైందీ—నలువైపులా చూశాడు. ఎవ్వరూ జనం లేరు. కొండమీద పెద్ద పెద్ద బండలు వొరిగి, కదిపితే జారే కోణాలమీద నిలబడి వున్నాయి. ఏడేనిమిది పెద్దవి, చిన్నవి కనిపించాయి. ఒకదాన్ని కదిపి చూశాడు. చాలా పెద్దది. అది కదల్లేదు. దాని ముందుగా కొంచం ఎత్తున నాలుగైదు చిన్న బండ లున్నాయి.

ఇంగ్లీషు సినిమాలలో దృశ్యాలు జ్ఞప్తికొచ్చాయి. నాజూకు, నాగరికత,—సహజమైన శక్తుల్ని, 'కసిని' వుద్రేకాన్ని మరుగు పరుస్తున్నాయి. కాని ఆ ప్రచండశక్తులు ఎప్పుడో వొకప్పుడు బైట పడక మానవు. అస లందుకే యుద్ధాలు. ప్రజలలో దాగిన 'తృష్ణ' 'కసి' 'పగ' 'పోటీపడటం'—మొదలైన ఆదిమానవుల వుద్రేకాలు బైటపడేటందుకే, కుస్తీపట్లు, 'బాక్సింగ్' మొదలైన వినోదాలు పాశ్చాత్యదేశాలలో ప్రబలాయి. టార్జాన్ చిత్రాలంటే అందుకే ప్రేక్షకుల కంత మోజు. 'హెమింగ్ వే' యీ రకం తన్నుకునే, గుద్దుకునే కథలు వ్రాశాడు—ఆ రచనలు వుత్తమ సాహిత్యం అంటున్నారు. లారెన్సు నవలలో నాయికానాయకులు తిట్టుకుంటారు, తన్నుకుంటారు, హింసించుకుంటారు. రక్తంతో వినోదిస్తారు. లారెన్సును, సారస్వత గురువుగా పూజిస్తున్నారు. మన దేశంలో వీటికి స్థానంలేదు....ఇక్కడంతా శాంతి, మృదుత్వం, దయ, క్షమ, ఔదార్యం, భక్తి, పాతివ్రత్యం, త్యాగం, మొదలైన విలువలు, యీ ప్రాచీన శక్తుల శేతాశిన్యత్వానికి తయారు చేసిన వేదిక; కూలిపోకుండా వుంటుందా?

చిన్న బండలని, బలంఅంతా వుపయోగించి, వర్మ వరసగా తోసేశాడు. అవి వెళ్ళి ఆ పెద్ద బండలు మూడింటనీ కదిపాయి. అన్నీ కలిసి కిందికి నదిలోకి శబ్దం చేస్తూ పడ్డాయి. రెండు మాత్రం వొంతెన మొగిలోపడి నాలుగైదు గజాలమేర వొంతెన కర్రలని కూల్చివేశాయి. ప్రకృతి హృదయం పగిలినట్లు, పెద్ద శబ్దం. మరుక్షణం ప్రకృతి ఆశ్చర్యంతో వూపిరి బిగపెట్టినట్లు నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుని వొక స్త్రీ కంఠం వినబడింది. మూనా పాడుతున్న వికృతమైన, విషాద కంఠం అది. ముచ్చెమట్లు పోసేశాయి. అగ్గిపుల్లని నోట్లో పెట్టుకుని, సిగరెట్టుని అగ్గి పుల్లగా రాస్తున్నాడు. ఆ కంఠం వల్లకాటిలో వేసిన కేక ప్రతిధ్వనిలా ధ్వనించింది. తనని రమ్మంటోంది. వెళుతున్నాడు. దిగుతున్నాడు. కిందికి—యింకా కిందికి.

ఆ కంఠంవైపు దిగుతున్నాడు. పాట దగ్గర కొచ్చింది. ఎదురుగా మూనా. గడ్డిపూలు రెండు చేతులకూ గాజులుగా అమర్చింది- ఎర్రపూలు చిక్కు జుట్టులో బిగించింది. ఎర్రటి పరికిణీనిండా, చిరుగులు, అతుకులు. నవ్వింది.

వర్మ సిగరెట్ పైకి తీశాడు. నీళ్లల్లో కాళ్లు పెట్టి వొడ్డున కూర్చుంది. ఏదో అంటోంది. నీళ్లల్లోకి రమ్మనా? నీళ్లు బురదగా, వడిగా వున్నాయి. అతను దిగదల్చుకోలేదు. సిగరెట్టు ముట్టించాడు. అతను వొదిలిన పొగను, తను వూదుతూ పీలుస్తోంది. పర్సులోంచి పది రూపాయలనోటు తీశాడు. ఆమె కళ్లు సంతోషంతో మెరిశాయి. దగ్గరగా చూడ్డానికి వొంగింది. బుజంమీది గుడ్డ జారి నప్పను సంధ్య వెలుగులో రొమ్ముల నీడలు గుండ్రంగా రాతి బండ మీద పడుతున్నాయి. రెండు చేతులూ ఆమె బుజాన వుంచాడు. కిందికి జారుతున్న అతని వేళ్ళని తొలగించి, తన చేతులతో బిగించి అతన్ని లేవతీసింది. నోటు తీసుకుని పరికిణీలో మడిచింది.

వర్మకి ధైర్యం పెరిగింది—లేచాడు. ఆమె నడుస్తోంది—తనూ నడుస్తున్నాడు. పరుగెడుతోంది; తనూ పరుగెడుతున్నాడు- సంధ్య పడమటి ఆకాశంలో కరిగి, ఊదాగా మారుతోంది. నీడలు పడటంలేదు; సన్నటి చందమామ నీటిలో ప్రతిబింబించటంలేదు. చందమామ ప్రక్క వొక నక్షత్రం, పడమటి ఆకాశంలో మరో నక్షత్రం కనబడుతున్నాయి.

వొంతెన దగ్గర కొచ్చేశారు. ఆమె వొంతెన మీదకు నడిచింది. అతన్ని రమ్మంది. వొచ్చాడు. కింద నీటి వడికి తన తల తిరుగుతోంది. అతన్ని పట్టుకుంది. మెడచుట్టూ చేతులువేసి దగ్గరకు లాక్కుని, బుగ్గలు, గడ్డం, గిల్లుతూ, లోతుగా కళ్ళల్లోకి చూసి విరగబడి నవ్వింది. ఏదో అంటోంది. వర్మ శరీరం పట్లు తప్పి, వుద్రేకంతో వూగిపోతోంది. ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు. అతని పెదవులు ఆమె మొహాన్ని తడుముతున్నాయి. గుండెమీద గుప్పెడి బిగించి, వొక్క వూపుతో ముందుకు తోసేసింది. వర్మ నీళ్ళలోపడి కొట్టుకుపోతున్నాడు.

కేకలు వేస్తూ, మునుగుతూ, తేల్తూ, చెయ్యి పైకి విసరివేస్తూ కొట్టుకు పోతున్నాడు. కేకలు తగ్గాయి. నీళ్లు మింగుతూ శబ్దాలు చేస్తున్నాడు. పదడుగులు, పదిహేనడుగులు, ఇరవై—వెళ్ళి పోతున్నాడు. వొడ్డునున్న ఏదో రాతిబండ కాసేపు కాలికి తగిలి నిలబడినా, పట్టు దొరక్క మళ్ళా కొట్టుకు పోతున్నాడు. ముప్పై నలభైఅడుగులు,—వెళ్లిపోతున్నాడు. చేతులు నీళ్లపైకి రావటం తగ్గుతోంది. శబ్దం సన్నగిలుతోంది. నది మలుపులో, వొడ్డున సచ్చిదానందం, చూశాడు. సైకిలు చెట్టున ఆనించి, లాల్చీ తీసేసి, డ్రాయర్‌తో, చేతిలో టెలిస్కోప్‌తో సహా, నీళ్లల్లోకి దూకేశాడు. టెలిస్కోప్ వర్మ చేతికి తగిలి, దాన్ని గట్టిగా రెండు చేతులతో పట్టుకున్నాడు. సచ్చిదానందం టెలిస్కోప్ పట్టువొదలకుండా, వొక చేతితో వర్మ మొహాన్ని పైకి నెట్టుతూ, వొడ్డుకి చేరవేశాడు.

సంధ్యకరిగి చీకటి అలుముకుంటోంది. వొడ్డున పడిన వర్మకి ప్రథమ చికిత్స చేశాడు. నీళ్లు తాగేసిన వర్మ నిస్త్రాణగా కళ్లు మూసుకుని పడుకున్నాడు. ఒడ్డున పొదల వెనక కీటకాలు చెలరేగాయి, అడివి కూసినట్లుగా. మందమైన ఆకులు రాలుతున్నాయి.

సచ్చిదానందం వొళ్లు క్షణంలో ఆరిపోయింది. పక్క చూశాడు. మూనా దూరంగా నిలబడివుంది. ఆమె కేసి నడిచాడు. అతని విడిచిన దుస్తులు ఆమె దగ్గరున్నాయి. ఒడ్డున కూర్చున్నాడు. మూనా తల తుడుస్తోంది. కణతలు నొక్కుతోంది. లంగా సద్దుకోడంలో, నోటు బైటపడింది. అతని కిచ్చింది. ఏదో మాట్లాడింది. అతను బట్టలు వేసుకున్నాడు. ఆమె సైకిల్ తీసుకొని నడుస్తోంది. అతను మెల్లగా నడుస్తూ టెలిస్కోప్‌లోంచి చూస్తున్నాడు.

పశ్చిమ ఆకాశంలో ఎరుపు చిక్కనై నలుపైంది. 'వీనస్—' పెద్దగా మెరుస్తోంది. భూమి అంచు, నిశీధిముసుగులా కమ్ముకుంది. శర్మదగ్గరకి చేరుకున్నారు. అతని పంట్లాం జేబులో పర్సుతీసి, అందులో నోటుపెట్టి, ఆ జేబులోనే వుంచాడు. మళ్లా నవుస్తున్నాడు. రోడ్డుమీదికి వొచ్చేశాడు. దూరంగా అతనికేసి వొక వేగన్ వొస్తోంది. సంజ్ఞలతో దాన్ని నిలిపాడు అందులోనుంచి సోమయ్యదిగాడు. అతని వెనకాల శర్మభార్య స్నేహలత దిగింది. చలికికాబోలు ఆమె కొంగుని జుట్టుమీద, చెవులమీద కప్పుకుంది. ఆమెని అక్కడే వుండమని, సోమయ్యని, డ్రైవర్‌ని తీసుకుని శర్మదగ్గర కొచ్చాడు. ముగ్గురూ సాయంపట్టి, అతన్ని వేగన్‌లోకి చేరవేశారు. ధ్వనికిప్రశాంతత మైలపడుతుందేమోనన్నట్లు, ఎవ్వరూ మాట్లాడటంలేదు. దూరంగా నది మూలుగు, కీటకాల రొద, శిఖరాలపై వికృతంగా బండలు, వాటిమధ్య 'వీనస్' వెలుగు— జబ్బుచేసిన పరమాత్మ అరుపులోయలో అడుగు పెట్టినట్లు, శూన్యం సజీవమైన క్షణాలు గడిచినాయి.

వేగన్‌లో చిన్నదీపం వెలుగులో శర్మ కళ్ళు తెరిచాడు. చుట్టూ చూశాడు. భార్యమొహం చూసి నీరసంగా నవ్వాడు.

"అసలేం జరిగింది?" అని అడిగింది స్నేహలత, ఏ ఒకర్నీ సంబోధించకుండా. విశ్వంచేసిన కడసారి గానానికి శ్రుతిలా ఆ కంఠం అసహజంగా వినబడింది.

శర్మ మాట్లాడబోయాడు. వద్దని సంజ్ఞచేసి, సచ్చిదానందం ఆ ప్రశ్నకి సమాధానం చెప్పాడు.

"ఏంలేదండీ— నేను సర్వే పూర్తిచేసుకుని, రోజూ లాగే, నదిమధ్యగా వొంగిన ఆచెట్టుకొమ్మమీదకూర్చుని, 'వీనస్' గ్రహం కనిపిస్తుందేమోనని టెలిస్కోప్‌లో చూస్తున్నాను. పట్టుజారి నీళ్ళల్లో పడిపోయాను. ఒడ్డున వస్తున్న శర్మగారు నన్నుచూసి నీళ్లల్లోకి దూకి, ఇద్దరం వొడ్డుకి చేరటంలో నీళ్లు తాగేశారు."

శర్మ కళ్లుతెరిచి జాలిగా అతనికేసి చూశాడు. చెయ్యి పైకి తీసి అతని భుజంమీద వుంచాడు. ఏదో మాట్లాడబోయాడు. సోమయ్యకి దగ్గరగా రమ్మని సంజ్ఞచేసి, అతని చెవులో ఏదో చెప్పాడు. "మీరు విశ్రాంతిగా పడుకోండి. వంతెన గురించి ఆదుర్దా పడకండి. ఆ పని మీ రెందుకు. మేమందరం పూర్తి చేస్తాంగా" అన్నాడు సోమయ్య.

వేగన్ బంగళాకేసి నడుస్తోంది. స్నేహలత వీనస్‌కేసి చూసింది. తన భర్తకి యీదటం రాదనీ, నీళ్ళంటే భయమనీ ఆమెకుతప్ప ఎవ్వరికీ తెలియదు. ఈ రహస్యం ఎవ్వరితో చెప్పనులే అన్నట్లు 'వీనస్' శిఖరంవెనుక లోయలో, భూమి అంచువెనక దిగి అంతర్ధానమైంది. కూలిన శిఖరంగా అరుపులోయ చీకటి సౌందర్యం ముసుగులా పైకిలాక్కుని పడుంది.



# నన్నయ అవతారిక

శ్రీ దివాకర్ల వేంకటావధాని

పూర్వలాక్షణికులు లాశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపితన్ముఖమ్మని కావ్యారంభమున నాశీర్వాదముకాని నమస్కారముకాని వస్తునిర్దేశముకాని యుండవలెనని శాసించి యుండిరి. సంస్కృతకావ్యములలోఁ బెక్కింట నీ మూఁడింటిలో నేదో యొక ప్రక్రియ కానవచ్చుచునే యుండును. కొందఱు కవులు పై యాశీరాదులలో నొకదానిని సూచించుటతో మాత్ర మూరకుండక కావ్యరచనాప్రేరకములైన సందర్భములను, విరచనమునఁ దమకుగల యర్హతానర్హతలనుగూడఁ గావ్యారంభములం దించుక సూచించుచుందురు. కాళిదాసుని రఘువంశ మహాకావ్యమునఁగల యారంభశ్లోకము లిందుకుదాహరణము. సంస్కృతకావ్యకర్తలకుఁ బూర్వులైన వ్యాసవాల్మీకులు రచించిన భారతరామాయణములలోఁ గూడ నారంభములం దిట్టి యవతారిక లున్నవి. ఈ సంస్కృతమహాకవుల నొజ్జబంతులుగాఁ గైకొని నన్నయ భారతేతిహాసము నాంధ్రీకరింపఁబూని తదారంభమున నొక యవతారిక రచించినాఁడు. నన్నయనుగుఱించికాని యాతఁడు భారతమును రచింపఁబూనిన పరిస్థితులనుగుఱించికాని యెక్కించిత్తయిన నెఱుంగుటకీ యవతారికయే ప్రధానమైన యాధారము.

నన్నయకుఁ బూర్వ మాంధ్రమునఁ గవిత్వమున్నను అతని కాదర్శము కాదగిన కావ్యమేదియు లేకుండెను. అందుచే నాతనికి సంస్కృతకావ్యనాటకాదులును బ్రతివేశదేశమునం దంతకుముందే రచింపఁబడిన కన్నడకావ్యములును గొంతవఱకు మేలుబంతులయ్యెను. సంస్కృతనాటకముల యారంభములందు నాందీప్రస్తావనలను ప్రక్రియలు కానవచ్చును. అందు నాంది పూర్వరంగమునందలి భాగము. ఇది యాశీర్వాదముతోడనో నమస్కారముతోడనో కూడియుండి శబ్దముచేతనో యర్థముచేతనో కావ్యవస్తువును సూచించుచుఁ జంద్రనామాంకితమై యుండవలెనను నియమమున్నది. అందలి పదముల సంఖ్యనుగూర్చికూడ లాక్షణికులు కొంత నియమము నేర్పరచిరి. కాని సంస్కృతనాటకములందే యది పెక్కుచోట్లఁ బాటింపఁబడి యుండలేదు. నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి నటీనట విదూషక పారిపార్శ్వకులలో నొక్కరితోఁ జిత్రమైన సంభాషణ కావించును. దీనికిఁ బ్రస్తావన యని పేరు. ఇందుఁ గవి గోత్రనామాది కథనము, ప్రరోచనమనఁబడు సమ్ముఖీకరణము, ఋతువర్ణనము, కావ్యార్థసూచనము, పాత్రప్రవేశసూచనము అనఁబడు నైదంగములుండును. ఈ ప్రస్తావన ప్రవర్తింపఁజేసి సూత్రధారుఁడు నిష్క్రమించిన పిమ్మట నాటక మారంభింపఁబడును.

భారతారంభమున నన్నయ రచించిన యవతారిక యొకవిధముగా సంస్కృతనాటకముల మొదలనుండు నాందీప్రస్తావనలను బోలియున్నది. ఇందలి యారంభ మంగళశ్లోకము సరిగా నాందీశ్లోకమును దలపించుచున్నది. పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులు మీకు శ్రేయోదాయకు లగుదురుగాక యను నాశీర్వాద మిందున్నది. దీనిని గావించినవాఁడు భారతాంధ్రీకరణ నాటక సూత్రధారుఁ డనఁదగు రాజరాజనరేంద్రుఁడు. ఇందుఁ గావ్యార్థసూచనాదులైన యితర నాందీలక్షణములేవియు లేవు గాని ఋషితుల్యుఁడైన నన్నయనోట నాంధ్రవాఙ్మయప్రపంచమునకుఁ ద్రిమూర్తులనఁదగు ముప్పురు కవిపుంగవులీ భారతాంధ్రీకరణమును బూర్తిచేయుదురను సూచన యప్రయత్నముగా వెలువడి యుండెనని చెప్పుదురు. నన్నయశబ్దము నారాయణశబ్దభవమనుటకు వీలుండుటయుఁ, దిక్కన యెఱ్ఱాప్రెగడలకుఁ గవిబ్రహ్మయనియు, శంభుదాసుఁడనియు బిరుదము లుండుటయు నీ యూహకవకాశ మొసంగుచున్నవి. ప్రకృతిస్వరూపిణులగు శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగములందు ధరించి పురుషోత్తమాంబుజభవశ్రీకంధరులు స్త్రీపుంసయోగోద్భవమైన లోకములస్థితి నావహించునట్లు త్రిమూర్తిస్వరూపులగు నారాయణ (నన్నయ) కవిబ్రహ్మ శంభుదాసు లాంధ్రభారతమను ప్రపంచముయొక్క స్థితిని నిర్వహింతురను భావము నారంభ మంగళశ్లోకమునుండి తీయవచ్చును. నన్నయ యిందు సాధారణముగా లోకమున వాడుకలోనున్న బ్రహ్మవిష్ణుమహేశ్వరులనుక్రమమును జెప్పక పురుషోత్తమాంబుజభవశ్రీకంధరులనుక్రమమును సూచించెను. దీనికి నన్నయ నారాయణశబ్దములకుఁగల సన్నిహితసంబంధమే కారణమై యుండవచ్చును. తొలుత భారతాంధ్రీకరణమును సృష్టి కారంభించినవాఁడు నన్నయయగుటచే నాతనియందు మహిమన్ వాగనుశాసనుఁడను పద్యమునఁ బట్టుమూర్తివలె బ్రహ్మత్వమునుగూడ నారోపింపవచ్చును గాని అప్పుడు తిక్కనయందు విష్ణుత్వకల్పనమునకుఁ గొంత దూరాన్వయమైన పద్ధతి నవలంబింపవలసివచ్చును. అందుచేతనే నన్నయనోట లోకవ్యవహారమున కించుక విరుద్ధమేయైనను పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులనుక్రమమే వెల్వడి యుండును.

కాలమునుబట్టి నన్నయ మొదటివాఁడు; తిక్కన ద్వితీయుఁడు; ఎఱ్ఱన తృతీయుఁడు. పై సమాసమునందలి వరుసకూడ దీని కనుగుణముగనే యున్నది. కవిత్రయమువారు నివసించిన కాలమును బట్టియు, వారు భారతము నాంధ్రీకరించిన కాలమును బట్టియు నీక్రమ ముచితముగానే యున్నది కాని భారతగ్రంథభాగముల యానుపూర్వినిబట్టి చూచినచో నది యించుక విరుద్ధముగాఁ గానిపించును. ఏలయిన నాది సభా పర్వములును నారణ్యపూర్వభాగము నైనపిమ్మట ద్వితీయుఁడైన తిక్కన రచించిన భాగముకాక తృతీయుఁడైన యెఱ్ఱన రచించిన యారణ్యపర్వశేష మున్నది. ఈ గ్రంథభాగక్రమమునుబట్టి చూచినచో ముందు నన్నయను దరువాత నెఱ్ఱనను బిమ్మటఁ దిక్కనను జెప్పవలసియుం

ము. ఈ లోపమును బరిహరించుటకే మంగళశ్లోకమునకు వెంటనే వ్రాయఁబడిన వచనమున నన్నయ పై శ్లోకమునందలి క్రమమును విడిచి "అని సకలభువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరి హర హిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియించి" యను చోట హరిహర హిరణ్యగర్భులను క్రమమును జెప్పినాఁడనియు లేనిచో నాతఁడు వెనువెంటనే యా త్రిమూర్తుల క్రమమును మార్చి చెప్పవలసిన యక్కఱ లేదనియు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవా రొక యుపన్యాసమున వక్కాణించి యున్నారు. కాలరచనాక్రమములనుబట్టి చూచినచో మొదటిదియు గ్రంథభాగక్రమమునుబట్టి చూచినచో రెండవదియు సముంజసములుగా నుండును. అందుచే రెండువిధములుగాఁ జెప్పి నన్నయ క్రమవైరుధ్యమును బరిహరించుటకు యత్నించినాఁడు.

పై శ్లోకమున నన్నయ యత్నముగనైన భారతాంధ్రీకరణమును ముగ్గురుకవులు పూర్తి చేయుదురని సూచించుట యథార్థమా లేక యది విమర్శకుల బుద్ధిచాతుర్యమా యను సందేహము ముదయించవచ్చును. కాని పై శ్లోకమునందలి త్రిమూర్తుల క్రమమును దరువాతి వచనమునందలి క్రమమును బైయూహకుఁ దావీయక పోవుటలేదు. అదియుఁగాక మహాకవియు నవిరళజపహోమతత్పరుఁడును ఋషికల్పుఁడు నగు నన్నయనోట నట్టి సూచన వచ్చుటయు నసహజము కాఁబోదు.

కావ్యాదియైన శ్లోకముతో పద్యముతో శ్రీకారముతో నారంభించుట మంగళసూచకము. ఈ యాదిమపద్యమున శబ్దార్థములం దెచ్చుటను సమంగళస్ఫూర్తి కలుగకుండఁ జూచుట మంచిది. అట్టియెడ నన్నయ శివునకు మాంగళ్యసూచకములైన నామము లనేకము లుండఁగా విషము కంఠమునఁగలవాఁ డను శ్రీకంఠశబ్దము నేల వాడవలయునని శంక కలుగవచ్చును. విషము భయంకరమును విధ్వంసకరమునైన వస్తువైయైనను శివుఁడు శ్రీకంఠుఁడైన పరిస్థితిమాత్రము జగద్ధితప్రయోజనమైనట్టిదే. అమృతమథనసమయమున హాలాహలముదయించి సర్వజగదుపద్రవము కలిగింపఁబోఁగా రుద్రుఁడు దానిని మ్రింగి కంఠమున నిల్పి దివిజ మనుజ లోకముల కెట్టి యిక్కట్టును గలుగకుండఁ గాపాడెను. దీనినిబట్టి శివుని శ్రీకంఠత్వ మతని లోకరక్షణపరాయణతకు ఫలితమైనదే కాని యమంగళస్ఫోరకమైనది కాదు. అందుచేతనే నన్నయ నిశ్శంకముగా మొదటిశ్లోకమున నా శబ్దమును వాడియుండును.

తనకులబ్రాహ్మణు నిత్యాది పద్యము నన్నయ కులగోత్రసూత్రాదికమును, విద్యావిజ్ఞానవిశేషములను, ఆచారస్వభావములను సూచించుచున్నది. నన్నయవిషయము గొంచెముగనో గొప్పదిగనో మనకుఁ దెల్పు సాధార మీ పద్యమొక్కటే. ఇందుఁ గానవచ్చు విశేషణములను పటికరములుగా నొండొంటితోఁ గూర్చి మనము నన్నయ జీవితచరిత్ర యను సౌధమును నిర్మించుకొనవలయును. అతఁడు రాజరాజు కుల బ్రాహ్మణుఁడు. అతని కనురక్తుఁడు నిరంతర జపహోమపరాయణుఁడు. విపులశబ్దశాసనుఁడు. వేదసంహితల నభ్యసించినవాఁడు. బ్రహ్మాండపురాణము మున్నుగాఁ గల వివిధ పురాణములఁ బఠించి యందలి విజ్ఞానమును జాం గొన్నవాఁడు. పౌత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, ముద్గలగోత్రుఁడు. సజ్జనస్తోత్ర పాత్రమును స్వచ్ఛమునైన చరిత్రసంపద కలవాఁడు. లోకజ్ఞుఁడు. సంస్కృతాంధ్రభాషలు రెండింటఁ గావ్యరచన చేయఁగలవాఁడు. సత్ప్రతిభాభియోగ్యుఁడు. నిత్య సత్య వచనుఁడు. సుజనుఁడు, బుద్ధిబృహస్పతి. ఇందుఁ గుల బ్రాహ్మణుఁడు, అనురక్తుఁడు అనునవి రాజరాజునకును నన్నయకును గల సంబంధమును దెలుపు విశేషణములు. ఆపస్తంబసూత్రుఁడు, ముద్గలగోత్రుఁడు అనునవి నన్నయ సూత్రమును గోత్రమును సూచించునట్టివి. సద్వినుతావదాతచరితుఁడు, పౌత్రుఁడు, నిత్యసత్యవచనుఁడు, సుజనుఁడు అను విశేషణము లాతని స్వభావమును బ్రవృత్తిని సూచించుచున్నవి. సంహితాభ్యాసుఁ డనునది యతని వైదికవిద్యానిష్ఠాతృత్వమునకు, అవిరళ జపహోమతత్పరుఁ డనునది యతని నైష్ఠికతకును సూచకములుగా నున్నవి. మిగిలిన విశేషణము లాతని పాండిత్యప్రతిభలను, కవితాకళాదక్షతను వెల్లడించుచున్నవి.

పై విశేషణములనుబట్టి చూడ నన్నయ పరస్పరవిరుద్ధగుణస్వభావములొక్కచోఁ గలసిన సమగ్రమూర్తివలెఁ గానవచ్చుచున్నాఁడు. వైదికులకు ఛాందసులను పేరున్నది. బ్రహ్మదేవుని వేదాభ్యాసజడుఁడని కొందరుకవు లాక్షేపించియున్నారు. అల్లసాని పెద్దన "బుద్ధిజాడ్యజనితోక్త్యాదుల్ గదా శ్రోత్రియు"లని శ్రోత్రియత్వమునకు బుద్ధిజాడ్యమును సహచారిగుణముగాఁ జెక్కొనుట ఎల్ల రెఱింగినదే. నన్నయ వైదికుఁడయ్యును బుద్ధిజాడ్యముతోఁ గూడినవాఁడు కాఁడు. లోకజ్ఞుఁడు, మత్యమరాధిపాచార్యుఁడు. కవితాకళాపారగులైనవారు కర్మిష్ఠులై యుండుట యరుదు. తిరుపతి వేంకటకవులు శ్రవణానందములోఁ గవిత్వమును సంధ్యావందనమును నవు బావగారని వర్ణించియున్నారు. కాని ఈ విషయమున కపవాదములైనవారు కొందఱు లేకపోలేదు. నన్నయ తిక్కన లందుఁ బ్రథమగణ్యులు. నన్నయ యవిరళ జపహోమతత్పరుఁడు; తిక్కన వైదికమార్గనిష్ఠమగు వర్తనమును నిర్వహించి సోమయాజియైనవాఁడు. నన్నయకూడఁ దణుకునకుఁ దూర్పున నొక్కచో యజ్ఞ మొనరించెనని తెల్పు పద్యమొక్కటున్నది కాని యది యెంతవఱకు యథార్థమో తెలియరాదు. లోకమునఁ గవితాకర్మిష్ఠతలకును శ్రోత్రియతాసుభసంపదలకును వైరుధ్యము చెప్పఁబడుచున్నను గవి కన్నియు నుండవలెనని లాక్షణికులు చెప్పుచున్నారు.

అప్పకవి యప్పకవీయ ప్రథమాశ్వాసమున సత్కవిలక్షణములను జెప్పుచు :

"ఇమ్మహిని మనులకే వెల
సెమ్మను గావ్యములు వాక్ప్రసిద్ధిఁ గుకవికే కా
వ్యమ్మును వచనార్థంబే
సమ్మతి గలివేళ సుకవిజనులే మాకుల్ 43

ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగదక్షుఁడు
గరుణామతి యొక్కఁ డతఁడు కవియనఁ జనుఁగున్. 44

శ్రుతి శాస్త్రేంగిత పురాణ
ప్రతతియు నితిహాస కావ్య భరతాగమముల్
స్మృతి సంగీత రతికళా
గతుల నలంకృతుల తెలియఁగాఁదగుఁ గవికిన్." 48.

అని చెప్పియున్నాఁడు. ఈతఁడు చెప్పిన లక్షణములన్నిటికిఁ గుదురైన కవులు నన్నయవంటివా రేయొక్క రిద్దరో తప్ప గొందఱో యుండరు.

"కులవిప్రః పురోహితః" అని వాచస్పత్యమునందలి నిర్వచనము నూఁతగాఁగొని, విప్రబ్రాహ్మణ శబ్దములు రెండును పర్యాయపదము లగుటచేఁ గులబ్రాహ్మణుఁడనఁగాఁ బురోహితుఁడనియు, అందుచే నన్నయ రాజరాజునకుఁ బురోహితుఁడుగా నుండెననియు, పురోహితులు సాధారణముగా వైదికబ్రాహ్మణులే యగుటచే నన్నయకూడ వైదికబ్రాహ్మణశాఖకే చెందియుండుననియుఁ జెప్పువారు పలువురున్నారు. కాని యీ యభిప్రాయము భ్రాంతిమూలకము. కులబ్రాహ్మణుఁడనఁగాఁ బురోహితుఁడు కాదనుటకు గొన్ని నిదర్శనములున్నవి. చాళుక్యరాజ్యాంగమున మంత్రి పురోహిత సేనాపతి యువరాజులు పంచప్రధాను లనఁబడుచుండిరి. ఈ పంచప్రధానులలో రెండవవాఁడు పురోహితుడు. కావునఁ బురోహితత్వముకూడ నప్పుడు న్యూనతావహమైనది కాదు. అవతారికయందలి 8వ వచనమున రాజరాజు మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానాంతసామంత విలాసినీ పరివృతుండై యుండెనని వర్ణింపఁబడియున్నది. దానువెంటనే నన్నయను వర్ణించు సీసపద్యమునఁ గులబ్రాహ్మణశబ్దము వాడఁబడినది. రెండుశబ్దముల నొకేస్థలమున వేఱువేఱుగాఁ బ్రయోగింపఁబడి యుండుటచే వీని యర్థమునఁ గూడఁ బార్థక్యమున్నదని యూహించుటకవకాశమున్నది. "కులబ్రాహ్మణ పదమునకుఁ బురోహిత పదము పర్యాయముగాఁ జాళుక్యశాసనములలోఁగాని కర్ణాటరాజ శాసనములలోఁగాని యెచ్చటను వ్యవహరింపఁబడి యుండలేదనియుఁ బంచప్రధానులను జెప్పుచోటఁ జాళుక్యశాసనములలోఁ బురోహిత శబ్దమే వినవచ్చును గాని కులబ్రాహ్మణ శబ్దము వినరాదనియు" సాహిత్యపత్రికలో శ్రీ. శ్రీ. బుర్రా శేషగిరిరావుపంతులుగారు వ్రాసియున్నారు. ఆదిగా నన్నయయే వ్రాసిన నందమపూఁడి శాసనములోను తత్పూర్వశాసనములందును జాళుక్యులకు మూలపురుషుఁడైన విజయాదిత్యుఁడు జిగీషచే దక్షిణాపథమున కరుదెంచి త్రిలోచనపల్లవునితోడి యుద్ధమున దివంగతుఁడైనపిమ్మట వాని మహాదేవి, యంతర్వత్ని యైనది, పురోహితునితోఁగూడ (పురోహితేన సార్థం) ముడివేము నామకమైన యగ్రహారమున కరిగి తద్వాస్తవ్యుఁడైన విష్ణుభట్టసోమయాజిచే దుహితృనిర్విశేషముగా నభిరక్షింపఁబడి విష్ణువర్ధనుని బ్రసవించెనని చెప్పఁబడియున్నది. * ఈ సందర్భమునఁ గులబ్రాహ్మణేనసహ యనక నన్నయాదులు పురోహితేనసార్థమని వ్రాయుట గమనింపఁదగియున్నది. దీనినిబట్టి నన్నయ యుద్దేశమునఁ బురోహిత కులబ్రాహ్మణపదములు పర్యాయరూపములు కావనితట్టుఁ దోఁచును. కాని కులబ్రాహ్మణుఁడును బురోహితుఁడును గూడ నాకాలమున నతి గౌరవార్హు లయిన రాజోద్యోగులే యగుటలో సందేహములేదు. ఇప్పటి పురోహితులకు సంఘమునన్న గౌరవమునుబట్టి యప్పటి పురోహితులుకూడా నిట్టివారై యుండు రని యనుకొనుట పొరపాటు.

రాజరాజనరేంద్రుని తాతయైన రెండవ అమ్మరాజు రాజమహేంద్రుని శాసనమున నొక్క చోట "...ర్మణః పుత్రాయ, కౌండిన్య గోత్రాయ,...ర్మాభిధానాయ మహాకుల బ్రాహ్మణాయ" యను భాగము కానవచ్చుచున్నది. ఈ శాసనము చాలవఱకు శిథిలమై పోయినది. కాని యర్థసందర్భమునుబట్టి యెవ్వరో యొక శర్మ కుమారుడు, కౌండిన్యగోత్రుడు, మఱియొక శర్మ యా మహారాజునకు గల బ్రాహ్మణుడై యుండినట్లు స్పష్టమగుచున్నది. ఈ శాసనము శిథిలము కాకుండ నుండినచోఁ బంచప్రధానులఁ జెప్పుచోటఁ బురోహితశబ్దమును గనఁబఱచి నన్నయ వర్ణనమును దృఢపఱచి యుండుననియుఁ, బురోహిత కులబ్రాహ్మణ శబ్దముల రెంటింటిని జూపిన భారతవచన మీ శాసనమున ననుసరించి వ్రాయఁబడియుండుననియు శ్రీ శేషగిరిరావు పంతులుగారు చెప్పియున్నారు. (రా. సంచిక పుట 92.)

రాజరాజనరేంద్రుని కాలమున నన్నయ శాసనకావ్యకర్తగా నుండెననుటకు నందమపూఁడి మండె తామ్రశాసనములు తార్కాణములు. సాధారణముగా శాసన లేఖనాధికారము సంధివిగ్రహులు రహస్యకులు, మహామంత్రులు అనువారి కొసంగఁబడుచుండెను. కులబ్రాహ్మణులుకూడ వీరితో సమానప్రతిపత్తి కలవారై యుందురు. ఇంతవఱకు లభ్యములైన శాసనములలోఁ బురోహితుఁడను నుద్యోగి వ్రాసిన శాసనమొక్కటియుఁ గానరాదు. సంధివిగ్రహులు లొక్కొక్కప్పుడు తమకు సన్నిహితులైనవారిచే శాసనములు వ్రాయించు నాచార ముండెను. క్రీ. శ. 1084వ సంవత్సరమున రాజరాజు జ్ఞాతియగు పాశ్చాత్య త్రిభువనమల్లదేవుని యాజ్ఞాపత్రము నాతని సంధివిగ్రహి యల్లుఁడు వ్రాసినట్లు తెలియుచున్నది. కాని పురోహిత రచితమైన శాసన మెచ్చటను గానవచ్చుటలేదు. ఇది కూడఁ బురోహిత కులబ్రాహ్మణులను నుద్యోగులు భిన్నభిన్న ధర్మనిర్వాహకులుగా నుండిరని యూహించుటకుఁ దోడ్పడుచున్నది.

కుల బ్రాహ్మణులనఁగా క్షత్త్రియపేత బ్రాహ్మణులనియు వారు రాజాస్థానములందుఁ బలుకుబడి కల్గి తమవారి కుపాధులు కల్పించు రనుట కనేక దృష్టాంతము లున్నవనియు శ్రీ శేషగిరిరావు పంతులు గారు వ్రాసియున్నారు (పుట 92). కులపుత్త్రికలవలెఁ గుల బ్రాహ్మణులుకూడ రాజాంతఃపురములలోఁ బెంపఁబడిన బ్రాహ్మణులై యుందురని వారూహించి యుండిరి. రాజరాజనరేంద్రుఁడను గ్రంథమునందలి సప్తమ ప్రకరణమున (పుట 144) శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులుగారు "రాజచాళుక్య కులమున నరపాలురకు కులబ్రాహ్మణు లుండుట చాళుక్యవంశాచారము. ఇమ్మడి అమ్మరాజు విజయాదిత్యునికి తాడిపఱ్ఱు వాస్తవ్యుఁడును, ఆపస్తంబ సూత్రుఁడును, కౌండిన్యగోత్రుఁడు నగు కులబ్రాహ్మణుఁ డొక డుండెను. వంశ మవిచ్ఛిన్నముగ వర్ధిల్లుటకు క్షత్రధర్మమొకటి భారతకాలమునాటినుండి ఆచరణలో నుండెను. అన్వయాభివృద్ధి

* రాజరాజనరేంద్ర సంచిక, పుట 91.

భూసురోత్తములు రాజపుత్రికలందు ధర్మవిధి సంతతి నిలుపుచుండిరి. అట్టి భూసురోత్తములు... కులబ్రాహ్మణుల నియమించి వారికి అడుబిడ్డలనిచ్చి వివాహముచేయు నాచారము కాకతీయ యుగాంతమువఱకు ఆంధ్రదేశమున వర్ధిల్లెను. కులబ్రాహ్మణులు క్షత్రియపత్నులతోపాటు స్వకులాంగనలనుగూడఁ బెండ్లియాడిరి. కులబ్రాహ్మణులు సాధారణముగా సున్నత రాజకీయపదవులందుండిరి. అట్టి కులబ్రాహ్మణులు వైదికులు కారు. లోకజ్ఞులు, కవులు. అప్పుడప్పుడు కార్యఖడ్గముల నెఱపిన దక్షులు" అని కులబ్రాహ్మణులనుగూర్చి వివరించియున్నారు. పరశురాముఁడు సర్వక్షత్రి సంహారము గావించిన పిమ్మటను, చిత్రాంగద విచిత్రవీర్యుల మరణానంతరమును భారతమున బ్రాహ్మణులు క్షత్రియకాంతలందు సంతానముఁబడసిన వృత్తాంతములు చెప్పఁబడినమాట సత్యమే. అట్టిది సాధారణముగా సంతానరాహిత్యముచే వంశవిచ్ఛేదము చేకూరు నుపద్రవము కలిగినప్పుడే జరుగుచుండెను. చాళుక్యవంశమున నిట్టి యుపద్రవ మెప్పుడైన సంభవించినట్లు కాని కులబ్రాహ్మణులు దయదలఁచి యావంశము నవిచ్ఛిన్న మొనరించినట్లు కాని తెల్పు సందర్భ మొక్కటియుఁ గానరాదు. కావునఁ బై చారిత్రికులు రాజులు కులబ్రాహ్మణుల నుంచుకొనుటకుఁ జెప్పిన ప్రయోజనము సందేహాస్పదమై యున్నది. వారు రాజులకడ నుద్యోగులుగా నుండి శాసనలేఖనాద్యన్యకార్యముల నొనరించుచుండి రనుటలో నాక్షేపము లేదు.

భారత సభాపర్వమున నారదుఁడు ధర్మజునికడ కరుదెంచి యాతని రాజ్యపరిపాలనపరిస్థితులనుగూర్చి యనేక ప్రశ్నలం జేసియుండెను. అందులో :

"కచ్చిదాత్మసమాబుద్ధ్యా శుచయో జీవితక్షమాః
కులీనా శ్చానురక్తాశ్చ కృతా స్తే వీర మంత్రిణః"

(సభా. 2 5. 16; Bhandarkar Oriental Research Institute Edition)

అనునదొకటి. "కులీనాశ్చానురక్తాశ్చ" అను పదములకు తన కులబ్రాహ్మణు ననురక్తు ననుపదములు సరియైన యనువాదములని శ్రీ శేషగిరిరావు పంతులుగా రభిప్రాయపడి యుండిరి. "దీనినిబట్టి నన్నయను గూర్చిన కులబ్రాహ్మణ ప్రయోగము వీరమంత్రికిఁ దగియున్నదనియుఁ, బురోహితునిఁగూర్చినది కాదనియు నూహింపవలె"నని వారు సిద్ధాంతీకరించియుండిరి. పై శ్లోకమునందలి కులీన శబ్దమునకును కులబ్రాహ్మణ శబ్దమునకును సంబంధమున్నట్లు గోచరింపదు. పైఁగా నందలి 'వీర' శబ్దము ధర్మజునికి సంబోధనము. పంతులుగారు దానిని మంత్రికి విశేషణముగాఁ జేసి వీరమంత్రియని వ్రాసియుండిరి. అందుచే నా శ్లోకమునకును నన్నయను వర్ణించు పద్యమునందలి పదములకును ముడిపెట్టుట యంత సమంజసము కాదు. అనురక్తపద మున్నదిగదా యని పంతులుగారు కులబ్రాహ్మణ శబ్దమును కులీన శబ్దమునఁ బర్యాయముగా గ్రహించియుందురు. కులీనత్వానురక్తత్వము లొక్క కులబ్రాహ్మణునకే కాక రాజోద్యోగు లందఱికిని నుండవలసిన లక్షణములు. నారదుఁడు సేనాపతినిగూర్చి యడుగు సందర్భమునఁ గూడ "కులీనశ్చానురక్తశ్చ దక్షస్సేనాపతి స్తవ" యనుట యిందుకు దృష్టాంతము. సాధారణముగా నారోజులలో విప్రులే మంత్రిత్వాదులకు నున్నతోద్యోగములందు నియమింపఁబడుచుండిరి. ఆముక్తమాల్యదలో రాయలు చెప్పిన రాజనీతిని బఠించినచో నిది వ్యక్తమగును. పై సభాపర్వమునందలి శ్లోకము ననువదించుచు నన్నయ :

"అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులఁగా
నొనరించితె కార్య సంప్రయోగము పొంటెన్" (సభా 1-26).

అని వ్రాసియుండెను. ఇందు ననురక్తపదము తప్ప మిగిలినవన్నియు నన్నయ కల్పించినవే. "పితృపైతామహాన్" అని మఱియొక్కచోట నెదటనో యున్న విశేషణమును దీసికొనివచ్చి యాతఁడిక్కడ నిముడించెను. దీనినిబట్టి నన్నయ యుద్దేశమున మంత్రులకు ననురక్తతతో పాటు అనఘత్వము, శాస్త్రవిధిజ్ఞత్వము, పితృపితామహ క్రమమున రాక యను లక్షణములుకూడ నుండవలెనన్నట్లు వ్యక్తమగుచున్నది. కులబ్రాహ్మణుఁడనఁగా పితృపితామహ క్రమమున వచ్చిన విప్రుఁడైన మంత్రి యని యర్థము చెప్పవచ్చును. రాజు తండ్రితాతలు రాజ్యము పాలించుచుండఁగా మంత్రి తండ్రితాతలు మంత్రిపదవి నధిష్ఠించియుండవలయును. అట్టి మంత్రులు రాజున కితర మంత్రులకంటె సన్నిహితులు ననురక్తులునై కులబ్రాహ్మణు లనఁబడుచుండిరని నిశ్చయింపవచ్చును. నన్నయ తండ్రితాతలెవ్వరో మనకుఁ దెలియదు కావున నీ విషయమును దృష్టాంతపూర్వకముగా నిరూపించుటకు వీలులేకున్నది. ఆంధ్రకవితరంగిణీకారులు చేతన భీమనభట్టులను నన్నయ తండ్రితాతలుగా నిర్ధారణచేసియున్నారు. ఇది సత్యమే యైనచోఁ బై యభిప్రాయము మఱింత బలవంతమగుచున్నది. ఏలయన చేతన భీమనభట్టులు రాజరాజ విమలాదిత్యుల యాస్థానముల నుండి సంధివిగ్రహులై శాసనములను రచించియుండిరి. (కోరుమిల్లి రణస్థిపూఁడి).

కులబ్రాహ్మణుఁడనఁగాఁ బురోహితుఁడను నర్థము నిరస్తమగుచున్నది. కావున దానినిబట్టి నన్నయ వైదికశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడే యనుటకూడ నిరస్తమైపోవుచున్నది. ఆ కాలమునకు బ్రాహ్మణవర్ణమున నియోగి వైదిక శాఖలు విస్పష్టముగా నేర్పడెనని చెప్పుట కాధారములు లేవు. అందుచే నన్నయ వేదవేదాంగవిదుఁడైన బ్రాహ్మణుఁడనియే తప్ప నాతని బ్రాహ్మణత్వమునుగూర్చిన యితర వివరములను దెలుపుట యశక్యము.

శాతవాహనుల కాలమున నాంధ్రదేశమున బౌద్ధమతము మూఁడుపూవు లాఱుకాయలుగా విరాజిల్లెను. తరువాత దానితో పాటు జైన వైదిక మతములుకూడ నించుక తలెత్తసాగెను. పూర్వచాళుక్యరాజుల కాలమున వైదికమతమున కధికమైన ప్రాపు చేకూరెను. కుమారిలభట్టు జైన బౌద్ధ మత సిద్ధాంతములను దీవ్రముగా ఖండించి పూర్వమీమాంసాపద్ధతిని బ్రతిష్ఠాపించెను. వేదాభ్యాసమును, వైదిక కర్మాచరణమును అపద్ధతికి జీవాతువులు. ఆ మతము నవలంబించి యాచరించెడివారి సమగ్ర స్వరూ

పను మనకు నన్నయలోఁ బ్రత్యక్షమగుచుండును. అతని సంహితాభ్యాసతియు, వివిధ జపహోమతత్పరత్వమును నిందుకుఁ దార్కాణములు.

సంస్కృతమున నష్టాదశపురాణము లున్నవి. వానిలో బ్రహ్మాండపురాణ మొకటి. పురాణమునందుండవలసిన పంచలక్షణము లన్నిపురాణములందు గోచరించుట నిజమేయైనను బ్రహ్మాండపురాణమున నవి మఱింత విపులముగా నుండును. సర్గ ప్రతిసర్గ మన్వంతరముల వృత్తాంతము తెలుపుట కది చాలఁ దోడ్పడును. మఱియుఁ బురాణముల పౌర్వాపర్యము నిర్ణయించుట కష్టమే యయ్యుఁ బెద్దలు బ్రహ్మాండపురాణమునకుఁ బ్రాచీనత చెప్పుచుందురు. అందుచేఁ బురాణములలో దాని కొక విశిష్టత యున్నది. నన్నయ "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁ"డని బ్రహ్మాండమునే పేరుపెట్టి పేర్కొనుట యీ కారణముచేతనే. శ్రీనాథుఁడుకూడ కాశీఖండమున బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ నిత్యాది పద్యమం దభ్యర్హిత బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమవని యా పురాణముచేఁ బ్రముఖముగాఁ బేర్కొనుటకుఁగూడ నిదియే కారణమై యుండును.

కళింగదేశమందలి భారతప్రతులలో నొండురెండుచోట్లఁ బాత్రునను మాటకు(భ్రాతు (తృ) అను పాఠాంతరముండిన కారణమున నదియే సరియైన పాఠమై యుండుననియుఁ, దిక్కనను మనుమసిద్ధి మామా యని పలుచుచుండినట్లే రాజరాజు నన్నయను అన్నా (భ్రాత) యని పిల్చి యట్లే భావించుచుండెనచ్చుననియుఁ, ప్రారణికి వటుసుదులకు వేయఁబడిన ప్రాసయతిని సాధించుటకు భారతమున నే ప్రయోగమున్నదనియుఁ బై సాహిత్యపత్రికలో నే శేషగిరిరావు పంతులుగారు వ్రాసియుండిరి. భ్రాతృ శబ్దమునకుఁ దెనుఁగున ద్వితీయైకవచనాంతము భ్రాతను అనియే యుండునుగాని భ్రాతృన్ (భ్రాతౄన్) అని యుండదు. ఈ రూపము వ్యాకరణ సాధ్యము కాదు. అందుచేఁ బై కళింగదేశ భారతప్రతులందలి పాఠము లేఖకప్రమాదజనితమైనదే కాని సరియైనది కాదు. ఒకవేళ పాత్ర శబ్దమే సరియైనదనుచో నది నాయకత్వము(Leadership)ను సూచించునని వారె అభిప్రాయపడి యయాతి చరిత్రముఁ బ్రజలు యదుని వర్ణించు సందర్భమునందలి పద్యము * దానికి నిదర్శనముగాఁ జూపిరి. నిఘంటువులలోఁ బాత్ర. శబ్దమునకు యోగ్యుఁడు, దానగ్రహణార్హుఁడు అను నర్థములున్నవి కాని నాయకుఁడను నర్థము లేదు. ఆ యోగ్యత సందర్భమునుబట్టి పలువిధముల వ్యక్తము కావచ్చును. యదుని వర్ణించు సందర్భమున దానికి నాయకత్వస్ఫూర్తి కలుగుట కవకాశమున్నది. కాని నన్నయవిషయమున నట్టియవకాశము లేదు. దాని కిచ్చట గుణపాండిత్యాభిజాత్యబుద్ధివైభవములచే సర్వథా యోగ్యుఁ డనునదే యర్థము కాఁదగి యున్నది.

* "అవిచారంబని పల్క నోడెదము ధర్మాభిజ్ఞ నీయగ్రసంభవుఁ డత్యున్నత శక్తియుక్తుఁడు మహీభార ప్రగల్భుండు భార్గవ దౌహిత్రుఁడు పాత్రుఁ డీయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ ................................"(ఆది.3—196)

ఈ పద్యమున నన్నయ యుభయభాషాకావ్యరచనాభిశోభితుఁ డని వర్ణింపఁబడి యున్నాఁడు. ఉభయభాషలనఁగా సంస్కృతాంధ్రములు. ఆ రెండింట నన్నయ కపారమైన పాండిత్యముతోపాటు కావ్యరచనాదక్షతయు నున్నట్లీ విశేషణము సూచించుచున్నది. నన్నయ యాంధ్రమున భారతముకాక మఱే యే కృతులైన రచించెనేమో చెప్పుటకు బలమైన యాధారములు లేవు. భారత మొక్కటే చాలు నాతని యాంధ్రభాషాకావ్యరచనాభిశోభితత్వమును జాటుటకు. సంస్కృతమున నాతఁడు రచించిన కావ్యములేవియు లభ్యములు కాలేదు కాని భారతాదినిగల మంగళశ్లోకము నందంపూఁడి శాసనమునందలి శ్లోకములును సంస్కృతభాషయం దాతనికిఁగల కావ్యరచనాపాటవమును వేయినోళ్ళ నక్కాణించుచున్నవి.

ఈ విధముగా నీసీసపద్య మేకైకమయ్యు నిష్ఠాగరిష్ఠుఁడును బాండిత్యపాథోధియు గుణరత్నాకరుఁడును గవితాకళానిధియు ధీరధిషణావధీరితదివిజాచార్యుఁడు నగు నన్నయనుగూర్చి యెన్నో విషయములను వ్యక్తముచేయుచు నాతని పవిత్రమూర్తిని మనకనులయెదుట సాక్షాత్కరింపఁజేయుచున్నది. ఇందలి విషయము లాక్షణికులు ప్రస్తావనలో నుండవలెనని చెప్పు కవిగోత్రనామాదికథనమను నంగమును స్ఫురింపఁజేయుచున్నది.

కావ్యార్థసూచనము ప్రస్తావనయందలి మఱియొక యంగము. అదియు నీ యవతారికలో సూచ్యమాత్రముగాఁ గానవచ్చుచున్నది. రాజరాజు నన్నయతో "నే ననేక పురాణములు వింటిని. అర్థధర్మశాస్త్రముల క్రమ మెఱింగితిని. ఉదాత్తరసాన్వితకావ్యనాటకక్రమములు పెక్కు సూచితిని. జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములందు భక్తితో హృదయము నిల్పితి" నని చెప్పిన పిమ్మట "అయినను నాకు ననవరతంబును శ్రీ మహాభారతమునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు"నని మహాభారతదంతో తమును చించెను. తరువాతఁ దనకు మిక్కిలి యిష్టములై యుండు నైదు విషయములలో మహాభారతశ్రవణాసక్తి యొక్కటని స్పష్టపఱచెను. అనంతరము చంద్రుఁడోట్టి పూరు భరత కురు ప్రభు పాండుభూపతులు క్రమముగా వంశకర్తలై యొప్పిన తన వంశమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్రము వినుట తన కెంతో యభీష్టమని వ్యక్తీకరించెను. భారతేతిహాసమునందలి ప్రధానవస్తువు పాండవోత్తముల చరిత్రయే కదా! అందుచే నీపై విషయములు సూక్ష్మముగనైనను జక్కఁగాఁ గథాంశసూచనను నొనరించుచున్నవి.

దశరూపకాదులు రత్నావళి నాటకమునందలి "శ్రీహర్షో నిపుణః కవిః" ఇత్యాది శ్లోకమున్ముఖీకరణ మను ప్రస్తావనాంగమునకు నుదాహరణముగా సూచించియున్నవి. ఇందుఁ గవి కావ్యవస్తు నట సభ్యాదుల గుణవిశేషములు వర్ణితములైనవి. ఇట్టి సూచన సభ్యులను నాటకదర్శనమున నత్యంతోన్ముఖులుగా నొనరించుట సహజమే. ఇట్లే నన్నయయు నీ యవతారికలో భారతమాహాత్మ్యము నించుక ప్రశంసించినాఁడు. అది జనమతుఁడైన కృష్ణద్వైపాయన మునివృషభుఁడు సంస్కృతమున రచించినట్టిది. భారత కథా

శ్రవణాభిరతిచే ఉత్తమములును సువర్ణశృంగఖురములును నగు కపిలగోవుల నూఱింటిని సర్వథా పాత్రులైన యుత్తమ వేదవిప్రులకు దాన మొనరించిన మహాఫలము చేకూరును. మఱియు భారతమును బహుభాషలలో బహువిధములుగా బహుజనులవలన వినుచు దాని యెడ బద్ధాదరులై యుండువారికి బహుయాగముల ఫలము లభించును. బహువిధముల ననఁగా శ్రవ్యకావ్యముగాఁగాని దృశ్యకావ్యముగాఁగాని యనియర్థము. సంస్కృతము, ఆంధ్ర కర్ణాట తమిళములు మున్నగునవి బహుభాషలు. బహుజనములను శబ్దమువ్యాఖ్యానము కులను, కావ్యముగాఁజెప్పు కవులను, పురాణముగా నుడువు పారాయణ చేయు పండితులను దృశ్యకావ్యముగా నభినయించు నటకులను, గేయముగాబాడు గాయనులను సూచించుచున్నది. ఈ పై పద్యము లొక విధమైన ఫలశ్రుతిపద్యములుగా గోచరించినను గవి చెప్పఁ బోవు భారతి మహాకావ్యము యొక్క మహనీయతను బ్రకటించుచుఁ బఠితలను దచ్ఛ్రవణ పఠనాదులం దున్ముఖులనుగా నొనరించుచున్నవి.

ఈ యవతారికలోఁ బ్రత్యక్షమైన ఋతువర్ణన మేదియు లేదనుమాట సత్యమే. కాని "ఘనదురితానుబంధేత్యాది పద్యమున వసంతర్తు వర్ణనము సూచ్యమానమగుచున్నది. వసంతము తుషార సంహతిని దవ్వుగఁ ద్రోపి పుష్పపల్లవ విభూతితో విరాజిల్లును. అప్పుడు మనుష్యుఁడు 'ధర్మ' నిబద్ధబుద్ధియై విజృంభించును. ఈ పద్యమునఁ గవి యలంకారమిషచే ఋతువర్ణనమను సంగమును గూడఁ జొనిపినట్లు కానఁబడుచున్నది.

ఇంకఁ బ్రస్తావనలోఁ జివరనుండు నంగము పాత్ర ప్రవేశ సూచన. భారతాంధ్రీకరణము నొక నాటకముతోఁ బోల్చినచో దానికి సూత్రధారుఁడు రాజరాజు. నన్నయయందలి ప్రధాన పాత్ర. నారాయణభట్టాతనికి సహాయుఁడు. అవతారికయందలి తుది రెండు పద్యములలోఁ బ్రధానపాత్ర సూచింపఁబడుచున్నది. "నన్నయభట్టు తెనుంగున మహాభారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్" అను వాక్యములో నా సూచన స్పష్టముగా గోచరించుచునే యున్నది. ఈ విధముగా నీ యవతారిక లక్షణసామ్యముచే సంస్కృతమునందలి నాందీప్రస్తావనల దృష్టియం దిడుకొని రచింపఁబడినదేమోయను నభిప్రాయమునకు దోహదము చేయుచున్నది.

---

# ఒంటరి బంగళా

శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ

హోరుమని గాలి వీస్తోంది.

పైన అంతా మబ్బు కమ్మి కన్నుపొడుచుకున్నా యేమీ కానరావటంలేదు. ఎనిమిదిగంటల రాత్రిప్పుడు జనసంచారం యేమీ లేకుండా—బొత్తిగా [illegible] అనుకునేందుకు వీల్లేకుండా, వుండీ వుడిగీ వో ముసుగేసుకున్న రిక్షా, తరువాత పదినిముషాలకు వో సైకిలు, బాగా విరామమిస్తూ ఘల్లుఘల్లుమని సన్నగా ప్రారంభించి జలజలమని పారే బురదనీటిని డెక్కలతో చిందగొడ్తూ యెక్కడికో చీకట్లో—అంతర్థానమయే వో జట్కా వీట్లను గమనిస్తూ మధ్యన వోమాటు బంగళా గేటువైపు దృష్టిని విసిరి తిరిగి ఆ నిశ్శబ్దంలో అద్దాల గాజుపలకలమీది నీటిని తొలిగిస్తూ ఆ గుడ్డను బాల్చీలోకి పిండుకుంటూ తన పనిలో మునిగిపోసాగాడు ధర్మయ్య.

ఆ వొంటరి హాల్లో జాగ్రత్తగా అమర్చిన బల్లలు కుర్చీలు అలవాటులేని నిశ్శబ్దానికి గింజుకొంటున్నట్లున్నాయి.

ఎక్కడో పిడుగుపడింది. ఆకాశం వురిమి గర్జనలు చేసింది. ఒక్క మెఱుపు మెరిసి కొండలు, వూరు, చెట్లు, అన్నీ తళుక్కుమన్న కాంతిలో మిలమిలలాడాయి.

బంగళా ముందు తోట అంతా నీళ్లతో ముంచెత్తి అంత క్రితం జాగ్రత్తగా, నడవటానికి చేసిన దారులు మొక్కలకు త్రవ్విన బోదెలు కట్టిన కంచెలు సర్వం కొట్టుకుపోయినై.

—వాన తగ్గలేదు. కాని ఉధృతం కొంత సడలింది.

రోడ్డుమీద దూరాన ఎలక్ట్రిక్ దీపాల వెల్తురు ప్రసరించిన చోట్లలోమాత్రం తూముకాలువలు నిండిపోయి నీరు సవ్యాపసవ్యంగా రోడ్డుమీద పరుగులెత్తటం చూడవచ్చు.

ఆ వొంటరి బంగళాయొక్క దీపాలులేని క్రింది చీకటిహాల్లో నుంచి ఒక జాతికుక్క పదేపదే భయంకరంగా అరుస్తూ మొరుగుతూ ఆ ఆవరణలోని నిశ్శబ్దాన్ని చీల్చి చెండాడుతోంది. దాని అరుపు విన్నప్పుడుమాత్రం ధర్మయ్య ముఖం కొద్దిగా వివర్ణమవుతోంది. తుడుస్తున్న గాజుపలకమీది చేతిని అట్టా ఆపించి భయంతో బంగళాగేటువైపొకచూపు విసిరి నిట్టూరుస్తున్నాడు. ఆ హాల్లోనికి మూసిన ద్వారాలతో వరుసగా యేర్పాటుగావున్న చక్కటి మూడుగదులు—వాటి గుమ్మాలకు కిటికీలకు పొందికగా కట్టిన తెరలు గాలిలో స్వేచ్ఛకోసం పెనుగులాడ్తూ కదలాడ్తూండగా—

“ఆ వెధవ కుక్క యెందుకలా మొరుగుతుంది!” అన్న గర్జన.

ప్రకృతిలోని యీ సంక్షోభం చెదరపాటువలన కలిగిన కోపమంతా ఆ కంఠంలో ఆ కుక్కమీద ద్వేషంగా రూపుమార్చుకుంటోంది. బుజంమీది గుడ్డను తలకు చుట్టుకుని ధర్మయ్య వూగుతూ మెల్లిగా చెక్కమెట్లమీదినుంచి దిగువకు జారుతున్నాడు. తరువాత మేడమీది హాల్లోని చీకట్లో ఎర్రగా వెలిగి నుసిగ్రమ్ముకొన్న పైపుతో ఒక నల్లటి నీడ యిట్నుంచి అటూ అట్నుంచి యిటూ తచ్చాడుతూండటం బంగళా గేటువద్దనుంచి కూడా జాగ్రత్తగా పరిశీలిస్తే అగుపడొచ్చు.

పనిలేని కీచుకుక్కలు ‘భంయ్’మని అరుచుకుంటూ దారి వెంటపోయే ఒక చీకిన గోనెల్లో తడిసిన ముష్టివాణ్ని ఆగిఆగి నిలబడి వెనుకనుంచి తరుముతూండగా వాడు కంకరరాళ్లలో చెదరిస్తూ గోల చేసుకుంటూ పరుగెత్తుతున్నాడు. ఈ మధ్యలో హఠాత్తుగా ఎక్కడ్నుంచో ప్రారంభమయిన గుఱ్ఱపు డెక్కల ధ్వనిలో కంకరరాళ్ల చప్పుడు లీనంకాగా, అసాధారణమైన వేగంతో పరుగెత్తి వచ్చిన ఒక బలిష్ఠమైన గుఱ్ఱం పూర్తిగా తడిసిపోయిన బండిని వేగాన్ని తగ్గించుకుంటూ లాక్కువచ్చి, ఆ నీళ్లలో బంగళా గేటువద్ద ఆగింది.

ముష్టివాణ్ని తరిమివచ్చిన కుక్కలు గుఱ్ఱపుబండీ చుట్టూ నిలబడి చోద్యంచూస్తున్నాయి. తలగుడ్డతీసి బుజానికి లాక్కుని బంగళాగేటువద్ద నిలబడిపోయి గొంతుక పూడుకుపోగా ‘చిన బాబుగారూ’ అనిమాత్రం అనగలిగాడు ధర్మయ్య. ఆ బండీకి కట్టిన దీపంబుడ్డిలోకి కొద్దిగా నీరు చింపటంవల్ల చిటపటమనే చప్పుడు, చమురుగుప్పు కాలిన వాసన వెలికిరాగా, ఎవరూ అడక్కుండానే ‘కలకత్తామైలు గంట లేటు బాబూ—’ అన్నాడు సామాన్లు చేరవేస్తున్న బండివాడు. బండిలోంచి దిగిన వ్యక్తి రబ్బరు వాన కోటుమీదనుంచి కారుతున్న నీటిని వొక్కమాటు దులుపుకుని ఆ గేటును తోసుకు బంగళావైపు నడిచాడు.

బంగళా పైహాల్లోని అద్దాల గాజు తలుపులు తెరుచుకున్నాయి. ఎర్రటి పైపు నల్లటినీడ ముందుకు త్రోసుకురాగా ఆ కంఠంనుంచి వచ్చింది ‘ఎవరది?’ అన్న ప్రశ్న.

మరొకమారు బంగళా క్రింది కుక్క మొఱయ్యోమని అరిచింది.

ధర్మయ్య వెనుకనుంచి, ‘చినబాబుగారు పూర్తిగా తడిసి పోయారు’ అని గొణుక్కున్నాడు. పైనుంచి చేత్తో నోట్లోని పైపును తీసి పట్టుకున్న చీకటినీడ పిల్చిన ‘రాజూ—’ అన్న గంభీరమైన పిలుపుకు యీ వచ్చినవ్యక్తి ‘వూ’ అనిమాత్రం ఇవ్వగలిగాడు.

అద్దాల గాజుపలకల తలుపులు ఒక్కమాటు మూసుకున్నాయి.

రాజు క్రింది వరండాలోని ప్రాతగిలిన కుర్చీ కాలికి తగులు గానే వానకోటుతీసి దానిమీదకు విసిరి తల తడుముకుని రెండు

చేతుల్లో జుత్తును పింజాలోసాగాడు. నీళ్లు టపటపమని నేలమీద చిందుతున్నాయి. బండివాడు యిక రూపాయి అడగ నవసరం లేకుండానే చిరపరిచితుడులా సామాన్లు మీదకు చేరవేసి వెళ్ళిపోయాడు.

'పైకి నడవండి బాబూ' అన్న నౌకరు మాటలు వినిపించుకోకుండానే 'తాళాలు తియ్యి ధర్మయ్యా, ఇల్లంతా చూడాలి' అన్నాడు రాజు.

హాల్లోని కుక్క బైట మనుష్యుల అలికిడికి గింజుకుంటోంది అరుస్తూ. కిటికీమీద కాలునుమోపి 'జిమ్మీ' అని పిలుస్తూ చిటికె వేశాడు. క్రింద లైట్లన్నీ వొక్కమారు వెలిగాయి. ధర్మయ్య క్రింది హాల్లోకి తలుపుల్ని తీసి ప్రక్కగావచ్చి నిల్చున్నాడు. రాజు చరచరా కుక్కను గట్టిన గొలుసు దగ్గరకు వెళ్లగానే లోతుకు కుంచుకుపోయిన కళ్లు దవడలతో 'జిమ్మీ' మీదమీదకు దూకుతూ నాకుతూ ఆప్యాయతను ప్రదర్శించింది.

ఇల్లంతా చెల్లాచెదరుగానూ నానా కంగాళీగాను వున్నట్లుంది.

'పిన్ని యెక్కడ జిమ్మీ' దుఃఖంతో రాజు గొంతుకు బొంగురుపోయింది.

ఎక్కడ పడితే అక్కడ అనవసరపు సామాను—మంచాలు అడ్డదిడ్డంగా పడివున్నాయి. పరుపులు తలగడాలు కొన్ని క్రింద కొన్ని కుర్చీల్లోనూ వివిధ రకాల మందు సీసాలు మూతలు తీసినవి ఖాళీవి ఎక్కడ పడితే అక్కడ దొర్లుతున్నాయి. కంగారులో తీసిన అలమారా బీరువాల తలుపులు వేసేందుకు యెవ్వరూ లేరు. నేలమీద మందు నీళ్లు పళ్లరసాల చారికలు ఎండిపోయి మచ్చలు కట్టాయి. గ్లాసులు చెంబులు నీళ్ళబిందెలు అన్నివైపులా చిందరవందరగా యెక్కడ పడేసినవి అక్కడ అట్లానే వున్నాయి. ఒక ఖాళీ మంచంపట్ట మాత్రం తలవైపున జాగ్రత్తగా అమర్చిన టేబిలు ఫాను వొంటరిగా దిగులుగా నేలకు దిగజారిన వైరుచుట్టతో గది అంతా పొంచి చూస్తున్నట్లుంది.

'ఈ యింట్లో యెవరూ ఎప్పుడూ సుఖపడలేదు ధర్మయ్యా.' బైట గాలీ—వానా అంతా తగ్గి ప్రకృతి ప్రశాంతతను తిరిగి కోలుకొంటోంది.

'పిన్ని నా గురించి వొక్క ముక్కఅన్నా చెప్పలేదా ధర్మయ్యా?'

రాజు తల వ్రేలాడేసుకుని సోఫాలో కూలబడ్డాడు. ధర్మయ్య పొడిబట్టల్ని చేత్తో పుచ్చుకుని ప్రక్కను నిలబడ్డాడు. వేడి కాఫీ పొగలు గ్రక్కుతూన్నది అలానే బల్లమీద వుండిపోయింది.

## 2

మనస్సు గుర్రంలా పరిగెడ్తూంటే, వయస్సుని కాలాన్ని చూసి సాంఘికధర్మం 'ఛీ' అని కసిరికొడ్తే—'వృత్తికి న్యాయవాదమే గాని జీవితంలో అన్యాయాల్ని సమర్థించుకొంటున్నా'రని కన్నకొడుకు తీవ్రంగా ఎదిరిస్తే, కన్నీళ్ళు ఆకలి దుర్భరదారిద్ర్యం ఎటువంటివో రుచిమాడకపోయినా—కానివయస్సులో చిలిపితన మనిపించుకున్నప్పటికీ, హృదయానికి పడుచుతనపు పోకడలు రప్పించుకుని, బీటలువారిన జీవితంలో నందనవనవాటికను నిర్మించుకుని అమృతవర్షం కురిపింపచేయాలనీ, జీవితాకాశాన కోరికల మబ్బుగుర్రాలసవారీ సాగించాలని—లోకంతో పోరాడి 'ఆనందము-స్త్రీ' గిరిగీసినట్లు కుర్రవాళ్లకే హక్కుభుక్తాలు కావని వొప్పించబోతే—'ఈ భోగభాగ్యాన్ని పెంచుకుని జీవితాలమీద అక్రమంగా దాడి చెయ్యకపోతే, ద్రవ్యాన్నీ పరువునీ ప్రతిష్టల్నీ విరజిమ్ముకొని ఎదటివారి దురవస్థల్లో చేజిక్కించుకున్న అవకాశాలతో దారుణావమానాలు చేయకపోతే—తమకన్నా చిన్నవాళ్ళ జీవన యమునాతీరంలో తాజమహల్లను కట్టి యివ్వరాదా? చరిత్ర - కళలూ, సంఘమూ, ప్రవహించే దిక్కున గోచరించే ఏకైక లక్ష్యం మానవాభ్యుదయమే! సాంఘికధర్మాలు న్యాయమూ చట్టమూ అన్నీ అటువైపుకే! భవిష్యత్తుమీద మన ముందుతరంమీద విశ్వాసం లేనివాళ్లు చేసే ఆత్మబలిదానం దేనికీ అక్కరకు రాదు. ఎడారిలో నడుస్తూ మిఠాయిల్ని తల్చుకుని నోళ్లలో నీరూరించుకొంటూ వెనక్కు వెనక్కు పరుగెట్టే అసూయాగ్రస్తులు వెనకటి రోజులే బాగున్నాయి కాలం మారింది ప్రపంచం చెడిపోయిందని తిడ్తూంటారు. ఈ యుగసంధిలో యీ గతితార్కికభావసంఘర్షణసమ్మర్దంలో ఆవేశాల కావేషాల సంకులసమరంలో—మేడమీద న్యాయవాది తండ్రి రామదాసు పంతులు, క్రింద కొడుకు చోటా న్యాయవాది రాజేశ్వరరావు—ప్రత్యర్థులుగా నిలబడ్డారు.

పిట్ట చేతిలోంచి ఎగిరిపోతే వ్రాలిన చిత్రాంగి మేడలో దూరి 'పావురమియ్యావె పిన్నమ్మా నా—' అనైనా అనకుండానే, రాజేశ్వరరావు, చెరగని అవమానాన్ని అఖండాల భాండాల విషాన్ని వొలకబోసుకున్న ఆ బంగళాలోకి వచ్చి 'పిన్ని నాగురించి వొక్క ముక్క అన్నా చెప్పిపోలేదా ధర్మయ్యా' అని అడిగాడు.

ఈ భయంకర భీతావహ కథాకథనంలో ధర్మయ్య పంచశిల మరమేకులా చుట్టుకుని ముందుకు నెట్టుకువచ్చాడు. కాని ... కాకపోతే...ఇప్పటికిది జరిగి ఓదశాబ్దమైయుంటుంది. నూరేళ్లు బ్రతకాలనీ, పండ్లంటి పిల్లాపాపలతో వెయ్యేళ్ల కాపురం వర్థిల్లాలనీ, నొసట కుంకుమరేఖలుదిద్ది బుగ్గనుచుక్కపెట్టి, ఒళ్ళో కొబ్బరిబోండాన్నుంచి, అలుకుచేత చేతిలో చెయ్యియించుకుని, కందపిలకనోము నోపించి 'పోయిరావమ్మ జానకీ' అని సన్నాయిమేళంవాళ్లు పాడుతూండగా—కన్నీళ్లతో తమ సర్వస్వాల్ని బిడ్డల భవిష్యత్తుకై సంతోషంతో అంకితమిచ్చే కన్నవారు ఉన్నవారుగాకపోవటంచేత అంతమైన రాధ జీవితకుసుమం ఎడారిలోపడి నలిగి ఎండి కృంగి కృశించిపోయింది. చెదరిన ముంగురులతో, చెదరిన కళ్లతో, తడబడ్తూ తడబడ్తూన్న కాళ్లతో, గలగలమని చప్పుడు చేసుకుంటూ, ఇంట్లోకివచ్చి కలకలమనిపించిన ఈ అందాలబాలను 'పిన్నీ' అని పిలవాల్సొస్తుందని ఊహామాత్రంకూడా శంకించలేకపోయాడు రాజు. శంకించవలసిన ఝంఝూటమైపోయాకకూడా తండ్రి తన్ను బహు చమత్కారంగా క్రూరమైన అపనింద అవమానాల పాల్చేసినప్పటికీ, ఏ కన్నీటిని కాలుష్యాన్ని రాధకు దూరంచేయాల్సిన విధి అని తెలు



MYERS
HIGH PRESSURE
SELF-OILING
BULLDOZER
POWER PUMPS
150 పౌన్లవరకు గరిష్ఠమైన ప్రెషరు గాని 580 అడుగుల గరిష్ఠమైన హెడ్డువరకు గాని, పనిచేయును. విస్తృతమైన యెడతెగని లూబ్రికేటింగు యేర్పాటు గలదు.
వాటర్ సప్లయి స్పెషలిస్ట్స్ లిమిటెడ్, 45, తంబుచెట్టి వీధి, మద్రాసు-1.
EVEREST WSS. 54. 11

గొంతుకలు విచ్చివట్లుగా, నదులన్నీ పొంగి కట్టల్ని త్రెంచుకుని ఉరికివట్టుగా, ఉద్రేకం ఉత్సాహం పొంగిపోయి, కొంపా గోడూ వదిలిపెట్టి, చదువూసంధ్యా, వృత్తి, అంతస్థు ఉద్యోగం, హోదాలకు దూరంగా నెట్టివేసి పారిపోయేట్లు చేసిందో, ఆ శ్రమా—ఆవేశం అంతా వ్యర్థం నిష్ఫలమైపోయేసరికి, పరాజితుడిలా ఆ ఒంటరిబంగళాలో శ్మశానాల ప్రశాంతత తాండవిస్తూన్న ఆ నైరాశ్యపు నిశీథ వాతావరణంలో, 'జివిగ్మ' భయంకరంగా అరుస్తూంటే—మేడ దిగి ఈవలకురాని రామదాసుపంతులుయొక్క అవిరామ పదన్యాసలను ఆలకిస్తూ రాజేశ్వరరావు చిత్రించిన రాధాదేవి అమాయిక మనోహర ముఖకమలాన్ని మనఃఫలకంమీద చిత్రించుకోసాగాడు.

ఠంగు ఠంగుమని గడియారం రెండుగంటల్ని కొట్టింది. రాజు చటుక్కున లేచి దుస్తుల్ని సంబాళించుకొని రబ్బరుకోటును మీద కప్పుకుని 'ధర్మయ్యా-' ఆగి 'తాళాలు కావాలి' అని గర్జించాడు. ఇద్దరూ బంగళావదలి షెడ్డువద్దకువచ్చి నిలబడ్డారు. తలుపులు తెరచుకున్నాయి. కారు ఈవలకు వచ్చింది. 'ఎక్కు-' అన్నాడు రాజు. కారుతలుపుమీద ధర్మయ్య చేయి వేయబోయాడు. 'ఎక్కడికి' అన్న గర్జన మేఘమిూంచి వచ్చింది. 'శ్మశానానికి' అన్న మాటతో బాటు జలికివచ్చినకారు త్రాచుపాములా నీళ్లను రాళ్లను దూసుకుంటూ నిశ్శబ్దమైన జనపథంగుండా చీకట్లోకి పోయి అంతర్హితమైంది.

శ్మశానంలో రెండు ప్రేతశవాలు కాలుతున్నాయి. ఆ శవాలతో మనుష్యులు దూరంగా గుంపుగా నిలబడి చూస్తున్నారు. సుమారావ కట్టెలఅడితి గొంతిక కూర్చున్న రాక్షసిలా చీకట్లో వికృతంగా అగపడ్తోంది. శ్మశానంలోని ఎర్ర ఆకుపచ్చరంగు మంటలు ధూమం పైకిలేచినప్పుడు—బూడిద కుండపెంకులు రాళ్లు కొరకంచులతో ఆ నేల భీతావహంగా వర్ణనమిస్తున్నది. దూరంగా యేరు నిద్రపోతున్నది. అక్కడా అక్కడా పొంచిచూస్తున్న పక్షులు వికృతంగా గానంచేస్తున్నాయి. కాటికాపరి చేతిలో కర్రతో నిర్వికారంగా నిలబడి ఖాళీగా చూస్తున్నాడు. కారు నేరుగావచ్చి శ్మశానంలో ఆగింది. ఇద్దరూ బయటకు దిగి నెమ్మదిగా రాధాదేవిని ఖననంచేసినచోటుకువచ్చి ఆగారు. ఏమీమిగలకుండా తెల్లటి మరుసులాటి బూడిద తడిసిపోయిన వాననీటిలో చితపతలాడుతూన్న అయిదడుగల మేరను ఠంగుని చేత్తో బురదను ఆప్యాయంగా ప్రోగుచేస్తూన్న రాజును భుజంమీద తడ్తూ 'ఇదేమిటిది? మీకేం పిచ్చా చినబాబుగారూ?' అని ధర్మయ్య వెనక్కులాగాడు.

'పిన్ని యిక్కడ నిద్రపోతోంది' అని మునివ్రేళ్లను బురదలో పూర్తిగా అన్ని 'నీకోసమే యిల్లువిడిచి పారిపోయానుగా పిన్నీ—అప్పుడే వెళ్ళిపోయావా? ఋజువుచెయ్యలేని అవమానాల్ని చెరగనిముద్రగా మోసుకుంటూ తిరగమన్నావా నన్ను.'

ధర్మయ్య శారీరకబలమంతా వుపయోగించి రాజును గుంజుతూ 'పిచ్చిపన్లు చెయ్యకండిక. పోదాం—యింటికి.'

'ఇంటికా—రాను. అక్కడికన్నా యిక్కడ చాలా ప్రశాంతంగా హాయిగా వుంది.'

'రండి'—ధర్మయ్య బలవంతాన రాజును లాక్కొంటూ షెడ్డులోకి తీసుకునివెళ్ళాడు. రబ్బరుకోటు పంట్లాం అంచులు బురదబురదయాయి. రాజు ముఖం ప్రక్కకు త్రిప్పుకొని యేడుస్తున్నాడు.

శవాలు పూర్తిగా కాలిపోయాయి. బంధుగులు యిళ్లకు వెళ్ళిపోయారు. కాటివాడు రెండుచేతుల్తో ఖాళీపాడెల్ని సగంకాలిన కొరకంచుల్ని బురదలో ఆర్పి కట్టల్ని ప్రోగుచేసుకుంటున్నాడు. ఎవరో చితుకు లేరుకొనేపిల్లలు వచ్చి యీ ప్రోగునాది యీ ప్రోగునాది అని తగూలాడుకుంటూ బొగ్గుల్ని తట్టల్లోనూ బుట్టల్లోనూ యేరుకొని వేసుకుంటున్నారు. తెల్లవారవచ్చింది. ధర్మయ్య 'లేవండి—రాధాదేవి ఆఖరికోరిక తీర్చివద్దాం పదండి. ఇంకా తెల్లవారటానికి రెండుగంటలుందికదూ—చాలు ఆ వ్యవధి.'

'ఆఖరికోరికా—కోరిక లేమీ వుంచవనుకున్నానే.'

ఇద్దరూ నడచివచ్చి కారులో కూర్చున్నారు. ధర్మయ్య సందేహిస్తూ—

'ఈరోజు ఎల్లా వానకురిసి చిందరవందరగా వుందో ఆనాడూ సరిగా యిల్లానే కారు మునుకు పోతుందా అని సందేహించాం. పోకపోయినా బాగుండిపోయేదేమో....'

రాజు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కారు చక్రాలు వేగంగా చుట్టుతిరుగుతూ నీళ్ళను రాళ్లను పల్లాల్ని గతుకుల్ని దాటి పరుగులు పెడ్తోంది.

'ఆ యిటువైపే—తిన్నగా...బస్. రోడ్డు బాగానే వుంది. చూడండి చినబాబుగారూ — మీరు కలకత్తాలో చదువుకొంటున్నారు. బ్యాంకులో చెప్పి నెలనెలా మీకు చెక్కువంపేయేర్పాటు చేసేశారు నాన్నగారు. మీకు అమ్మగారు గుర్తున్నారా? ఆవిడే పోకపోయుంటే నాన్నగారు మీ అతీ గతీ పట్టించుకోకపోయేవారంటారా?'

రాజు తల్లిని గుర్తుచేసుకుందామనేసరికి యేమీ స్ఫురణకు రాకపోగా బంగళాలోని గదిలో నాన్నగారు హోదాను ప్రాయించిన నిలువుసైజు తైలవర్ణ చిత్రం ధర్మయ్య మాట్లాడుతూంటే—ఆ బొమ్మను ఎదురుగ్గా నిల్చొని అనేకసార్లు ఆప్యాయతను కోరితెచ్చుకోబోయి విఫలమయిన సందర్భాలు మనస్సులో మెదిలాయి.

'మిమ్మల్ని అమ్మగారు పోగానే కాన్వెంటు దొరసానిని పిలచి అప్పగిస్తూంటే వద్దని, లబలబలాడేను. ఆపేక్ష లాలన ప్రేమాభిమానాలకు దూరంచేస్తున్నారని గోడవచేస్తే పిడ్ని కనిపెట్టుకొని సాకటానికి ఇక్కడ ఎవరున్నారు? డబ్బుపారేస్తే సురక్షితంగా శిక్షణలో పెంచుతారు వాళ్లు అని నా నోరు మూయించేశారు.' రాజు కొంచెంకొంచెం చెప్పగోనవసరంలేని తన బాల్యాన్ని నెమరువేసుకుంటున్నాడు. ఎప్పుడూ పండగలూ శెలవలూ యిళ్ళకు వెళ్ళడం అనేది ఎరగడు. ఎవరోవచ్చి ఎక్కడికో తీసుగెళ్ళటం ఆపేక్ష అభిమానాలు చూపించటం తెలియగడు. ఈ ధర్మయ్యే నెలకోసారి వచ్చి చూసి కంట తడిపెట్టుకొని వెళ్లిపోతూండేవాడు. ఎప్పుడో యే మూర్తాలకో వచ్చిచూసే తల్లి

పోతూ వుంచేవాడు తండ్రి. కాలేజీలో చదువుకునే టప్పుడు కూడా సెలవుల్లో అన్ని పండగల్లోనూ హాస్టల్లో హాటల్లో వుంచేవాడు తనొక్కడే. తన కెప్పుడూ ఎక్కడ్నుంచీ వుత్తరాలు రావు. వస్తే గడియారాల కేటలాగులూ పుస్తకాల వ్యాపారస్థులు ఏదన్నా సందర్భంలో వ్రాసినవి మినహాయించి. ఒడి దుడుకులు వుద్రేకం ఆవేశం అభిమానమూ చూడని రసహీనమైన జీవితంలోకి అర్థాంతరంగా వచ్చి తొంగిచూసిన మొదటి స్త్రీ వ్యక్తి 'రాధాదేవి.'

తెలతెలవారుతోంది. పిట్టలు కిచకిచమని గోలచేస్తున్నాయి. పల్లెలనుండి పట్టణాలకి తరలివెళ్ళే పల్లె వనితలు పాలకావిళ్లూ పెరుగు తట్టలవాళ్ళూ దారిలో ఎదురవుతున్నారు.

'ఆవేళ మీ పాల పాపారావు డ్రైవు చేస్తున్నాడు కారును. నాన్నగారే అతన్ని వుద్యోగంలోంచి తప్పించేశారు. మీకు తెలుసా ?'

'కొంచెం విన్నట్లు గుర్తు—చూశానేమో, చూసేవుంటాను కూడా—'

'పాపారావు అమ్మగారి హయాంలో మంత్రి. పూజలు పురస్కారాలు వుత్సవాలు ధర్మకార్యాలు అన్నింట్లో విశేషంగా పాల్గొంటూ ఆ హయాంలో మీ యింట్లో వొక వెలుగు వెలిగించి, అటుదిటు తిరిగి కాలం మారగానే అనవసరపు మనిషయి తొలగించబడ్డాడు. నాన్నగారు చిత్రమైనమనుష్యులు సుమండీ! ఆయన స్వభావానికి ఎప్పుడూ యేది తడుతుందో, యెవరు యెప్పుడూ అనవసరమైపోతారో, ఏది ఎందుకు తప్పనిసరిగా మారిపోతుందో వూహించటం కష్టం. ఆయన మార్గానికి యేది కంటకమైతే దాన్ని సుళువుగా తొలగించేస్తారు. అతనిప్పుడు రూటుమీద బస్సులు నడుపుతున్నాడు. మీ రెప్పుడైనా కనుపిస్తే మిమ్మల్ని చూపిస్తే తప్పక సంతోషిస్తాడు. ఎంత ఎత్తుకు మోసేవాడని—'

రాజా ధర్మయ్యకేసి చూసి 'అవును నిజం. ఏది మార్గానికి అడ్డు తగుల్తుందో దాన్ని సుళువుగా తొలగించి పరిష్కారం చేస్తారు. ఆయన నన్ను మార్గానికి దూరంగానే వుంచగలిగారు కాని పరిష్కారం అంత సుళువుకాదు.'

దారి కిరుప్రక్కలా దట్టంగా పెరిగిన ఎత్తైన కొమ్మలు రెమ్మల సందులనుంచి లేత వాడి సూర్యకిరణాలు దారిమీద పడి తడిసిన బాటలో బంగారుఛాయల్ని చిమ్ముతూండగా కారు జర జరా బరిమీద పాములా సర్రున పోతున్నది. చిన్న చిన్న కుగ్రామాలు పల్లెలు గుడిసెలు అర్ధనగ్నమానవుల దీనదేహాలు, మెళ్లో రంగుల పూసలు వంటిమీద చింకి పేలికలు, చంకల్లో నిసువులు శిశువులు, నెత్తిమీద తట్టలు—తట్టల్లో బొచ్చెలు కుండలు, చేతుల్లో పనిముట్లు—పారలు పలుగులు కొడవళ్లు, నెత్తిన మోపులు వెనుక మేకలు కుక్కలు దున్నపోతు బండ్లూ, ఎడ్లమందలు—అరుపులు తిట్లు పాటలు కొట్లాటల కోలాహలమంతా గడిచి రాజా దూరాన తెల్లటి దారలా పెంకుటిళ్ళూ దేవుడిగుడి పెద్దమేడతో వో గ్రామాన్ని పోల్చుకొంటూ ధర్మయ్య కేసి చూశాడు. 'హా— వచ్చేస్తున్నాం. చినబాబుగారూ. ఇదు... దేయి... సరిగ్గా యిలాగే ఆనాడూ ఊరి పొలిమేరల్లో అడుగుపెట్టామో లేదో—మేఘాలు క్రమ్ముకుంటూ వచ్చి కుంభవృష్టిగా వాన కురుస్తుంది. కారు సగం దారిలోనే బురదలో దిగబడిపోయి ససేమిరా కదలనంది. అదే ఆ తెల్లని ఎత్తైన భవంతి కనిపిస్తోందే అదే ధర్మరాజా మేడ. అదేదో చాలా ముఖ్యమైన కేసు. ఆ కేసులో నిష్కారణంగా వొక బ్రాహ్మణకుటుంబం యిరుక్కుని ఛిన్నాభిన్నమై సర్వనాశనమైపోయింది.'

గతుకుల్లోంచి మిట్టపల్లాల్లోంచి కారు వూళ్లోకి రాగానే పిల్లలు గొల్లకాడి కుర్రవాళ్లు కేకలేసుకుంటూ కారు వెనక్కాలే పరుగులెట్టసాగారు. అరుగులమీదకువచ్చి ముఖాలకి చేతులడ్డంచేసుకుని జనం కొంచెం దిగ్భ్రమచెందినట్లుగా నిలబడిపోయిచూస్తున్నారు. గ్రామం మధ్య పాఠశాలదాపుకు రాగానే కారు నిలబడిపోయింది. రాజా రబ్బరుకోటును లోపల్నే వదిలి తలుపుతెర్చుకుని బైటకు వచ్చాడు. ధర్మయ్య కారులో సీట్లక్రింద రహస్యంగా దాచిన అందమైన చిన్న క్యాలికో చెక్కపెట్టెను చేతపుచ్చుకుని 'ఇది పట్టుకోండి చినబాబుగారూ! రాధాదేవి ఆఖరికోరిక...'

ఇద్దరూ తల కొంచెం వంచి పాఠశాలలోపలకు దూరారు. అది తాటియాకుల పురాతనపుపాక-వెదురుబద్దల్ని చీల్చి జాఫ్రీలా అల్లి ఆపాకను రెండుమూడు భాగాలుగా విడదీశారు. నేలంతా దుమ్ము. బల్లలులేవు పిల్లలు కూర్చుందుకు. అంతా చింకి-చింకి గోనెలమీద పలకలూ పుస్తకాలూ పర్చుకుని సరస్వతీపూజ చేస్తున్నారు. పంతులుగారి డ్రాయరు నల్లగా కొరకంచులా వెలవెలబోతూవుంది. ఆయనకు కూర్చునేందుకు కుర్చీలేకనో మరేకారణంచేతనే చెక్క పెట్టె నొకదాన్ని బోర్లించి దానిమీద అధివసించి వుండటంమాత్రం నిజం. మాస్టరుగారు కళ్లజోడు ముక్కుమీదనుంచిజారిపోతూండగా కంగారుగా లేచారు. పిల్లలుకూడా లేచినిలబడ్డారు. ధర్మయ్య యెదురువెళ్ళి పంతులుగార్ని ప్రక్కగా తీసుకెళ్ళి 'రాధమ్మ సవతి కొడుకు బాబూ-తివరితో పనుండి వచ్చారు.'

మాస్టరుగారు క్షణకాలం 'హా' అని తెరిచిననోరును అల్లాగే వుంచి 'వస్తున్నాము బాబూ-' అని పిల్లల్ని పదినిముషాలపాటు లోపల చదువుకొంటూండమని చెప్పి 'రండిబాబూ!-యీ పేదవాడి కొంప తమబోంట్లు మెట్టదగినది కాదుగానీ మా రాధాదేవి తరపు నుంచి వచ్చాక ముందు ముఖ్యమైనది మీపని చూశాక-'

కారు నిర్లక్ష్యంగా పరుగెత్తి ధర్మరాజా మేడచుట్టి ఊరికి రెండవతట్టున మట్టిఅరుగులతో శుభ్రంగా అలికి ముగ్గులు తీర్చిన వో పెంకుటింటిముందు వచ్చి ఆగింది. ముగ్గురూదిగి యీవలకువచ్చాక-ధర్మయ్య 'ఇక్కడే ఇక్కడేబాబూ రాధమ్మకు తొలిపారిమాసింది. అవునా- పంతులుగారూ నన్ను పోలికపట్టారా?'

పంతులుగారు కళ్లజోడులోంచి తేరిపారజూచి 'అవునవును-దాసుగారితోకూడా వచ్చింది నువ్వేగదూ? ఏమిమంచి-ఎంతచాకిరీ చేశారు బాబూ?' అని రాజానుద్దేశించి దాసుగారిది ఎంతజాలిగుండె-మూగమొద్దు, అది దిక్కులేనిదై పోతుందని రాధమ్మ జీవితసమస్యను నాపైన వేయండి-నేను చూసుకుంటాను, అని గట్టిగా నొక్కి మరీ చెప్పికారులో అపిల్లను స్వయంగా తనబంగాళాకు తీసుకుపోయాడు.

పెళ్లిచేసుకున్నారు. దాని బ్రతుకు కుదుటపడింది. లేకపోతే యీగ రాధకు దిక్కా? మొక్కా? కన్నుముక్కు తీరు అన్నీ చక్కగా వుండి ధారాళంగా వాక్శుద్ధి గలిగి సద్గుణమైన పిల్లలకే పెండ్లిళ్లు కావటం కష్టమాయె-భగవంతుడున్నాడు సార్. అందుకనే అనాధ కులకు దిక్కులేనివాళ్ళకు కష్టంలో ఎవరోఒకర్ని దాసుగారి లాటి మహానుభావుల్ని చూపిస్తుంటారు. అంతా కులాసా బాబూ-లోపలికి దయచేయండి!

ధర్మయ్య రాజా లోనికి అడుగుపెట్టేసరికి చూసిన దృశ్యం తాలూకు సందర్భం యిది.

ఒక పద్దెనిమిదేళ్ల అమ్మాయి చక్కగా విరబోసుకున్న కుంతలాల్ని చేత్తో సర్దుకుంటూ రెండవచేత్తో తీక్షణంగా తర్జని యెదుట వ్యక్తి పైనిర్దేశిస్తూ యిలా ధారాళంగా చెప్పుకుపోతున్నది.—

'శెట్టీ నీకు బుద్ధి యిల్లా గడ్డి తింటున్నదేం? ఎన్నిసార్లు నీకు కాళ్లా వేళ్లా పడి-ఆ ముసలిదాని చేతులోనుంచి యేదీ పుచ్చుకోవద్దని కచ్చితంగా చెప్పలేదు? ఆ ముసలమ్మ ఎక్కడనుంచో చీరెత్తుకొచ్చి నీకిస్తే ఆ దొంగసొమ్ము పుచ్చుకొని నువ్వు నల్లమందు యిస్తావా? అందరికీ తెలుసుగదా మా ముసలమ్మకు బుద్ధిలేదని-వెంటనే నాకు కబురుచెయ్యక కొంపమీదకు తగూలుతెచ్చి ఆనందించటం యిదా నీ బుద్ధి?'

శెట్టి చిరాగ్గా 'ఇందవెయ్యమ్మ మీ చీర-నా రెండు రూపాయలూ నాకు పారెయ్యండి. అంత పెద్ద పంతులుగోరితల్లి దొంగతనం చేస్తుందని నాకేం ఖరిక-నన్నెందుకమ్మా తిడతావు? చేతనైతే మీ ముసలమ్మను సంబాళించుకోరాదూ?

మాస్టరుగారు యీ తగూ మధ్యలోకి వస్తూ 'యిష్...ష్ ఏమిట్రా ఆగోల? అసలు పెద్ద మనుష్యులు వచ్చి కూర్చుంటేను బయట-ఆపండి. ఏమిటి శెట్టీ తగూ....'

'రెండురూపాయ లిచ్చి చీరపట్టికెళ్ళమంటున్నాను. మీ అమ్మగోరు చీరెత్తుకొచ్చిందారని నాకేం తెలవదు. దొంగసొమ్ము కొంటం నా యింటా వంటా లేదు. పెద్దపంతులుగోరి తల్లి గందా అని నల్లమందు యిచ్చాను. చూడండయ్యాగోరూ మీ జయమ్మగోరెల్లా తిడతావుందో?'

పంతులుగారు నీళ్లు నములటం ఆరంభించారు.

'ఊరుకో విజయా-లోపలకు పదు. శెట్టీ నువ్వుపద-నీకు రెండు రూపాయ లివ్వాలా? జీతం ఫస్టురాగానే కనిపించు బాబ్బాబు ఎవరో పెద్దమనుష్యులు రాకరాక వాకిట్లో కొచ్చారు' అని నూతిదగ్గర పళ్లెంలో కూర్చున్న తల్లి నుద్దేశించి 'ఏవిటే యీపాడు పనులు? ఎప్పుడూ యేదోవొకటి యెత్తుకొచ్చి నా ప్రాణంమీదకు తీసుకురాకపోతే—కుదురుగా కొంపలోపడి యేడవరాదూ? నన్నేం వూళ్లో తలెత్తుకు తిరగనియ్యరా యేమి ఈ కొంపలోవాళ్లు.'

'అబ్బే—అంతా ఉట్టిదిరా అబ్బాయీ. దొంగతనమా—నాకేం ఖర్మ? కాలూ చెయ్యీ వంగాక కళ్ళూ కాళ్ళూ కనిపించక పోయాక ఎన్నైనా అంటారు? రొవ్వంత నల్లమందు పెట్టమంటూ యిల్లా అడిగానో లేదో చీరెత్తుకొచ్చి తాకట్టు పెట్టిందని అభాండం నా నెత్తిన వేశారు. రామ! రామ!!'

'నువ్వూరుకో నీకు తెలీదు బాబయ్యా—యీ శెట్టికి దొంగసొమ్ము కొనటం మాబాగా అలవాటయింది. రెండు రూపాయలు గాదు కదా రెండు కాసులుకూడా యివ్వొద్దు—ఎల్లా యివ్వడో చీర చూస్తానుగా. పద శెట్టీ. నేను మీయింటి కొస్తున్నాను. ఇంకా ఎక్కువ డబాయించావో నువ్వే దొంగతనాలు చేయిస్తున్నావని కేసు పెట్టిస్తాను. దాంతో తిక్కకాస్తా కుదిరిపోతుంది తెల్సిందా?'

బాబయ్య రెక్కపుచ్చుకు లాగాడు విజయను.

'కాస్తంత నెమ్మదిగా మంచిపిల్లలే మాట్లాడు విజయా. నీకోసం ఎవరో పెద్దమనుష్యులు వచ్చి వాకిట్లో కూర్చున్నారు. ఆ జుట్టూ అదీ కాస్త ముడివేసుకుని వోమారు ముఖం కడుక్కుని కాస్త శుభ్రంగా రారాదూ?'

మూతి వంకరగా పెట్టి నడుంమీద చేయి ఆన్చి అక్కోలా బాబాయికేసి చూసింది.

'అవును తల్లీ! చుట్టాలొచ్చారు నీకోసం—దప్పున తెములుకురా.'

'ఎవరు బాబూ— అంత హఠాత్తుగా ఆకాశంమీంచి వూడిపడిన చుట్టాలు?'

'చెప్తానుగా—మంచినీళ్లు కాస్త ఫలహారం ఏమన్నావుంటే చూడు తల్లీ.'

బాబయ్య వసారలోకి తప్పుకున్నాడు అతిథుల్ని పరామర్శించేందుకు. విజయ నీళ్ళతో ముఖం కడుక్కుని చప్పున ఆదరా బాదరా చీరమార్చుకుని, పొయ్యి ఎగసనదోసి టీనీళ్లు పడేసి, వంటయింటిగూట్లో సజ్జలోంచి రెండు రెండు అరటిపళ్ళూ రెండేసి మినపసున్ని వుండలూ పళ్లెరంలో పెట్టుగుని—మంచినీళ్ళ గ్లాసు చెంబు వోచేత్తో పుచ్చుగుని, యేవరా ఆవచ్చిన చుట్టాలనుకుంటూ వడలోకి కాలుపెట్టగానే—మన్నుగొట్టుకుపోయిన ముఖం విషాదాక్రాంతమైన చూడ్కులలో, బల్లమీద నేరస్థుడిలా కూర్చున్న రాజేశ్వరరావుని నేలమీద చాపమీద బాసింపట్టు వేసుకు కూర్చున్న ధర్మయ్య యీరెండు కనీ వినీ ఎరుగని క్రొత్తముఖాల్ని చూడగానే క్షణంసేపు తటపటాయించి బాబయ్యముఖంలోకి చూసింది.

రాజేశ్వరరావు పెదిమ కొరుక్కుంటూ భయంభయంగా తలెత్తి విజయముఖంలోకి చూసాడు. అదే పోలిక—అవే చక్రాలాటి విశాలమైన నయనాలు. అదే దేహకాంతి—సరిగ్గా రాధాదేవి నడిచివచ్చినట్లుగానే వుంది.

'చిన్న బాబుగారూ-చూశారా! అయమ్మ యీయమ్మే... అదే పోలికని అచ్చుగుద్ది పడేశాడు భగవంతుడు.'

'నువ్వన్నా చెప్పు ధర్మయ్యా-నేను చెప్పలేను.'

రాజా రెండుచేతుల్తో ముఖాన్ని కప్పుకుని భోరుమనవస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటున్నాడు. విజయ చలితమనస్కురాలై, అయోమయంగా నిలబడిపోయినది, మంచినీళ్లను చాపమీద వుంచుతూ, ఫలహారపు పళ్లెరాన్ని బల్లమీద వుంచబోయింది.

'అక్కర్లేదు తల్లీ! మంచిమాట చెప్పిపోవటానికి రాలేదు. దుఃఖవార్త మోసుకొచ్చామమ్మా నీకోసం'—

రాజా తడబడ్తూ లేవబోయి మళ్లీ బల్లమీద ఎవరో వెనక్కి త్రోసినట్లు కూలబడ్డాడు. పంతులుగారు తెల్లబోయి నిలువు గ్రుడ్లేసుకుని చూస్తున్నారు. అతను అతికష్టంమీద అందమైన చిన్న క్యాలికో చెక్కపెట్టెను వొణుకుతున్న చేత్తో అందిస్తూ' ఇది నీకివ్వమని చెప్పిపోయిందమ్మా మీ అక్క. తీసిచూసుకో... చూస్తూగా మీ రాధమ్మ వెళ్ళిపోయిందండీ. పాపం మా నాన్నగారి ఔదార్యాన్ని చాలా ప్రశంసించారు. ఎవరి ఔదార్యంతోనూ నిమిత్తం లేకుండా ఆమె నిష్కంటకమైన మార్గాన్నే చూసుకుంది.'

విజయ కాంతివంతమైన ముఖమండలం నల్లగా పొగచూరినట్లయిపోయింది. ఆ చేతిలోని పెట్టెను భద్రంగా విప్పి అందులోంచి తీసిన వెండిచుట్టు తీగతో అరిగిపోయి వెలవెల బారుతోన్న పొగడాల దండవైపు అందరూ క్షణకాలం ప్రశ్నార్థకంగా చూశారు. విజయకళ్లలో నీరు చుట్టుకుంటూండగా—

'ఇది మా అమ్మ వేసుకునే పొగడాలదండ—ఎంత గుత్తగా దాచిపెట్టింది మా అక్క పాపం! మాట్లాడలేకపోయినా యిది భద్రంగా దాచుకుని మమ్మల్ని జ్ఞాపకం చేసుకునేది కాబోలు.... నా కోసం పం...పిం....చిం...ది. ఇదే మాకు చివరి గుర్తు. ఇక మాకు సంబంధం... చివరికింతకన్నా యేమీ మిగలలేదు.' తలుపుని కర్చుకుని విజయ పొగడాలదండను వ్రేళ్లతో చేతికిచుట్టుకుంటూ రుద్ధకంఠంతో—' ఏదో గొప్ప యింట్లోకి వెళ్లిపోయిందన్న తృప్తితో మమ్మల్ని మధ్యపెట్టి బ్రతికివున్నన్నాళ్లూ మమ్మల్ని శాశ్వతంగా ఒకర్నొకరు చూసుకోనీయకుండా చేశారు మీ నాన్నగారు. మాట్లాడ్డం రాని మా అక్కను మీ హోదాలు అంతస్తుల్లో కట్టేసి శాశ్వతమైన బందీని చేసేసారు. పోనీలెండి; మీకటకటాల్ని త్రెంచుకుని యీ క్రూరమైన అంకుల్నుంచి కొంకుల్నుంచి రెక్కలు వచ్చిన పిట్టలా ఎగిరి చక్కాపోయింది. మీరీకబురు మోసుకురాకపోయి వుండినట్లయితే యింకా ఎక్కడో మా రాధ మూగబాధలు అనుభవిస్తూన్నదనే అనుకునేవాళ్ళం.' దుఃఖంనిండి ఆమె గొంతుక పూడిపోయింది. ధర్మయ్య గుడ్లప్పగించి చూస్తున్నాడు. చెరగుతో ముఖాన్ని రుద్దుకుంటూ పరుషంగా—'మా దుఃఖంలో మేము మునిగివున్నాము. అప్పుడు ధర్మరాజుగారు మా నాన్నమీద కేసు నడుపుతున్నాడు. ఆయనకొలువులో వున్నప్పుడు కిస్తులు వసూలుచేసిన బాపతు పదిహేను వేలదాకా మా నాన్నగార్ని లెక్క చెప్పవలసిందని లేకపోతే జైలు తప్పదని ఆయన్ని బెంగలో ముంచేశారు. ఆ కేసులో మా నాన్నగారు ధర్మరాజుగారి సామ్మేతి చేసివుంటే యీ గర్భదారిద్ర్యం—గుండెలు పగిలి మా నాన్న చావవలసి రావటం ఎందుకు? ఈ మాట ఎవరూ నమ్మరుకారు. ఆయనెక్కడో యీ సొమ్ము దాచుకున్నాడని అనుమానం అందరికీనూ. చివరికి మునిబావస్థలో క్రింద పడేసినప్పుడు శోకసముద్రములో మునిగిపోయిన మమ్మల్ని కడుదయతో మీ నాన్నగారు వచ్చి ఉద్ధరించి పదేళ్ళదాన్ని నన్ను యీ బాబయ్యగారి వశంచేసి తానేమో మా రాధమ్మను కొడుక్కిచ్చుకుని పట్నం తీసుకెళ్ళిపోయి పెళ్లాడేసాడు. ఎంత గొప్ప సంస్కర్త? యేమిజాలి? అని అంతా మెచ్చుకోవటమే—నోరులేని మా అక్క యేమని చెప్పుకోగలదు? ఎవరున్నారిక్కడ ఆదరించేందుకు? పేదవాళ్లమని దిక్కు లేవని, మూగపిల్లని రూవరం చేసుకుంటారని గప్‌చుప్‌గా అందరూ వెనక్కు జారుకుంటే మా అక్కను హరించుకుపోయి దాని బ్రతుకు ఆర్పివేశారు మీ నాన్నగారు. సంఘంలో ఆపదానికి జీవితం బలిపీఠమయిపోయిందే? ఓహో! యేమి విశాలహృదయం? మీ డ్రైవరు పాపారావని అతను వచ్చిచెప్పాడు. దాసుగారు రాధతాలూకు మనుష్యులెవ్వరూ ఎప్పుడూ బంగాళా పొలిమేరలు త్రొక్క వల్ల కాదని కబురు పంపించారు. ఆయనేం మనిషి? మాది మనుష్యజీవితాలు కావు—ఆటబొమ్మ లనుకుంటున్నారా? పేదరికంతో పరిహాసా లాడ్తారా? మా దుఃఖం, మా కన్నీళ్లు శాపాలూ వుప్పెనలా వచ్చి మిమ్మల్ని ముంచెత్తేస్తాయని నేనన్నానని మీ నాన్నగారితో చెప్పండి'—

ఎడాపెడా లెంపకాయ కొట్టినట్లనిపించి వళ్లంతా జలదరించింది రాజాకు. ధర్మయ్య పంతులుగారి నుద్దేశించి 'ఈ పొగడదండను అబ్బాయి పట్టుగెళ్ళి ఈ చెల్లాయి కిచ్చిరావాలని రాధమ్మ కోరిక—ఈ అమ్మని యెంత రోస్తుగా మనస్సులో తల్చుకునేదో అంత యోస్తునే యీ అబ్బాయిగార్ని రాధమ్మ ఆపేక్షగా చూసుకుంది. చివరికి నొక్కరూ కంటికి కనిపించకుండానే బ్రతుకు తెల్లార్చేసింది.'

పంతులుగారు నెమ్మదిగా విజయనుద్దేశించి - 'ఇంటికివచ్చిన అతిథుల్ని కోపంగా నాలుగుమాటలన్నావుగదా చాలు! మంచి దల్లని ముక్కలుకూడా రెండు చెప్పు తల్లీ!'

'చినబాబుగారూ! మనం వచ్చినపని అయిపోయినట్లే—మీకెప్పుడు రాధమ్మగార్ని చూడాలనిపించినా, పడితే నాలుగు మాటలు నోర్చుకునీ ఇక్కడకు వచ్చినట్లయితే మీ కనువాపిరి తీరిపోతుంది. లెండి-అమ్మాయిగారూ! మీ రాధమ్మకు ప్రియమైన వస్తువులు రెండు తెచ్చాము-ఒకటి మీకిచ్చి రెండవది మాతో తీసుకు వెళ్ళిపోతున్నాము.'

రాజా నీరసంగా లేచి 'మాటల్ని పడ్డానికి నేనెప్పుడూ వెనుకాడను. విషభాండాల్లాంటి అభాండాలు నా నెత్తిన ఎప్పుడూ పడుతూంటాయి.'

విజయ పొగడదండను క్యాలికో చెక్కపెట్టెలో ఉంచి మూత వేస్తూ-'ఈ రెండువస్తువులూ మీదగ్గిర్నే ఉండనివ్వండి — యిక్కటే పాపం ఇక్కడెందుకు?' అని ఆ పెట్టెను జాపిన అతడి చేతిలో ఉంచుతూ అప్రయత్నంగానే అతడిచేయి తగులగానే-

'అమ్మబాబో ఎంత వేడిగావుందో - జ్వరంకాదుగదా?' అని పెట్టెతోసహా పాముతిన్నట్లయి చేతిని వెనక్కు లాగేసుకుంది. ధర్మయ్య రాజా నుదుటిమీద చేయివేసి 'అమ్మాయిగారూ మీరు చెప్పింది నిజమే-జ్వరం నాగుబాములా ప్రాకింది. పదండి కారులో రెండుగంటల్లో వెళ్ళిపోతాము.'

పంతులుగారు రాజును ముట్టుకుని నాడీ పరీక్ష చేసి అన్నారు— 'చాలా నీరసంగా వుంది' అని. రాజా దృష్టి పళ్లెంలోని మినప సున్నివుండమీద పడింది. వంగుని దాన్ని అందుకోబోతూంటే విజయ చర్రున పళ్లెరాన్ని ప్రక్కకు లాగేస్తూ 'అమ్మ యింకే మన్నా ఉందా—మినపసున్ని తింటే జ్వరం ఒంటిమీద కొంప మునిగిపోదూ—'

'మునిగిపోయేదేమీ ఉండదులే—' అని చిన్నగా నవ్వాడు రాజా. పంతులుగారు బైటకువెళ్ళి కారుచుట్టూ చేరిన కుర్రమూకను బెదిరించి స్కూలుకువెళ్లే నలుగురుపిల్లల్ని కాపలా కాస్తూంటమని బండిదగ్గరకు పంపించారు. విజయ తన చల్లనిహస్తాలతో మెత్తటి ప్రక్కను పర్చి తల బ్రద్దలుకొట్టేస్తున్నదని రాజా గోల పెట్టేస్తుండగా బలవంతాన నూరుకొచ్చి కంట్లో కలికం పెట్టేసింది. రాజా అమ్మో! అమ్మో! అని వాపోతుండగా 'మూసెండి. మీతో నాకేం విరోధం లేదు. గంటసేపటికల్లా మీ శిరోభారం యావత్తూ దిగజారి పోకుంటే నన్ను విజయా అని పిలవకండి.' బయట అరుగుమీద ధర్మయ్యను ఆ ఇంట్లో ముసలమ్మ తానేమీ తీని కొంగిలించుకు రాలేదనీ నల్లమందు అమ్మే కోమటిమాటలన్నీ బూటకమనీ అ వేపి నమ్మవద్దనీ నచ్చచెబుతోంది.

# 3

ఇంకా వెఱ్ఱిగాలి వుండివుండి వీస్తూనేవుంది. కారు నిర్లక్ష్యంగా జలజలమని పారే బురదనీటిని చిందగొడ్తూ వెళ్లిపోయింది. రామదాసుగారు టక్కున తలను యీవలకు లాక్కుని కిటికీ మూసేశారు. గదిలో చిమ్మచీకటి—సుమ్మానికి కట్టిన తెరలు స్వేచ్ఛ కోసం గింజులాడుకొంటున్నాయి. లాంగుకోటులో ఆయన దేహం కజకజలాడింది. పైపుతీసి బాగా రెండుమూడు దమ్ములు పీల్చి అద్దంముందు వచ్చి నిలబడ్డారు. మసగమసగ్గా నల్లటి భయంకరమైన నీడ అద్దంలో గోచరించింది. తల గిర్రున తిరిగిపోతోంది. బంగళా యావత్తూ కెరటాల్లో వూగిసలాడుతున్న నావలా తోచింది. క్రమంగా ఆయనకు భయం లోపల క్రమ్మసాగింది. అలమార్లోంచి తాళాలుతీసి బీరువా తెరిచారు. వణుకుతున్న చేతుల్తో నోట్ల కట్టల్ని యీవలకు లాగారు. మళ్ళీ తాళం వెయ్యలేదు. టేబిలు మీద కాస్సేపు తడిమారు. టక్కున బల్లమీద దీపం వెలిగి వులిక్కిపడ్డారు. ఒక్కమాటు నేలమీద కూర్చుని మంచంక్రింద చూశారు. చుక్కల చుక్కల జాకెట్టు రాధాదేవిది మూలను గోడవారను దిగువను వ్రేలాడుతోంది. కళ్లు గట్టిగా మూసుకుని బలవంతాన వొక గుంజ తీసినట్లు లేచి నిల్చొని హాల్లోకి వచ్చేశారు. ఎదురుగుండా పెద్దభార్య తాలూకు తైలవర్ణ చిత్రంలోంచి ఆ యిల్లాలు పెద్ద తిరపో చీరకట్టు, వొంటినిండా వొంటెడు నగలు, అర్ధణా కాసంత కుంకుమబొట్టు—ముఖాన గౌరవనీయమైన ముడతలు గీతలతో, 'నేనంతా కనిపెడ్తున్నాను సుమా—' అని పలకరిస్తూన్నట్లుంది. దాసుగారు తీవ్రంగా విసుక్కున్నారు. 'యీ పీడబొమ్మ వ్రాయించకపోయినా బాగుండిపోయేదని' కంగారుగా అద్దాల తలుపుల కిటికీదగ్గరకువచ్చి నిలబడ్డారు. ప్రక్కనే తన్ను రాసుకుని ఎవరో దూసుకు వెళ్లినట్లయింది. అర్థంకాని మూగబాధను వ్యక్తం చేస్తూన్న రెండు సజలనయనాలు కిటికీ అవతలనుండి తన్ను చూస్తున్నాయి. గబగబా చేతుల్తో గోడలన్నీ తడిమారు. హాల్లో లైట్లు హఠాత్తుగా వెలిగాయి. కళ్లకద్దంగా రాజా వెడ్డింగ్ ట్రంకుపెట్టి కదలనిచ్చేట్టు లేవు. మూగపిల్ల రాధాదేవిని ఆక్రమించుకుని అనుభవించి ధ్వంసంచేసిన నేరానికి—రాజుకి దయలేదు. ఒక్కనాటికి తన్ను క్షమించదు. ధర్మయ్యకూడా వెళ్ళిపోయాడు. తన పాపాల ఘోరమైన చిట్టా అంతా క్రమం తప్పకుండా వ్రాసివుంచిన చిత్రగుప్తుడు. దాసుగారు కళ్లు గట్టిగా మూసుకున్నారు. ఆయన మనోనేత్రాలముందు చిత్రపటంలోలా ధర్మరాజు కేసులోపడి నలిగి నాశనమైన రాధాదేవి తండ్రి బాపు ప్రత్యక్షం కాసాగింది. ఘోరున ఆరోజు కురిసిన వానలో కూరుకుపోయిన కారులోంచి దిగి పన్నిన పన్నాగంలో యిరుక్కున్న పదహారేళ్ల జవ్వని బ్రతుకు భారం చేతచిక్కించుకున్న వైనం—కొలకంచుల్లోంచి కాల్తున్న మందభాగ్యుడు నిప్పుముద్దల్ని విసిరి తిరుగని శాపం విసర్తున్నాడు. ఆ మూగపిల్ల అందమైన ముఖం, పెద్దపెద్ద కళ్లు, వినీలకుంతలాలు, చక్కగా వంపులుతిరిగిన పెదవులు—బలిష్ఠమైన శరీరం ఆకుదింపు ఆ యవ్వనాన్ని కంబళించాలనే దాహంముందు—బలిగావించబడ్డ క్రూరంగా వంచింపబడిన పేగుసంబంధం—దారి కద్దుకాబోయిన పాపారావు మీసాలు. ఒకడు వుద్యోగంనుంచి నిర్దాక్షిణ్యంగా తొలగించబడ్డాడు. రెండవవాడు లజ్జతో తలవంచుకుని పెట్టీ బేడా సర్దుకుని కంటికి కనపడకుండా కలకత్తా పారిపోయాడు. పారిపోయినవాడు మళ్లీవచ్చాడు. ఈ ధర్మయ్య ఎంతకైనా తగును. ఓసే పిలిపించాడు. దాసుగారు పళ్లు పటపటా పిండుకొని పిస్తోలు కోసం కోటుజేబుల్ని తడువుకున్నారు. ఆ క్షణంలో ఆయనకు పిస్తోలు చాలా అవసరమనిపించింది. వెంటనే పడకగదిలోకి పరుగెత్తి టక్కున ఆగిపోయారు. బీరువా తలుపులు తెర్చేవున్నాయి. దీపం ఖణీగా వెలుగుతోంది. గదిలో ఎవరో దూరినట్లు అనుమానం వేసింది. ముందుకే వెనక్కి చూసి పగలబడి నవ్వబోయి నవ్వురాక బీరువాలోంచి బ్రాందీబుడ్డీ తీసి తాళంగుత్తులతో కొర్కు పీకిపారేసి అలమార్లోని గ్లాసునుతెచ్చి వంపుకుని గటగట గుక్క మీద గుక్క పీల్చేసి పిస్తోలుకోసం అరల్లో తడుముల్లాడి మొత్తానికి తూటాలు నింపుతూండగా 'జిమ్మీ' భయంకరమైన అరుపు దాసుగార్ని వివశుల్ని చేసిపారేసింది. కోపంగా ఆయన మెట్లవద్దకు పరుగెట్టారు. పెద్ద చప్పుడు చేసుకుంటూ దిగి పిడికిలితో గాజా తలుపును గుద్ది ముక్కలుచేసి పిస్తోలును హాల్లోకి నూటిగా మూడుమార్లు ఢామ్మనిపించారు. పెద్ద చప్పుడయింది. ఏ బీరువాయో బద్దలయింది. జిమ్మీ యింకా బిగ్గరగా గది అంతా విశృంఖలంగా తిరుగుతూ అరుస్తోంది. దానికీ తగిలుండాలి—చావలేదు. వరండాలో దీపం వెలిగించటానికి దాసుగారికి ధైర్యం చాలలేదు. తలుపుల్ని తెరిస్తే జిమ్మీ పట్టుకుంటుంది—ఛీ! యింత బ్రతుకూ బ్రతికి చివరికి కుక్క చేతిలోనా ఛావు! వెనక్కు తిరిగి హాల్లోకి రాగానే అద్భుతమైన రోదన బుర్రలో మెరిసింది. గదిలోకి పోయి ప్రయాణపు సంచీతెచ్చి కొన్నిబట్టలు నోట్లకట్టలు అందులో కుక్కి తాళాలు తలిమ్మాని ఎక్కడివక్కడ వదిలేసి పలాయనానికి

సిద్ధపడ్డారు. పిస్తోలు యింకా చేతిలోనేవుంది. అద్దానికి ముఖాన్ని ఆన్చి బయటకు చూశారు. చీకటి మసగమసగ్గానే వుంది.

దాసుగారు మెట్లుదిగి వరండాలోంచి నెమ్మదిగా దొంగలా నక్కి నక్కి తోటలోంచి గేటువైపుకు నడకసాగించారు. హఠాత్తుగా వెనకనుంచివచ్చి పట్టుకుంది 'జిమ్మీ'--జిమ్మీ ఎల్లావచ్చింది! కిటికీ బ్రద్దలయివుంటుంది. అబ్బా గట్టిగా పట్టుకుందే? దాసుగారు పిస్తోలును ధామ్మని పేల్చబోయారు. తూటాలు ఖాళీ... అయ్యో! అయ్యో!! అయ్యో!!! ప్రయాణపు సంచీ పడిపోయింది. జిమ్మీ కాళ్లను పట్టుకు పీకేస్తోంది. దాసుగారు విడిపించుకోలేక బోర్లా పడ్డారు మొక్కల్లో. భీకరంగా అరుస్తున్నారు. ఆ వొంటరి బంగళా ఆయన ఆక్రందనాలకు దద్దరిల్లిపోతోంది. ఈ వెధవ కుక్క చేతిలో ఛావు ఎల్లాగూ తప్పేట్లుందే—ముష్టాముష్టి యుద్ధం ఆరంభమయింది. గోళ్లతో గుండెల్ని రక్కుతూ యథేచ్ఛగా చేతుల్ని కరిచేస్తోంది. దేహమంతా రక్తాలు గాట్లు—కాళ్లు పీకేసింది. చేతుల్ని కొరికేసింది. అయ్యో! అయ్యో! బాధ—బాధ—ఎవ్వరూ లేరు. ఎంత దిక్కుమాలిన చావు? గోండ్రింపు ఆరంభమయింది. పరుగెత్తలేను — పారిపోలేను—ఎవరో పగ దీర్చుకుంటున్నారు? జన్మ జన్మల కసి—కాలభైరవుడి వాత—అయ్యో యీ దిక్కుమాలిన శవాన్ని చూసి యెవరు జాలిపడ్తారు? ఎవరొక కన్నీటిబొట్టు రాలుస్తారు? యీ మొక్కల్లో తుప్పల్లో... జిమ్మీ దాసుగారి దేహాన్ని యిష్టంవచ్చినట్లు ఖండీలు ఖండీలుగా కొరికి కాళ్ళతో బంతిలా తోస్తూ గంటా గంటన్నర చిత్రవధ చేసి తిన్నగా గేటువైపు పరిగెత్తి శ్మశానంరోడ్డుచ్చుకుంది.

భళ్లున తెల్లవారింది. సూర్యుడు ఫెళ్లున కాస్తున్నాడు. దాసుగారు దేహంనుండి వరదలుకట్టి తెట్టెలు తెట్టెలుగా గడ్డిలో మొక్కల్లో యినికిపోయిన నెత్తురు తళతళా మెరుస్తున్నది. పిస్తోలు ప్రక్కగా నేలమీద పడిపోయివుంది. ప్రయాణపు సంచీ యింకా కొంచెం దూరంగా విసిరివేయబడివుంది. అందులోంచి నోట్ల కట్టలు పొట్టల్ని విచ్చుకుని సూర్యుణ్ని చూస్తున్నాయి. దాసుగారి నిలువుగ్రుడ్లుమాత్రం భీతావహంగా మొక్కల్ని పరికిస్తున్నాయి. బంగళాలోకి పది పదిన్నరవరకూ యెవ్వరూ రాలేదు. ఆ తర్వాత పదకొండూ ఆ ప్రాంతాల ఒక సైకిలువచ్చి ఆగింది. పోస్టు జవాను గేటుదాటి లోపలకు అడుగుపెట్టి కెవ్వున కేకేసి వీధిలోకి పారిపోయి పదిమందిని ప్రోగుచేసుకొచ్చాడు. ఆ వెనుక పోలీసువాళ్లు వచ్చారు. బంగళా అంతా కలయతిరిగారు—అంతా ఖాళీ. నిశ్శబ్దంగా వుంది. క్రింద హాలువెనుక కిటికీ విచ్చిపోయివుంది. ఆ కంతలోంచి లోనికిచూస్తే బీరువాలు పగిలిపోయి అద్దాలు ముక్కలు ముక్కలయి నానాభీభత్సంగానూ వుంది. అంతా ఆశ్చర్యపోయారు. పైన మేడమీది గదుల్లో బీర్వాలలమారాల తలుపులన్నీ తీసివున్నాయి. కార్కు విసిరివేయబడ్డ ఖాళీ బ్రాందిసీసా టేబిలుమీద వుంది. టేబిలులైటు హాల్లోని లైటన్నీ అట్లానే వెలుగుతున్నాయి. షెడ్డు ఖాళీగావుంది. అక్కడ వుండవలసిన కారుకూడా లేదు. కారుపోయిన మార్గం గుర్తుపెట్టుకుని పోలీసులు తిన్నగా శ్మశానానికెళ్ళారు. అక్కడ హంతకుడు నిశ్చింతగా నిర్వికారంగా నోటినిండా ముఖంనిండా నెత్తుటి మరకలతో ప్రత్యక్షమయ్యాడు. కారులో వచ్చింది కుక్కగాదని తెలిసిపోయింది. కాటికాపరిని అడిగారు. రాత్రి ఎవరోవచ్చి కాస్సేపు విచారించి వెళ్లారని తెలిసింది. పోలీసు అధికారులు కారునెంబరు యిచ్చి మోటారు సైకిళ్ళను నాలుగువైపులకూ త్రిప్పారు. సాయంత్రం మూడుగంటలకు ధర్మయ్యనూ రాజేశ్వరరావును కలుసుకుని పోలీసులు యీ దుర్వార్తను విన్నవించారు. రాజు కళ్లు తిరుగులుకమ్మి తలతిరిగి పడిపోయాడు. విజయకూడా వస్తానంటే రాజు ధర్మయ్య వారించారు. సరిగ్గా నాలుగుగంటలకు ధర్మయ్య రాజు వచ్చి బంగళాముందు కారులోంచి దిగారు. పోలీసు అధికారులు చుట్టుముట్టి ప్రశ్నల వర్షాలు కురిపించారు. వాఙ్మూలాలు రాసుకున్నారు. జిమ్మీని పోలీసు వానులో ఎక్కించుకొని వచ్చారు. రాజును చూడగానే దిగులుగా వున్నదల్లా సంతోషంతో తోకాడిస్తూ మూలిగింది. దానికూడా గుండుదెబ్బ తగిలినట్లు గాయాలు స్పష్టంగా చెబుతున్నాయి.

ఈ కబురప్పుడే పూరంతా ప్రాకిపోయింది. జనం తండోపతండాలుగా యీ వొంటరిబంగళా చూడ్డానికి రాసాగారు. పత్రికలవాళ్లు రాజును పీక్కుతింటం ఆరంభించారు. ప్రెస్ ఫోటోగ్రాఫర్లు 'జిమ్మీ' ఫోటోలుతీసుకుని దాసుగారి శవం ఫోటోతో సహా వార్తల్ని ప్రచురించారు. బంగళాను సీలువేసి పోలీసు కాపలాపెట్టారు. ధర్మయ్య రాజూ పోలీసుస్టేషను చుట్టూ కోర్టుల చుట్టూ కాళ్లు బలపాలుకట్టేలా తిరిగారు. కేసు పరిష్కారమయేసరికి దాసుగారి కుటుంబ కథనం యావత్తూ పత్రికల్లో వింత వింత శీర్షికల్లో ప్రజలు చదివి ఆనందించారు. రాజు బాగా కృంగిపోయాడు. ప్రభుత్వం అంతా పరిష్కరించి యావదాస్తిని బంగళాను తిరిగి వప్పగించబోతే రాజు ఆ బంగళాను ఆసుపత్రిగా వాడుకోమని ఆ యావదాస్తినీ ఆ ఆసుపత్రిపరంగా ఖర్చుచెయవలసినదిగా వ్రాసియిచ్చాడు. ఎంత చెప్పినా వినకుండా పోలీసులు జిమ్మీని కాల్చిపారేసారు. రాజు యిప్పటికీ ఆ బంగళావైపు పోడు. దాని పేరు తల్చుకుంటే అతనికి స్పృహ తప్పిపోయినంత పనవుతుంది. రాజేశ్వరరావు పట్నంలో పాతికరూపాయలకు యిల్లొకటి అద్దెకు తీసుకుని అందులో ప్రాక్టీసు పెట్టాడు. ఆ యింట్లో బొత్తిగా వస్తుసామగ్రిలేదు. అక్కడే అతడికి వివాహంకూడా అయింది. అతడి వివాహానికి పోలీసు అధికారులు పత్రికా విలేఖరులూ ఎక్కువమంది వచ్చారు. ఇప్పటికీ విజయ తనకు తలనొప్పి వస్తే కలకంపెడ్తానంటుంది. ధర్మయ్య సుష్టుగా రెండుపూటలా భోంచేసి పూరంతా తిరిగితిరిగివచ్చి అరుగుమీద తలగుడ్డ పరుచుకుని పడుకుంటాడు. రాజూ-విజయా యిద్దరూ సంసారానికి కావలసినవన్నీ స్వయంగా చూసుకుంటారు. ఆమె గీచిగీచి బేరమాడుతుంది. అతను కొసరి కొసరి డబ్బులిస్తూంటాడు. పర్సులో తడి ఆరిపోవటంకూడా కద్దు. చెప్పుకోతగ్గ ప్రాక్టీసుకూడా యేమీలేదు. కోర్టుకుకూడా కాలినడకనే వెళ్ళివస్తూంటాడు. ఇద్దరూ అప్పుడప్పుడు సినిమాలకు వెళ్ళివస్తూంటారు. ఏదన్నా పేచీలు మంకుపట్టు పడితే ధర్మయ్య కొస్త అప్పుడప్పుడు మధ్యవర్తిత్వం నెరపుతూవుంటాడు. జీవితం ఎల్లాగుందని యెవరూ అడగరు. అడిగితే చక్కగ్గా హాయిగ్గా పదునుగా వుంది—ఈ పదును చెడగొట్టొద్దని వేడుకుంటానంటాడు. ఎప్పుడైనా బజారున పోతూ చట్టున ఆగి, బఠాణీలుకొని జేబులో పోసుకొని—చావాగరం దుకాణందగ్గర ఆగి ఒక అణా కారపు మిరపకాయలు కొని లొట్టలేస్తూ, పంపు దగ్గర దోసెడు మంచినీళ్ళని నోట్లో పోసుకుని, నిర్వికారంగా కోర్టునుంచి దారికరకం సిగరెట్టు కాలుస్తూ యింటికిపోయే న్యాయవాదిని యెప్పుడైనా చూడ్డంగనక సంభవిస్తే అతనే రాజేశ్వరరావని తప్పకుండా గుర్తుపెట్టుకోవలసుంటుంది.

# కవి: కాలము

శ్రీ చిఱుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్

లోకమునందు సకల విషయసాధనమునకు ధన ముపకరించునని తలంచువారున్నారు. అందులకే, మానవున కుండదగిన సకల లక్షణముల నాహుతి యొనరించి ధనసముపార్జనాకాంక్షచే వ్యవహరించువారి సంఘమునందు నేడనల్పముగ గానవచ్చుచున్నారు. ఓరిమి, ప్రేమ, మొదలగు నున్నత మానవలక్షణములను ధనము సంపాదింప నేరదు. కనువిందుగూర్చు నాభరణములను, శారీరక సౌఖ్యమును గూర్చు రమ్యహర్మ్యములను, శాల్యోదనమును, ధనము సమకూర్చును. వీనిని కలిగియున్నంతమాత్రమున నొక వ్యక్తియందు మానవత్వము సంపూర్ణమై యున్నదనుట సత్యదూరము. ధనవంతులందరు, నాగరకులు గారు, నాగరకులందరు ధనవంతులు కావలసిన పని లేదు.

ఒకని నాగరకతను గుర్తించుట కతని బాహిరకస్వరూపము, ధనధాన్యములు లక్ష్యములు కారాదు. అంతరంగికస్వరూపమును బట్టియే అనగా అతని చిత్తౌన్నత్యమును బట్టియే లోక మతని నాగరకుడైన మానవునిగా నెంచవలసియుండును.

నేడు, రాకపోకలయందు, కట్టుబొట్టులయందు, ఆహారవిహారములయందు, పెక్కు మార్పులు వచ్చినవి. సంగీత, వైద్య, శాస్త్రములయందు మార్పులే గాక, క్రొత్త పరికరములును వచ్చినవి. ఈ మార్పులు, కూర్పులు, ప్రాత రూపములకు క్రొత్త సొగసులను చేసి, నవ్య నాగరక స్వరూపమును ప్రదర్శించుచున్నవి.

ఇన్ని మార్పులు వచ్చినవి, ఇన్ని సౌకర్యములు సమకూర్పబడినవి, కాని మానవుని యంతరంగమునందు మార్పు వచ్చినదా? ఒకని రక్తమును వేరొకని కెక్కించి, రక్తహీనుని బ్రతికించుచున్నారు. ఉపన్యసించు మానవుని రూపమును, ఉపన్యాసమును, వేలకొలది మైళ్ళవరకు కనుపించునట్లు, వినుపించునట్లు, యంత్ర సహాయమున చేయగల్గుచున్నారు. శబ్దముకన్న త్వరిత గతిని ప్రయాణ మొనరించు విమానమును వియత్పథమున విహరింప జేయుచున్నారు. పంచభూతముల నీరీతిని జయించిన నాగరకుడగు మానవుడు, తన యందలి యరిషడ్వర్గమును జయింప నేరక, అనుమానమునకు, భయమునకు బానిసయై భయంకరములగు శస్త్రాస్త్రములను సృష్టించుకొని తన జాతినే సమగ్రముగ నిర్మూలింప నిశ్చయించుకొని యున్నాడు. విశ్వము పరమేశ్వరుని దలంచు నేటి నాగరకుడగు మానవుని లక్షణ మిది!

ఒరులవలన తనకుగలిగిన కష్టనష్టములను తాను గుర్తునందుంచుకొని, అట్టి కష్టనష్టములను తా నొరులకు గల్గింపకుండుటకు ప్రయత్నింపవలయునను, కావ్యసందేశమును, నాగరకుడనని చెప్పుకొను నేటి మానవు డెంతవరకు పాటించుచున్నాడు? అనకట్టల మూలమున జీవనదుల నరికట్టి, యెడారులను సస్యశ్యామల మొనరించుచున్న మానవు డింత తన యూహావాహిని నరికట్టి, హృదయ కేదారములయందు దయాదాక్షిణ్యములను పంటల బండింప యత్నింపడేమి! ఇది, వ్యయప్రయాసల కాలవాలమగు విషయము కాదు. కవి యొసంగు సందేశము నాదరించి: 'కాలము ననుసరించి కవి నడువవలయును, ఏనాటి సిద్ధాంతములనో ఈనాడు, ఆదరణలోనికి గొనిరావలయునని హెచ్చరించు కవి రచనముల నెవరాదరింతురని,' నేడు కొందరు ప్రశ్నించుచున్నారు.

ప్రపంచమునందు శాశ్వతముగ నిలచియుండుటకు, ప్రతి విషయమునకు కొన్ని నియమములు, సత్యసమ్మతములగు కొన్ని లక్షణము లవసరమై యున్నవి. ఆలక్షణములు లేనిది, ప్రత్యేకత లేదు. ప్రత్యేకత లేనిది, స్థిరత్వము లేదు. ఒక సంఘము, మానవ సంఘమని చెప్పుకొనుటకు, కొన్ని ప్రత్యేకలక్షణముల నలవరచుకొని యుండవలయును. అట్లుకానిచో, లోకమునందలి ఇతర జంతు సంఘమునందు మానవుని యున్నతిని గుర్తించు టెట్లు? సృష్టియందు, మానవునికన్న జ్ఞానమున మిన్నయగు 'జంతువు' వేరొండు లేదు. ఆ ప్రత్యేకతను నిలుపుకొనవలయుననియు, నాగరికతయను తెరమఱుగున దాగి పశుత్వమును పెంపొందించుకొనవలదనియు కవి, నాడును, నేడును, రేపును, హెచ్చరిక చేసియున్నాడు, చేయుచున్నాడు, చేయనున్నాడు. మానవుని మానసమునకు మఱపు రాకుండ:

"నఱికినను దన్ను నౌర! చందనపు దరువు
పరశుముఖమున కొసగును పరిమళంబు."

అని, 'అపకారికి ఉపకారము నెపమెన్నక చేయువాడు నేర్పరి,' యను నీలమువంటి నీతిని, ధ్వనిప్రధానమైన, అందర కందు బాటునందుండునట్లు ఉపమానసహితమైన, రచనముల మూలమున, జ్ఞప్తి కలయించుచున్నాడు.

ఈనీతులు, ఈ నియమములు, ఈవరకు విన్నవియే గావచ్చును, కాని వీనికి క్రొత్తప్రాతలు లేవు; కాలవాహిని యుఱుతరంగముల తాకున కివి చలింపవు, నిరంకుశముగ దేశమును బాలించు నియంతల కంటి యెఱుపున కివి వెరగుపడవు; సూర్యచంద్రులు వెలుగును వెలార్చువరకు, మానవుడు సృష్టియందు మసలువర కివి నిలచియే యుండును. కవి,-వీనిని గాన మొనరించుచునే యుండును.

కవి ననుసరించి కాలము సాగవలయునా? కాలము ననుసరించి కవి కలము నడువవలయునా? అను ప్రశ్నకు ప్రత్యుత్తరమును, దేశచరిత్ర, వాఙ్మయచరిత్రము లొసంగుచున్నవి. మానవ

జాతి కన్ని విధముల జవమును, జీవమును, గూర్చు విషయములను సేకరించి కవులు గ్రంథములను వెలయించియున్నారు. ప్రజా సమూహము గ్రంథములను పఠియించి, తమ విజ్ఞానాభివృద్ధికి దోహదము గావించుకొని యున్నారు. సంఘమునందలి లోపములను విమర్శించి కవి గావించిన సూచనలను లోకము గుర్తించుటయూ జరుగుచు వచ్చినది.

"పూడునా కోటి కల్లాడు పేదలడొక్క-
ముప్పూట లభిమతంబులు ఫలింప,
నడచునా ధర్మంబు నాల్గుపాదములతో
కులతత్త్వముల గాలి కుంటులేక,
దిగి వచ్చునా ధనాధిపుల మందపుజూపు
సామాన్య మానవ సదనములకు,
అణగారునా నితాంతాభిజాత్యపు మంపు
చిరుత చట్టాల దాక్షికమునకు,
ఒక మహాత్యాగిమీది నమ్మకమువలన
కరగతంబైన యధికార కనకముద్ర,
బహుళ కల్లోల గర్భిణీ భరతసతికి
దక్కునే, స్వార్థరహితవర్తనము లేక."

అని, రాజకీయ, మత, సాంఘిక రంగములయం దీర్ష్యాకషాయిత హృదయులగువారివలన కలుగు ముప్పునుగూర్చి హెచ్చరిక గావించు కవి పలుకులను, ఇకనైన దేశనాయకు లాలించుట లెస్స.

"ఎందు జూచిన నీ యశస్యందనములు
నడచిపోయిన జాడ లిప్పుడును గలవు.
దిక్తటంబుల మరల నెత్తింపవోయి
తెలుగు మన్నెల పసుపునిగ్గుల పతాక."

అనియు,

"పరువు దూలిన నీ యనాదరణ కతన
మేటి నీ భాష పొలిమేర దాటలేదు
పరుల విజ్ఞానమునకు సంభరముపడక
కడగి యెత్తుము నీ వీర కాహళంబు."

అని తెలుగుజాతి యొక్క కుసివింత బాపుటకు యత్నించిన కవి ధన్యుడగుచున్నాడు. సంఘమేమి యొనరించినను ప్రశంసించి తన ప్రత్యేకతను, కాలవాహినియందు గలుపుటకు కవి యెన్నడును ప్రయత్నింపలేదు. కాలమున కెదురీది, సంఘమునకు వెరువక, సత్యమునే నిత్యము వెలువరించుటకు కవి యత్నించి యున్నాడు.

"సుతులమీది ప్రీతి చుట్టాలపై ప్రేమ,
మిగుల నిందుముఖులమీది వలపు
ధనముమీది యాస, ధాన్యంబుపై దృష్టి
యతిశయంబు వలవ దాత్మయందు."

అను నియమములతో,

"ఆకల్పాంతము నీ పవిత్రదిన చ
ర్యల్ నిత్యనిర్నిద్ర వి
శ్వైక ప్రేమ మహాగమమ్మునకు తూ
చా పోని వ్యాఖ్యానముల్,
పాకీదానిగ ఆడిపోసుకొను ఈ
పాపిష్టిలోకమ్ము నీ
బాకీ తీర్చుకొనంగ లేదు జగదం
బా! జన్మజన్మాలకున్."

అని సంఘసేవకులకు స్వాంతన వచనములతో, ఇహమునకు, పరమున కుపకరించు రచనముల మూలమునను, 'వరవిక్రయము', 'కన్యాశుల్కము', 'ఆకలిమంట', 'బాల వితంతు విలాపము', మొదలగు దృశ్య, శ్రావ్య, ప్రబంధముల మూలమున మానవాభ్యున్నతికి కవి ప్రయత్నించియున్నాడు గాని, కాల మెటు నటించిన తానటు నటించి, సంఘము నెల్లవేళల ప్రశంసించి, తాను పొట్ట నింపుకొన ప్రయత్నింపలేదు. కాలము ననుసరించి కవి, రచన సాగింపవలయునను నియమమును, కవి, కొంతవరకుమాత్రమే పాటింపగలడు: ఉన్నతాశయములు గలవాడు మాత్రమే మానవుడు: మానసమును నికృష్టాశయముల కాలవాల మొనరించినపుడు, మానవుడు దానవుడగును. అట్టియెడ, మానవసంఘమును ధిక్కరించి, కవి:

"తమ కార్యంబు పరిత్యజించియు పరార్థ
ప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచున్ పరహితార్థ
వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థ ఘాతుకజనుల్
దైత్యుల్, వృథాన్యార్థభం
గము గావించెడి వార లెవ్వరో యెఱుం
గన్ శక్యమే యేరికిన్."

అని, మానవులను, దానవులను, వేరుపరచుటకు వెనుదీయడు. మానవ సంఘము వెంట నడచు కాలముతోబాటు తానును తాళమువైచి, గ్రంథములను వెలువరించుచున్నారను దుర్యశమునుండి కవిలోకము బయల్పడుట కిట్టి రచనములే సహాయ మొనరించుచున్నవి.

కాలము వెంట, సంఘపరిస్థితి ననుసరించి, కావ్యము వెలుగొందనిచో నా రచన మెవరికొర కుద్దిష్టమై యున్నది? అట్టి కావ్యమువలన ప్రయోజనమేమి? అను ప్రశ్నమునకు తగు జవాబొసంగవలసి యున్నది. కాలమునననుసరించి, సంఘము ననుసరించి, కావ్యము వెలయరాదను వాక్యమునందు, 'కాలము', 'సంఘము', అను శబ్దములకు, సముగ్ర

నిర్వచనము నాలింపవలయును. నికృష్టాశయముల కాహుతియైన సంఘమును, ఇట్టి సంఘముచే, కాలమునందు, అమలులోనికి వచ్చిన కృతకధర్మసంచయమును, కావ్యవస్తువుగా పరిగ్రహించి, వానినే నిర్దేశింపదగిన విషయములుగా కవి నిర్ణయించు టెట్లు? అట్టి సమయములయందు కాలమును, సంఘమును, కవి ధిక్కరింపవలసి యున్నది. ఈ వ్యాసము, నడచినకొలది, ఈ విషయము విస్తృతింపబడగలదని మనవి :

రాజకీయ సాంఘిక విషయములయందు పెక్కు మార్పులు వచ్చినవి. 'త్రైలోక్య సంపుట పేటీపరిపూర్ణకీర్తిమయకర్పూర ప్రకాండము'లు, 'వసంత సమాగమ ఫుల్లమల్లికాస్తోమ తుషార, పాండుర యశోగరిమంబు' నంద సామాన్యులగు, భూధవులను మరచి:

“........................పె
ద్దల కాలాలు గతించి పోయినవి,
స్వాతంత్ర్యంబు సిద్ధించె, రా
జుల సింహాసనమెక్కినారు ప్రజ,
లెచ్చుందగ్గులం బాపుజీ
హాలికశ్రేష్ఠుడు దున్నినా
డిపుడు లేవంతస్థుడు”

అని, కవి, నేడు గుర్తించినాడు. ఇది కాలప్రభావము; ఇచ్చట కాలమునకు కవి తల యొగ్గుచున్నాడు. ఒకప్పుడు పరరాజుల పాలనమునందుండి, పరభాషాప్రాబల్యమున, ఖండకావ్యములను, నవలలను, ఇంక మరి కొన్ని క్రొత్తరీతుల నలవరచుకొనిన భాషారూప, దేశస్వాతంత్ర్యము సిద్ధించుటకు కొలదివత్సరములకు పూర్వమే జాతీయభావవిలసితములైన రచనములతో నలరారుచు, మొత్తముమీద నొక క్రొత్తదనమునే ప్రదర్శించిన దనవచ్చును. ఈ క్రొత్తదనమును, దేశసౌభాగ్యముకొరకు, సంఘాభ్యున్నతి కొఱకు, ప్రజామోదముకొర కెంతదనుక యుచితమో యంతదనుక మాత్రమే కవులు తమ రచనములయందు ప్రవేశ పెట్టిరి. దేశ మెన్నడు పెడద్రోవలబోవునో, సంఘ మెన్నడు నీతి నియమములను విస్మరించునో, ఏనాడు ప్రజలు స్వార్థవిషయాసక్తులై తమ యభిప్రాయముల ప్రకటింతురో, ఆనాడు :

“తెలదొంగల్ దినిరందు వేల? మన
యాస్తిన్ నల్లమార్కెట్లలో
నలదొంగల్ దినకుండ జూచుకొని
యజ్ఞంబై విమూఘాశయా
కులమైయున్న యనుంగు దేశమున నం
క్షోభంబు మాయించి ని
శ్చలశాంతిన్ వెలయించి నీదు ప్రతిభా
శక్తుల్ ప్రదర్శింపుమా”

అని హెచ్చరిక చేయుచున్నారు కవులు. దేశసౌభాగ్య సాధనా నిష్ఠాగరిష్ఠులగు మన మంత్రిపుంగవు లీ సందేశము నాలింతురా? లేక, కాల మెటునడచిన కవు లటునడచి, మానవులందరను ప్రశంసించి, తమ కడుపునింపుకొన యత్నించిరని, కనువిప్పైన వారి రచనములను గనక !

“ప్రతిమల్ సెక్కి శిలాసహస్రముల నా
రాధించినన్ గాదు భా
రత దేశాన ననైకమత్యములు, నీ
ర్ష్యాద్వేషముల్, స్వార్థమున్
గతమై దోషపుజాతులేవి యుక
సాక్షాత్ స్వర్గమింపారినన్
బ్రతుకుం గ్రమ్మర, శ్రీ సబర్మతిముని
బ్రహ్మంబు, ముమ్మాటికిన్.”

అను కవితాసందేశము నాలింపక మిన్నకుందురా?

ఏ విషయము కాలమున కతీతమై నిలచునో, ఎల్లవేళల నేది యనుసరణయోగ్యమై యలరారునో, అట్టివానినే కవులు ప్రస్తుతించి, తమ రచనములయందు ప్రవేశపెట్టియున్నారు. సత్యము, నీతి, ఓరిమి, మొదలగునవి మానవహృదయస్థిత యనర్ఘగుణ రత్నములు. ఈ గుణములకు లోపము వచ్చిననాడే, కొన్ని దేశముల మధ్యమునందేమి, ఒక దేశమునందేమి, ఒక సంఘమునందేమి, ఒక కుటుంబమునందేమి, విపరీత, విపత్కర, విషయము లావిర్భవించును. సరళజీవితమార్గము కుంటుపడి, నీతినియమములు తారుమారై, కవి హృదయమును కలచి, ఆవేశయుతములగు రచనములతో మానవునియందు మార్పు గొనివచ్చుట కివి, కవిని పురిగొల్పును. ఉద్గ్రంథముల మాట యటుంచి, శతకవాఙ్మయము నిందుల కుదాహరణముగ జూపవచ్చును. సంఘమును, అందలి దురాచారములను, రాజులను, వారి పరిపాలనావిధానములను, లోకమునందలి మూఢనమ్మకములను, ధనవ్యామోహమును, కుతంత్రములను, విమర్శించి, రహస్యములను విప్పిచూపి, మానవజాతికి శతకవాఙ్మయము గావించిన సేవ కొలదియిడరానిది. ధనము నాశించి, పొగడ్తలతో పొట్టనింపుకొని, ధర్మమును విస్మరించి, కవులు ప్రొద్దుపుచ్చలేదనుట కీ శతకములే తార్కాణములు.

పెక్కు శతకములు, కందము, ఆటవలది, తేటగీతి, మొదలగు వానిచే నలరారుచుండుటచే కాబోలు, సులభముగా పద్యముల జదువుటకు వీలగునని పాఠశాలలయందు వీనిని మిక్కిలి చిన్నతరగతులకు పఠనీయగ్రంథములుగా నిర్ణయించుచున్నారు. పద్యము చిన్నదైనను, అర్థ మవగత మొనరించుకొనుటకు, విస్తృతమగు లోకజ్ఞానము కావలసియున్నది. అర్థముగానిచదువై పిల్లల కాలము నీ శతకములు వ్యర్థ మొనరించుచున్నవి. ఈ శతకములను, కళాశాలలయందు చివరతరగతి విద్యార్థులకు పఠనీయములుగా నిర్ణయించుట పాడి. ఉదాహరణపూర్వకముగ నీ విషయము నిచ్చట విపులపరచుట యప్రస్తుతమగును.

కొన్ని విషయములను పరామర్శించునపుడు, కాలమునందెంత వ్యత్యాసమున్నను, కవుల భావములందు మార్పు గోచరించుట లేదు. భావమును ప్రదర్శించు భాషయందు, భావ కాధార

భూతములైన శబ్దముల కూర్పునందు, కొంత భేదము గోచరించు చున్నది గాని, భావ మెప్పటికప్పుడు వినూత్నముగ దోచినను, తుదకు, ఒకమూసయందే కరగిపోసిన బంగారుపూసవలె, యభేద మునే ప్రకటించుచున్నది. ప్రకృతియందలి కొన్ని విషయములచే, కాలము ధిక్కృతమైయున్నది. ఎన్ని శతాబ్దములు గతించినను సూర్యచంద్రుల యుదయాస్తమయములయం దంతర్యామితమైయున్న నియమము, నిలుకడ చెదరలేదు. నీతియందు మార్పురానిచో కవి యందును మార్పురాదు. నీతియందు, అసహజముగ మార్పు వచ్చినచో, కాలము కన్నుమూసినను, కవి మిన్నకుండ నేరడు. అందులకే, ఒక నీతిని లేదా నియమము నాధారపరచుకొని సహజ ప్రకృతికి, కవి సన్నిహితుడు. దాదాపు సాల్గువందల వత్సరములనాటి:

"అమరుల బోనపుట్టిక,
సహస్రనయమయూఖుని జోడుకోడె, నం
తమసము వేరు విత్తు,
కుముదంబుల జక్కిలిగింత, పుంశ్చలీ
సమితికి చుక్కవాలు,
నవసారసలక్ష్మికి తోలంగు బావ, కో
కములకు గుండెతల్లడము,
కైరవమిత్రుడు దోచె తూర్పునన్."

అను చంద్రోదయవర్ణనమునకును:

"సివాక అప్సరః ప్రణయినీ
కబరీ మృగ్య పారిజాతమా
లావిసరంబవో, ఇక
యిలాతలమంట సుధాతుషార వ
ర్షా విమలావకుంఠమును
జారుచు పోవు శరద్విభావరీ
దేవి లలాటికామణివో,
దీపికవో సురలోకలక్ష్మికిన్"

అను, నేటి చంద్రోదయవర్ణనమునకును, ప్రథమమున యంతర మెంతయో యున్నట్లు దోచును. కొంచె మోపిక వహించి పరీక్షించిచో భేదము శబ్దములయందుగాని, భావమునం దనల్పముగ దోపదు. ఆనాటి వర్ణనమునం దీనాడు మనకు క్రొత్తగా కనిపించువిషయములు లేవు. సహస్రనయమయూఖునికిగాక, నేడింకెవరికి చంద్రుడు జోడు కోడె కాగలడు? శరద్విభావరీదేవికి, నాడును, నేడును చంద్రుడు లలాటకామణియై విరాజిల్లుచునే యున్నాడుకదా! కుముదములకు చక్కిలిగింత, నవసారసలక్ష్మికి తొలంగుబావ, జాబిల్లి గాక నే డెవ రున్నారు? ఇప్పుడు మనము గమనింపవలసిన ది పద్యములయందు సంగ్రథితి మొనరింపబడిన శబ్దజాలమును గాదు. ఆ శబ్దములమూలమున నున్మీలనము చెందిన భావము, సత్యసమ్మతిమె, కాలము మారినను మారక, కవిలోకము నేగాక, పాఠకలోకము నెంతగ నాకర్షించివచ్చునో గుర్తింపదగియున్నది. సాంఘిక రాజకీయాదిరంగములయం దనల్పముగ మార్పులం వచ్చినను, నీతి నియమములను పాటించు ప్రకృతి యందు, ప్రకృతి నారాధించు కవియందు మార్పు రాలేదు. ఇప్పుట కవికి కాలము తలయొగ్గుచున్నది!

"మొదలుజూచిన కడుగొప్ప, పిదుప గురుచ,
అది కొంచెము, తరువాత నధికమగుచు
దనరు, దినపూర్వపరభాగజనితమైన
ఛాయపోలిక, కుజన సజ్జనుల మైత్రి"

అను పద్యమునం దొక ప్రకృతినియమము వర్ణింపబడినది. ఈ నియమమును, ఉపమానముగా గొని, కవి మానవప్రకృతి యందలి యొక రహస్యమును వెలువరించియున్నాడు—కాల మెంతయో మారినది. ప్రకృతిరహస్యముల నెన్నింటినో మానవుడు తన పదార్థవిజ్ఞానశాస్త్రము నాధారపరచుకొని, కనుగొని యున్నాడు. కాని ఈ పైపద్యమునందలి ప్రకృతినియమము మారినదా? అందువిహరింపబడిన మానవప్రకృతి మారినదా? ఇక, కాలముపెంట కవి మారవలయుననుటలోని యర్థ మేమైయుండును? మానవుని యభిరుచియందు మార్పువచ్చినది. విశ్వమానవకోటి యాత్మకమైన యభిరుచిననుసరించి కావ్యములు వెలయవలయు ననెడి యుద్దేశ్యమును, కవు లాదరించియున్నారు. శాస్త్రపరిశోధనమువలన, మానవజీవితమునకు చెందిన పెక్కువిషయములు తొల్లింటకన్న సుకరములై యందర కందుబాటులోనికి వచ్చియున్నవని యీవరకే వివరించియున్నాను. పూర్వముకన్న శరీర సంబంధమైన సుఖమునకు మానవుని, ఈ పరిశోధనాఫలితములై వెలసినవిషయములు, తార్చినవి. శరీరసౌఖ్యము పెంపొందినకొలంది, మానవునకు మానసికబలము సన్నగిలదొడగినది. అందులకే సమాసయుతములగు రచనములను, దీర్ఘములగు కావ్యములను, ఆమూలాగ్రముగ చదివి సంతసించు, ఓపిక, నేడు, నాగరకుడైన మానవుని యందు కానరాకున్నది. ఖండకావ్యములు, కథానికలు, ఏకాంకికలు, అందులకే ప్రచారములోనికి వచ్చినవి. ఎద్దులబండిపై కొలది దూరమును గంటలకొలది ప్రయాణ మొనరించినమానవుడు, నేడు విమానముపై కొలదినిముషములలో ప్రయాణమును ముగించుచున్నాడు. శరీరమునకు చెందిన ఆయాసము నీరీతి తప్పించుకొనిన మానవుడు, మనసున కాయాసమునుగూర్చు రచనముల నెట్లాదరింప గలడు? శరీరమునకు సుఖము గూర్చునది బాహిరికవస్తుజాలము; మనసునకు సుఖముగూర్చునది మృదులభావసంచయము. ఈ భావములు శ్రమలేక, పడుకకుర్చీయందు పవ్వళించి పఠియించు నేటి నాగరకున కాస్వాదయోగ్యముగా నుండిననేగాని వాని నాదరింప నేరడు. అట్లాస్వాదయోగ్యములైన కావ్యములనే కవి రచియింపవలయునని కోరుచున్నాడు. కాలముపెంట కవి మారవలయునను వాదములోని కొంత రహస్య మిది!

"ఆ చెలి వచ్చి తా జలక
మాడిన యంతటిసేపు కృష్ణవే
ణీవల దూర్మికల్ రవధుని
పరివర్తన వైఖరిన్ సుధా

రోచులు గ్రుమ్మరించినవి
ప్రోవులువడ్డ వెలంది నవ్వులే
పూచెను పూవులై తరగ
మొత్తములన్ వెలిగించు వెన్నలై."

అని స్నానసుందరిని వర్ణించిన కవి;

"మసృణేందీవర మల్లికా పరిమళ
న్మందార రక్తాంబుజ
ప్రసవామోదభరాతిమంజులశరీరా!
చారుమూర్తీ! సనా
రస సీలోత్పల శంఖచక్రహల శా
ర్ఙ్గ శ్రీ విడంబిప్రసూ
నశరాంభోద నవావతార! జగదా
నందా! కటాక్షింపవే!"

అర్థవంతములును ఒకింత కఠినములును, అగు శబ్దసందోహము నాధారముగా గొని భావనీయత్వపథమున, ఇట, కవి విహరించుచున్నాడు. కాలము మారినది, కావున కవిత్వమును సులభమై యుండవలయునను వాద మాదరణయోగ్యమైనది కానేరదు. రాజకీయాదివిషయప్రచారమునకు, వ్రాయబడు పద్యగేయాది రచనములు, సులభములై యుండవలయు ననుటలో కొంత యర్థమున్నది; కాని విజ్ఞానాభివృద్ధికి, కావ్యకళాప్రదర్శనమునకు, పద్యము శబ్దసౌభాగ్య విలసితమై, సహజమగు ధారాశుద్ధికి నిలయమై, శిల్పచాతుర్యమును, ప్రతిభావ్యుత్పత్తులను, సంపూర్ణముగ విశదపరుప సమర్థమై, యుండవలసియుండుననుటలో దోషము కానరాదు. కవితాశిల్పమును, భావసౌందర్యమును, సులభముగ ప్రదర్శించుట కవకాశము లనేకములున్నవి. అట్టి సులభములగు కావ్యములును నేడసంఖ్యాకముగ నక్షరాస్యలోకముచే నాదరింపబడుచున్నది. అంతియె కాని, కాలము మారినది. ప్రతివిషయము, సులభముగ సంతరింపబడుచున్నది. కావున వ్రాయబడు ప్రతికావ్యము, పద్యము, అందర కందుబాటున నుండవలయునని శాసించుట పాడికానేరదు. కవియొక్క భావసంపదనుబట్టియు, నిర్మాణకౌశలమునుబట్టియు, ముఖ్యముగ, విషయగౌరవమునుబట్టియు, కొన్ని కావ్యములు సులభములై, కొన్ని కావ్యములు కఠినములై యుండక తప్పదు. విషయగౌరవమునుబట్టి, ఒకే కవి, తన రచనావిధానము నేరీతి మార్చుకొనునో, పై రెండు పద్యములు విశదపరచుచున్నవి. తన యభిరుచిని తాను గుర్తించుకొని, తనకుగల విజ్ఞానపాటవముననుసరించి, పాఠకుడు తనకందుబాటున నుండు రచనములను నిర్ణయించుకొనుట యుచితముగాని, రచనములన్నియు తనకందుబాటునే యుండవలయునని కోరుట, సమంజసము కానేరదు. ప్రచారము కొరకు వ్రాయబడు కవిత్వము వ్యాజయుక్తము; అది ఫలితకళల వరుసలో చేరును, కళాధర్మము ననుసరించి వ్రాయబడు కవిత్వ మవ్యాజము; అది లలితకళలవరుసలోనిది. సువర్ణమును సంపాదింపవలయునన్న, గనులలోనికి ప్రవేశించి, కఠినములగు శిలలను భేదించి, కాచి, చూచి, శుద్ధియొనరించి, ఎక్కువ శ్రమపడినచో నెచ్చటో నతిస్వల్పముగ లభియించును. అందులకే ఆ లోహమునకు విలువ యెక్కువ. పద్యమునందలి శబ్దములు, సమాసములు, కఠినముగా నున్నచో నోపిక వహియించి, అర్థమును పరిజ్ఞానముగొని, శబ్ద సంపదయందలి, ధ్వని, సౌందర్యములను గుర్తించి, యానందము ననుభవించుట తప్ప. కొన్ని నియమములను నిర్ణయించి, కవి, తన భావమును, భాషను, శిల్పమును, ఆ నియమముల ననుసరించి వశపరచవలయునని కోరుట యుక్తము కానేరదు. లోకము కోరినచో గులాబి తన యాకృతిని, రంగును, మార్చుకొని పూయుచున్నదా? మానవుడు తన మనస్సునకు తృప్తిని కలిగించుకొనుటకు, వింతవింత రంగుల కాగితములతో గులాబిపూవులను సృష్టించుకొనుచున్నాడు. కాని సౌరభ మెట్లు తేగలడు? కొందరను తృప్తిపరుప వ్రాసిన కావ్యమున కన్నిలక్షణము లుండును. కాని యందు కవిహృదయము కానరాదు. కాగితపుపూవువలెనే, యా కావ్యము కృత్రిమమై, భావబంధురమై భాసిల్లదు. విశ్వమానవభావయుతమై, కవిహృదయము యథాతథముగ ప్రతిబింబించు కావ్యము, కళామయమై ప్రకాశించును.

ఒకనాడు:

"భరతఖండంబు చక్కని పాడియావు,
భారతీయులు లేగలై బరితపింప,
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు, మూతులు బిగియగట్టి."

అను పద్యమును, మనదేశమునందు పదిమందిలో పఠియించుట, యపచారముగా పరిగణింపబడినది. కాని, నేడది యపచారమనువారె కానరారు! కవి, యసత్యమును, పలికినాడా? లేనిచో, ప్రజలయందీ పద్యమును చదువునప్పు డెందులకు వచ్చిన దీవింతమార్పు? దేశమునందు రాజకీయవాతావరణము మారినది; కావున ప్రజల మానసికపరిస్థితియు మారినది. ఇన్ని మారినవి, కవి పలుకుల యందున్న సత్య మసత్యమైనదా? కాలేదు! నాడును, నేడును, కవి సత్యమునే పలుకుచున్నాడు. కాలము మారినది, సంఘము యొక్క హృదయము మారినది, కాని కవి మారలేదు! కవియొక్క భావములను, ఎంతవరకు, ఎప్పుడుపయోగించుకొనవలయునో, నిర్ణయించుకొనవలసిన బాధ్యత సంఘముపై నున్నది.

"చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు చేయదగదు
పొసగ మేలుజేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినుర వేమ."

అను పరమసత్యమును, ప్రపంచించుచున్న, ఈ పద్యము తెలుగని యాంధ్రేతరు డెవ్వడున్నాడా? ఇందర్థముగాని శబ్దమే లేదుకదా! ఇందలి తాత్పర్యమును గ్రహించి, తమ నిత్యజీవితమునం దాచరణములోనికి గొనివచ్చినచో నిందరు భారతీయులయం దొక్కడే, మహాత్ముడైనాడేమి! కవులు, నిగూఢశబ్దములతో, కాలమునే

మఱచి, ఏకేవో గ్రంథములతో, ఏనాటి నియమములనో నేటి సంఘమునకు చేర్ప బ్రయత్నించుచున్నారని వచియించువారు, నిన్నమొన్నటివరకు, ఈ పద్యమునం దేనాడో కవి విశదపరచిన, ఒక నీతిని, ఆచరణములోనికి గొనితెచ్చి, నాగరకలోకమున కాశ్చర్యమును గూర్చు పెక్కు రాజకీయ, మత, సాంఘికాది విషయములను సాధించి, మహిమోన్నతుడై వెలింగిన, గాంధీదేవుని మఱువకుందురుగాక!

మానవాభ్యుదయమున కుపకరించు విషయములను పెంపొందించుటకు, కవి తన గ్రంథములమూలమున, పెక్కు రంగములయందు, పద్యగద్యాత్మకములైన దృశ్యశ్రావ్యప్రబంధములమూలమున విహరించును. కాలమున కనుకూలముగ (Book of the hour) గ్రంథరచన జరిపి, మానవ సత్సంకల్పమునకు మాత్రము, దోహదము గావించును. శాశ్వతములగు నీతినియమముల నశ్వరాస్యలోకమున కందింప, కొన్ని గ్రంథములను (Book of all times) వెలయించి పోవు, మానవజాతి, నిలచియుండునంతవరకు, తన పలుకులు, నిలచియుండునట్లు ప్రయత్నించును, కాలమున కనుకూలముగ గ్రంథములను వ్రాయక కవులు మిన్నకున్నదియు లేదు. కాల మెటు నటించిన, కన్నులు మూసికొని తా మటు నటించినదియు లేదు.

"నీ దృక్పథమునందు నిఖిల ప్రపంచంబు
నగ్నసుందరమైన నల్లపూస,
నీ మానసము దయారామాభివృద్ధికి
అమృతంబు జిల్కు వర్షాగమంబు,
నీ చరిత్రము గాఢనిద్రాదరిద్రాణ
కుతల చక్రమునకు కోడికూత,
నీ వాణి వికటభావావేశరభసకు
గిరిదాటరాని సుగ్రీవముద్ర,
సుప్రశాంతి రత్నశుద్ధాంతముల నిల్చి
తప మొనర్చు యోగధనుడ వీవు
భావదాస్యమునకు నీ వతీతుడ వంద్రు,
ప్రజ్ఞ విస్మరింపవలదు సుకవి!"

అని, కవితోబాటు మనమును, విన్నప మొనరింతుము గాక!



**కథానిక:**

# తెగినగాలిపటం

శ్రీ బలివాడ కాంతారావు

చలమయ్య మేష్టారి అల్లుడు రైలుక్రింద తలపెట్టాడు—ఈవార్త ఊరంతా ప్రాకిపోయింది. చాలమంది నోటవెంబడి "మేష్టారి కూతురు సుఖపడిందిలే" అన్నమాటలు వచ్చినయ్.

అల్లుని శవం చూచిన మేష్టారు చలించలేదు. సావిత్రి ఆ సమయంలో వూళ్లోలేదు. ఆమె వచ్చేసరికి తండ్రి పరిస్థితియేమీ బాగులేదు.

ఊళ్లో చిన్నా పెద్దా మేష్టారి ఇంటిచుట్టూ మూగారు. అల్లుడు చనిపోయాడని పలుకరించడానికి కాదు—ఇంత జ్ఞాని—ఇలా అయిపోయారేమని ఓదార్చడానికి!

మనిషోలా అనుకున్నారు. "వాడు బ్రతికి ఆ కూతుర్ని యేం సుఖపెట్టాడు. తన సేం హాయిగా బ్రతకనిచ్చాడు? ఆ చచ్చినవాడైనా యేం సుఖపడ్డాడు?"

"అల్లుడు చచ్చాడంటే మేష్టారు పీడాపోయిం దన్నారే—గుండెనిబ్బరం లేనివాళ్ళమీద—చేతకాక పౌరుషం హెచ్చయి రైలుక్రింద తలపెట్టినవాళ్లమీద చలమయ్య మేష్టారు సానుభూతి చూపించారే! అలాంటిది సాయంత్రింసరికి మతి తప్పినవారిలా అయారేం?"

"అసలు—ఆ సావిత్రికి లేని దుఃఖం ఈయనకెందుకూ అని?"

వచ్చేవారు చెప్పినవిధంగా చెప్తున్నారు. ఎప్పుడూ కన్నీరు చూడనివాళ్లు మేష్టారి కంటివెంబడి నీరు కారటంతో చాలామంది కళ్లనులుపుకొని వెళ్ళిపోతున్నారు!

"మీకే చావుబ్రతుకులుగురించి యెంత చెప్పేవారు?—అలాంటిది ఈ సమయంలో గుండెధైర్యం లేకుండావుంటే ఆ అమ్మాయి యేలావుంటుంది?"—సలహా చెప్పేవాళ్లు చెప్తున్నారు!

మేష్టారు అందరి సలహాలు వింటూ వింటూనే కళ్లవెంబడి నీరు బొటబొటా కారిపోతోంది. రెండు రోజులైంది నిద్రాహారాలు లేవు. ఎవరితోనూ చివరికి కూతురుతోనైనా మాటాడలేదు. కారణం? ఏ ఒక్కరికీ యీ ప్రశ్నకి జవాబు దొరకలేదు.

* * *

చలమయ్య మేష్టారి పుట్టుక పెరగటం వుద్యోగం బొబ్బిలిలోనే. బొబ్బిలి హైస్కూల్‌లో తెలుగు పండితులు. స్వయంకృషివలన బయటికివచ్చి వూళ్లో అందరిచే గౌరవింపబడుతున్నారు. ఆ గౌరవం సర్వకాలాల్లోనూ చెక్కు చెదరకుండా నిలబెట్టుకొనేటట్లు మెసలుతూ వచ్చారు.

మేష్టారికి ముప్పయ్యేళ్ల ప్రాయంలో భార్య గతించింది. అప్పటికి ఒకే ఒక సంతానం సావిత్రి—ఆరేళ్ళపిల్ల. ఆయనమీదవున్న అభిమానంతో వూళ్లోవారందరూ డబ్బు సహాయం చేస్తామని మళ్లీ పెళ్ళి చేసుకోమన్నారు. అందుకు ఆయన అంగీకరించక ఆ కూతురును చూసుకొనే పవిత్రంగా బ్రతికారు. సావిత్రి ఏపుగా అందంగా పెరుగుతూ ఆ వయసులో సాధారణంగా చూపించని తెలివితేటలు చూపించటంతో మేష్టారు యెంతో మురిసిపోయేవారు. పెళ్ళియీడు వచ్చింది. తల్లిపోయాక తనే తల్లి అయ్యాకనేమో తన చేతులతో యింత చేసాక యింకోయింటికి పంపించడానికి యెంత ప్రయత్నించినా మమకారాన్ని చంపుకోలేకపోయారు. "ఆడపిల్లకు అత్తవారిల్లు శాశ్వతం కానీ, నాకెవరున్నారు? అమ్మాయి వెళిపోతే నేను ఇంట్లో వుండగలనా? అమ్మాయిని విడిచి బ్రతుకలేనని" ఒకసారి, మళ్ళి యింకొకసారి "నా పిచ్చిగానీ! ఆడపిల్లకి పెండ్లి శోభస్కరం కదా—పెళ్లి చేస్తే అమ్మాయిమాత్రం మొగుడ్ని విడిచి ఉండగలదా నాయనా? ఉంటే నెలా రెండునెలలూ—నాతల్లి నా కంటికి కనపడాలన్న స్వార్థంతో వాళ్లి సుఖం చంపడం నాకు న్యాయమా? అన్నిటికీ దొడ్డవాడొకడున్నాడు. ఈ నాటకంలో మన పాత్ర ఎంత వుత్తమంగా నిర్వహించామని అనుకోవటమే గానీ—ఏమిటో మనిషి అంతా స్వంతం అనుకొని బ్రతకటంకన్న తెలివితక్కువ ఇంకొకటి లేదు."

ఈ మాటలు తన శిష్యుల్లో ఒకడైన రామారావుతో ఆరోజుల్లో చెప్పుకున్నారు. రామారావు తండ్రి పల్లెనుంచి తెచ్చి మేష్టారికి పదేళ్ల కుర్రాడ్ని అప్పచెప్పారు. మేష్టారి అదుపాజ్ఞల్లో పెరుగుతూ పెద్దవాడై ప్రస్తుతం రామారావు ఆంధ్రా యూనివర్శిటీలో చదువుకుంటున్నాడు.

ఇలా బాధపడుతూనే సంబంధాలు చూసేవారు. తన మనసులో కోరికే ఫలించింది.

సావిత్రి పెళ్ళి ఒకానొక మంచి ముహూర్తాన అయిపోయింది. మేష్టారి సంతోషం పట్టలేనంతదైపోయి కన్నీరు కారింది. ఆనందరావు నిజంగా ఆనందరావే. ఆయన యేవిషయమైనా చాలా తేలికగా తీసుకుంటాడని యెల్లప్పుడు సరదాగా ఉండే మనిషని చాలామంది అనుకున్నారు. మనిషి అందగాడనే చెప్పాలి. మాటలు తీరు చాలా ఆర్భాటం అనిపించినా మర్యాదగల మనిషిగానే కనిపించాడు.

సావిత్రి అందమైన మొగుడ్ని అందులో ఇల్లరికం వచ్చిన మొగుడ్ని కట్టుకొని సుఖిస్తుందని అందరూ అనుకున్నారు. మేష్టారు యీ అల్లుడ్ని యెలా కలుసుకున్నదీ రామారావుతో చెప్పారు. పాలకొండ ఒక స్నేహితుని ఇంటికి వెళ్లారట. ఆయన ఎక్సైజ్

డిమాన్‌స్ట్రేటరు. ఆరోజు నే బదిలీమీద వచ్చిన ఆనందరావు చాలాకీ చూసి ముచ్చటపడి నాలుగు విషయాలు కనుక్కొని ఎగ్రికల్చర్ మేస్త్రీ ఐతే నేం? బొబ్బిలి బదిలీ చెయ్యిస్తానని తన స్నేహితుడు హామీ ఇచ్చాడు—ఇంట్లో ఉండటానికి ఒప్పుకున్నాడు—ముందు వెనుకా ఎవరూ లేరు. భగవంతుడు ఈనాటికి అనుగ్రహించాడని పెండ్లి నిశ్చయం చేసారుట.

ఎవరూ లేరా ? ప్రశ్నించాడు. రామారావు కడుపులో ఉన్న వ్యాజే తండ్రిపోయాడట! తల్లి రెండేళ్ళక్రితం పోయిందట! చాలాడబ్బు సంపాదించే పోయాడట! కూర్చొని తింటే కొండలు తరిగిపోవా నాయనా ? ఆస్తిపాస్తులు లేకపోయినా ఏదో వుద్యోగం చేసుకుంటున్నాడు. కుటుంబాన్ని పోషించుకోలేడా ? అన్నారు.

బొబ్బిలి అల్లుణ్ని వెంటనే బదిలీ చేయించుకున్నారు. తొలిసారి మేష్టారు అల్లుడితో చెప్పవలసిన పరిస్థితి ఎప్పుడు వచ్చిందంటే—ఆయన కళ్ళతో అల్లుడు ఒకనాడు ఊరుబయట ఎవరో భామతో సరససల్లాపాలు ఆడటం చూసాక !

ఆనందరావు నిజస్వరూపం చాలా వేగిరంగానే బయట పడిపోయింది. తను తెచ్చుకున్నది ఇప్పుడు తన ఖర్చులకే చాలదు. మేష్టారు అడగకుండా వుండలేకపోయారు. మొదట మౌనం వహించిన తరువాత "ఇల్లరికం నిన్ను పోషించడానికి వచ్చాననుకున్నావా? నన్ను నువ్వు పోషించా"లన్నాడు. ఇలాంటి కటువుమాటలు ఇదివరకు వినని మేష్టారు ఒకరోజంతా భోజనం చెయ్యలేకపోయారు. ఒకనాడు మొగుడూ పెళ్లాల కేం వచ్చిందో మేష్టారు చూస్తుండగానే చెప్పతీసి సావిత్రిని కొట్టే పళ్ళలోనుంచి రక్తం కారటం మేష్టారు చూసి అక్కడనుంచి వెళ్లిపోయి రాత్రి తొమ్మిది దాటకగానీ యింటికిరాలేదు. మళ్లా అల్లునితో యిది నాయనా అది నాయనా అంటూ యీ విషయం ఆ విషయం మాట్లాడేవారు. కానీ వాడు వినిపించుకొనేవాడు కాదు—వినిపించుకున్నా చివరికి ఈ వెట్టి వేదాంతాలన్నీ నాకెందుకూ ? అని అక్కడనించి వెళ్లిపోయేవాడు.

క్రొత్తగా ఒక ఆఫీసరు వచ్చాడు. ఎక్కడికో వెళ్ళమన్నాడట-నే వెళ్లనన్నాడట-అది మనసులో పెట్టుకొని ఒకనాడు వంచిలో రికార్డు మోసుకొని వెళ్ళుమంటే యేదో గలాభా జరిగింది. తను చేస్తున్న ఉద్యోగం చిన్నదైనా తన వ్యక్తిత్వానికి తగ్గ పని చెప్పమన్నాడు. ఒక వారంరోజుల్లోనే కలహం పెరిగిపోయింది. మాటామాటా వచ్చి ఆ ఆఫీసర్ని చెంపపెట్టు తగిలించడానికి వురికితే గుమస్తా అడ్డుపడ్డాడు. మేష్టారి ముఖంచూసి ఉద్యోగం తీసేసేబదులు యేజన్సీప్రాంతాలకి బదిలీచేయించాడు. రెండు రోజులు వూరుకొని యేం నాయనా యిలా చేసావని మేష్టారు అల్లుణ్ని అడిగితే కోపంగా "నన్ను మీ కులానికి చేస్తే నేను మీయింట్లో ఉంటానా? నీ అవసరం చూసుకొని నీ కూతురు నన్ను మొగుడిలా చూడటంలేదే! బదిలీ చేయించుకోడానికే వాడికి గట్టిగా తగిలించబోయాను—ఇప్పుడు నీ కూతురు నాతో రాదూ?"

మేష్టారు "పోనీ యీ వూళ్లోనే వేరేగా వుండలేకపోయావా నాయనా? అమ్మాయి నువ్వూ కంటికి కనిపించేవారు."

నవ్వేసి "పిచ్చి—ఎందుకొచ్చిన మమకారాలు హాయిగా బ్రతకడం మీరిద్దరూ నేర్చుకోలేదు"—అన్నాడు.

మేష్టారు కూతుర్ని చూసి నాలుక కదలనిచ్చేవారుకారు. తన కటువంటి గౌరవం వుండకపోయినా అల్లుడనే మమకారం చంపుకతినేది. అది చంపుకోవాలని ప్రయత్నించినా కూతురు బ్రతుకేమవుతుందనే భయంచేత చాలా నెమ్మదిగా వుండేవారు.

ఒకనాడు యింతో ఆప్యాయంగా "అంత కలవుంది—కొన్నాళ్లు యిక్కడే వుండు నాయనా" అంటే వెంటనే తన పెళ్లాన్ని పంపించితీరాలని పెట్టె పరుపూ సర్దడం మొదలు పెట్టాడు. మేష్టారు చివరికి "నీక్కావలసింది అంతేగా. నేనెవర్ని పంపించకపోడానికి ? నీ పెళ్లాన్ని నువ్వు తీసుకుపో నాయనా!"

ఆ మాట అన్నారు. తన కళ్ళల్లో నీరు నింపకూడదనుకున్నారు. ఇంటినుంచి కదులుతున్న కూతురు మౌనంగా మమకారాన్నంతా కన్నీరుగా వలకబోస్తుంటే నాలుగడుగులైనా ముందుకు పడలేదు.

గదిలో కూలబడిన మేష్టారు తనకు తెలిసినంతమట్టుకు తొలిసారిగ విలపించారు. భార్య పోయినప్పుడైనా యిలా కాలేదు. పెళ్లాం తనను ఏదేదో ప్రశ్నించినట్లు తనుకూడ ఆమెకు దరిదాపుల్లో చేరినట్లు భ్రమించుకూ పెల్లుబికిన దుఃఖముతో తనలో తనే పిచ్చివానిలా మాటాడుకున్నారు. "నా సావిత్రమ్మకు సత్యవంతుణ్ని తెస్తాననుకున్నాను—తెచ్చాననుకున్నాను. కానీ...కాని......"

ఎంతోసేపటికిగానీ యీ చీకటిపోయి తెలతెలవారే ఉషఃకాంతులు మనసులోనికి అలుముకోలేదు. కుదుటపడిన మనసు ఏకాంతంనుంచి బయటపడడానికి ఆలోచించింది. ప్రకృతి వుదయించిన దగ్గరనుంచి పడిన కోట్లకొలది వానజల్లులలోని ఒక బిందువు తను ? ఎండిపోయిన ఇసుకపైబడితే లాభం ఏముంది? ఒక చెరువులోనో ఒక బీటలుదేరిన పొలములోనో-లేక సుక్తిలోనో... పడితే ఈ జన్మ తరిస్తుంది. ఈ తలపులు తనమీదనే జాలిని పుట్టించాయి. చిన్నవవ్వు నవ్వి "యేమిటో ఈ సంబంధాలు ఎందుకో ఈ అభిమానాలు. తెలివితక్కువచేత మా అల్లుణ్ని దూషిస్తున్నా గాని వాడు నాలాంటి మనిషే కాని దుర్బలుడు; అలాంటివానిమీద కోపం అసహ్యం చూపించి చేలవుతానా ? మా అమ్మాయిమీద అభిమానం యీనాడు లేకపోతే రేపైనా వాతల్లి మంచితనము చూచి కలగదా ?"

సావిత్రి జీవితం పాలకొండలో మరీ దుర్భరమైంది. ఎన్ని హింసలు పెట్టినా మౌనంతోనే భరిస్తూ తను తండ్రికి ఒక వుత్తరమైనా వ్రాయడానికి వీలులేదన్న భర్త ఆజ్ఞ అతురాలా మనస్ఫూర్తిగా పాటిస్తోంది. తండ్రి ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాస్తున్నా ఏదీ భార్యకు చూపించకుండా అడపాదడపా జవాబులిస్తున్నాడు.

ఒకనాటిరాత్రి ఆనందరావు ఎవరిదగ్గరనుంచో పుస్తకం తెచ్చాడు. కథలో రచయిత ప్రతీ ఆడదానికి ఇంకో మగాడిమీద వుంటుందిగానీ సంఘంలో కట్టుబాట్లకి జడిసి ఆ కోరికను మనసులోనే వుంచుకుంటుందని వ్రాశాడు. అది చదివి పెళ్లాన్ని బలవంతంచేశాడు నీకెంకే మగాడిమీద వుందో చెప్పమని. చాల సేపటివరకు ఆమె ఊరుకుంది. కాని ఏదో అంటేనేగాని తను అక్కడ వుండలేని పరిస్థితి వచ్చి నాకెవరిమీదా లేదంది.

"నామీదలేదని నాకు తెలుసులే. ఆ ఇంకోసారి చెప్పు"మన్నాడు.

సావిత్రి ఒక రెప్పపాటు వరకు చలించలేదు. రెప్పే బదులు నవ్వింది. ఆ నవ్వుమాని గది బయటకు తోసేస్తుంటే ఇంటావిడ కలుగజేసుకుంది. వాళ్ళతో కయ్యానికి దిగగానే ఆమె ఊరుకుంది. పైన దోమలు చలి ఆ చీరకొంగు కప్పుకొని తెల్లవారేవరకు అలానే కూర్చుంది. ఉదయం తలుపు తెరచేసరికి సావిత్రి మామూలుగా గదిలోనికి వెళ్లబోతుంటే "నా అసలైన పెళ్ళాం అయ్యింటే నా మనసు అర్థంచేసుకొనేదుండువు. నన్ను తలుపుతీయమని బతిమాలేదానవు. నీమనసు ఇంకెవరిమీదో లగ్నం అయివుంటుంది. అంచేతనే ఇంట్లో ముంగలావుంటావు."

ఈ మాటలన్నీ నలుగురికీ వినపడాలి—తనుచేసిన పనులు నలుగురికీ తెలియాలని ఆనందరావుకు ఉబలాటం హెచ్చు. సావిత్రికి అంతా నష్టే.

మాష్టారుకు వరసగా రెండురోజులు అమ్మాయి కలలో కనబడింది. ఒకరోజు విచారంగా ఉన్నట్లు మరుచటిరోజు నన్ను మరచిపోనాన్నా అని ఏడుస్తున్నట్లూ — ఏదో జరిగివుంటుందని నిల్చున్నపాటున బయలుదేరేముందు అల్లుడువ్రాసిన ఉత్తరం అందింది.

"మీ అమ్మాయి నాకు మీపేరుపెట్టి భయపెట్టాలని చూస్తోంది. తీసుకుపోయి నాలుగురోజులు ఉంచుకుని పంపించండి. లేకపట్టుకొని నాటివరకు త్రోసుకవెళ్ళి పడ్డావా లేదా అని అన్నానేగాని మళ్ళీ భార్య అని ఇంటికి తీసుకవచ్చి ఆమె చేతితోనే ఆమె మెడకి రిబ్బను కట్టించాను. ఎందుకు? నన్ను ఎదిరించినవాళ్లకు ఉరిశిక్ష విధించి న్యాయం చేకూర్చాలి."

మేష్టారి కాళ్లు విరిగిపోయినా పరుగెత్తుకవెళ్ళినట్లు పాలకొండ వెళ్లారు. కూతుర్ని ప్రాణంతో చూడగానే సగం పోయినప్రాణం తిరిగివచ్చింది. తల్ల నిమురుతూనే వచ్చేదుఃఖాన్ని ఆపుకుంటూ "నాతల్లీ... నాతల్లీ... ఇంక నోరు పెగలలేదు. కూతురు కాసేపటికి చిరునవ్వుతో "నాకేంనాన్నా హాయిగానే ఉన్నాను."

భార్యమాటలకు ఆనందరావు వెక్కిరించాడు. "సంతోషంగా వుండటం సత్యం ఆడటం మీ అమ్మాయికి తెలియద"న్నాడు. అంతేకాకుండా తన ప్రతాపం మామగార్కి బాహాటంగా తెలియపర్చాడు. మనసులో తన కూతురు ఇంత బాధ ఎలా ఓర్చిందని గింజుకున్నా పైకి ఏమీ అనలేదు. ఆశ్చర్యం ఏమంటే ఆనందరావు ఒక నెలరోజులుపాటు చిక్కిపోయిన పెళ్లాన్ని కన్నవారింటికి పంపడానికి ఒప్పుకున్నాడు.

సావిత్రికి కన్నవారింటికి వెళ్లడం ఇష్టం లేకపోయినా తండ్రి బలవంతానికితోడు భర్తకూడా మంచిమాటలు ఆడటం మొదలుపెట్టాడు. ఈలోగా తిరిగివచ్చి మళ్లీ తీసుకవెళ్తానన్నాడు.

అనుకున్నట్లు ఆనందరావు నెలరోజుల్లోగానే బొబ్బిలివచ్చాడు. ఈసారి తిరిగి వెళ్లే అవసరం లేకపోయింది. ఇంటి పొరుగుననే యున్న ఓ క్రొత్తికోడలితో సరసం భోజనం చెయ్యబోయాడు. ఫలితం ఆ పూర్లోనేకాదు చుట్టుపట్ల ఎక్కడా నిలవటానికి వీలులేకపోయింది. ఆ అమ్మాయి తనభర్తృ కోరమూర్ఖలం ఊసేదని అంచేత తను యిలా చేయబోయాడని అనగానే వీపుకూడా చదునైంది.

వచ్చిన నాలుగురోజులు ఏగొడవా లేదు. ఒట్లు గట్టిపడ్డాక సావిత్రివైపు ఒకనాటిరాత్రి చూస్తూ చూస్తూ "నువ్వు చాలా మంచి దానవు" అన్నాడు. ఆమె ఒకసారి తలయెత్తిచూసింది. కార్తీక లాంతరు వెలుగులో ఆమె ఇన్నాళ్లు మనసులో పూజించుకున్న మొగుడు కనిపించాడు. "నువ్వువుంటే ఉద్యోగం ఊడేదికాదు. దెబ్బలు తినేవాడ్ని కాదు—"

"ఊఁ" అంది ఆశ్చర్యంగా సావిత్రి.

"నాకు అబద్ధం ఆడటం తెలియదు. నిన్ను ఎందుకు పంపించావనుకున్నావు..."

మౌనం సావిత్రిని కొంతసేపు ప్రమింగివేసింది. ఈసారి పెగిలిన గొంతుకలో ఆవేదనా విచారం మిళితమై "నాప్రక్కను నేను వేరేగా బ్రతుకుతున్నాననే ఆశైనా లేకుండాచేశారు."

"మీ నాన్న కోరిక నీకోరిక నెరవేరిందిగా! మళ్ళీ ఇల్లరికం వచ్చాను."

"నాకాకోరిక ఎప్పుడూ లేదు."

జవాబులేదు. ఆ మరుచటిరోజు ప్రశాంతంగానే గడిచింది. నిజం మేష్టారులోను చెప్పాడు. ఆయన విచారించలేదు. మనసు కుదుటపడితే చిన్న వుద్యోగం సంపాదించవచ్చని.

ఇక ఊరువెంబడి పడ్డాడు. పదిహేనురోజుల్లో చాలా గొడవలు జరిగాయి. ఒక గొడవ చాలా తీవ్రరూపందాల్చింది. తను ఒక ప్రముఖ సోషలిష్టని అవినీతిని పూర్తిగా రూపుమాపడానికి సంఘసేవే తన జీవితలక్ష్యమని నలుగురితో చెప్పటం మొదలుపెట్టాడు. అవినీతిని బయటపెట్టే కార్యక్రమంలో మొదటిమెట్టుగా గోడమీద కాగితములు అంటించడం మొదలుపెట్టాడు. ఎవడో ఏదో చేస్తున్నాడని—ఇంకో ప్రముఖవర్తకుడు ఫలానా ఆఫీసరుకు యిన్నివేలు లంచం ఇచ్చాడనీ—ఫలానా ఆఫీసరు పెళ్లానికి ఇంకో ప్రియుడు ఉన్నాడని!

ఇంత బాహాటంకాగానే ఊరంతా గుసగుసలు బయలుదేరాయి. ఆ ఫలానావారు మేష్టారుకోసం కబురు పంపించవలసి వచ్చింది. ఆయన తిరిగివచ్చి అల్లుడ్ని ప్రశ్నిస్తే "నేను వ్రాసింది అబద్ధం అని నిరూపించండి. మీరుకూడా సత్యానికి దూరమైపోతున్నారు. వీళ్లందరి అవినీతిని ప్రజలముందుపెట్టి వీళ్లకు మంచినీరు పుట్టకుండా చేస్తాను" అన్నాడు.

మేష్టారు చాలాచెప్పినా ప్రయోజనం లేకపోయింది. అట్టే అల్లునితో వాదించటానికి యిష్టపడక ఊరుకున్నారు. ఆ వారం రోజుల్లో ఒకరోజు రాత్రి తన కార్యక్రమం కొనసాగిస్తుంటే కొందరు గుమిగూడి శుభ్రంగా వీపు చదునుచేశారు. ముక్కుమీద కనుబొమ్మమీద చిన్న దెబ్బతగిలి రక్తం కొద్దిగా కారుతోంది. ఇంటికి వచ్చాడు. తనకోపం పూర్తిగా మామమీద చూపించాడు. డాక్టరు సర్టిఫికేటు తీసుకొని పోలీసులకు ఫిర్యాదుచేస్తావా లేదా అని అరుస్తున్నాడు. మేష్టారు మాటాడలేదు. మామకు తెలియకుండా

ఏపనీ జరగదని — మళ్లీ యీ యింటిముఖం చూడనని వెళ్లి పోయాడు—చీకటిలో కలిసిపోయాడు.

మేష్టారు అలా నిల్చుండిపోయారు. సావిత్రి రెండుచేతులూ ముందుకు వేసి తండ్రివైపు చూస్తూ నిల్చుండిపోయింది. రెండురోజులు యెక్కడికీ కదలలేదు. మళ్లీ ఆయన యే నిర్ధారణకు వచ్చారో యేమో మామూలుగా బడికి వెళ్లేవారు.

కొన్నాళ్లు గడిచాయి. మేష్టారి ఉత్తరం చూసుకొని ఒకనాటి మధ్యాహ్నానికి విశాఖపట్నంనుంచి రామారావు వచ్చాడు. తన బాధల్నీ సంతోషాన్నీ రామారావుకు చెప్పుకున్నారు మేష్టారు. సాయంత్రంవరకూ, అల్లుడు వెళ్ళిపోయేవరకు జరిగిన సంగతి వివరంగా చెప్పారు. సాయంత్రం యిద్దరు షికారుకు బయలుదేరారు. మూడు ఫర్లాంగులు దూరాన్న ఉన్న రైలురోడ్డు దగ్గరకు వెళ్లి ఆదగ్గరగా యెత్తుగా ఉన్న మర్రిచెట్టు మొదట్లో కూర్చున్నారు.

మేష్టారు ఒక కాగితం రామారావుచేతికి ఇచ్చారు. అది అల్లుడు వ్రాసిందే. అందులో యేంవుందంటే సావిత్రి నిజస్వరూపం తాను తెలుసుకున్నానని—దానికి మొగుడంటే యేమాత్రం అభిమానం వున్నా ఆరాత్రే తనవెంట వచ్చేదని—యిలాంటి స్త్రీని తను ఇక సంస్కరించడానికి పూనుకుంటానని వ్రాశాడు. తరవాత తన శిష్యుల్లో ఇద్దరికి వ్రాసిన కాగితాలు రెండు యిచ్చారు. "మేష్టారి ఇంట్లో స్టూడెంట్సు కరవా ? అందులో సావిత్రికి మొగుడంటే అసహ్యం! ఏమైనా జరుగుతుంది !" రామారావుకు బ్రహ్మాండమంత కోపంవచ్చి యేదో యేదో అనేసాడు. మేష్టారికీ తనలా కోపం వచ్చిందనుకున్నాడు. గానీ రాలేదు.

"ఇప్పుడు నిన్నెందుకు పిలిపించానంటే"......అని ఆగి పోయారు మేష్టారు. మళ్ళీ అన్నారు "వాడిని తిట్టటానికి నేపిలువ లేదు. నాతో నువ్వూ ఖడ్గపురం రావాలి."

కాస్సేపు ఆలోచించాక సరే అన్నాడు. లేచిపోతూ "వెళ్ళక పోదును కానీ వాడేదో అమ్మాయికి ఉత్తరం వ్రాసినట్లుంది. అప్పటి నుంచీ అక్కడికి తీసుకవెళ్లి విడిచిపెట్టమంటోంది. మనంవెళ్లి వాడి పరిస్థితి చూసాకా ఆలోచిద్దాం" అన్నారు.

ఇద్దరూ ఖడ్గపురం వెళ్లాక ఒకపూట తిరిగాక ఆనందరావు జాడ తెలిసింది. ఒక మారుమూలలోవున్న ఆ కొంప—ఆ కొంపలో వుంది ముప్పయ్యేళ్ల భామ—నోటిలో ఖిల్లీ—పెదాలకు లిప్‌స్టిక్ వ్రాసినట్లుంది. ఎర్రటి జాకెట్టు, వ్రేలాడే జూకాలు—చిన్న బెంగాలీముడి—మట్టిరంగు చీరకట్టి కొత్తా పాతా, ఉత్తరదక్షిణపు సంస్కారం కలిసిన మనిషిలా అగుపించింది. ఆమె గంభీరంగా మాటాడుతుంటే శక్తి వుత్పత్తి అవుతున్నట్లుంది. సుమ్మంలో చాప వేసి కూర్చోబెట్టింది. మేష్టారు మాటాడలేదు. రామారావు ఆమె అడిగిన ప్రశ్నలకు జవాబుచెప్పాడు.

"మీరోడంటున్నారు. నాకొక్కత్తే ఉండేది. అది చచ్చి పోయిందని చెప్పాడే! మరెవరూ లేరన్నాడు."

ఇద్దరూ ఆఘాతికి మాటాడటానికి పిరికివాళ్లయ్యారు. ఆమె అంది "మీరెవరు యింకెవరో! ఈయన వస్తాడు కూర్చుండగాని—చాల మంచిమనిషి—ఒకోసారి కోపం వస్తాది—ఆక్షణంలోనే చిన్న పిల్లడిలా అయిపోతాడు—ఏడ్చుకుంటాడు ఆడదానిలాగ—మళ్లా మరో క్షణానికి పెద్దపులే—ఆయనదగ్గర కోపం ఎంతుందో కనికారం అంతుంది—చెడ్డెంతుందో మంచంత వుంది—యీ దొడ్డమనిషి!"

ఇంతలో పొరుగుపిల్లాడిచేత తెప్పించిన 'చా' నీరు యెదర పెట్టి బలవంతంచేసింది. మేష్టారు త్రాగలేదు. రామారావు త్రాగుతుంటే "ఆయనకి ఖర్చుకి డబ్బు ఇచ్చేస్తే యింకేం గొడవ వుండదు. గొడవచేసినా నాకేంటో వానోఅమ్మలా అయిపోతాను. అప్పుడు కొట్టినా నవ్వుతాను—తిట్టినా నవ్వుతాను. కొట్తాడు, తిట్తాడు, తరవాత ఆయనే ముద్దిస్తాడు. అప్పుడు అసలైన మొగుడులాగ వుంటాడు."

ఆమె ఇదంతా చెప్పడానికి యేమాత్రం మొగమాటపడలేదు. ఆమె యెంత బజారుమనిషైనా యేదో సావిత్రిలో లేనిది ఈమె దగ్గర వుందనిపించింది. అందుకే ఆనందరావు యీమెదగ్గర వుండ గలిగి యీమెచే దొడ్డమనిషనిపించుకున్నాడని సైకాలజీ స్టూడెంటు రామారావు అనుకున్నాడు.

ఆనందరావు వచ్చాడు—తుఫాను వచ్చినట్లయింది. మేష్టారు గానీ రామారావుగానీ యేమాటా అనటానికి అవకాశం యీయలేదు. నానా దుర్భాషలాడాడు. కూతురుని ఇంట్లో పెట్టుకొని వ్యాపారం చేస్తున్నావన్నాడు. న్యాయాన్ని నీతిని సమర్థించని బురకారాయుడి వన్నాడు. ఈ మనిషి తన కూతురుకంటే యెన్నోరెట్లు నయమని-యిది తన కూతుర్ని పోషిస్తుందని అన్నాడు. మేష్టారు దైన్యంగా "ముందుగతి ఆలోచించు నాయనా" అన్నారు.

"నాకేమిటి ఒకరి అదుపాజ్ఞలో ఉండే అవసరం నాకేం వుంది?"

కోపం కక్కుతుంటే మేష్టారు సాంతంగా "అవును నాయనా! తెగిన గాలిపటంలా స్వేచ్ఛగా విహరిస్తానంటావు. కానీ ఆ తెగిన గాలిపటం ఎంతసేపు గగనమార్గాన వుంటుంది? మనిషైపుట్టాక యెవరో ఒకరి అదుపాజ్ఞల్లోనో అథవా తనయొక్క సభ్యత్వానికైనా కట్టుబడకపోతే—యెదురయ్యేది వినాశం !"

ఆనందరావు విరగబడి నవ్వుతూ "ఇది బడికాదు పంతులూ ! వచ్చినత్రోవనే పోతావా లేదా ?" ముఖంచూసి మాటాడుతున్నాడు రామారావు. ఇద్దరూ లేచేవరకూ వెంటతరుల్తూ మేష్టారు ముఖం మీద తుప్పున ఉమ్మేశాడు. ఇద్దరు నడుస్తున్నారు. వాడు అంటున్న మాటలు ఇంకా వినిపిస్తున్నాయ్. వినబడకపోయినా చెవుల్లో గింగురుమంటున్నాయ్. మేష్టారు ఒకమాటైనా ఆడలేదు. రైలు ఎక్కారు. మేష్టారు నిముషానికి ఒకవిధంగా అగుపిస్తున్నారు. అగ్నిపర్వతం తనలో ఉద్భవించిందని ఒక క్షణం—మరోక్షణం మహాసముద్రపు లోతుల్లోని నిశ్చలత్వం తనని యెటువంటి గాబరా పొందకుండా చేస్తోందని అనుకున్నాడు శిష్యుడు.

ఆయన మైళ్లతరబడి రైలువచ్చినా మాటాడలేదు. కొంతసేపు హాలాహలాన్ని చిరునవ్వుతో మ్రింగిన గరళకంఠునిలా మరోక్షణానికి శ్మశానవాటిలో భీభత్సంగా నాట్యంచేస్తున్న పరమశివునిలా అగుపించారు.

ఊగేటప్పుడు "నాయనా!" అన్నారు. పెద్ద నిట్టూర్చారు. నడచి ఇంటికి వెళ్తున్నారు. మళ్లీ "నాయనా!" అన్నారు. "అమ్మాయి అడిగితే యేంచెప్పను ?"

చీకటిలో సమాధానం కోసం గింజుకుంటుంటే రామారావుని గట్టిగా పట్టుకొని వలవల యేడ్చేశారు.

"మేష్టారూ!" అన్నాడు యేదో రౌద్రం యేదో అభిమానం–చెప్పలేని బాధ అన్నీ ఒక్కసారిగా ప్రజ్వరిల్లాయి.

శిష్యుడు మరింకేమీ మాటాడలేదు. చీకటిలో యిద్దరూ మెల్లగా నడచి ఒంటిగావున్న యిల్లు చేరుకున్నారు. మేష్టారు సావిత్రివైపు చూడలేదు. జవాబు వాళ్ల ముఖాల్లోనే గ్రహించిన సావిత్రి యేప్రశ్నా వేయలేదు.

ఒకరోజు....రెండురోజులు......వారం....నెల....గడిచిపోతున్నాయ్. అల్లుని దగ్గరనుంచి వచ్చిన ఒక్క ఉత్తరం కూతురుకు చూపించలేదు. తనూ చదువలేదు. రెండో వుత్తరం చింపనూ లేదు. మరి వుత్తరాలూ లేవు. ఎవరైనా కూతురు గుణగణాలు పొగిడి అల్లుని దూషిస్తే "నాకు కూతురు లేదు. నా కొడుకు సావిత్రి!" అనేవారు మేష్టారు. దుఃఖంతో మౌనంతో కృంగిపోయి కృశించిపోతున్న సావిత్రి ఒంటరిగా కూర్చొని తనలో తనే నవ్వుకుంటోంది. అప్పుడప్పుడూ తనలో తనే యేవేవో మాటాడుకుంటుంది. మేష్టారు కూతురు పరిస్థితిచూసి...రోజుకు రోజూ తనలో తనకు తెలియకుండానే ద్వేషం రగులుకుంటోంది......ఒకనాటి రాత్రి తనకు నిద్దరపట్టలేదు. కూతురు నడిరాత్రిమీద లోపలి వసారాలో చీకటిలోనే యిటూ అటూ పచారుచేస్తూ యేవో మాటలు అంటోంది. "దెయ్యాలు భూతాలు రాకుండా రక్షిస్తున్నాను యీయింటికి"—మేష్టారు కూతురు అంటున్న మాటలు వినగానే నడుం విరిగినట్లయింది. అయినా తమాయించుకొని లేచి "చాలా రాత్రయింది పడుకో అమ్మా" అన్నారు.

సావిత్రి తండ్రివైపు చూస్తూ, "నాన్నా! ఆయన యేమయ్యారో....ఉత్తరమైనా రాలేదు! నన్ను ఆయన దగ్గర విడిచి పెట్టరూ!" అలా విలపిస్తూనే యేడ్చేస్తోంది. కొద్దిక్షణాల్లో మళ్ళీ పకపక నవ్వుతూ "నేను మీ కొడుకునుకదూ? ఇక్కడే ఉంటాను. ఏ భూతాలనుంచీ మీకు ఆపదరాకుండా చూస్తుంటాను."

తెల్లవారేవరకూ యిద్దరికీ నిద్దరలేదు. పగలల్లా కూతురు పనిపాట్లు యేదో చేసుకుపోతోంది. ఒక మూగమనిషిలా ప్రపంచంతో తనకేం సంబంధంలేనట్లుగా పోతోంది. ఇరుగుపొరుగంటూ ఎవరూ లేరు. ఒక చిన్న తోటలో వూరిచివర మేష్టారు ఇల్లువుంది. రైళ్ల కూత, పిట్టల అరుపులూ వినిపిస్తుంటాయ్.

సావిత్రి పరిస్థితి రానురాను అధ్వాన్నం అయిపోతోంది. మనోవ్యాధితోపాటు యేదో జబ్బు ఆవరించినట్లుంది. మేష్టారు కూతురుని చూసినప్పుడూ, తలచినప్పుడూ అల్లుడు యెదరగా ప్రత్యక్షమౌతున్నాడు. తను అల్లునిమీద రాతిబండ వేసినట్లు, తుపాకి పేల్చినట్లు ఇంకా రకరకాల క్షణికమైన ఆలోచనలు తిరిగినా యెంతోసేపటికిగాని మళ్ళీ తన మామూలు ధోరణికి రాలేకపోతున్నారు.

చంద్రకళలు మారిపోతున్నాయ్. పున్నమ మళ్లీ అమావాస్య. మళ్లీ వేసవివచ్చింది. ఒక సంవత్సరం దాటినా ఆనందరావు జాడ తెలియదు. తెలుసుకోవాలని మేష్టారు ప్రయత్నించలేదు...కానీ యేదోవిధంగా యింట్లోవున్న యిద్దరికీ అంటిపెట్టుకున్నట్లే వున్నాడు.

మేష్టారి విధవ చెల్లెలు రాజమండ్రిలో వుంది. సావిత్రి పరిస్థితి బాగులేదని తెలిసి చూడటానికి వచ్చి యీ జబ్బు బాగుచేయిస్తానని సావిత్రిని తీసుకవెళ్ళింది. మేష్టారు కాదనలేదు. స్థలం మారిస్తే కూతురు మానసికంగా కొంత కోలుకుంటుందని అనుకున్నారు.

సావిత్రి రాజమండ్రి వెళ్లి నెలరోజులు పూర్తికాలేదు గానీ మేష్టారు ఇక్కడ మానసికంగా బాధపడుతున్నారు. ప్రతిక్షణం కూతురుగురించి ఆలోచనలే! చెల్లెలు జాగ్రత్త తీసుకుంటుందనే విశ్వాసంవున్నా యిల్లంతా చీకటిగొయ్యినట్లుంది. ఒకసారి చూసైనా వద్దామనే కోర్కెతో బయలుదేరి వెళ్లారు.

తిరిగివచ్చినప్పటికి రాత్రి పదిగంటలైంది. తలుపుతీసి హరికేన్‌లాంతరు వెలిగించారు. కాళ్ళూ చేతులూ కడుక్కొన్నాక పరుపు వేసుకున్నారు. కూతురుగురించి ఆలోచిస్తూనే పక్క వాల్చారు. కూతురు చిన్ననాటినుంచీ జరిగిన సంఘటనలన్నీ తరంగాలులా తలపుకు వస్తున్నాయ్. గుండె చివుక్కుమంది. ఈలోకంలో తనకేదైతే ప్రియాతిప్రియమైనదో దానిని ఒక హంతకునికి చేతులారా అప్పగించాననుకున్నాడు. పాముకు పాలుపోసి పెంచటం పులిని ఇంట్లో పెట్టుకోవటం ఎంత తెలివితక్కువ? తను అల్లుడ్ని ఇంట్లోపెట్టుకొని తెలివితక్కువవాడి నయ్యాననుకున్నాడు. వాడినుంచే తన కూతురి పరిస్థితి యీలా వచ్చింది. తన సర్వస్వాన్ని కొల్లగొట్టినవాడు......రాత్రి పదకొండు దాటిపోయింది.

ఈ ఆలోచనలో అల్లునిమీద యీర్ష్య లోలోన మండుతున్న అగ్నిపర్వతంలా అయిపోయింది. తలుపుతట్టిన చప్పుడు—మొదట వినిపించలేదు. రానురాను చప్పుడు వుండివుండి వినిపించింది. ఎవరూ అని లోనుంచే అరిచారు. జవాబులేదు. మళ్లీ తలుపు చప్పుడయింది. లేచి లాంతరు పట్టుకొని గుమ్మందగ్గరకు వెళ్లి "ఎవరూ"? అంటూనే తలుపుతీసారు.

"నువ్వా?" మేష్టారు ఒక్క అరుపు అరచారు.

అల్లుడు తలదించి నిలుచున్నాడు. అగ్నిపర్వతం బ్రద్దలైంది. గాలిపటం తెగిపోయింది. కోపం శరీరాన్నంటినీ పైకి ఎత్తివేసింది; గజగజ వణకించేసింది. తన స్వాధీనంలో లేని తన మనసు...అవయవాలు...చేతిలోని లాంతరును అల్లునిమీదకు విసిరేశాయ్.

ఆనందరావు అంతర్ధానమయ్యాడు. చీకటిలో మేష్టారు తలుపు ధాం మని వేస్తూ పరుపుమీదకు చెంగున గంతువేసి కూలబడిపోయారు. అంతే...తెల్లవారి లేచేసరికి వార్తవచ్చింది...అల్లుడు రైలుక్రింద తలపెట్టాడని...ఆహా అన్నారు—అంతే! ఎందుకు ఆత్మహత్య చేసుకున్నదీ యింకెవరికీ తెలియలేదు.

పదిగంటలప్పుడు తిరిగి వస్తుంటే తపాలా బంట్రోతు యెదురై "మూడురోజులై వుత్తరం వచ్చింది. కిటికీలోనుంచి గది లోనికి వెయ్యటానికి ప్రయత్నించాను గానీ వీలయింది కాదు" అంటూ కవరు అందిచ్చాడు. ఇంటికి వచ్చాక చదువకూడదనుకుం టూనే చదివితే గుండె జెణికింది. పట్టు తప్పిన మనిషి అయి పోయారు.

మేష్టారిపరిస్థితి మిత్రునిద్వారా విన్న రామారావు బొబ్బిలి వచ్చాడు. పగలు పదిగంటలకు వచ్చినదగ్గరనుంచీ మేష్టారిదగ్గరనే కూర్చొనివున్నాడు. ఆయన యేమీ మాటాడలేదు. ఈ లోగా చాలామందివచ్చి వెళ్ళిపోతున్నారు. ఆయనవైఖరి చూస్తూంటే బహుశః కొద్దిగా మతి చెడిందేమో ననిపించింది. ఇంత నీరసంగా తనెప్పుడూ చూడలేదు.

హోటలుకు వెళ్లి భోజనంచేసి వచ్చాడు మేష్టారిప్రక్కనే చాపవేసుకున్నాడు. రాత్రి తొమ్మిది దాటింది. చీకటిరాత్రి ఒకసారి రైలుకూత వినిపించింది. మేష్టారు గుర్కుమన్నారు.

పదిగంటలైంది. సావిత్రి పెరటిగదిలో కూర్చొనివుండటం గుమ్మంద్వారా కనిపిస్తోంది. బెడ్‌లైట్ వెలుగులో ఆమె ఒక్కొక్కసారి లేచి ఇటూఅటూ తిరుగుతోంది. కొంత సేపయ్యాక రామారావుకు ఆమె అడుచున్నమాటలు వినిపిస్తున్నాయ్. "మీరు ఎంత మంచివారు...మీరంటే నాకు అంత పట్టీ యెందుకుంటేది? మీ అంత మంచివారు లోకంలో వున్నారా? మీరు చచ్చిపోయారని వారంతా అంటున్నారు? నిజంగానే...లేదు లేదు...మీరు చావలేదు...మీరు బ్రతికే వున్నారు ...ముమ్మాటికీ..."

రాను రాను ఆమె గొంతుక పట్టుకపోయింది.కళ్లల్లో నీరు కారిపోతోంది..."పోనీ లెండి. ఒకసారి వచ్చి నాతో మాటాడరూ?... మాటాడరూ?"

సావిత్రి అలా అంటూనే మంచంమీద కూలిపోయింది. ఈ మాటలు వింటూ ఈ పరిస్థితి తిలకించిన రామారావు కళ్లల్లో నీళ్లు తిరిగాయ్. నిశ్శబ్దంలో ఆమె తీస్తున్న యెగవూపిరి యిక్కడికి వినిపిస్తోంది. అప్రయత్నంగా "అయ్యో! పాపం!" అన్నాడు.

మేష్టారు "నాయనా!" అన్నారు. శిష్యుని ఒళ్లు ఒక్కసారిగా పులకరించింది. ఏం మాటలు వస్తాయో అని ఆతృతతో యెదురు చూశాడు.

"నాయనా! సావిత్రినిగూర్చి విచారిస్తున్నావా? వద్దు నాయనా-తండ్రీ, నా పని నేను చేశాను. అది ఆమె కర్మ! నేను అంచేత నే విచారించలేదు."

శిష్యుడు ఆశ్చర్యంగా యీ బాధ అంతా దేని కన్నట్లు చూశాడు.

వెనువెంటనే మేష్టారు అన్నారు "నా గురించి విచారించు నాయనా...నా గురించి...విచారించు..."

ఇంతలో ఆయన కళ్లల్లోనుంచి నీరు గిరగిర తిరిగి, జలజలా స్రవాలటం చూసి దప్పున దగ్గరకు వొచ్చాడు. కళ్లు ఒత్తుకోకుండానే "ఇదిగో...యీ ఉత్తరం చదువు నేనెందు కిలా అయ్యానో అర్థం అవుతుంది!"

హరికేన్‌లాంతరు దగ్గరగా జరిగి రామారావు వుత్తరం తనలో చదువుకోవటం మొదలుపెట్టాడు!

"మహారాజశ్రీ మాను గార్కి నమస్కారములు.

ఈ వుత్తరం చదవకండా చింపాలన్నంతకోపం మీకు వస్తుంది. కానీ ఒక్కసారైనా చదవమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. నేను చేసిన పనులకు మీలాంటి వుత్తములు, మీ కూతురులాంటి పతివ్రత యెన్ని బాధలు పడ్డారో తెలుసుకున్నది యీ మధ్యనే! నేను యెందుకిలా అయ్యానో నాకే అర్థం కాకుండా ఉంది. నేను బహుశః కల్లుత్రాగినవాడిలా అయ్యుంటాను. నాలోని చెడు గుణే సింహాసనం ఎక్కించాను. నాగురించి మీకు చాలా తెలుసునని మీరనుకోవచ్చు. కానీ మీకు నాగురించి అధికం తెలియదని మీయిల్లు చేరేముందు, మీ యిల్లు విడిచిపెట్టాక విషయాలు పూర్తిగా తెలియవని ఆవే వ్రాసుకుంటున్నాను. నేను కొన్నాళ్లు మనిషిని యెందుకు కాలేదో నా కిప్పుడు అర్థమైంది.

మానాన్న గడించిపోయారు. మా అమ్మ ముద్దుచేత వరిదైన అదుపాజ్ఞలలో ఉంచలేదు. చిన్నతనంనుంచీ నాదే పెద్దరికం; నాకు కూడిన చెడ్డసహవాసందే పెద్దరికం అంటే సబబుగా ఉంటుంది. నేను మా అమ్మచావుకి కారణం అయ్యానేమో అనిపిస్తుంది. నేనెలా బ్రతుకుతానన్న బాధతో యెల్లప్పుడూ ఉంటేది. ఆమె పోయేసరికి మిగిలింది నేను—యెందుకూ కొరగాని నా ఉద్యోగం! నాకు కష్టాలనేవి యెలా ఉంటాయో మీయిల్లు విడిచి పెట్టాక గానీ తెలియలేదు.

మీయిల్లు విడిచిపెట్టాక కొన్నాళ్లు యెలాంటి తిరుగుళ్లు తిరిగానో మీకు తెలుసు. ఖర్గపురంలో డబ్బుకోసం నన్ను దేవునిలా చూచిన ఆమెనుకూడా మోసగించాను. జీవితంలో ఆమె ఒకేసారి ఆదిశక్తియై నన్ను త్రొక్కివేసి ప్రాణాలతో వూరు విడిచిపెట్టనిచ్చింది. కడుపుకోసం నెలలకొద్ది బాధపడ్డాను. ఆకలంటే యేమిటో నాకు తెలిసింది. రిక్షాలు లాగాను. బస్తాలు, బుట్టలూ మోశాను. రోడ్లు ఊడిచాను. చింకిబట్టలతో చలికీ యెండకీ లోనై నాలానే బాధపడే యెందరిమధ్యనో తిరిగాను. ఈ బాధలు పడి, యితరులవాళ్ళ బాధలు కళ్ళారా చూడటంవల్ల నా కరుడుకట్టిన హృదయం ... సూర్యరశ్మి తగిలిన మంచులా అయిపోయింది. రాహువు విడిచిన సూర్యునిలా...నాలో అసలైన వెలుగు ప్రకాశించింది...ఈ హృదయంతో నేను జరిగినరోజులు తలంచాను; చూచాను. నేను యెంత చెడ్డవాడినో తెలుసుకున్నాను.

మళ్లీ ఇన్నాళ్ళకి నాలో మీమీదనున్న గౌరవం, విశ్వాసం భక్తి మీదగ్గరకు రానిస్తోంది. నావిషయమై సావిత్రిపలవరిస్తూ పిచ్చిమనిషి అయ్యుంటుందని నాకు తోస్తోంది.ఆమె పరిస్థితి చూసి మీరు బేజారెత్తి నేనంటే పరమశత్రుత్వం వహించివుంటారు. కానీ నాలోని విశ్వాసం నన్ను మీరు ఉదారులని, నాపాతజీవితాన్ని మరచి గౌరవించి ఆదరిస్తారని మళ్ళీ మీ దగ్గరకు చేరనిస్తోంది. ఇటు

వంటి ఆశను నిరాశచేస్తే నాకీలోకంలో నిలవటానికి చోటు లేదు—నేను భగ్నహృదయుడనై యేమౌతానో చెప్పలేను.

మీ అల్లుడు
ఆనందరావు"

పరిస్థితి గ్రహించిన రామారావు ఒక నిట్టూర్పు విడిచాడు. మేష్టారిదగ్గరగా వస్తుంటే మళ్ళీ దీనస్వరంతో "నాయనా! ఊరంతా నేనేదో అయిపోయానని నాకు నీతులు చెప్తున్నారు. నే నేమీ కాలేదు—చలమయ్యనే. కానీ ఇదివరకు చలమయ్యలా సంఘంలో ఒక గౌరవమైనస్థానాన్ని అలంకరించడానికి తగిన వాడిని కాను"....

మేష్టారి దుఃఖం పొంగిపోవటంవల్ల మాటాడలేకపోయారు. కొంతసేపయ్యాక కా నేలవైపు దృష్టి ఆనుస్తూ "నా యేడుపు నా గురించే..."

పరుపుమీద చేరబడ్డారు. ఉండి ఉండి ఆయన ముఖం ముడుచుకపోతోంది. అంతటిలో ఆయన వెక్కుతూ కన్నీరు కారుస్తుంటే రామారావు ఆయనను తాకి ఓదార్చబోయాడు.

ఆయన కళ్లు తుడుచుకుంటూ "నాయనా! లోకంలో యెందరో యెన్నో చెడ్డపనులు చేస్తారు. నా అల్లుడూ చేశాడు. వాడి పనులవల్ల మేం మానసికంగా బాధపడ్డాం. అంతే—కానీ ఇన్ని చెడ్డపనులుచేసి ఎవరినీ ఖూనీ చెయ్యలేదు. కానీ నేనో—లోకమంతా నన్ను మంచివాడనని గౌరవిస్తుంది—కానీ ఒక్క నిముషంలో వచ్చిన కోపంతో బ్రతుకుమీద గంపెడాశతో వచ్చిన ఒక మంచివాని ప్రాణాన్ని తీశాను.....నేను ఖూనీకోర్ని—నాకీసంఘంలో స్థానంలేదు..."

నిశ్శబ్దం చీకటితోపాటు ఆవరించింది. ఎంతసేపటికో చలమయ్య మేష్టారి మాటలు వినిపించాయ్. "తెగిన గాలిపటం ఆకాశాన యెంతసేపు వుంటుంది?"

ఈ మాటలు ఆయన పలవరిస్తున్నారో లేక తెలివితో అంటున్నారో తెలుసుకోలేని రామారావు కిటికీగుండా చీకటిలోనికి చూసాడు. రైలుకూత వినిపించింది భీకరంగా!

# విశాలాంధ్రాశయసిద్ధి

శ్రీ కొన్నుఅగడ్డ సత్యనారాయణమూర్తి

ఎట్టకేలకు విశాలాంధ్రాశయము సిద్ధించినది. సర్వతోముఖాభివృద్ధికై ఆంధ్రులింక సంయుక్తప్రయత్నము లొనరింతురుగాక. పురోభివృద్ధికై ముందంజవేయు జాతి ప్రాచీన చారిత్రికాంశములను స్మరించుకొనవలెనని ఒకప్పుడు చర్చిల్ వ్రాసెను. ఇట్టి స్మరణవలన ఆత్మజ్ఞానము కలుగును. ఆత్మజ్ఞానమువలన ఆత్మవిశ్వాసము తలచూపును. ముందంజ కిది ఘనతరశక్తిని చేకూర్చును. కావున ఆంధ్రుల ప్రాచీన విభూతి నీశుభసమయమున స్మరించుట పాడికదా.

కాలవియత్తలమున ప్రజ్ఞానదీప్తిని ప్రసరింపజేసిన ప్రపంచజాతులలో ఆంధ్రజాతి యొకటి. సాంస్కృతికమైన గంగోత్రి వైదికవాఙ్మయమున నుద్భవించినదని ప్రపంచమందలి మనీషులు ఏకగ్రీవముగా వాకొనుచున్నారు. జ్యోతిర్మయమైన ఈ వాఙ్మయములోనివే బ్రాహ్మణములు. వీనియందును, తక్కిన ప్రాజదువులందును ఆంధ్రుల ప్రసక్తి కలదు. ఆంధ్రావనినుండి భారతీయ సభ్యతావల్లరులు దశదిశలందు ప్రాకినవి.

చారిత్రక కాలమని పరిశోధకులవలన నిర్ణయింపబడిన సమయమున పాదుకొల్పిన ప్రతి యుద్యమమునందును ఆంధ్రులు నాయకులై యుండిరి. చారిత్రకయుగము హూణశకమునకు ఆరునూరులయేండ్లకు మున్ను ఆరంభమైనది. భారతదేశమున బుద్ధమహావీరులను, కన్ఫ్యూషియస్ లావోటిజ్‌లు చైనాదేశమందును, పైథాగరస్ గ్రీసు విషయమందును ప్రవక్తలై ప్రబోధము సలిపిరి. ప్రాచీప్రతీచీ భూభాగములం దీ ప్రబోధమువలన ఉత్తాలతరంగసంకులమైన అద్భుత వైజ్ఞానిక మహోదధి యుద్భవించెను. తథాగత వర్ధమానుల జీవితప్రభావమున నవనవోన్మేషశాలినియైన సంస్కృతి ఉదయించెను.

తథాగతుని జీవితము యజ్ఞవాటిక యాయెను. త్యాగాగ్నికుండమున ఆత దాత్మార్పణ మొనరించుకొనెను. ఆతని పవిత్రజీవితమునుండి "ఆసియాజ్యోతి" ("The Light of Asia") తేజరిల్లెను. ఆంధ్రమానససదిగ్వలయమున నీ తేజస్సు ఏనూరేండ్లు వెలసెను. స్థవిరులు నివసించిన విహారములను, స్తూపములను, సంఘారామములను గుహాలయములును తెలుగునేలలో వెలగొనెను. నేడును వీని చిహ్నములు గోచరించుచున్నవి. ధాన్యకటక వేంగీ విశ్వకళాపరిషత్తులందు సుశిక్షితులగుటకై ప్రపంచపథికులును, విజ్ఞానయాత్రికులును, జిజ్ఞాసువులును, సాధకులును వందలకొలది మైళ్ళు నడచినడచి వచ్చువారు. హూణశకమున నైదవ శతాబ్దమున ఫాహ్యాన్, ఏడవ శతాబ్దమున పూర్వోక్త విద్యాపీఠములను సందర్శించిరి. త్రిపిటకములను, "ధమ్మపదము" దీపవంశ మహావంశ గ్రంథములను, జాతకకథలను "మంగళసుత్త" "ధమ్మచక్కపవత్తనసుత్త" మున్నగు పాళీగ్రంథముల నీవిద్యాపీఠములందు పఠించిరి. భావవివేకదిఙ్నాగాచార్యులు ప్రపంచప్రశస్తి వడసిన అధ్యాపకులు. వీరివలన వేంగీ విద్యాపీఠము దశదిశల దృష్టి నాకర్షించెను. శ్రీపర్వతముపై తన గురుకులమును నెలకొల్పిన నాగార్జునుడు ప్రపంచమందలి యుగపురుషులలో నొక్కండనను ప్రతీతిని వడసెను; ఈ మహాపురుషు డైదువందల డెబ్బదేండ్లు జీవించి పరార్థజీవియై భిక్షువువలె యొరులకై తన ప్రాణములను బాసెను. నాగార్జునులు ముగ్గురని కొంత పరిశోధనము తెలుపుచున్నది. ఆదినాగార్జును నారాధించి, ఆతడు స్థాపించిన విద్యాపీఠమున నంతేవాసులై పరదేశీయులు పవిత్రజీవితములు గడపిరి. ఈ విద్యాపీఠమును సముజ్జ్వలమైన మేలుబంతి చేసికొని టిబెట్టుదేశస్థులు డెప్రుంగ్‌లో నొక మహోన్నత విద్యాపీఠమును నెలకొల్పిరి. సంస్కృత పాళీ వాఙ్మయములం దీతడు బహుళములైన మహాగ్రంథములను రచించెను. బౌద్ధమతము వ్యాపించిన సర్వసీమలందును అవి బోధింపబడుచువచ్చెను. 'మహాయాన' బౌద్ధశాఖను స్థాపించినవాడీ యుగపురుషుడే! 'హీనయాన' బౌద్ధశాఖయం దీశ్వరుని గురించిన ఉల్లేఖన మంతగా లేకుండుటచే భగవద్గీతాది గ్రంథములందలి భక్తితత్త్వమును చేర్చి "మహాయాన" శాఖ నీతడు సృజించెను. ఆతని శిష్యులు, ఆర్యభట్టు ప్రభృతులు నలంద మున్నగు విద్యాపీఠములను నెలకొల్పిరి.

గుంటూరు మండలమున నాగార్జునకొండ యనబరగు చోటున నీ మహోత్కృష్ట విద్యాపీఠము విలసిల్లెను. సమస్త ఆసియాఖండమం దీపీఠము ప్రసిద్ధివందెను. ప్రాచీన సాంస్కృతిక సముద్ధరణము మిక్కిలి యక్కరైన ప్రస్తుత ముహూర్తమున పూర్వోక్త విద్యాపీఠమునుబోలు, విశ్వవిశ్రుతము కాజాలు విద్యాపీఠ మిందు నెలకొనిన మేలు. "పంచశీల" నేడు ప్రపంచవాసుల మనసు నాకర్షించెను. "అహింసా పరమోధర్మః" అను మహావాక్యమును నేడు ప్రపంచనేతలు పురస్కరణ మొనరించుచున్నారు. "ఆసియాజ్యోతి" యనిన గాంధీజీ కెంత మక్కువయుండెడిదో జవహరు పండితున కంత మక్కువ కలదు. 'శారిపుత్ర' 'మొగ్గలానా'లను థేరుల యస్థికలకు నంజలి ఘటించిన నెహ్రూ పండితుడు, శాక్యసింహుని ప్రబోధముపై మనసునిలుపు భారత ప్రధాని తథాగతుని పేరిట లేక నాగార్జుని పేరిట నాగార్జునకొండకడ అంతర్జాతీయ విశ్వకళాపరిషత్తును స్థాపింపవలసియుండెను. మహాబోధిసంఘమువారీ విషయముయెడల శ్రద్ధవహింపవలసియుండెను. ఆంధ్రనాయకు లీ విషయముపై మనము నిలుపకుండుట శోచనీయము. నందిప్రాజెక్టు అమలుజరుగుటకై యత్నములు జరుగుచున్నవి. నాగార్జునకొండ యున్నచోటున గాక అనుకూలమైన మరొక్కచోటున ప్రాజెక్టు నెలకొనుట పాడి. ఆ చోటున

నున్న మృత్తికయందు భావప్రబంధమును ఉన్నవి. ఆ మృత్తికను తెలదాల్చుటకై ముక్తిదూతలు పరువెత్తుకొని సర్వసీమలనుండి వచ్చువారు కేవలము బౌద్ధసంస్థకాక ఆసియాసంస్కృతి నెలకొనుటకై విశ్వకవి రవీంద్రుడు శాంతినికేతము స్థాపించిన విద్యాపీఠముబోలు విశ్వకళాపరిషత్తు నిందు నెలకొలుపుట మేలని స్థానస్థానములందు కంఠమెత్తి వచించుటకు నేను సంశయించుటలేదు. ఫాహ్యాన్ యువాన్‌చ్వాంగు లెందలెందరో నిచట వంతేవాసులగుటకై వత్తురు. బుద్ధుని కాలమునుండి, అశోకుని కాలమునుండి, కనిష్కునికాలమునుండి, శ్రీహర్షునికాలమునుండి భారతభూమిని పవిత్రస్థలముగ నెంచిన చైనా, జపాన్, కొరియా, టిబెట్టు కాంబోడియా, సుమిత్రా, జావా, బాలీ సీమస్థులు మరల తెలుగు నేలలో విద్యార్థులు కాజాలుదురు. విశాలాంధ్రము "విశాలయూనివర్సిటీ"యై మరల వెలయజాలును.

సంస్కృతియనినను, ధర్మమనినను కేవలము ధ్యానయోగ జ్ఞానయోగములకు సంబంధించిన వ్యవస్థలే కావు. ప్రసిద్ధినంది ప్రపంచ నాగరికతలు వానియందే పుట్టినవి. చైనాలో పదునెనిమిది వందల మైళ్ళ పొడవుగల గోడయును, ఆరునూరుల పొడవుగల కాలువయును, సుమారు పదునేడు లక్షల ఏబదినాలుగువేల శబ్దములు గల విజ్ఞాన సర్వస్వమును, సుమారు నలుబది వేల పదములు కల నిఘంటువు ఒక ప్పుడు చైనాలో అంతరంగమందలి సాంస్కృతిక సంచలనముంకే యుత్పన్నమయ్యెను. కర్మభక్తి జ్ఞానయోగములు వేర్వేరైన ఆధ్యాత్మిక వ్యవస్థలని తలపరాదు. భారతీయసంస్కృతిలోని తత్వమునెఱింగినవా రెవ్వరును అట్లూహింపజాలరు.

సంస్కృతి శాఖోపశాఖలు కలది. బహువిధహేతువులవలన హృదయపుండరీకము వికసించును. బౌద్ధ జైన హిందూ మతములు పారమార్థ్యము తెలియక మన నేలలో విలసిల్లెను. పిదప తెరువులబోయినవారు చెలరేగుటవలన, అసహన అహంభావములు విజృంభించుటవలన మన నేలలో బౌద్ధమతము క్షీణించెను; జైనమతము సన్నగిలెను; ఆర్షధర్మసముద్ధరణమునకై శ్రీ శంకరభగవత్పాదులు నడుము గట్టిరి.

ఆదిశంకరులు కేరళసీమయందలి 'కాలటి'లో జనించిరి. ఆయన పూర్వపురుషులు అహిక్షేత్రమునుండి వలసపోయిరనియు మలబారుసీమ జేరిరనియు కొంత పరిశోధనము తెలుపుచున్నది. ఈ యహిక్షేత్రము ఆంధ్రవసుంధరలోనిదనియు, కాకినాడ సామర్లకోటల నడుమనున్న సర్పవరమే ఈ యహిక్షేత్రమనియు ప్రొఫెసరు ఆప్టే ప్రభృతులు వాకొనిరి. ఈ విషయ మింకను దృఢపడుచో ఆంధ్రులకు గర్వకారణ మగును.

ఆదిశంకరుని తరువాత ఆర్యమతప్రబోధ ప్రచారము లొనరించిన శ్రీ రామానుజస్వామి ఆంధ్రుడు. ఆదిశంకరులు హూణశకము 780 సంవత్సరమున నవతరించి ముప్పదిరెండేండ్లు మాత్రము జీవించెను. ఈయన జన్మతిథినిగుఱించి అభిప్రాయభేదము లుండుట నిజమే. శ్రీ రామానుజస్వామి 1017 సంవత్సరమున మదరాసునకు ఇరువదియారు మైళ్లదూరమున శ్రీపెరంబూదూరులో జనించిరి. వీరి తండ్రి ఆసూరి కేశవసోమయాజి; తల్లి కాంతిమతి. ఈయన వైదిక సంప్రదాయమున కంజలి ఘటించుచు, నాలాయిరా ప్రబంధమును హృదయంగమ మొనరించుకొనిరి. వైష్ణవ సంప్రదాయమునకు పంచరాత్ర ఆగమములు విశేష భావకబలతను ప్రసాదించెను. శ్రీ రామానుజస్వామి కాలములో ఆర్షమతప్రాంగణము విశాలమాయెను.

వైష్ణవసంప్రదాయము నన్యరాష్ట్రములందు విస్తృత మొనరించిన ఆచార్యు లాంధ్రులే. వీరిలో నొక్కరైన వల్లభాచార్యుని తండ్రి కంభంపాటి లక్ష్మణభట్టు, కాకరపర్తిలో జనించెను. వల్లభ సంప్రదాయము రాజస్థానమందును, గుజరాతులోను నేడును ప్రచలితమైయున్నది. గాంధీజీ వల్లభాయి పటేలు ప్రభృతులు వల్లభ సంప్రదాయము ననుసరించినవారే!

నింబాదిత్యుడు (నింబార్కుడు) తూర్పుగోదావరీమండలమున నుదయించిన ఆచార్యుడు. నేడును నింబార్క పీఠము బృందావనమున కలదు.

నందవంశము నాశనమైనపిదప మౌర్యరాజ్యస్థాపన మొనరించి, చంద్రగుప్తుని చక్రవర్తిని జేసి, జగతికి సుప్రసిద్ధమైన అర్థశాస్త్రమును ప్రసాదించిన చాణక్యుడు, ఆంధ్రుడు. కాకతీయ సామ్రాజ్యము ధూళ్యవలుంఠితమైనపిదప తుంగభద్రాతీరమున ఆనెగొంది ప్రాంతమున విజయనగరసామ్రాజ్యమును స్థాపించి హరిహర బుక్కరాయల నేలికలొనరించిన విద్యారణ్యస్వామి ఆంధ్రుడు. శ్రీ శంకర భగవత్పాదులకు తక్కువకాని శక్తిని వ్యక్తీకరించి వైదికవాఙ్మయమున బహుళగ్రంథముల నీ యద్భుతవ్యక్తి రచించెను.

అన్నమాచార్య ప్రభృతులును ఆంధ్రులే. కాశిలో వసించి, శ్రీరామకృష్ణ పరమహంస ప్రభృతుల ప్రస్తుతినందిన త్రైలింగస్వామి తెలుగుతల్లి కడుపున బుట్టినవాడే!

పోతరాజు, త్యాగరాజు, గోపరాజు లాంధ్రులు. గాయకలోకమున ప్రతీతినొందిన త్రిమూర్తులలో ఇరువు రాంధ్రులు. త్యాగయ్య తరువాత గణుతికెక్కిన గాయకుడు శ్యామశాస్త్రి. క్షేత్రయ్య సభాపతయ్య నారాయణతీర్థు లాంధ్రులు. వీరివలన విమలగాంధర్వ మాంధ్రుల ప్రధానవిద్య యాయెను. ప్రపంచప్రశస్తినందిన సంస్కృతమహాకవి భవభూతి ఆంధ్రుడు. ఇతడు గోదావరీతీరమున జన్మించెను. రామచంద్రభండార్కరు మున్నగు పరిశోధకు లీవిషయమును ముక్తకంఠములతో తెలిపిరి. కాళిదాస కృతులకు భావబంధురములైన వ్యాఖ్యానములను వ్రాసిన కోలాచలం మల్లినాథసూరి ఆంధ్రుడు. షాజహాను చక్రవర్తి ఆస్థానమున మహాకవియై రసగంగాధర, 'భామినీవిలాసము' మున్నగు సుప్రసిద్ధ సంస్కృతకృతులను రచించిన ఉపద్రష్ట జగన్నాథపండితుడు అమలాపురమునకు కొలదిమైళ్ల దూరములోనున్న ముంగండలో జన్మించెను. షాజహాను చక్రవర్తి జ్యేష్ఠపుత్రుడైన దారాశకోకు సన్నిహితుడు, గురువు.

అక్బరు ఆస్థానములోనుండిన వీరబలు డాంధ్రుడు. శ్రీ చైతన్యస్వామి ప్రధానశిష్యులలో నొక్కండైన రామానందరాయలు తెలుగువాడు.

వల్లభాచార్య సూరదాసు ప్రభృతుల సంప్రదాయమున ముఖ్యభక్తులలో కొంద ఱాంధ్రులు. వీరిలో కొందఱు హిందీభాషలో సద్గ్రంథములను రచించి యశస్విలుకులైరి.

ఆంధ్రులలో కొందఱు సుప్రసిద్ధులైన సచివోత్తములును, దండనాయకులును ఉండిరి.

సుప్రసిద్ధ గ్రీక్ యాత్రికుడు మెగస్తనీస్ మౌర్యరాజధానియైన పాటలీపుత్రము నవలోకించినట్లు కృష్ణాతీరమందలి ఆంధ్రుల ప్రధాననగరమైన శ్రీకాకుళమును సందర్శించి సర్వతోముఖమైన ఆంధ్రప్రజ్ఞను వర్ణించెను. తరువాత కృష్ణాతీరమందలి ధాన్యకటకము (నేటి అమరావతి) గోదావరీతీరమందలి ప్రతిష్ఠానగరము (పైఠాన్) ఆంధ్రుల రాజధానినగరము లాయెను. శాతవాహనులు క్రీస్తుపూర్వము మూడవశతాబ్దమునుండి క్రీస్తుతరువాత మూడవశతాబ్దమువరకు పాలించిరి. సుమారు నాలుగునూరుల వర్షములు వారివలె వైభవోపేతముగ పాలించిన చక్రవర్తులు లేరు. మహారాష్ట్రమందును, మాళ్వాలోను, మగధలోను ఆంధ్రపాలనము వ్యాపించెను. నాసిక్‌లో ఆంధ్రుల జెండా ఎగసెను.

వాకాటకులు, కాకతీయులు ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, పల్లవులు తెలుగు నేలల నేలిరి. మధురలో తంజావూరులో, పుదుక్కోటలో తెలుగుదేలిక లుండిరి. ఇమ్మడి దేవరాయ, కృష్ణదేవరాయ, రఘునాథరాయలు మున్నగు పాలకులు కవులను, పండితులను ఆదరించిరి; పోషించిరి. వారికాలమున ఆంధ్రవాఙ్మయము జ్యోతిర్మయమై వెలసెను. మాతృభాష తమిళమైనను, కన్నడమైనను, మలయాళమైనను, మహారాష్ట్రమైనను దక్షిణాపథమున తెలుగు ప్రధానభాష యాయెను. తెలుగురానివాడు పండితుడనిపించుకొనలేదు. దక్షిణాపథమున నాయకరాజులును మఱికొందరు తెలుగుదేలికను నెలకొలిపిన ఉన్నతసంస్థలు నేడును గోచరించుచున్నవి.

ప్రాచీప్రతీచీఖండములందలి పెక్కుసీమలలో ఆంధ్రులకు వైజ్ఞానిక వాణిజ్యసంబంధములుండెనని బహుళాధారములవలన తెలుపగలము.

హూణశకము మొదటిశతాబ్దమున ప్లినీటాలమీ లను ఇటలీ చరిత్రకారు లీయంశము నుల్లేఖించిరి. మెగస్తనీస్, హ్యూఎన్‌త్సాంగ్, యువాన్‌చ్వాంగ్, మార్కోపోలో, నికోలాకోంటి, అబ్దుల్ రజాక్ మున్నగు విజ్ఞానయాత్రికులు గ్రీస్ చైనా ఇటలీ పర్షియా మొదలగు సీమలనుండి వచ్చి, ఆంధ్రప్రభావము నెఱిగి జగతికి తెలిపిరి. పాళీ భాషలో జాతకకథలందు పూర్వోక్తాంశమును దృష్టాంతీకరించు వృత్తాంతములు కలవు.

చారిత్రిక ప్రశస్తిని పడసిన సంస్థలును, శిల్పసౌభాగ్యముతో వెలయు మందిరములును, గుహాలయములును తెలంగాణాలో నున్నవి. అజంతా యెల్లోరాలు బహుశతాబ్దములనుండి ప్రపంచ పథికుల దృష్టి నాకర్షించుచున్నవి. వీనిలోని శిల్పసంపద, సుందర చిత్రలేఖనము సముజ్జ్వలమైన ఆంధ్రుల ప్రతిభనుండి యుద్భవించినవే. అజంతాగుహలు బౌద్ధప్రభావమును ప్రకటించుచున్నవి. ఎల్లోరాగుహలందు బౌద్ధ హిందూ జైన మతాశయములు వ్యక్తమగుచున్నవి. కైలాసమనబరగు పదునారవగుహ సర్వోత్కృష్టమైనది. కొలనుపాకను తావున మనోహరమైన జైనమందిర మున్నది. గోదావరీతీరమున సిక్కులమందిరము కలదు. ఘృష్ణేశ్వర, పర్లీ వైద్యనాథ, నాగనాథ క్షేత్రములందు జ్యోతిర్లింగములు కలవు. ఔరంగబాదులో టాజ్‌మహల్ నకలు బీబీకామక్‌బరీ కలదు. హనుమకొండలో వేయిస్తంభాలమంటప మున్నది. నీటిలో తేలు యిటుకలు రామప్పదేవాలయప్రాంగణమున నున్నవి. హిందూ బౌద్ధ జైన సిక్కు ఇస్లామ్ సంస్కృతుల సమన్వయము తెలంగాణాలో నున్నట్లు భారతభూమిలో మఱెందును లేదు. ప్రాచీన కాలమందువలెనే భావికాలమందును విశాలాంధ్రము విశ్వశ్రేయస్సును చేకూర్చజాలు సాంస్కృతికపూజా మందిరము కాజాలును.

భూసంపదయనుడు, జలసంపదయనుడు, ఖనిజసంపదయనుడు, విజ్ఞానసంపదయనుడు, కళాసంపదయనుడు, ఆత్మిక సంపదయనుడు, బహువిధ సారస్వతసంపదయనుడు ఆంధ్రజనయిత్రికి స్వతస్సిద్ధములై యున్నవి. తారకమంత్రముతోపాటు ఇకముందు ఆంధ్రులు ఐకమత్యమంత్ర పురశ్చరణమున బద్ధదీక్షులు కావలెను. దూరదృష్టి, అంతర్దృష్టి, విజ్ఞానదృష్టి, విశాలదృష్టి మన కలవడవలెను. క్షుద్రదృష్టి గాని హ్రస్వదృష్టి గాని మన జీవితమును కలుషితమొనరింపరాదు. విశ్వవిస్తృతకీర్తికి, విశ్వశాంతికి విశాలాంధ్రాశయ సిద్ధి తోడ్పడునని విశ్వసించుచున్నాను.



**నాటిక:**

# సంస్కర్తలు

శ్రీ నాగభూషణ్

### పాత్రలు

| | | |
|---|---|---|
| గోపీ | ఆశీర్వాదం | సీతారామయ్య |
| అవతారం | జకరయ్య | ఏడుకొండలు |
| పిచ్చయ్య | ప్రసాద్ | చిట్టన్న |
| ధర్మారావు | తాతయ్య | ఇంకా కొందరు |
| పాపారావు | సత్యం | విద్యార్థులు |

### మొదటి రంగం

* * మహాపురుషుడి చిటికెనవ్రేలుమీద లేచిన చిత్రమైన కురుపులా, మహానగరానికి మారుమూల, కుళ్ళిపోయిన కురూపిసందులో ఓ యింటిముందు గది...రాక్షసుడి కోరల్లా పొడుచుకువచ్చిన ముందు అరుగులు; చింపిరి జుట్టులా లేచిపోయిన పెంకులు. తాతలనాటి గది తలుపు, అస్థిపంజరంలా వూగులాడుతోంది...చనిపోతున్న వాడినికూడా బ్రతికించి బాధపెట్టడానికి ప్రయత్నించే డాక్టర్ల ఇంజక్షను మాదిరిగా, తలుపుల ఇహలోకానికీ, గదిలోపలి పరలోకానికీ మధ్య తాళం అడ్డుతెరగా నిలబడివుంది......

ఓ పూర్తిస్వదేశీ వెంట, ఓ పూర్తివిదేశీ వస్తాడు—పూర్వసువాసిని వెంట నడుస్తున్న కాలేజీపిల్లలా—

విదేశీసరుకు, అవారాబొమ్మ వేసిన సిల్కుజేబుగుడ్డ నోటికీ, మూతికీ అడ్డంపెట్టుకుంది... దేశవాళీసరుకు ఫక్కున నవ్వింది.

ప్రసాద్ : ఈ మహారాజసౌధానికి ఈడ్చుకొచ్చావేరా?

తాతయ్య : కొంచెంసేపు సుత్రాన్ని ఇక్కడే కట్టివెయ్యాలిరా! ఇదే మహారాజులుంగారి సౌధం.

ప్రసా : నిజంగా!...ఇక్కడెట్లా వుంటున్నాడురా?

తాత : మహారాజులా వుంటున్నాడు!......అయినా, అందరూ నువ్వు ఉండే గదుల్లో వుండాలంటే మాత్రం ఎలా?

ప్రసా : అక్కడుంటే నాకు ఇంకా ఇరుకుగా వుంటుంది. నరకం లాంటి ఈ గదుల్లో వుండి చదివితేమాత్రం చదువెలా అబ్బుతుంది?

తాత : అవునవును......ఇప్పుడు క్లాసులో ఫస్టుమార్కులన్నీ నీవేగా!...గోపీగాడు ఎప్పుడూ ఆఖరివాడేనాయె!

ప్రసా : నువ్వు ఎగతాళి చెయ్యనక్కర్లేదు బ్రదర్! మనకు మార్కులు వచ్చినా, రాకపోయినా ఒక్కటే! మనం చదువుకోసమే చదువుతున్నాం గాని, మార్కులకోసం కాదోయ్!

తాత : మార్కులకోసం బతుకుతోంది మీ నాన్న! అవునా?

ప్రసా : (ఎగతాళిగా) ఇంత కష్టపడి చివరకు సత్యాన్ని కనిపెట్టావు!

[సత్యం వస్తాడు]

సత్యం : ఎవరినిరా కనిపెట్టింది? నన్నే!

తాత : నిన్ను కాదురా, సత్యాన్ని.

సత్యం : నేనే సత్యాన్ని. సత్యమే నేను.

ప్రసా : ఏడిశావ్......నువ్వు బ్రతికున్న సత్యానివి....తాతయ్య కనుక్కున్నది చచ్చిపోయిన సత్యాన్ని....

సత్యం : అమ్మమ్మలా చెప్పాడు.

ప్రసా : సత్యం చెప్పావురా!

సత్యం : మరి సత్యాన్నికదూ!...ఆఁ! ఇంతకూ వీడెక్కడికి వెళ్లాడు?

తాత : ఈసారి ఈ సత్యాన్ని అన్వేషించడం కొంచెం కష్టమైన పనే!

సత్యం : కథానాయకుడి కథానాయిక గారింటికి వెళ్లాడేమో?

ప్రసా : (ఉత్తరపోయి) ఏమిటి? ధైర్యంకాని ప్రకోపించలేదు కదా?

సత్యం : ఏం? మందు వేస్తావా?

ప్రసా : మరో అయిదేళ్లు ఆగు—

తాత : పోనీలే! ఈ అయిదేళ్ళనాన్న జనరక్షణ!

ప్రసా : (ఇంకా వెనకటిలానే వుండి) ఇంతకూ నీ కథానాయిక ఎవర్రా?

సత్యం : నీకు తెలియకపోవడమేమిట్రా?...మన వంకటరత్నం సిస్టర్ లేదూ?...సుగుణ—

ప్రసా : (ఆత్రంగా) ఆ...సుగుణ—?

సత్యం : ఇంకేముంది? అంతే! సుగుణ—ఫుల్ స్టాప్.

ప్రసా : సుగుణా!

సత్యం : అదేమిట్రా! నువ్వే కథానాయకుడులా మూర్ఛపోతావ్! కావాలనుకుంటే విలన్‌వి కా!

ప్రసా : నాకు విలన్ కావలసిన ఖర్మేరా?...లక్షణంగా హీరోనే అవుతాను.

సత్యం : అయితే గోపీగాడినే విలన్ చేద్దాం!...ఏం చెయ్యడానికైనా వీడు రాంకే!

తాత : వీడికక్కడ పనేమిట్రా?

సత్యం : కథానాయికకు ప్రైవేటు టీచరు హోదాలో వున్నాడు ప్రస్తుతం.

తాత : అయితే భయంలేదురా ప్రసాద్!...ఇంకా వీళ్ళు మొదటిరంగంలోనే వున్నారు...నీ ఇష్టం వచ్చినట్లు కథ మార్చుకోవచ్చు.

ప్రసా : అమ్మమ్మలా మాట్లాడకురా తాతయ్యా! నాకు భయమేమిటి?...ఇప్పుడు చూస్తావుగా, ఎవరంటే ఎవరికి భయమో?

సత్యం : ఏం చేస్తావేం?

ప్రసా : చూస్తూ వుండండి...మీరందరూ మాట్లాడకుండా వూరుకోండి. వాడి నీలుగేమిటో నేను చూస్తాను.

సత్యం : మధ్య నీ నీలుగేమిటి?...అది వాడిష్టం. కాదనడానికి నువ్వెవడివి?

ప్రసా : వాడిష్టం అయితే సరా? ఇహ మంచి, చెడ్డా అక్కర్లా? కాలేజీ అంతా ఒక త్రాడుమీద నడుస్తుంటే, వీడు ఎన్ని దమ్ముల్లో కావనాలి?

సత్యం : ఎన్ని దమ్ముల్లోనయినా కాదంటాడు!

ప్రసా : ఇహ మనతో వాడికి అవసరం రాదా?

సత్యం : వస్తే సుగుణతో రావాలికాని, నీతో పనేమిట్రా?

తాత : అట్లా అనకురా, మరి...వీడు కథానాయకుడా! ఎప్పుడు ఏం అవసరం వచ్చినా, రావచ్చు...

[ఇంతలో ధర్మారావు వస్తాడు.]

ధర్మా : ఏమిటోయ్! మీ ప్రేమ వివారమంతా ఇక్కడ చేరింది?

సత్యం : ప్రేమపక్షుల్ని వెదకడానికి!

ధర్మ : గోపీ లేడల్లే వుందే!

తాత : మేమూ అతనికోసమే వచ్చాం.

ధర్మ : ఏమిటి కథ?

ప్రసా : గోపీ నిన్న విద్యయ్యతో ఇవ్వాళ కాలేజీకి వెడతా నన్నాట్ట! వాడితో చెప్పి—

తాత : నాభయం ఏమిటంటే, వీడు కొంతమందికి హీరోగా! తీరా వీడు వెళ్లడాన్ని ఆసరా చేసుకొని మిగిలినవాళ్ళూ వెళ్లడానికి ప్రయత్నించేస్తే మొత్తమంతా రసాభాసవుతుంది.

ధర్మ : అందుకని—?

ప్రసా : అందుకని, ఆ వెళ్లడం ఏమిటో కనుక్కుందామని వచ్చాం.

ధర్మ : మంచిదేనుకో!...కాని వాడు కొన్ని నియమాలు ఆశయాలున్న మనిషి. పైగా బీదవాడు.

ప్రసా : అటువంటప్పుడు నియమాలేమిటి?

ధర్మ : అదేమన్నమాట? వాటిమీద నిలబడడం, నిలబడకపోవడం అటుంచితే మనందరికీ లేవా ఆశయాలు, ఆదర్శాలు! నియమాలు !!

సత్యం : ఎందుకుండవూ? ప్రసాద్ చూడు — ఉలెన్‌సూటుతో తప్ప బయటకు రాడు. లవండర్, మైసూరు శాండల్సు తప్ప వాడడు. పార్కర్ సీనియర్‌తో తప్ప రాయడు. ఇవన్నీ వీడి నియమాలు.

తాత : అంతవరకు ఆపు...అది కాదోయ్, ధర్మారావ్! వాడికి నియమాలు ఉన్నయ్. తప్పులేదు...వాటినే జాగ్రత్తగా ఉంచుకోమను. కాని వాటివల్ల ప్రక్కవాడికి బాధ కలుగుతున్నప్పుడు కొంచెం సవరించుకోవాలి, సర్దుకుపోవాలి.

ధర్మ : ఒకవేళ వాడు సవరించుకోడు—

ప్రసా : సవరించుకోకపోతే ఏం జరుగుతుందో చెబుదామనే వచ్చాం.

ధర్మ : ఏమిటో ఆ చెప్పేది?

ప్రసా : చూస్తావుగా!

సత్యం : చెప్పేది చూడ్డమేమిటిరా? ఇలా క్లిష్టాన్వయాలు ఉంటేనే తెలుగుమాస్టారు మొన్న మైనస్ మార్కులు ఇచ్చారు.

ప్రసా : వాడూ, నువ్వూ కలిసి ఏడ్చారుగాని—

తాత : (ధర్మారావుతో) పోనివ్వండి గొడవ ... ఆ కార్నర్ దాకా వెళ్ళి గోపీ వస్తున్నాడేమో చూడు బ్రదర్ ... త్వరగా మాట్లాడి పోదాం.

[ధర్మారావు వెడతాడు]

(ప్రసాద్‌తో) వాడితో పోట్లాట లంకించుకుంటావేరా?

ప్రసా : మరి వాడి మాటలు చూశావుగా!

సత్యం : మాటలు చూడవేమిట్రా? 'విన్నావా' అనాలి.
ప్రసా : ఏదో ఒకటిలే! అడ్డురాకు—
తాత : వ్యవహారం అంతా ఇప్పుడే చెడిపేటట్లు చేస్తావు నువ్వు!.. ఆ గోపీగాడే రణపెంక. వీళ్లతో ఇట్లా మాట్లాడితే—
ప్రసా : ఆ ధర్మిగాడు కదిలించడమేమిటి మరి?
సత్యం : వాడు కదిపిస్తే నువ్వు ముందుకు దూకాలా?
తాత : వీడి తత్వమే అంత!...వీడిక్కడ వుంటే మన పని ఆవగింజలో అరభాగం కాదు...నిన్న వీడిని ఒప్పించేసరికి చచ్చాం!...అందువల్ల—
సత్యం : ఆఁ! అందువల్ల—?
తాత : వస్తున్నాడుగా! రానీ, చెబుతాను.
ధర్మ : (వస్తూ) రావడంలేదు బ్రదర్.
తాత : అయితే ఒక్క సాయం చెయ్యి బ్రదర్...గోపీ ఎక్కడ వుంటాడో చూసి—
ధర్మ : నాకేం తెలుసు ఎక్కడ వుంటాడో?
తాత : ఇందాక పార్కు వైపుకు వెళ్లాట్ట!...కొండయ్యగారింటికేమైనా వెళ్లాడేమో కనుక్కొని, అటునుంచి కాలేజీకి తీసుకురా!
ధర్మ : ఊరికే వాడు కాలేజీకి ఎందుకు?
తాత : వాడిని నువ్వు ఎట్లాగైనా ఒప్పించాలి...వాడు చెబితే వింటానని మూర్ఖించేవాళ్లు కొందరు ఉంటారు.
ధర్మ : నా మాట వింటాడా?
తాత : మేం చెబితే చచ్చినా వినడు...వింటే, నువ్వు చెబితేనే వినాలి.
ధర్మ : పోనీ—వాడు కాలేజీకి వెడితేమాత్రం నష్టం ఏమిటి?
సత్యం : అట్లా అనకుమరి—తాతయ్య, ప్రసాద్ అండ్ ఫ్రెండ్స్ సమ్మె చేయిస్తున్నారంటే, ఒక్క పురుగు లోపలికి వెళ్లినా, పరువు నష్టమే!
ప్రసా : అసలు ఈ సమ్మె ఎందుకు మొదలుపెట్టాం? విద్యార్థుల హక్కులను సంరక్షించుకొని విద్యార్థిలోకాన్ని సంపర్కింపడంకోసం—ఇంతటి గొప్ప విషయాల్లోనే మనవాళ్లు సానుభూతి చూపకపోతే నలుగురిలోనూ తల యెత్తుకు తిరగగలమా?
సత్యం : ఎప్పుడూ ఎత్తుకు తిరిగినా తలనొప్పి పుడుతుంది. అందువల్ల అప్పుడప్పుడూ వంచుకొని నడవాలి.
ధర్మ : వాడి కిది ఎలాగూ నచ్చదు.
తాత : మరి, నిన్ను పంపడ మెందుకు? ఎలాగైనా ఒప్పిస్తావనేగా?
ధర్మ : నేను అడిగి మాత్రం చూస్తాను...వాడిని బలవంతింమాత్రం చెయ్యను.
తాత : అలా అనకు. వాడి విషయం నీకు వదిలాం.
[ధర్మారావు వెళ్లిపోతాడు. ముగ్గురూ దీర్ఘంగా నిట్టూరుస్తారు.]

సత్యం : ఒరే, తాతయ్యా! నువ్వు రాజకీయనాయకుడివి కాదగ్గ వాడివిరా!
తాత : అవునురా! పాము చావాకూడదు, కర్ర విరగాకూడదు.
ప్రసా : గోపీ పార్కుకొస్తున్న విశ్వాసం నువ్వు మాశావా?
తాత : మాస్తే అప్పుడే మాట్లాడేవాణ్నిగా! ముందు ఈ ధర్మిగాడు కనుమాపుదూరంలో లేకుండా వుంటే, ఈ గోపీని కట్టివెయ్యొచ్చు—సామ దాన భేదోపాయాలు మన చేతుల్లో వుండనే వున్నయ్.
ప్రసా : దండం అక్కర్లేదంటావా?
సత్యం : అంతగా అయితే కథానాయకుడికి విలన్కి కత్తియుద్ధం పెట్టిద్దాం.
తాత : అటువంటివి చెయ్యకండి. పరువులు పోతయ్.
సత్యం : ఇప్పుడున్నట్లే!
ప్రసా : నీకు లేకపోవచ్చు...నాకు వుంది.
సత్యం : అవునవును...చాలా వుంది.
[ఆశీర్వాదం, పాపారావు వస్తారు.]
తాత : ఏరా! మీ రిద్దరే వచ్చారు?
ఆశీ : సీతారామయ్యగారు సాయంకాలం ఎక్కడో మీటింగులో మాట్లాడాలిట! గర్భనిరోధాన్నిగురించిట!...ఉపన్యాసం చెప్పించుకుంటున్నారు.
సత్యం : ఎవరిచేత?
పాపా : మాకుమాత్రం ఏం తెలుసు!...కొత్తవాడు. సిగరెట్లు ఇస్తే రాసి పెట్టేటట్టున్నాడు.
తాత : ఇంతకూ ఆయన ఎప్పుడు వస్తానంటాడు?
ఆశీ : ఏమో?...సాయంకాలం మంత్రిగారుకూడా సభకు వస్తారట—
ప్రసా : మన కిక్కడ అర్జంటని చెప్పలా?
పాపా : చెప్పడమేమిటి? చెవిని ఇల్లుకట్టుకు పోరాం.
ప్రసా : ఏమంటాడు?
పాపా : ఆయనకు తీరిక లేదు. మరెవ్వరికైనా రికమెండ్ చేస్తానంటారు...రమణయ్యగారింట్లో గోపీకి వారం వుందిటగా! ఆయన్ని పంపి చెప్పిస్తానంటారు.
తాత : ఈమాత్రం రికమెండేషన్లు మనం చెయ్యలేం? ఆయన పెద్దవాడని దమ్మన్నాంగాని—
ఆశీ : చివరకు ఒప్పుకున్నారులే!—ఓ అయిదు నిముషాలు మీరు ఏమైనాసరే వచ్చి వెళ్ళాలన్నాం—సరే, నన్నారు.
తాత : మరి దగ్గరుండి తీసుకు రాలేకపోయారా?
పాపా : ఆయన వచ్చేదాకా ఎక్కడ కూర్చోం?...ఇంకా మావాళ్ళు కొందరు ఒప్పుకోలేదు. ఇప్పుడే రమణగారి దగ్గరకు, విఠల్ దగ్గరకు వెళ్లి చెప్పొచ్చాం.
ప్రసా : ఎందుకు ఒప్పుకోవడంలేదు.

పాపా : ఏం చెబుతాం! వాళ్ళు దీన్ని చిలిపితగూ అంటున్నారు. ఇంతకంటె 'సిల్లీ'గా జరిగిన సైకిలు వున్నాయని చెప్పాను—ఇది విద్యార్థులందరి సమస్యరా. ఇవ్వాళ ఆంజనేయుల్ని అన్నారు, రేపు మనల్ని అనరని నమ్మకమేముంది!...ఇట్లా ప్రతివాడికీ సమాధానం చెప్పేసరికి తలప్రాణం తోకకు వచ్చింది.

సత్యం : మంత్రసానితనానికి ఒప్పుకున్నాక, ఏం చెయ్యక తప్పుతుంది?

అశో : వాళ్ళుమాత్రం అంతటితో ఒప్పుకున్నారా! మేము ఎప్పుడూ ఆంజనేయులుమాదిరిగా మాష్టర్ని అంత క్లాసులోనే అవమానం చెయ్యం. అంటారు.

ప్రసా : కనీసం ఆంజనేయులు మనకు స్నేహితుడయినందుకైనా ఒప్పుకోవచ్చునే!

పాపా : వాళ్లనేది అదే! ఆంజనేయులు స్నేహితుడే! కాని వాడు చేసిందిమాత్రం తప్పే నంటారు......

అశో : ఆంజనేయులు మీవంటివాళ్ల స్నేహితుడు కాబట్టి, మీరు లీడర్స్ కాబట్టి సమ్మె చేస్తున్నారు—అదే మాలాంటి వాళ్లయితే మీరు ముందుకు వచ్చేవాళ్ళా అని ఎదురు ప్రశ్నలు—!

పాపా : చివరకు ఎట్లాగయితే నేం, ఒప్పుకున్నారులే!

తాత : ఇప్పటికే ఆలస్యమయింది......వీరు వస్తే ఈలోగా మేం మాట్లాడుకుంటూవుంటాం. మీరు వెళ్ళి సీతారామయ్యగారిని తీసుకురండి.

పాపా : మీరు ముగ్గురూ ఎందుకు ఇక్కడ? కాలేజీదగ్గర మన వాళ్లెవరూ లేరు.

సత్యం : ఇక్కడ వుండి నేను ఉద్ధరించేదేమిటి! నేను కాలేజీదగ్గరకు వెడుతున్నానురా!

ప్రసా : మేం ఇద్దరం ఇక్కడే వుంటాంలే! మీరుమాత్రం త్వరగా రండి......

[ఆశీర్వాదం, పాపారావు, సత్యం వెళ్ళిపోతారు. వెళ్ళిపోతున్న ముందు వాళ్ల ఇద్దరివంక మిగిలిన ఇద్దరూ అసహ్యంగా చూస్తారు.

ప్రసా : మొనగాళ్లు దిగివచ్చారు!......వాళ్లవాళ్లు ఒప్పుకో లేదట!...రేపు మనతో ఏమీ పనిరాదూ?

తాత : ఈ పాపారావు ఇప్పుడు వాళ్లవాళ్లని ఎందుకు ఒప్పించాడంటావ్?...అందుకే!...రేపు వాళ్ళకేమైనా అవసరంవస్తే — 'మాకారా! మొన్న మీకు చేశాం.' అంటారు.

ప్రసా : అదొక్కటే కాదురా! ప్రజల్లో పలుకుబడిపోయిందిగా! అందుకని విద్యార్థుల సమస్యలతో బయలుదేరి నలుగురి పాముధూళి సంపాదించాలని వీళ్ల తాపత్రయం.

తాత : వాళ్లకా అభిప్రాయంవుంటే వుండొచ్చు. మనం ఎందుకు అనాలి? హృదయపూర్వకంగానే సహాయం చేస్తున్నారనుకుందాం.

ప్రసా : ఇది మనకు కొత్తా?....స్వార్థంలేకుండా ఎవరుమటుకు ఇటువంటి సహాయాలు చేస్తారు? ఎట్లాగూ వాళ్లకు చెడుపేరు రానేవచ్చింది. ఇప్పుడు మనల్ని తెర ముందుకు లాగాలని వీళ్ల ప్రయత్నం.

తాత : మనకు తెలియదురా? నేను సీతారామయ్యను తీసుకు రమ్మని ఊరికే చెప్పానా? సీతారామయ్య ఎవరో వూళ్లో జనానికి అందరికీ తెలుసు. ఆయనే వచ్చాడంటే, వాళ్లవాళ్లు వుంటారని ఎలా అనుకుంటారు?

ప్రసా : సీతారామయ్య వస్తే పనిఅవుతుందని నాకు నమ్మకం లేదురా!

తాత : నాకుమాత్రం నమ్మకం ఏడిసిందా? మనల్ని మనం కాపాడుకోవడానికి ఇదొక ఎత్తు. అంతే!

ప్రసా : ఇందాక సత్యంగాడు చెప్పింది అక్షరాలా సత్యంరా! నువ్వు నూటికి నూరువంతులూ రాజకీయనాయకుడివి. కాలేజీ దాటు, నిన్ను అమాంతంగా యం. యల్. ఏ ని చేస్తాం.

తాత : అదుగో! గోపీ వస్తున్నాడు......నువ్వు అనవసరంగా తొందరపడకు.

[గోపీ వస్తాడు...విషాదంలో జీవితాన్వేషణ చేసే మహర్షిలా వుంటాడు. నవ్వినప్పుడు, రాజ్యంపోయిన మహారాజు నవ్వేపోలిక కనిపిస్తుంది.]

తాత : హల్లో! గోపీ! నీకోసమే వచ్చాం......అరగంటనుంచి కాచుకొని కూర్చున్నాం.

గోపి : అరెరె! అలాగా! కాకిచేత కబురుపంపితే మీదగ్గరకు నేనే వచ్చేవాణ్ణిగా!...ఆగండి. లోపలకు వెడదాం.

[తాళంతీసి, తలుపులు తోస్తాడు. నిద్రపోతున్న ముసలివాణ్ణి లేపినప్పుడు వికారంగా ఆవలించి, వికృతంగా నవ్వినట్లుగా ధ్వనిచేసి, తెరుచుకుంటాయ్ తలుపులు.]

గోపి : రండి—

[ఇద్దరూ లోపలికి వస్తారు. క్రింద గచ్చు అయినా చేయని ఒట్టి నేల. మానవతి అయిన పేదరాలు చిరుగులగుడ్డ ఒంటికి కప్పుకున్నట్లు క్రిందవున్న మట్టిని మరుగుపరచడానికి ప్రయత్నంచేస్తున్న చింకిచాప. దుమ్ము దులపడానికి చాపచుట్టి గదిలో దుమారం లేపుతాడు గోపి. ప్రసాద్ జేబుగుడ్డతో ముక్కు మూసుకుంటాడు.]

(నవ్వుతూ) సారీ...కూర్చోండి.

[ప్రసాద్ తన ఉన్నిదుస్తులకు తగిన హోదాలో కూర్చోవడానికి ఏమైనా ఉన్నతాసనం ఉన్నదేమోనని చుట్టూ కలియచూస్తాడు. అతని కష్టాన్ని గుర్తిస్తున్నాడు గోపి.]

గోపి : అరుగుమీద అయితే మీరు హాయిగా కూర్చోవచ్చు...పదండి...

ప్రసా : థాంక్స్...

[గోపీ చాప అరుగుమీద వేస్తాడు.]

తాత : ఇవ్వాళ స్ట్రయిక్ సంగతి నీకు తెలిసే వుంటుంది.

గోపీ : అవును...నిన్న పిచ్చయ్య చెప్పాడు.

తాత : నిన్న వాడితో ఇవ్వాళ కాలేజీకి వెడతానన్నావుట—

గోపీ : అవును.

ప్రసా : సమ్మె జరుగుతుంటే, కాలేజీకి వెళ్ళడమేమిటండీ?

గోపీ : మీరు సమ్మె చేయండి...నన్ను మాత్రం కాలేజీకి వెళ్లనివ్వండి...

ప్రసా : సమ్మె చెయ్యడమంటే కాలేజీకి వెళ్లడం కాదండీ!

గోపీ : అది మీ సంగతి! నేను వెళ్లినందువల్ల మీకు నష్టం లేదు. కాని వెళ్లకపోతే నాకు చాలా నష్టాలువున్నాయ్.

తాత : అలా అనకు—ఏ ఒక్క కుర్రాడు లోపలకు పోయినా సమ్మె జయప్రదంగా జరిగినట్లు కాదు.

గోపీ : రెండువంతులు బయటవుండి, ఒక వంతు వెళ్ళినా సమ్మె గెలిచినట్లే నన్నారు!

ప్రసా : అది బయటి సమ్మెలకండి! మనం విద్యార్థులం. మన హక్కుల్ని మనం సంరక్షించుకోని, మనల్ని మనం సంస్కరించుకోకపోతే మనం దేశానికి ముందుముందు ఏం సేవ చేయగలం?

గోపీ : దేశసేవ చేయడానికి ఈ సమ్మెలే పనికి వస్తాయంటారా?...నాకెందుకనో వీటిమీద సానుభూతి లేదు.

ప్రసా : అంటే, ఇప్పుడు మేం ఎందుకు సమ్మె చేస్తున్నామో, ఆ కారణంమీద సానుభూతి లేదంటారా?

గోపీ : ఇప్పుడా విషయాలన్నీ ఎందుకు? నేను మాత్రం కాలేజీకి వెళ్ళడానికి ఒప్పుకోండి.

తాత : అది కాదోయ్...పోనీ, నీ అభ్యంతరాలు చెప్పు...అవి మాకు సంబంధించినవైతే మేము చెప్పగలిగినంతవరకు సమాధానం చెబుతాం.

గోపీ : నాకు ఇప్పుడు ఈ సమ్మెమీద అసలు సానుభూతి లేదు.

ప్రసా : ఏమిటి!...ఇది మొత్తం విద్యార్థిలోకానికి చెందిన సమస్య! దీనిమీదే సానుభూతి లేదా!

గోపీ : నా వుద్దేశ్యం...ఇది వ్యక్తిగతమైన సమస్యేమోనని—

తాత : ప్రస్తుతానికి ఇది వ్యక్తిగతమైనదే ననుకోండి. రేపు మీకే ఇలా అవమానం జరగదని ఎక్కడ వుంది?

ప్రసా : అంతమంది పిల్లలఎదుట—ఓపిన్ క్లాసులో—అంతమంది ఆడపిల్లలు వుండగా—ఒక కుర్రవాణ్ణి అలా తిట్టడం కంటె ఇంకా అవమానం ఏం వుంటుందండీ? దీన్ని సహిస్తూ వూరుకోమంటారా?

గోపీ : ఊరుకోమని నేననను...ఒక్క లెక్చరరుదే తప్పయితే నేను మీతో సంతోషంగా కలిసేవాడిని.

ప్రసా : అయితే, తప్పంతా కుర్రాడిదే నంటారు!

గోపీ : ఎవరి ఉద్దేశ్యాలు వారివి లెండి.

తాత : పోనివ్వండి, కుర్రాడిదే తప్పనుకుందాం. లెక్చరరు చెయ్యవలసిందదేనా?

గోపీ : పోనీ అతను చేసినదానికి ముందా లెక్చరరుగారికి క్షమాపణ చెప్పమనండి...అప్పుడు లెక్చరరుగారు తన మాటలు ఉపసంహరించుకోకపోతే, అప్పుడీ సమ్మె చెయ్యవచ్చు.

ప్రసా : ఇంత జరిగినతర్వాత ఆయనదగ్గరకు వెళ్ళి క్షమాపణ చెప్పకోమంటారా?

గోపీ : పోనీ, ఆంజనేయులుగారిని కలుసుకోనైనా చెయ్యండి.

తాత : మరోగంటలో కాలేజీ టైం అవుతోంది..మనవాళ్లందరూ అప్పుడే అక్కడకు వెళ్ళివుంటారు...పిల్లలకందరికీ చెప్పివుంచాం...ఈ ఆఖరుక్షణంలో—

గోపీ : నాకు తెలిసింది ఆఖరుక్షణంలోనే—

ప్రసా : మీకు నిన్న సాయంకాలమే తెలుసు.

గోపీ : నేను కాలేజీకి వెడతానన్నట్లుగాకూడా మీకు నిన్న సాయంకాలమే తెలుసు.

తాత : తెలుసుననుకోండి...మీరు వూరికే అన్నారేమో అనుకున్నాం.

గోపీ : ఇటువంటివిషయాల్లో సరదా ఏమిటండీ?

ప్రసా : పర్యవసానం మీరు తేల్చేది మీరు కాలేజీకి వెళ్లక తప్పదని—అంతేనా?

గోపీ : పరిస్థితులు ఇలాగే వుంటే, మరి వెళ్ళక తప్పదు.

ప్రసా : దీనివల్ల జరగబోయే విషమఫలితాల్ని వూహించుకోనే చెబుతున్నారా?...ఇది విద్యార్థులందరికీ అవమానకరం.

తాత : ఊరుకోరా, ప్రసాద్.

గోపీ : (శాంతంగా) ఈ విషయంలో ఆవేశాలూ, ఆర్భాటాలు ఎందుకు ప్రసాద్ గారూ? నాకు యిష్టంలేదు. వెడుతున్నాను...దీనిలో మిమ్మల్నికాని, విద్యార్థులందరినీకాని అవమానించడం ఎలా జరిగిందో నాకర్థం కావడంలేదు.

తాత : తొందర ఎవ్వరికీ మంచిదికాదు...నువ్వూ ఆలోచించు.

గోపీ : నేను ఆలోచించే చెప్పాను.

తాత : అలా అనకు మరి...ఇప్పుడు నువ్వు, నీ వెనక ఓ యాభైమంది కాలేజీకి వెడితే యీ సమ్మె ఎందుకు చేస్తున్నట్టు?

గోపీ : ఏమో? ఎవరికి తెలుసు?

తాత : పోనీ, నీ స్నేహితులం, వచ్చి అడుగుతున్నాం. అందుకోసమైనా నువ్వు ఈ ఒక్కపూటా కాలేజీ మాన వచ్చునే!

[సీతారామయ్య, ఆశీర్వాదం, పాపారావు వస్తారు.]

సీతా : ఈయనేనట్రా ఇవ్వాళ కాలేజీకి వెడతానంటున్నది?

పాపా : అవునండీ.

సీతా : ఏమయ్యా! నీ దగ్గరికి మేంకూడా వచ్చి చెప్పవలసి వచ్చిందే! పిల్చి చెబితే చాలలా?

గోపీ : మీరు ఎవరో తెలియకుండా కూడా, మిమ్మల్ని రమ్మంటానా, నేను?

ఆశీ : ఈయన్నే ఎరగవా! ఈ వూరికంతకూ ఏకైకనాయకులు సీతారామయ్యగారు.

ప్రసా : అంతంత విశేషణా లెందుకులే!

సీతా : (విషపు నవ్వుతో) బాగా అన్నావు.

ఆశ : ఏం? ఉన్నమాట అన్నాను.

ప్రసా : ఉన్నా, అంత ఎత్తేసుకోకూడదు.

గోపీ : మిమ్మల్ని నేను రమ్మనలేదే!

సీతా : రమ్మని నీ నోటితో అనాలా? వచ్చేటట్లు చేస్తే చాలదూ?

గోపీ : మిమ్మల్ని రప్పించేపని నేనేమీ చెయ్యలేదే!

సీతా : ఇవ్వాళ విద్యార్థుల హక్కుల రక్షణకోసం, విద్యార్థి స్వాతంత్ర్యరక్షణకోసం, విద్యావిధానసంస్కరణకోసం ఇంత బ్రహ్మాండమైన సమ్మె జరుగుతూవుంటే నువ్వు కాలేజీకి వెడతానంటున్నావ్! ఇంతకంటే ఏం చెయ్యాలి?

గోపీ : నాకు ఈ సమ్మెమీద సానుభూతి లేదు. నేను వెళ్ళదలుచుకున్నాను...అది మీకేం నష్టం?

సీతా : విద్యార్థిలోకంలో ఇలాంటి అభ్యుదయనిరోధకశక్తు లున్నాయి కనుకనే, దేశం ప్రగతివైపు పురోగమించడం లేదు...సంస్కరణ మన ఆశయం...చెడును ప్రతిఘటించి, కుళ్ళును తొలగించడం మన ఆదర్శం...విద్యార్థిలోకం సాగిస్తున్న ఈ సంస్కారప్రదమైన సమస్యాపరిష్కారంలో నువ్వు చేతులు కలపక సానుభూతి లేదంటావేం? ఇది విద్యార్థిసమస్య కాదూ?

గోపీ : కావచ్చును...ప్రతి విద్యార్థిసమస్య విద్యార్థుల కందరకూ సానుభూతిదాయకమై వుండాలని నియమం వున్నదా?... నేను బీదవాడిని. నాకు చదువుకోవడం బాధగా వున్నది. మరి నా సమస్యను ఎవరైనా ఒక్కరు ఆలోచించారా? నా కోసం సమ్మెలు చేయనక్కరలేదు. కనీసం సానుభూతివాక్యమైనా పలికారా?

ప్రసా : అవన్నీ ఎందుకు? ఇప్పుడీ సమస్యమీద నీ కెందుకు సానుభూతి లేదు?

గోపీ : అది వ్యక్తిగతమైన అభిరుచుల్ని పట్టి వుంటుంది.

తార : ఉండడం తప్పు అని ఎవరూ అనరు. కాని అది పరిస్థితుల కనుగుణంగా మార్చుకోకపోతే ఎలా?...పోనీ ఇంతమంది స్టూడెంట్సు మానేశారు. మీరుకూడా మానినందువల్ల నష్టంఏమిటి?

గోపీ : ఇందాకటినుంచీ చెప్పానుకదండీ. ప్రతి మనిషికీ కొన్ని నియమాలు వుంటయ్. నా వంటివాడు చావడానికైనా ఇష్టపడుతాడు గాని, వాటిని మార్చుకోలేడు.

సీతా : ఇందులో నీ ఆశయాలకూ, నియమాలకూ విరుద్ధంగా జరిగేదేమిటి? ఇవ్వాళ కాలేజీ లేదనుకో? హాయిగా ఇంట్లో చదుకో.

గోపీ : బయట ఇంత రణగొణధ్వని జరుగుతూవుంటే, చదుకుంటే మాత్రం నిలకడ బుద్ధిపుడుతుందా?

ప్రసా : మరీ అంత సంకుచితంగా ఆలోచిస్తారేమండీ?

సీతా : ఇది విద్యార్థి లోకానికే అవమానం...అదే రేపు క్లాసులో నీకు జరుగుతుందనుకో?

గోపీ : క్షమించండి. నేనలా అనుకోలేను...నేను క్లాసులో మాస్టారితో ఎన్నడూ సవాలు చెయ్యను...కుస్తీపట్టడానికి రమ్మని చేతులు పైకి లాగను.

తార : జరిగింది పోనివ్వండి... ఆయన క్లాసులో విద్యార్థు లందర్నీ అవమానించడం మీకు తెలియదా?

గోపీ : అవమానం జరగడం నిజమే...విద్యార్థి తప్పుచేశాడని మీరూ ఒప్పుకున్నారు. తప్పుచేసిన అతనికి అవమానం జరిగిందని మీరంటున్నారే, చదువులోనూ వయస్సులోనూ ఆయనకన్న తక్కువవాడు, అంతమంది పిల్లలున్న క్లాసులో చేతులు పైకి లాగి కొట్టడానికి వస్తే ఆయన ఎంత బాధపడి వుండాలి?

సీతా : మనం వాదించడంకోసం ఇక్కడకు చేరలేదు. ఒక ఉన్నతమైన పథకంతో, కాలేజీ విద్యావిధానంలో జరుగుతున్న అత్యాచారాన్ని నిర్మూలించి, దాన్ని సంస్కరించడానికి సాగిస్తున్న ఈ అహింసాసమరంలో నువ్వూ పాల్గొని దాన్ని విజయవంతం చెయ్.

గోపీ : అదే నాకు ఇష్టంలేదని చెబుతున్నాను.

ప్రసా : వారాలు చేసుకుతినే వెధవలకు కూడా ఎంత నిలుగు!

తార : ప్రసాద్!

ఆశ : తొందరపడకోయ్!

ప్రసా : తొందరేమిటి? వందసార్లు అంటాను.

గోపీ : మీరు ఎన్నిసార్లన్నా నేను కాదనను. మీ దృష్టిలో నేను వెధవనుకావచ్చు... నేను వారాలు చేసుకు తింటున్నానని జనానికందరికీ తెలుసు...నన్ను మీరు వ్యక్తిగతంగా గాయపరచదలుచుకుంటే చెయ్యండి...నా కభ్యంతరం లేదు...కాని మిగిలిన నావంటివాళ్ళమీద అందరిమీదా మాత్రం నిందమోపకండి...వారాలుతింటూ చదువుకుంటున్నంతమాత్రాన వ్యక్తిగతమైన అభిప్రాయాలు వుండకూడదా?...వాటికి విలువ వుండదా?

తార : ఇంత గొడవెందుకు గోపీ! ఈ కాస్త త్యాగానికి—ఒప్పుకుంటే సరిపోయేదానికి—

గోపీ : నాకుమాత్రం బాధలుండవా?

పాపా : అంత బాధలేమిటో?

గోపీ : ఇవ్వాళ నేను కాలేజీ మానివేస్తా ననుకోండి. నేను కావాలనుకొనే మానివేశానని ప్రిన్సిపాలుగారికి తెలిసి, ఆయన నా స్కాలర్‌షిప్ రికమెండ్ చెయ్యకపోతే, రేపటినుంచీ నేను వీధుల్లో రిక్షాలాక్కోవాలి...లేకపోతే బిచ్చమెత్తాలి.

తార : ప్రిన్సిపాలుగారు ఏమైనాచేస్తే మేం అందరం లేమూ? విద్యార్థుల హక్కులకోసం పోట్లాడడానికి మేం ఎప్పుడూ వెనుదీయం.

గోపి : నాకు స్కాలర్‌షిప్ ఇవ్వకం నాకు వున్న హక్కు ఎలా అవుతుంది?

ప్రసా : పోనీ మేం అటకాయించామని చెప్పండి.

గోపి : ఆటవికశక్తులు అంతిమనిశ్వాసం ఏనాడో విడిచాయని ఆయనకు మాత్రం తెలియదంటారా?... ఇంతటితో ఆగితే ఫరవాలేదు... నన్ను పోషిస్తున్న ఉదారులున్నారు. వారందరికీ సమాధానం చెప్పుకోవద్దా?... నువ్వుకూడా సమ్మెలో పాల్గొన్నావు, అటువంటివాడికి నాయింట్లో కూడు పెట్టనంటే, నన్ను పోషించేవాళ్లు ఒక్కరున్నారా, మీలో?

సీతా : ఏమిటోయ్, ఒక్కపూట కాలేజీ మానమంటే సవాళ్లు చేస్తావు!

గోపి : నాకున్న సాధకబాధకాలు చెప్పాను...వాటిని మీరు ఎలా స్వీకరించినా నాకు యిష్టమే!

శాస : ఇంతసేపు మొరాయిస్తావేమోయ్! మంచిగా చెబితే అర్థం చేసుకోవేం?

ఆశి : నీకు ఏ బాధా కలగకుండా హామీ యిస్తానన్నా ఒప్పుకోవేం?

పాపా : ఎంతో తొందరపనుల్లో వున్నా, అన్నింటినీ వదులుకొని వచ్చిన సీతారామయ్యగారికోసమైనా ఒప్పుకోవేం?

శాస : పోనీ, నువ్వు వెడితే వెళ్లావ్, నిన్ను చూసి జారబడే వాళ్లను రానివ్వకుండా చూడు.

గోపి : అది మాత్రం నాచేత ఎలా అవుతుంది?

పాపా : 'నేను ఇన్ని కారణాలవల్ల వెడుతున్నాను. మీరు రాకండి' అని చెప్పడమే!

గోపి : నేను వెడుతూ వాళ్ళను రావద్దంటే వాళ్లు నన్ను తిట్టరూ?

సీతా : ఇంత తలమొండివి దొరికావేం? రేపు పొద్దున నీకు వారాలున్నవాళ్ళకు చెప్పి నీకు తిండిలేకుండా చేస్తే ఏం చేస్తావ్?

గోపి : మీ పుణ్యమనుకుంటాను.

ప్రసా : అప్పుడు వారాలు వుండవన్నే, నువ్వు కాలేజీకి వస్తే పోయి నప్పుడూ అనుకో!

గోపి : ఇప్పుడైతే మన ఆశయాలను చూసుకునైనా కడుపు నింపుకోవచ్చు. అప్పుడు రెండూ నాశనం అయిపోతాయ్.

సీతా : ఆఖరిసారి చెబుతున్నాను...నేను అసలు ఎవరికీ ఇంతసేపు చెప్పను...

గోపి : క్షమించండి...నేనేం చెయ్యలేని పరిస్థితుల్లో వున్నాను.

ప్రసా : ఇంతమంది ఇంతసేపు బ్రతిమాలినందుకైనా ఒప్పుకో వచ్చునే!

గోపి : బ్రతిమాలించుకోవాలని నాకు మతరామూ లేదు.

సీతా : ఛస్! ఇతనికి ఎన్ని చెప్పినా బుద్ధి వచ్చేటట్లులేదు...నేను వెడుతున్నాను.

(ఒక మూలకు పోయి వలుకుతూ ఏదో గునగునలాడతాడు. తలలు పంకించి ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్లు చూస్తారు...సీతారామయ్య వెళ్లిపోతాడు.)

శాస : మాకు బ్రదర్! ఇప్పటికే చాలా లేటయింది. నీతో వాదాలు పెంచుకోవడానికి మాకు టైం లేదు...మరో సారి అడుగుతున్నాను, నువ్వూ, మీ వాళ్లు ఇవ్వాళ కాలేజీ మానరా?

గోపి : వాళ్ళ సంగతి నాకు తెలియదు...నా విషయం ఇంతా కటినుంచీ మీకు చెబుతూ వున్నా ఇంకా అడిగితే ఏం చెప్పగలను?

ప్రసా : కాలేజీ మానవంటావ్!

గోపి : వెళ్లాలనే నా సంకల్పం.

ఆశి : ఇదుగో బ్రదర్!...మేం అడిగినవాళ్లందరూ మారు మాట్లాడకుండా ఒప్పుకున్నారు. నువ్వుమాత్రం తిరగేశావా?...రాద్ధాంతం లేకుండా ఒప్పుకో నేదానికి!

గోపి : అదేమిటి ఆశీర్వాదంగారూ! రాద్ధాంతం చేస్తున్నది నేనా?...నా యిష్టప్రకారం నన్ను పోనివ్వక మీరు ఒత్తిడి చెయ్యడం బావుందా?

పాపా : ఒత్తిడి అంటావేమిటి? పెద్దవాడు ఆయన వచ్చి చెప్పాక నైనా లేకుండా—

ప్రసా : ఇప్పటికీ ఒప్పుకోకపోతే, ఒప్పుకుంటేటట్లు చేయవలసి వస్తుంది.

గోపి : అంటే?

పాపా : అంటే ఏమిటో నీకే తెలుస్తుంది. మర్యాదగా ఒప్పుకో.

గోపి : ఒప్పుకోకపోతే—

ప్రసా : మర్యాద మంట కలుస్తుంది.

గోపి : మీలాగా నేను మర్యాదమీదనే బ్రతికే మనిషిని కాదు. నన్ను బలవంతంగా ఆపితే తప్పితే—లేకపోతే అణు మాత్రైనా నేను కాలేజీ మానను.

శాస : అయితే, బలవంతంగానే ఆపవలసివస్తుంది. మిత్రమా, నీతోపాటు నీ ఆరాధకులు ఏ అరడజనుమందో లోపలికి వెడితే ఇంకా సమ్మె చెడిపోక ఏమవుతుంది?

గోపి : సరే! మీకు చేతనయింది చెయ్యండి.

ప్రసా : పరాయివూరునుంచి వచ్చి చదువుకుంటున్నావ్!... మేం వూళ్లోవాళ్ళం! ఎక్కడనుంచో వచ్చి ఇక్కడి వాళ్ళను ఎదిరించడం మంచిదికాదని తెలుసుకో.

గోపి : పరాయివూరయినంతమాత్రాన ఈ వూరు రాగానే మీకు నీడల్లా బ్రతకాలా? వ్యక్తిత్వం చంపుకోవాలా?...అటువంటి నీచమైన పని ఎక్కడ వున్నా, ఎదిరించి తీరుతాను. ఎవరు చెయ్యాలనుకున్నా ఎదిరిస్తాను.

ప్రసా : మాటలు జాగ్రత్తగా రానీ! ఎవరనుకున్నావో!

గోపి : ఎవరో నాకు తెలియదా?...అయినా నే నిప్పుడు తప్పు మాట ఏం అనలేదే!

పాపా : ఇంకా ఏం అవాలి? మేం చేస్తున్నది నీచమైన పని అన్నావు. చాలదూ?

గోపీ : నా దృష్టికది ఇలాగే కనిపిస్తోంది.

ఆలీ : నిన్నూ మేం నీచుణ్ణిగానే చూస్తాం. సరా?

గోపీ : నేను కాదన్నానా? ఇందాక నేను అనమంటేనే అన్నారా ప్రసాద్ గారు నన్ను 'నేరాలు చేసుకొనే వెధవ' అని.

తాత : ఈ గొడవంతా ఎందుకు? మర్యాదగా ఈ పూట కాలేజీకి రాకు.

గోపీ : ఇన్ని చెప్పిన తరువాతకూడా మీరలా అంటే నేనేం చెయ్యగలను?

ప్రసా : ఈయనగారిని లాలిస్తూ ఎంతసేపు కూర్చుంటాంరా? టైం అప్పుడే పది కావచ్చింది.

తాత : ఆఖరిమాట చెప్పు గోపీ. ఇంతమందిమి, ఇన్నిసార్లు అడుగుతున్నాం—

గోపీ : ఎంతమంది ఎన్నిసార్లు అడిగినా నాసమాధానం ఒక్కటే.

ప్రసా : ఇట్లా ఎదిరించడం భావ్యంకాదు. ఆలోచించుకో!

గోపీ : ఆలోచించుకొనే చెబుతున్నాను.

పాపా : తప్పదంటావ్?

గోపీ : (తల త్రిప్పుతాడు)

ఆలీ : మంచిగా చెబితే ఎందుకు వూరుకొంటాడురా?

పాపా : అమ్మ పెట్టే నాలుగూ పెట్టొద్దూ?

ప్రసా : (మీదికి వెళ్ళి) చివరిసారి చెప్పు.

గోపీ : ఇది నాలుగోసారి 'చివరిసారి.'

తాత : ఛా! 'మంచిమనిషి కొకమాట, మంచిగొడ్డు కొక దెబ్బ' అన్నారు.

గోపీ : నేనూ అదే అంటాను.

పాపా : మాటలు జారకు. జాగ్రత్త.

గోపీ : నా జాగ్రత్తలో నేను ఎప్పుడూ వుంటాను.

ప్రసా : అంటే, నువ్వు సిద్ధమే నన్నమాట!

గోపీ : కొట్టడానికా! మీకు తెలియదూ, నేను కొట్టలేనని.

ప్రసా : అయితే పిచ్చివాగుడు వాగకు.

గోపీ : అది మీది—

ప్రసా : ఫూల్! నన్నే అన్నావ్.

[ఛెళున చెంపమీద కొడతాడు]

తాత : ఇప్పుడే కొట్టుకోవడాలు ఎందుకురా? అత నెలాగూ ఒప్పుకోడు...అతన్ని రానివ్వడం మనకు ప్రమాదం—

పాపా : ఇంకా మాటలెందుకురా?...ఆ గదిలో పెట్టి తాళం వేస్తే సరి—

[పాపారావు ఈ మాట అన్నదే తడవుగా ప్రసాద్ అతన్ని మెడబట్టి లోపలికి గెంటుతాడు. గోపీ విడిపించుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తాడు. అందరూ లోపలకు వచ్చి బయట తాళం వేస్తారు.]

ప్రసా : ఇప్పుడొచ్చి వీణ్ణి రక్షించాలంటే, ఆ కుకుణాదేవిగారే రావాలి! వెధవ, వీడూ ఓ రొమాంటిక్ హీరో, వీడి బ్రతుక్కి!

తాత : ఇది నలుగురికీ తెలిస్తే మన అబోరు దక్కదు.

ఆలీ : ఏం ఫరవాలేదు...అసలు తెలియదనుకో! వూరికి కూడు మూల. వీడి గొడవ ఎవరు వింటారు? విన్నా, మన కేం చేస్తారు?

ప్రసా : ఇంతవుండి ఇంతసేపు బ్రతిమాలాం. లాంగంకే! సీతారామయ్య వీడిని శతమూండి అన్నాడుగాని నేను 'సహస్రమూండి' అంటాను.

పాపా : 'సీతారామయ్యగారూ' అనలేవూ?

ప్రసా : నా యిష్టం వచ్చింది నే నంటాను.

తాత : మళ్ళీ దానికో పోట్లాటా?

ప్రసా : లేకపోతే నా యిష్టానికి వీడి అభ్యంతరం ఏమిటి?

పాపా : నీ యిష్టమైతే నీ లోపల అనుకో! బయటకు మాట్లాడేటప్పుడు సభ్యత వుండొద్దూ? అట్లా అంటే కొందరికి కష్టం కలగవచ్చు.

ప్రసా : ఎవరి కేకష్టం కలిగినా, నేను అనేది అనేదే.

పాపా : జాగ్రత్త. అనవసరంగా మాటలు జారకు.

తాత : అబ్బబ్బ! వూరుకోండిరా! మొత్తానికి తెలుగువాళ్ళనిపించారు! అరే ప్రసాద్, నువ్వు త్వరగా కాలేజీకి పద... మీ రిద్దరూ మీ వాళ్లను తీసుకొని కాలేజీకి రండి... మీరు వచ్చేటప్పుడు ఆ ధర్మారావును పట్టుకురండి. వాడికీసంగతి తెలిస్తే దుమారం లేపుతాడు.

ఆలీ : వాడు మావాడుగా! వాడిసంగతి మేం చూసుకుంటాంలే!

[వేరువేరు ప్రక్కలకు వెళ్లిపోతారు—తెర.]

## రెండోరంగం

** కాలేజీకి ఇరవైగజాల దూరాన, రోడ్డుమీద చాలామంది విద్యార్థులు జండాలు పట్టుకొని నిలబడివుంటారు. అట్టలమీద 'విద్యార్థుల హక్కుల్ని కాపాడుకోవాలి,' 'అభివృద్ధి నిరోధక శక్తుల్ని నాశనంచెయ్యండి.' 'సమ్మెను జయప్రదం చెయ్యండి'—అంటూ నినాదాలు వ్రాయబడి వున్నయ్. రోడ్డుమీదనే ఒక ప్రక్కగా ఏడుకొండలు బడ్డీ వుంది. దానికి ముందుగా ఓ బెంచీ. కొంద రక్కడ సిగరెట్లు తాగుతూ కూర్చుని, నిలబడి మాట్లాడుకుంటూ వుంటారు.]

అవతారం : గోపీ ఎక్కడా కనిపించడేం?

జకరయ్య : నేనూ చాలాసేపట్నుంచి చూస్తున్నాను. కని పించలేదు.

అత : మీకు కనిపించాడా పాపారావుగారూ ?

పాపా : లేదండీ—

తాత : (సిగరెట్టుకొంటూ) రూముదగ్గరమాత్రం లేడండీ!... ఎక్కడకు వెళ్లాడో, ఎంత వెదికినా కనిపించలేదు.

పిచ్చి : వెంకటరత్నంగారింటికి వెళ్ళాడేమో?

సత్యం : ఆ పిచ్చి ఏడుపేమిటో సరిగ్గా ఏడవరాదూ!—సుగుణగారింటికి వెళ్లాడేమోనని—

పిచ్చి : అనుమానం వేసింది, అడిగాను.

సత్యం : నిక్షేపంగా అడగవచ్చురా పిచ్చితండ్రీ! అడుగుతూ మధ్య ఈ డొంక తిరుగుడు దేనికి ?

జకర : సత్యంగారూ! తీరా సమ్మె అయిపోయినతర్వాత మన పేరు బయటకువస్తే ఫైను వెయ్యరుగదా ?

సత్యం : ఫైన్ అంటారేమిటండీ? కొందరికి టి. సి. లు ఇచ్చి పంపినా పంపవచ్చు.

జకర : మనకుకూడా ఇస్తారంటారా?

సత్యం : ఎందుకు ఇవ్వకూడదూ? ఇవ్వడానికి ఒకే ఒక్క సుగుణం మీలో వుండాలి. మీరు సమ్మెనాడు కాలేజీ దగ్గరకు వచ్చి, కొంతమందినైనా లోపలకు వెళ్లకుండా ఆపారా, లేదా అని.

జకర : ఆ విషయం ఎలా తెలుస్తుందిలెండి?

సత్యం : ఎందుకు తెలియదులెండి? మనవాళ్ళల్లోనే అయిదారు వందమంది సి. ఐ. డీలు వున్నారు.

జకర : (బిక్కచచ్చి) ఆఁ!—

తాత : ఏమిట్రా! అసలే అతను పిరికి గుండెవాడు. అతన్నేమిటి సాగదీస్తున్నావు ?

జకర : అబ్బే! నన్నా!...ఏంలేదు.

సత్యం : ఏమిలేదురా! విద్యార్థుల హక్కులు సంరక్షించడానికి మనం కంకణం కట్టుకున్నట్టు ప్రిన్సిపాల్ గారికి తెలిస్తే, మనకు టి. సి. ఇచ్చి పంపుతారా అని అడిగాడు. ఎందుకు ఇవ్వరూ అన్నాను.

తాత : ఏడవలేకపోయావ్...(జకరయ్యతో)ఏమిలేదు బ్రదర్... వాడిమాట నమ్మకు. ఏ ఒక్క కుర్రాడిని తీసివేసినా మేం వూరుకుంటామా ?

సత్యం : అవునవును. ఊరెట్టుకుంటారు. అంతగా అయితే మరో సమ్మె మొదలు పెడతారు...వాళ్లతో మనకెందుకు గాని, ఏడుకొండలు! ఒక సోడా కొట్టవోయ్.

ఏడు : తీసుకోండి సామీ...ఇంకేమైనా కావాలా?...అరటిపళ్లు తెచ్చినా...

సత్యం : అక్కర్లేదోయ్...ఇవ్వాళ ఆంజనేయులు పుణ్యమా అని ఆర్గనైజర్ల కందరికీ స్వీట్, హాట్, కాఫీ ముత్తుగా పడ్డది.

ఏడు : నాకు తెలీకడుగుతా, ఇదంతా ఎందుకు సామీ ?

సత్యం : ఈ పిల్లకాయల హక్కులకోసం ఏడుకొండలూ!

ఏడు : హక్కులంటే—?

సత్యం : హక్కులంటే—రైట్స్...(తెలుసురాక.) హక్కులు అదే!...ఆఁ! ఈ కొట్టు నీ స్వంతంకదా! అంటే దీని మీద నీకు హక్కువున్నదన్నమాట?

ఏడు : వుంటే—?

సత్యం : దాన్ని ఎవరైనా అక్రమంగా లూటీచేసి, నీ సామాన్లు ఎత్తుకుపోతారనుకో....అప్పుడు నీవస్తువుల్ని కాపాడు కోవడానికి నీవు ఇటువంటిదే ఏదో చేస్తావు.

ఏడు : మీరు పరాసకాని కంటూఉండారుగాని, ఈ బడ్డీనిఎవరు లూటీ ఎవరు చేస్తారు సార్?

సత్యం : చేస్తారనికాదు...ఒకవేళ చేస్తే...

తాత : (వస్తూ) ఏరా, ఏమిటి ఉపన్యాసాలు దంచుతున్నావ్. ఏడుకొండలు దగ్గర—?

సత్యం : ఎవ్వరూ వినకపోతే ఏం చేస్తాను? సోడా తాగితే, ఏడుకొండలు ఏంచెప్పినా వింటాడుకదా అని అతనికి చెబుతున్నాను.

తాత : కాలేజీ మానేసింతర్వాత నేను ఎట్లాగూ రాజకీయాల్లో చేరతాను. అప్పుడు నావెంట తీసుకువెళ్ళి ఉపన్యాసా లిప్పిస్తానులే.

సత్యం : బ్రదర్! ఇవి రాజకీయనాయకులకు మంచిరోజులు కావు. నీతోపాటు నేనూ దెబ్బలు తినాలనా—?

ప్రసా : తాతయ్యా! ఆ గేటుదగ్గర నుంచోరా! కాఫీ తాగొస్తాను.

సత్యం : అమ్మయ్యా! నాకూ కాఫీ ఇప్పించవురా?

ప్రసా : ఇంకా ఎగతాళి పట్టించడానికా?

సత్యం : ఎగతాళి అంటావేరా? నువ్వు సుగుణని ప్రేమించడం నిజం కాదా? ఆ అమ్మాయి—

ప్రసా : అపరా బాబూ! పుణ్యం ఉంటుంది. ఆలిండియా రేడియో నయంరా!

సత్యం : అందుకే కాఫీ ఇచ్చుకో.

ప్రసా : ఇప్పుడే కదరా రెండు స్వీట్లతోసహా తాగావ్.

సత్యం : వూరికే వచ్చేటప్పుడు ఎన్నిసార్లు తాగితే నేంరా?

ప్రసా : సరే, పద. (వెడతారు)

ఆశీ : ఏం బ్రదర్! ప్రిన్సిపాలు ఏమంటున్నాడు?

తాత : లొంగి రావటంలేదు బ్రదర్...ఇహ లీడర్సు అందరూ వెళ్ళి అడగాలి.

ఆశీ : ప్రిన్సిపాలు ఇంతమాత్రానికే దిగివస్తాడని నాకు నమ్మకం లేదు...మనం ఒక్కరోజా చెయ్యడానికే బ్రహ్మ ప్రళయం అయింది.

ఏడు : ఎన్నాళ్లుంటాది బాబూ, ఇలా?

తాత : ఏమానోయ్...నీబేరం మాదిరిగా, ఇది ఏరోజు వ్యవహారం ఆరోజే.

అవ : మూనాన్న మూగాళ్ళగా! అప్పుడే వసుగుతున్నారు.

తాత : ముందు ఇవ్వాళ గడవనీ.

అవ : ఆ అవతారాన్నీ, జరకరయ్యనీ మూగారా! గోపీ ఏదని వందసార్లు అడిగారు...

తాత : మీరు ఒక్కపని చెయ్యండి...వాళ్ళిద్దర్నీ తీసుకువెళ్ళి కాసిని కాఫీనీళ్ళు పోయించండి. లేకపోతే వాడు రేపు ఉదయాన వాడిదగ్గరకు వెళ్ళినా వెళ్ళొచ్చు.

అవ : అలాగే (వెళతాడు)

(ధర్మారావు వస్తాడు)

ధర్మ : తాతయ్యా! నేనొక్కసారి కాలేజీలోకి వెళ్ళాలోయ్.

తాత : ఎందుకూ?

ధర్మ : మా నాన్నగారిదగ్గరనుంచి ఏదో ఉత్తరం వచ్చిందట—

తాత : ఉత్తరానికేముంది? రేపు తీసుకోవచ్చు.

ధర్మ : అలాకాదు...ఎక్స్‌ప్రెస్ డెలివరీ అట.

తాత : అయితే కాలేజీలో ఎందుకు ఇచ్చాడు?

ధర్మ : కాలేజీకి వస్తామేమోనని మన గుమాస్తా బాలకృష్ణ లేడూ? అతనికి ఇచ్చాడట!

(ప్రసాద్, సత్యం వస్తారు)

తాత : నువ్వు వెళ్ళడంవల్ల మాకు భయంలేదనుకో! కాని —

ప్రసా : ఏమిటి? లోపలకు వెళ్ళాలా?

ధర్మ : అవును.

ప్రసా : వీల్లేదు.

ధర్మ : ఎందుకని?

తాత : ప్రతివాడూ ఏదో ఒక మిషతో వెళ్ళాలంటే?

ధర్మ : అంటే నేనూ ఆ మిషనే వెదుకుతున్నానంటారా? అంత గతి పట్టలేదు...అర్జంటు కాబట్టే అన్నాను.

ప్రసా : అంతోటి తొందర ఏమిటో?

తాత : ఏదో వుత్తరం వచ్చిందట.

ప్రసా : అంత - అర్జంటా?

సత్యం : ప్రేమలేఖ ఏమోరా?

ధర్మ : దగ్గర దగ్గరగా అటువంటిదే!...ఏదైతేనేం, అర్జంటయిన తర్వాత.

ప్రసాద్ : అయినా వీల్లేదు...నిన్ను పోనిస్తే అందర్నీ పోనివ్వాలి.

ధర్మ : బ్రదర్...సమ్మెలు అందరి సానుభూతితోనూ జరగవలసినవి కాని, దౌర్జన్యాలతోనూ, బెదిరింపులతోనూ జరగవు.

తాత : నువ్వు వెళ్ళక తప్పదంటావు!

ధర్మ : ఎందుకు వెళ్ళాలో కూడా చెబితిని...పోనీ, మీ లెవరైనా ఆ వుత్తరం ఏప్యూన్‌చేతనో తెప్పించండి...మీకూ, నాకూ బాధ వుండదు.

తాత : వాళ్ళెవరూ ఇటు చాయలకి రావడంలేదు. ఇందాక మరి గాను మాతో మాట్లాడుతుంటే ప్రిన్సిపాలు మొహం వాచేటట్లు తిట్టి పంపాడట...

ధర్మ : ఎలా?...పోనీ నేను ఉత్తరం తీసుకోగానే వచ్చేస్తానని ఒట్టుపెట్టి మరీ చెబుతాను.

ప్రసాద్ : అందరూ ఆ మిషమీదే బయలుదేరితే?

(పిచ్చయ్య త్వరగా వస్తాడు).

పిచ్చయ్య : అరే ప్రసాద్!....తాతయ్యా! గోపీని ఎవరో గదిలో పెట్టి తాళం వేశారట.

ప్రసా : నీ కెవరు చెప్పారు?

ధర్మ : నిజంగానా?

పిచ్చ : వాళ్ళెవరో అనుకుంటూ వుంటే విన్నాను.

ప్రసా : ఏడిశావు...ఎవరో తమాషాకు చెప్పి వుంటారు...

(అవతారం వస్తాడు.)

ధర్మ : అవతారం! గోపీ కనిపించాడా?

అవ : ప్రొద్దుటినుంచీ చూస్తున్నాను.

ధర్మ : వాడిని వాడి గదిలో పెట్టి తాళం వేశారట. నువ్వు వెళ్ళి చూసిరా.

ప్రసా : ఈ పిచ్చయ్య చెప్పేవన్నీ అటువంటివే! గోపీని ఎవరు గదిలో పెట్టి తాళం వేస్తారు?

ధర్మ : ఏమో? ఈ వూళ్ళో చెయ్యకూడనిది ఏం వుంది?...వెళ్ళిరా అవతారం.

[అవతారం బయటకు వెళ్ళగానే ధర్మారావు లోపలకు వెళ్ళడానికి బయలుదేరుతాడు]

ప్రసా : వద్దని నీకు కాదూ చెప్పేది?

ధర్మ : వెళ్ళాలని నీకు కాదూ, చెప్పేది?

తాత : నీ మాటే నీది కాని ఎదుటివాళ్ళ మాట వినిపించుకోవేం?

ధర్మ : మీ మాటే మీది కాని ఎదుటి వాళ్ళ మాట వినిపించుకోరేం? (అంటూ వెళ్ళబోతాడు.)

ప్రసా : ఏమైనా నువ్వు వెళ్ళడానికి వీలులేదు.

ధర్మా : ఏమైనా నేను వెళ్ళితీరాలి.

ప్రసా : నువ్వు పోట్లాటకు వచ్చినట్లున్నావే!

ధర్మ : ఎవరు వచ్చిందీ తెలియడంలా?

(అంటూ లోపలికి పోబోతాడు. ప్రసాద్ అతన్ని వెనక్కి నెడతాడు.)

ధర్మ : ఏం చేస్తున్నావో తెలుసుకో! అనవసరంగా ఎందుకని వూరుకుంటుంటే, పెచ్చురేగి పోతున్నావే!

తాత : ఎవరికో చెప్పినట్టు, నీకు ఎన్నిసార్లు చెప్పాలి ధర్మారావు?

ధర్మ : ఎవరికో చెప్పినట్టు మీకు ఎన్నిసార్లు చెప్పాలి?

ప్రసా : ఇదేం అవసరం వున్నట్టుగా లేదు.

ధర్మ : అటువంటిపనులు చేసేది నువ్వు. నేను గోపీ ననుకున్నావేమో కాబోలు...ఇవేం మనదగ్గర సాగవు.....మర్యాదగా అడ్డంలే.

ప్రసా : లేవకపోతే ఏం చేస్తావ్?

ధర్మ : ఏంచేస్తానో చెప్పటం ఎందుకు? నువ్వే చూడొచ్చు.

ప్రసా : నీయిష్టంవచ్చింది చేసుకో...మేంమాత్రం నిన్ను వెళ్లనివ్వం.

ధర్మ : ఎందుకు వెళ్ళనివ్వరో నేనూ చూస్తాను.
(అంటూ ముందుకు నడతాడు. ప్రసాద్ అతన్ని గట్టిగా తోస్తాడు. అతను వెనక్కుపడి, తమాయించుకొని, లేస్తాడు.)

తాత : ప్రసాద్ ! ఏమిటది ?

ప్రసా : నడతాట్ట! వెళ్లమను—
[ధర్మారావు సర్దుకొని, లేచి, గబగబా ప్రసాద్ దగ్గరకు వెళ్ళి చాచి లెంపకాయ కొడతాడు. చుట్టూ మూగిన విద్యార్థులు కొందరు నవ్వుతారు. కొందరు నోళ్లు తెరుచుకొని చూస్తూవుంటారు.]

ధర్మ : ఎందుకులే అని వూరుకుంటుంటే మగతనం చూపిద్దామనుకున్నావ్. మగతనం! నేనేం గోషీ ననుకున్నావా ?... ఎక్కడనుంచో వచ్చినవాణ్ణి భయపెట్టి, గదిలో వుంచి తాళంవెయ్యడానికి ?

తాత : ఎవరు ?

ధర్మ : మీరే ! ఇంకెవరుచేస్తారు ?.......వాడీ ఈ వూరే !... నీబతుకు తెలియదనుకోకు. క్రిందికెళ్తే మగాడు వచ్చాడు...జాగ్రత్త !...అనవసరంగా నాజోలికి రాకు.

ప్రసా : నన్ను...నన్ను కొడతావురా ! బ్రూట్...
(అంటూ ధర్మారావుమీదికి వస్తాడు. తాతయ్య ఆపుతాడు.)

తాత : నువ్వు చెయ్యిచేసుకోవడం ఏమీ బాగులేదు ధర్మారావు !

ధర్మ : ఏం ? మీవాడు చేసింది బావుందా ? నన్ను నెడతాడా ? వీడెంత, వీడిబ్రతుకెంత ? నాలుగు వులెన్‌గుడ్డలు కట్టి, అమ్మాయిలకు పోజులు కొట్టినంతమాత్రాన వీడు హీరో అయిపోయాడా ?

ప్రసా : అనవసరంగా మాటలు మిగలకు—తిన్నులుతింటావు.

ధర్మ : ఎవరు తింటారో తెలుస్తూనేవుంది.

ప్రసా : నోరుముయ్...(అని తాతయ్యను విదిలించుకొని ప్రసాద్ మీదకు వస్తాడు. కాని తాతయ్య మళ్ళీ ఆపుతాడు.)

విశు : ఎందుకుబాబూ, ఇంతలో కీచులాటలు !

ధర్మ : కీచులాట అంటావేం ఏడుకొండలూ ? ప్రపంచాన్నంతా వీడియిష్టంవచ్చినట్లు నడిపిద్దామనుకుంటున్నాడు...వీడి వ్యాళ ఈ వూళ్ళో మగాడయినాడు...అమ్మ పుట్టిల్లు మేనమామలదగ్గరా ?

ప్రసా : తెలుసు, తెలుసు...ఆ గోపిగాడిని వెంటవేసుకొని ఆ వెంకటరత్నం ఇంటికి వెళ్లడంలోనే బయటపడ్డది నీ బండారం.

ధర్మ : ఏమిటోయ్, అది ?

ప్రసా : నీకుమాత్రం తెలియదూ ? ఆ అమ్మాయిగారికి ఆ వారాల వాళ్ళమీద ఎందుకూ అంత మమకారం ?

ధర్మ : అట్లా వాగితేనే మళ్ళీ తింటావ్ ? ఏం మాటలు మర్యాదగా రావూ ? నీకు ఆ ఏడుపెందుకూ ? నేను గోపిని వాళ్లయింట్లోకి తీసుకువెళ్ళి పరిచయం చేశానని నీ ఏడుపు...నిన్నూ పరిచయం చేస్తాను,రా...ఛీ ! నీకంటె తక్కువయంరా. వాళ్ళు అక్కచెల్లెళ్లయినా, అమ్మ కొడుకులైనా, నీలాంటివాళ్లకు ఏదో నీచమైన సంబంధమే కనిపిస్తుంది.

ప్రసా : ఏం నోట్లేగిపోతున్నావు ? ... ఆగరా ! నీడిసంగతి తేలుస్తాను.

తాత : మీ రిద్దరూ ఇలా బజారున పడితే ఎలారా ? పెద్ద పెద్ద వుపన్యాసాలు చెబుతాము ? ఇంత చిన్నవిషయాలకేమిట్రా ఈ దెబ్బలాటలు ?
(ఇంతలో పాపారావు, ఆశీర్వాదం వస్తారు.)

ధర్మ : ఏరా, పాపా ! నేను వుత్తరం తీసుకోవడానికి లోపలకు వెళ్లాలంటే, వెళ్లనివ్వరా ?

పాపా : నీకు అడ్డేమిటిరా ? వెళ్లు.

తాత : అదికాదు పాపారావు ! అతను నడిచే ప్రతివాడూ అతగడూ ?

ఆశీ : ప్రతివాడూ, అతనూ ఒకటేనా ?...వెళ్లరా ధర్మా—

ధర్మ : ఇందాక నేను నడతానన్నందుకే నన్ను క్రిందికి తోశాడు ప్రసాద్.

పాపా : (ప్రసాద్ మీదికి వెళ్లి) ఏం బ్రదర్ ! ఒక్కసారి హీరో వయిపోదామని చూస్తున్నావా ?

ధర్మ : ఇప్పటిదాకా ఎందుకు ? ఇందాకే అయిపోయాడు.

ఆశీ : ఏం తాతయ్యా ! మీ వాడు నీ ఎదటే ఇట్లా తోస్తుంటే చూస్తూ వూరుకున్నావా ?

తాత : ధర్మారావు చేసింది బావుందా ?

ధర్మ : నన్ను క్రిందికి తోశాడు. నేను కొట్టాను.

ప్రసా : కొడతావు, కొడతావు...తాతయ్య పట్టుకోబట్టి బ్రతికిపోయావు.

ధర్మ : అబ్బా ! లేకపోతే ప్రాణాలు తీస్తావా ? ఇప్పుడు వదిలేయ్ ఏం చేస్తావో ?

ప్రసా : నీం చెయ్యాలి ? సిగ్గూ ఎగ్గూ లేని బ్రతుక్కి—

పాపా : మాటలు జాగ్రత్తగా రానీ ! పేలిపోతుంది ఒళ్లు.

ప్రసా : వాడు అనగా లేనిది, నేనంటే వచ్చిందేం ?

ఆశీ : వాడేమన్నాడు ? తప్పేం అనలేదే !

పాపా : (తాతయ్యతో) మీవాడి మాటలకి ముందు క్షమాపణ చెప్పించు... మరీ మితిమీరిపోతోంది వ్యవహారం.

తాత : ఎవరనుకొన్నది వాళ్లనుకొని పైగా క్షమాపణ ఏమిటోయ్...

ఆశీ : ముందు అన్నది ఎవరు ?

తాత : ఎవరంటే ఏం ? జరిగిపోయాక—

పాపా : అలాకాదు—

తాత : ముందు తొందరపడ్డది ప్రసాదే !

పాపా : అందుకే క్షమాపణ చెప్పాలనుకుంటున్నాం.

ప్రసా : చచ్చినా చెప్పను.

ఆశీ : ఆలోచించుకోండి... ఏం ఇప్పుడే వస్తాం... క్షమాపణ చెబితే సరేసరి, లేకపోతే— (ముగ్గురూ దూరంగా వెళ్లి పోయారు).

శాత : చూశావా! తొందరపడకురా అంటే—

ప్రసా : ఇంకా తొందర అంటావేం! వాడనే మాటలు నువ్వు వినలా?

శాత : మాటల్తో పారేదానికి నువ్వు చెయిచేసుకుంటివి.

ప్రసా : ఇంకానయం... కాలుచేసుకోలేదు....

శాత : సంతోషించాం కాని, ఇప్పుడేం చెయ్యడం?... నువ్వు క్షమాపణ చెప్పకుంటే ఈ నిప్పు మండకుండా ఆరిపోతుంది.

ప్రసా : ప్రాణాలు పోయినా ఒప్పుకుంటానుగాని, ఆ వెధవకి క్షమాపణ చెప్పకుంటావా?

శాత : మరి ఎలారా?

ప్రసా : ఎలాగంటూ చూనుస్తానేం? వీళ్లు ఒక్కమాట ఇటు వస్తారో, సాయంకాలంలోపుగా వీళ్లలో కొందరికి వరస తగలనిస్తాను.

శాత : సరే! ఏమయితే అది అవుతుంది... కానీ—

(ఆశీర్వాదం, పాపారావు, ధర్మారావు, మరికొందరు సన్నిహితులు వస్తారు.)

పాపా : ఏం బ్రదర్, ఏం తేల్చుకున్నారు?

శాత : ఈ భాగ్యానికి వాడు క్షమాపణ చెప్పవలసిన అవసరం ఏముంది?

ఆశీ : ఉండడం లేకపోవడం తరువాత సంగతి...ముందు క్షమాపణ చెప్పుకోవాలి.

ప్రసా : చెప్పను, చెప్పను, చెప్పను.

పాపా : అయితే పదండిరా కాలేజీలోకి. వీళ్ళసంగతి ఏమిటో చూద్దాం. వాళ్లు తప్పులు చేస్తే ఒప్పులూను, మనం చేస్తే కాదా? పదండి...ధర్మా! లోపలికి పద ... జకరయ్యా! ... అందరూ లోపలకు పదండి—

[లోపలకు వెళ్ళడానికి రెండు వర్గాలవారికీ సంఘర్షణ జరుగుతుంది. వీరు వారిని వారు వీరిని తోసుకోవడం, పరస్పరం ఒకటి రెండు దెబ్బలు తినడం జరుగుతుంది. ఓ క్షణం అయినతర్వాత ప్రసాద్ రేగిపోయిన జుట్టుతో, చిరిగిన బట్టలతో వస్తాడు......ఇంతలో మరోవైపు నుంచి సత్యం వస్తాడు.)

సత్యం : ఏమిట్రా బ్రదర్! దేవదానుదేమంగాని చెయ్యడం లేదు కదా!

ప్రసా : నోరుముయ్యిరా! నీచేతగానోకాలకు చేతాకాకా లేదురా?

సత్యం : టైంటేబుల్లో ఇది ప్రత్యేకంగా ఒక సబ్జక్టు కాదు, ఖర్మ! ఏంచేస్తాం?...సరే! వీళ్ళందరూ వీరి?

ప్రసా : ఎవరు?

సత్యం : అదే! [illegible], [illegible]. పాపారావు వచ్చారు.

ప్రసా : ఆ పాపారావు వాళ్లు ఉన్నట్టుంది కాలేజీ కొళ్ళాయి తెలుసా?

సత్యం : ఏమిటే!....ఎందుకు?

ప్రసా : ఒళ్లు మదం ఎక్కి...వీళ్లకి కుందుకున్నదిలే మనల్ని వండుగ...(ఏదో ఆలోచించి) అరేయ్, బ్రదర్! ధర్మారావు క్లాసుకు వెళ్లినట్టున్నాడు గాని, వాడి వలా వెనకాల గేటుదగ్గరకు తీసుకురా, మాట్లాడాలి.

సత్యం : నువ్వే కాలేజీలోకి వచ్చి మాట్లాడకూడదూ?

ప్రసా : ఈ వేషంతో వస్తే దడుసుకుంటారు...నువ్వు ఓ పదినిమిషాలు అయినతర్వాత వాడిని అటుతీసుకురా! నేను రమ్మన్నానని చెప్పకు... నువ్వే ఏదో మాట్లాడుతూ తీసుకురా!

సత్యం : ఏమిటో, నాకేమీ అర్థం కావడం లేదు.

ప్రసా : ఇది చెబితే అర్థం అయ్యేది కాదురా...ప్రత్యక్షంగా చూస్తావుగా!...త్వరగా వెళ్లు.

[బలవంతాన పంపుతాడు.]

వీడు : ఏంది బాబుగారూ? 'యవ్వారం అంతా తెలిసినట్టుందే!

ప్రసా : వాళ్లవాళ్లు నలుగురు దగ్గరున్నారని మిడిసిపడితే ఏంచేస్తుంది? ... చూస్తావుగా ఏడుకొండలూ! — సాయంకాలంలోగా వీళ్లందర్నీ ఒకసారి వాయించివదలాలి.

వీడు : పోనియ్యండి బాబూ! ఆల్లెవరో సేసినారని మనం సేస్తే మనగొప్ప ఏముంది?...అయినా యింతదాకా బాగానే ఉన్నారు గదండీ!...

ప్రసా : వెధవబుద్ధులు పుట్టడానికి ఎంతసేపు పట్టాలి?

ఏడు : కూచుని, ఓసోడా తాగండి బాబూ!

[సోడా కొడతాడు—ఇంతలో చిట్టన్న వస్తాడు.]

ఏడు : ఏంది చిట్టన్నా, ఇటొచ్చినావు! దోవతప్పినట్టుందే!

చిట్ట : లేదన్నా! కావాలనే వచ్చినా!...(ప్రసాద్‌తో) అయ్యా, ఈడ మా ధర్మయ్యగారు ఎక్కడుంటారో తెలుసునా?

ప్రసా : ధర్మయ్యా, అధర్మయ్యా ఎవరికి తెలుసు?

ఏడు : ఇప్పుడే లోపలికి పోయినట్టుందాది... కాదుబాబూ?

ప్రసా : ఏమో, ఎక్కడ ఏడిచాడో ఎవరికి తెలుసు?

చిట్టన్న : ఏందిబాబు! ముక్కుమీద కోపం పెట్టుకొచ్చినావు! పోనీ గానయ్యా! గోపయ్యబాబు ఎక్కడుంటడో తెలుసునా!

ప్రసా : గోపేనా? ఎందుకు?

చిట్ట : పనుండదిలే బాబు, ఉన్నాడా?

ప్రసా : ఏమిటిపని? చెప్పు, ఫరవాలేదు...లోపల ఉన్నాడు.

చిట్ట : మా సుగుణమ్మగోరు ఓ సీటీ ఇచ్చిరమ్మన్నారండీ... ఎక్కడున్నారయ్యా?

ప్రసా : లోపల క్లాసులో ఉన్నాడు. ఆ చీటీ ఇవ్వు నేను ఇస్తాను!

చిట్ట : అయ్యబాబు! ఇది ఎవరికైనా ఇచ్చినావని తెలిస్తే అమ్మగారు ఊరుకుంటారూ?

పిచ్చి : నిన్నకూడా వారంరోజులు సస్పెండుచేశారు...... ఇప్పుడే నోటీసుకట్టారు.

గోపి : నన్నా !...నిజం ?

పిచ్చి : ఇప్పుడేగా చూసివస్తున్నది!...నీకు చెబుదామని వస్తున్నాను.

గోపి : నాపేరెలా తెలిసిందో ప్రిన్సిపాలుకు ?

పిచ్చి : అసలు ఏంజరిగిందంటే—మళ్ళీ నేను చెప్పావని ఆ ప్రసాద్ వాళ్లతో చెప్పకు—మొదట ప్రిన్సిపాలు దగ్గరకు వెళ్ళినప్పుడు కసికొడ్డి నీ పేరు చెప్పారట...తీరా కొంతమంది కాలేజీకి వచ్చారా ? రానివాళ్లలో లీడర్సునందర్నీ సస్పెండుచేశారు.

గోపి : బావుంది!...అరె ! ఇదేమిటి ? ఇంకా రక్తం ఆగలేదు...ధర్మా! ధర్మా!...... అరె స్పృహతప్పుతున్నాడు......ఏడుకొండలు ! మా వాళ్లెవరన్నా వస్తే జనరల్ హాస్పిటల్‌కు రమ్మని చెప్పు...

[వెళ్లడానికి లేస్తాడు.]

పిచ్చి : గోపీ! మనొక్కసారి అర్జంటుగా ప్రిన్సిపాలును కలుసుకోవాలి...అప్పుడే కమిటీవాళ్లంతా కాలేజీకి వచ్చారు...వాళ్లకు నీ పేరు తెలిసిందంటే నీస్కాలర్ షిప్ కాస్తా పోతుంది.

గోపి : పోనివ్వరా, ఏంచేస్తాం ?...నేను ముందు ఆసుపత్రికి వెళ్లాలి...వాళ్ల ఇష్టంవచ్చినట్లు చేసుకోమను.

పిచ్చి : అదికాదురా—

గోపి : (వినిపించుకోకుండా) ఏయ్, రిక్షా ! రిక్షా !

[గోపి త్వరగావెళ్లిపోతాడు. పిచ్చయ్య అలాగే నోరు తెరిచి చూస్తూవుంటాడు.]

ఏడు : మంచిమారాజు ! ఎంతజాలిగుండె !...అటువంటి ఆయనకే అన్నికష్టాలు !......

[ఇద్దరూ గోపి వెళ్ళినవైపే చూస్తూవుండగా తెర.]

---

# సంక్షేమరాజ్యం, ప్రజాస్వామ్యం, సామ్యవాదం

శ్రీ చావలి వెంకటహనుమంతరావు

మనదేశంలో సంక్షేమరాజ్య వ్యవస్థ వీలైనంత త్వరలో ఏర్పాటుచేయడం మన అభివృద్ధి ప్రణాళికల లక్ష్యం అని అనేకమంది చెప్పడం వింటున్నాము. మన రాజ్యాంగచట్టంలో ఈ లక్ష్యాన్నిగురించి ప్రస్తావింపబడి, ఆ వ్యవస్థను నిర్మాణించడానికి ప్రభుత్వకార్యకలాపాలన్నింటిలోను శ్రద్ధవహించాలని కూడా నిర్ణయింపబడింది.

“సంక్షేమరాజ్యం” అనే పదం రాజకీయశాస్త్రంలోకి క్రొత్తగా వచ్చినప్పటికి, ఏవిధానమైతే దానివల్ల పేర్కొనబడుతోందో అది ప్రజాస్వామ్యసిద్ధాంతంలోను, ప్రజాస్వామ్య వ్యవస్థలోను ఎప్పుడూకూడా అంతర్గతమై ఉందనే చెప్పొచ్చు. ఒక చిన్న విషయంలోమాత్రం ఈ రెండువిధానాల్లో భేదంవుంది. ఒక దేశప్రజలలో అధికసంఖ్యాకుల అభిప్రాయానుసారంగా రాజ్యాంగం జరగాలని, స్వల్పసంఖ్యాకులు అధికసంఖ్యాకుల అభిప్రాయాలను మన్నించి, సక్రమమైనపద్ధతులవల్ల క్రమేపి తమ అభిప్రాయాల్ని బహుళసంఖ్యాకుల అభిప్రాయాలుగా మార్చడానికి ప్రయత్నించాలని, ప్రయత్నించవచ్చునని ప్రజాస్వామ్య సిద్ధాంతంలోని కేంద్రవిషయం. అనగా ప్రజాస్వామ్యమనేది ముఖ్యంగా రాజకీయసంబంధమైన వ్యవస్థ అని దీనివల్ల తేలుతుంది.

ఇక సంక్షేమరాజ్యం అంటేనో, దేశమందలి ప్రతి పౌరుని యొక్క యోగక్షేమానికి, సంఘసంక్షేమానికి బాధ్యత ప్రభుత్వం మీద ఉంటే వ్యవస్థ అని అర్థం చెప్పుకోవచ్చు. ప్రజల జీవితపరిమాణంలోను, రాబడి, ఆదాయం మొదలైనవాటిలోను, కుల, మత, సాంఘికవిషయాలలోను విభేదాలను తొలగించి, ప్రతి మానవుని యొక్క సంక్షేమాన్ని పెంపొందించడం సంక్షేమరాజ్యవిధానం యొక్క ముఖ్యసూత్రం మాత్రంకాక దానిక్రింద జరుగవలసిన కార్యక్రమంలో ప్రధానవిషయంకూడా అయిఉంది. దీనినిబట్టి సంక్షేమరాజ్యం అనేది కేవలం రాజకీయసంబంధమైన సిద్ధాంతమే కాక, ఆర్థిక, సాంఘిక మార్పులకు సంబంధించిన సిద్ధాంతం అని కూడా చెప్పొచ్చును.

20 వ శతాబ్దం ప్రారంభంనుంచీ ప్రపంచంలో ప్రజాస్వామ్య ప్రభుత్వవిధానం కల్గిన దేశాల్లో వ్యక్తిహక్కులు మొదలైన రాజకీయ సంబంధమైన విషయాలతోపాటు ఆర్థిక, సాంఘిక సమస్యలకు, ఆర్థిక సాంఘిక స్వేచ్ఛలకుకూడా క్రమేణ ప్రాధాన్యం పెరుగుతోందని పరిస్థితుల్ని జాగ్రత్తగా పరిశీలించినవారందరకు తెలుస్తోంది. ఆర్థికస్తోమతులేని దేశాలన్నీ వెనుకబడిఉండడం, వాటి ప్రజల జీవిత పరిమాణం తక్కువగా ఉండడం, ఆర్థికస్తోమతుకల దేశాలతో అవి తులతూగలేకపోవడం వాటిక్రింద తొత్తులుగా ఉండవలసిరావటం మనం చూస్తున్నాము. ఆర్థికంగా వెనుకబడివున్న దేశాల్లో ప్రజాస్వామ్యపద్ధతి అమలులో ఉన్నా, వాటికి ఆ పద్ధతిని నిర్వహించడంలో అనేక ఇబ్బందులు, అడ్డులు కష్టాలు ఎదుర్కొంటున్నాయి. ఈ కారణంవల్ల ఆయాదేశాల్లో ప్రజాస్వామ్యసిద్ధాంతం, ప్రజాస్వామ్య ఆదరణ క్రమేపీ బలహీనంకావడం, ప్రజాస్వామ్య సంస్థలు వాటికి తట్టుకోలేకపోవడం, కొంతకాలానికి కమ్యూనిజం వంటి అతివాదసిద్ధాంతాలకు ప్రాబల్యం రావడంకూడా అనుభవసిద్ధమే. కనుక ప్రజాస్వామ్య సిద్ధాంతానికి, పద్ధతికి, ఆదరణకి సంక్షేమరాజ్యవ్యవస్థను నిర్వహించడానికి అవసరమైన పరిస్థితులకు దగ్గరసంబంధం ఉంది. సంక్షేమరాజ్యం ఏర్పాటు ప్రజాస్వామ్య పద్ధతికి ఆఖరిమెట్టుగాను అంతిమరూపంగాను పరిగణించొచ్చు.

సంక్షేమరాజ్యలక్ష్యాన్ని ముందుపెట్టుకొని ప్రభుత్వ విధానాలను, ప్రభుత్వకార్యక్రమాలను రూపొందించవలసిన బాధ్యత మనదేశంలో ప్రభుత్వ ఆధిపత్యం వహిస్తున్నట్టినీ, ఇకముందు వహించేటటువంటిన్నీ ప్రతి రాజకీయపక్షంపైన మోపబడివుంది. దాన్ని అందుకోడానికిగాను ప్రతిపౌరుడూ విద్య నభ్యసించడానికి, జీవితం సౌఖ్యవంతంగా జరుపుకోడానికీ, ఎవరికి ఇష్టమున్న జీవనోపాధి మార్గాన్ని వారనుసరించడానికి కావలసిన పరిస్థితులను చట్టాల ద్వారా, ఇతర మార్గాలద్వారా కల్పించడానికి ప్రభుత్వం పూనుకోవలసివుంది. ఒక పౌరునికి, ఇంకొక పౌరునికి మధ్య సమానత్వం, సౌభ్రాతృత్వం, స్వేచ్ఛ పెంపొందించడానికి అవకాశాలు కల్గించాలి. ఆర్థికంగా, సాంఘికంగావుంటే విభేదాలు, హెచ్చుతగ్గులు తొలగించడానికి అనువుగా ప్రభుత్వకార్యకలాపాలు, ప్రాతిపదికలు ఏర్పాటుచేయాలి. సహకారసిద్ధాంతరూపేణ ప్రజాస్వామ్యాన్ని అమలులో పెట్టాలనికూడా మన రాజ్యాంగచట్టంలో నిర్ణయింపబడింది. దానికొరకై నిరంతరకృషి చేయాల్సివుంది. సహకార ప్రజాస్వామ్యవిధానం సంక్షేమరాజ్యవ్యవస్థకు ఒకవిధంగా ప్రతిరూపం అని అనుకుంటే, ఇట్టి కృషియొక్క ప్రాముఖ్యత అవగాహనౌతుంది.

మనలక్ష్యం చాలా వున్నతమైనదీ, గొప్పదీ, నిర్విరామంగా కృషిచేయతగ్గదీ అవడానికి ఎంతమాత్రం అనుమానించ నక్కరలేదు.

రాన్ని అందుకోడానికి ఏమార్గాల్ని అనుసరించాలనే విషయంలో కూడా ఎక్కువ భేదాభిప్రాయాలు లేవనే అనుకోవాలి. భేదాభిప్రాయలేమైనావుంటే సంక్షేమరాజ్యాన్ని ఏర్పాటుచేయడంలో ఎంత త్వరగా మనం సాగిపోగలమనే విషయాన్ని గురించి మాత్రమే.

ఇతరవిషయాలు, పరిస్థితులు మాట వదిలేసి, ఈ లక్ష్యాన్ని చేరుకోడానికి మన ఆర్థికవిధానంలోను, సాంఘికవిధానంలోను మార్పులు ఏంకావాలి అని ఆలోచిస్తే కన్పించేదేమంటే, సంక్షేమ రాజ్యాన్ని ఏర్పాటుచేయడానికి ప్రథమసోపానం సామ్యవాద సిద్ధాంతాన్ని అమలులోపెట్టాలి అనేది. అంటే ప్రజాబాహుళ్యంలో పేరుకున్న ఆర్థిక విభేదాలు, వివిధవర్గాల జీవితపరిమాణంలో వుండే భేదాలు, కుల మత సాంప్రదాయాలనుబట్టి ఏర్పడ్డ సాంఘిక విభేదాలు తొలగించడం జరగాలి.

అయితే సామ్యవాదసిద్ధాంతానికి అనేక రూపాంతరాలున్నాయన్న విషయం మరిచిపోకూడదు. దేశం మొత్తంమీద వస్తూత్పత్తికి అవసరమయ్యే పరికరాలవన్నింటిని ప్రభుత్వపరంచేసుకొని, ప్రభుత్వమే వాటి ఉపయోగాలను నిర్ణయించడం, వాటిని దేశక్షేమానికి అనువుగావుండే విధానాలప్రకారం నడపడం సామ్యసిద్ధాంతానికి మూలసూత్రం అని కొందరి అభిప్రాయం. దేశంయొక్క ఆర్థికాభివృద్ధికి ప్రధానమైన పరిశ్రమలనుమాత్రం ప్రభుత్వం తనపరంచేసుకొని, ఇతర విషయాలలో పెట్టుబడి విధానానికి అవకాశం వదలడం సామ్యసిద్ధాంత ఆచరణలో ఇంకోవిధంకాగా దేశ పరిపాలనలోనే కాకుండా మొత్తం ప్రజల జీవితాలకు సంబంధించిన ప్రతి విషయంలోకూడా ప్రభుత్వం కలుగచేసుకోవడం, రాజకీయంలోను ఇతరత్రాకూడ భేదాభిప్రాయాలను అరికట్టడం సామ్యసిద్ధాంతంలో అతివాదసిద్ధాంతం అయిన కమ్యూనిజంలో ముఖ్యవిషయం. సాధారణంగా సామ్యవాదపద్ధతిని ఆచరణలో పెట్టడంలో, ప్రజాస్వామ్యానికి, ప్రజాస్వామ్యపద్ధతులకీ అవకాశం ఉంటుంది. కమ్యూనిజం ఆచరణలో ఉన్న దేశాలలోమటుకు ప్రజాస్వామ్యానికి పూర్తిగా స్వస్తిచెప్పడమే జరుగుతుంది.

ఇండియాలో క్రమేపీ అమలులోకి వస్తూన్న విధానం సామ్యవాదం. సామ్యవాదంతో ప్రజాస్వామ్యాన్నికూడా మిళితంచేసి ప్రజాస్వామ్య సామ్యవాదాన్ని మనం ఆచరణలోకి తీసుకువస్తూన్నాము. మన విధానంలో ఈ రెండువిధానాల్ని ఆచరణలో జాగ్రత్తగా సమన్వయించి సమగ్రమైన దేశాభివృద్ధికి, ప్రజాబాహుళ్యం ఆర్థికంగాను, సాంఘికంగాను పురోగమించడానికి మార్గాన్ని సుక్షేమం చేసుకుంటున్నాం. మన విధానంలో ప్రత్యేకత ఏమైనా ఉందీ అంటే అది ఈ సమన్వయాన్ని జయప్రదంగా జరపడానికి మనం చేస్తున్న ప్రయత్నమే. ప్రజాస్వామ్యాన్ని విసర్జించకుండా, అది నిర్విఘ్నంగా కొనసాగడానికి పరిస్థితుల్ని కల్గించుకొంటూ సామ్యసిద్ధాంతానికి అనుగుణ్యంగా ఉండే విధానాలను ఆచరణలో పెట్టుకుంటూ, సంక్షేమరాజ్యవ్యవస్థను ఏర్పాటు చేసుకోడానికి కృషిచేస్తూన్నాం.

ఏవిధంగా ఈ సమన్వయం జరపాలో జరపడానికి వీలుంటుందో దానికి పథకం మన మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికలో నిర్ణయింపబడి ఉంది. దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందడానికి, మన రాజ్యాంగచట్టంలో నిర్ణయింపబడిన లక్ష్యాల్ని అందుకోడానికి, ఈ పథకం దారి చూపిస్తూంది. ప్రజలయొక్క జీవిత పరిమాణాన్ని హెచ్చించడం, వివిధమార్గాలలో దేశాభివృద్ధికి అవసరమైన వస్తూత్పత్తి, ఆహారోత్పత్తి ఎక్కువ చేయడం, ప్రజలలో ఆర్థిక సాంఘిక భేదాల్ని, హెచ్చుతగ్గులను తొలగించడం, అక్షరాస్యత తొలగించి విద్యాగంధాన్ని ప్రజలలో ఎక్కువ వ్యాపన చేయడం, చిరకాలంనుంచి మనదేశంలో స్థావరం ఏర్పర్చుకొని ఉన్న రోగాల్ని, అనారోగ్యతల్ని నిర్మూలించడం మన పంచవర్ష ప్రణాళికల ప్రధానోద్దేశ్యాలై ఉన్నాయి. రెండవ పంచవర్షప్రణాళిక అంతంలో ఎంతవరకూ ఈ ఉద్దేశ్యాలను ఆచరణలో పెట్టగలుగుతామో, అంత మేరకు మనం సంక్షేమరాజ్యలక్ష్య మార్గంలో ముందుకు సాగిపోయినామనే అనుకోవచ్చు.

ఈ సాగిపోవడంలో సామ్యవాదంలో అతివాదమైన కమ్యూనిజం సిద్ధాంతాన్ని ఒక ప్రక్క పెట్టుబడిదార్లు, ధనవంతులు మొదలైనవారి ఒత్తిడిని ఇంకొకప్రక్క తొలగించుకుంటూ వాటిలో చిక్కుడికుండా జాగ్రత్తగా ముందుకుపోవడం చాలా అవసరం. కొన్ని తప్పటడుగులు వేస్తే వాటి ఫలితంగా మన ఆర్థిక, సాంఘికాభివృద్ధికి ఆటంకం కలగడమే కాకుండా, దేశక్షేమానికే ముప్పు వచ్చే అవకాశాలు ఏర్పడవచ్చు.

సామ్యసిద్ధాంతవ్యవస్థ నిర్మాణానికి అనుగుణ్యంగా ఉండేటట్లు, ఇండియా ప్రభుత్వం కొన్ని చర్యలు ఇదివరకే తీసుకున్నది; మరికొన్ని ఇకముందు తీసుకోబోతున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వనిర్వహణక్రింద జరిగేపనులు, నిర్వహింపబడే పరిశ్రమలు, ఇతర కార్యక్రమాల పరిమాణం హెచ్చింపబడుతూంది. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద నడపబడే పరిశ్రమలపై పెట్టుబడి 179 కోట్ల రూపాయలు, పెట్టుబడిదార్ల ఆధ్వర్యంక్రింద నడపబడే పరిశ్రమలపై పెట్టుబడి 888 కోట్ల రూపాయలు. అయితే, రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద నడపబడే పరిశ్రమలపైన పెట్టుబడి 891 కోట్లరూపాయలు వరకూ పెంచబడగా, పెట్టుబడిదార్ల ఆధ్వర్యం క్రింద జరిగే పరిశ్రమల పెట్టుబడి 620 కోట్ల రూపాయలని నిర్ణయింపబడింది. పంచవర్ష ప్రణాళిక ఆచరణలోకి వచ్చినతరువాత క్రమేపీ ప్రభుత్వ ఆధ్వర్యంక్రింద నడపబడే పరిశ్రమల సంఖ్య ఎక్కువవడమే కాక ఇదివరకు ఏర్పడ్డ పరిశ్రమల ఉత్పత్తి పరిమాణాలు హెచ్చింపబడుతూన్నాయి. ఈ విధానం కాలక్రమేణా ఎక్కువ చేయడం ప్రభుత్వ అభిప్రాయం అని ప్రధానమంత్రి, ఇతర ప్రభుత్వ నాయకులు పదేపదే చెప్పుతూన్న సంగతి అందరకు తెలిసిందే. పరిశ్రమాభివృద్ధి అటుంచి, గ్రామసీమలను అభివృద్ధి చేసేటందుకు చాలావరకు బాధ్యత ప్రభుత్వం వహించడం, భూమి విధానంలో సామాన్య రైతులకు వారు సేద్యం చేస్తూన్న భూమిపై హక్కును కల్గించడం ఇంకా ఇతర సంస్కరణలు ఏర్పాటు చేయడం-ఇవన్నీ కూడ ప్రజాస్వామ్య పద్ధతి ననుసరించి సామ్యసిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టేమార్గాలే.

ఇదికాక సామ్యసిద్ధాంతాన్ని అనుసరించి ప్రభుత్వం తీసుకొంటూన్న చర్యలు మరికొన్ని ఉన్నాయి. వీటిలో పన్నుల విధానాన్ని, ఆర్థిక విభేదాల్ని, ఆదాయాలలో హెచ్చులను తొలగించడానికి మార్గంగా ఉపయోగించడం. ఆదాయపు పన్నును క్రమేణా హెచ్చించడం, అదనపు ఆదాయాలపైన వేయబడే పన్నులరేట్లను పెరిగించడం, మూలధనంమీద పన్ను విధించడం, భూస్వాముల భూవసతి పరిమాణాన్ని చట్టరూపేణా నిర్ణయించడం, ఈ ప్రణాళికలోని యితర భాగాలు.

పైన చెప్పినదానినిబట్టి సంక్షేమరాజ్యం, సామ్యవ్యవస్థ, ప్రజాస్వామ్యం వీటికి పరస్పర అవినాభావ సంబంధం ఉందని స్పష్టపడుతుంది. ఈ పదాలను అర్థం చేసుకోవడంలోను, అర్థం చెప్పడంలోను కొన్ని భేదాలున్నప్పటికీ, వాటి మూలసూత్రాలను గురించి అభిప్రాయభేదాలు లేవు. ప్రజాస్వామ్యవిధానంద్వారా సామ్యవ్యవస్థకు దారి ఏర్పాటు చేయడం; సామ్యసిద్ధాంతం యొక్క ఆచరణ వైశాల్యాన్ని క్రమేణా హెచ్చించడంద్వారా సంక్షేమరాజ్యలక్ష్యాన్ని అందుకోవడం జరుగుతుంది. సంక్షేమ రాజ్యవ్యవస్థలో ఒక ముఖ్యభాగం సంఘసంక్షేమాన్ని పెంపొందించడం, అనగా సమాజపు ఏర్పాట్లలో ఇమిడివున్న లోపాలను నిర్మూలించడం, సంఘంలో భాగస్థులుగావున్న వివిధశాఖలవారికి అవసర సౌకర్యాలను ఏర్పాటుచేయడం మొదలయినవి.

"సామ్యవాదం" విప్లవం సూచించే పదంగా భావించి, దానిని ఉపయోగించడానికి భయపడే రోజులు పోయాయి. రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో మన ఆర్థిక విధానం యొక్క లక్ష్యం "సామ్య సాంఘిక వ్యవస్థను నిర్మాణించడం" అని స్పష్టీకరింపబడింది. ఆ పదాన్ని ఇంకా విశదీకరిస్తూ, "మన అభివృద్ధి కార్యక్రమాలు కొంతమంది వ్యక్తుల లాభాలను హెచ్చించడానికి కాక సాంఘిక లాభాల్ని పెంపొందించడానికి నిర్మింపబడతాయి" అని చెప్పబడింది. అసలు ముఖ్యవిషయం ఏమిటంటే పెట్టుబడిదారీ విధానానికి మూలవిరాట్టని చెప్పుకోదగ్గ దేశాలలోకూడ, రెండు మూడు దశాబ్దాలలో ఆ విధానం అనేక మార్పులకు లోనయింది. అమెరికావంటి దేశంలో సామ్యవాదం సిద్ధాంతరూపేణా ప్రచారంలో లేకపోయినా, దానికి అనుగుణ్యంగా ఉండే కార్యక్రమాలు, విధానాలు ఆచరణలో పెట్టబడుతూనే ఉన్నాయి. అమెరికాలో పన్నులవిధానం, పరిశ్రమల యాజమాన్యపద్ధతి చూచినట్లయితే, ప్రధానంగా కన్పించేదేమిటంటే పెట్టుబడిదార్లని పిలవబడేవారిలో చాలమంది సామ్యవాదులుగా వ్యవహరించడం, పెట్టుబడిదారీ ప్రభుత్వం అనేది సామ్యవాదపద్ధతులపైనే నడపబడడం.

మనదేశంలో పండిత నెహ్రూ ఆధిపత్యంక్రింద నడుస్తూన్న మన ప్రభుత్వం అనేకవిషయాల్లో మధ్యేమార్గం అవలంబిస్తూంది. ఇతర దేశాల అనుభవాలనుబట్టి మన విధానాల్ని నిర్ణయించుకోడానికి ఏర్పడ్డ అవకాశాలను మన దేశపరిస్థితులు, అవసరాలనుబట్టి, అవసరమైన సవరణలతో మార్పులతో ఉపయోగించుకుంటున్నాము. విదేశ వ్యవహార నిర్వహణలో నేమి, దేశాభివృద్ధికి అవసరమైన కార్యక్రమాలను, పథకాలను ఏర్పాటు చేసుకోవడంలో నేమి, ప్రజాసంక్షేమ కార్యకలాపాలను ఆచరణలో పెట్టడం విషయంలో నేమి, మన మధ్యేమార్గం లాభదాయకమైన ఫలితాల్ని ఇస్తోందనడానికి అనుమానం లేదు. ఈ విధంగా మనం దేశవ్యవహారాలను నడుపుకో కల్గినంతకాలం, విప్లవాత్మకసిద్ధాంతాలు తలెత్తకుండా, విప్లవ పరిస్థితులు ఏర్పడకుండా, చట్టపద్ధతుల కనుగుణ్యంగా మనదేశాభ్యుదయం ముందుకు సాగిపోగలదని నిశ్చయంగా నమ్మొచ్చు.

సామ్యవిధానంద్వారా సంక్షేమరాజ్యం ఏర్పడి వీటివల్ల మనం పొందవల్సిన లాభాలు అనుభవించడానికి ముందు ఒక ప్రధాన జాగ్రత్తను సర్వదా మనస్సులో ఉంచుకోవాల్సిన అవసరం ఉంది. అదేమిటంటే, అన్నిటికి మూలాధారం, పునాది అయిన ప్రజాస్వామ్యపద్ధతిని విడనాడకుండా ఉండడం, సర్వదా ప్రజాస్వామ్యమార్గాన్ని సురక్షితంగా ఉంచుకోడానికి తగుజాగ్రత్త వహించడం. ప్రజాస్వామ్యం ఏనాడైనా దెబ్బతిందీ అంటే దాని ఫలితంగా ప్రజాస్వామ్యసిద్ధాంత పునాదిపైన నిర్మాణించుకోదలచిన సౌధం అంతాకూడా కూలిపోతుంది. ప్రజాస్వామ్యాన్ని ఈవిధంగా సురక్షితంగా చేసుకోవడం, చేసుకోకపోవడం ప్రజాబాహుళ్యంయొక్క చేతుల్లో వుంది.



# పండుగ ప్రయోజనాలు, విశేషాలు

శ్రీ గజపతిరాయవర్మ

మీనంనుండి మిథునం—మధ్యలో పండుగలు, అన్నీ ఆధ్యాత్మికం, ప్రాకృతికం, వ్యవసాయికం అనిపించినా, బాహ్యాలు యుద్ధాలు వినిపించని సార్వజనీన సంతోషవిషయం అయినా, ఆలోచిస్తే అంతా సృష్టిభావాలు, కార్యక్రమాల ప్రాతిపదిక అనిపించకపోవు.

సంవత్సరంలో అయనాలు, ఋతువులు, కాలవిభజన ప్రపంచం అంతటా, కనీసం మనదేశీయులు తలోరకం (ప్రాంతీయం)గా పంచాంగాలు తయారించుకోడం; పడికట్టుకు సూర్యుడ్ని కొందరూ, చంద్రుడ్ని కొందరూ ఎంచుకోడం, అక్కడక్కడ కొన్నిప్రాంతాల పంచాంగాల్లో మధ్యలో తెచ్చుకున్న మార్పులు; జ్యోతిర్వైదికంగా ఏర్పడిన భావాలు—పండుగలు, ఉగాదికూడా అంతటా ఒకేనాడు జరుగని పండుగయైన కారణము.

సంవత్సరకాలవిభజనకే కారణా లిలా ఉండగా అణ్వస్త్ర ప్రయోగాల్లో అంతరాళం వాయువుల్లో (పంచభూతాల్లో కొన్ని) మార్పుల ఫలితంగా ఋతువైపరీత్యలక్షణాలు కల్గునని ఎరిగినవారు కూడా బాహాటంగా వెల్లర్చకపోడం—"అంతర్జాతీయఅసభ్యత"—ఈ ప్రయోగాలు జరిగినకొద్దీ—ముందుతరాలవారికి చైత్ర వైశాఖాల్లో వసంతఋతులక్షణాలు కాన్పించకపోవచ్చును.

పంచాంగభేదాల్లో ప్రాంతీయ శీతోష్ణస్థితి కారణాలుగా, జ్యోతిర్వైదికంగా కల్గి, ఆచరణకువచ్చిన వారావారిభావాల కనుగుణంగా, ఉగాది నిర్ణయం ఒకో రకోవిధంగా ఎంచుకున్నారు. అది సహస్రాబ్దాలపూర్వంనుండీ ఉన్న ఆచారం. ఉత్తరాయణారంభం (డిసెంబరు – జనవరి)లో కొందరి ఉగాది. వసంతంలో కొందరు, శారద సంపాతానికి కొందరూ ఉగాది పండుగ ఏర్పర్చుకున్నారు.

చైత్రం—అనేకులకు జీవకల ప్రభాతకాలం. ఆ దినాల్లో ఉగాది జరుపుకోడం ఒక్క ఆంధ్రలోనేగాక అనేకప్రాంతాల్లో ఉంది. దీపావళి పండుగకువలెనె టపాకులు తుపాకులు పేల్చడం, దీపాలు వెలిగించడం ఉగాదికీ ఉంది.

శాతవాహనులకాలంనుండి రాష్ట్రకూటులపాలనవరకూ అవినాభావసంబంధాలుండీ—ప్రాదేశికంగా వేర్వేరైనా కర్ణాట మహారాష్ట్రులకూ ఆంధ్రులవలె వసంతంలోనే ఉగాది.

తమిళులు, బెంగాలీలు మరుసటి మాసంలో (మన పంచాంగరీత్యా) చేసుకుంటున్నారు.

ఉగాదినాడు జ్యోతిర్వైదికమూ, కాలము గూర్చిన కల్పనాభావముల గణపతినీ, విష్వక్సేనునీ—అనేకదేశాల్లో అతిపురాతన కాలంనుంచీ అవిచ్ఛిన్నంగా తరాలవారినీ పూజిస్తున్నారు.

కేంబుల కొత్తసంవత్సరంకూడా ప్రాకృతిక, భౌతికవిషయాల భావాలు కలినదే. సాయన మేషంలో కంచుపళ్లెంలో కొబ్బరి, డబ్బులు, అద్దం, ఆభరణాలు, కూరగాయలుకూడా ఉంచి-పళ్లెం పార్శ్వాల్లో దీపాలు వెలిగిస్తారు. ఉగాదినాడు ఉదయాన్నే ప్రప్రథంగా ఆ వెలుగు దర్శించడం వారు శుభకరంగా నమ్ముతారు. మొదట దర్శించిన వ్యక్తి ఇంటనున్నవారి కొక్కొక్కరికి కండ్లు మూసి (దాగిలిమూతలువలె) నడిపించుకవచ్చి దర్శనం జేయించడం మధ్యలో వారు మరేదీ చూడకుండా ఉండాలనే ఏర్పాటు. ధాన్యం, నాగలి పూజ వీరికీ ఉంది.

పూర్వులు కొందరిని ఆనవులని వ్యవహరించారు. హిమాలయ ప్రాంతాల్లో చీనీసంస్కృతియైనా వసంతంలో గాకున్నా ఉత్తరాయణారంభంలోనె ఉగాదిపండుగ జపాలు, నృత్యాలు, మంత్రాలతో జరుపుకుంటారు.

## చీనీ సంస్కృతి

సిక్కిమ్ ప్రజల ఉగాది ఉత్సవం—"లోసంగ్" రెండు రోజులు సాగే నృత్యోత్సవం. గత సంవత్సరపు దుష్టశక్తుల పారద్రోలి శాంతిసౌఖ్యాల క్రొత్త సంవత్సరం కోరుతూ ప్రభుసమక్షాన పూజలూ నృత్యాలూ—అయినా ప్రాకృతికం అనిపించే పూర్వాచారం ఒక్క పల్లీయుల్లోనే నిలచిఉంది. పల్లీయులు కొత్తపంట పండ్లు మొదలైనవి సమర్పించుకుంటే పట్టణప్రజలు ధనరూపకంగా కానుకలు సమర్పించుకుంటారు. ఆర్థికసిద్ధాంతంలో ఇక్కడ రెండు భిన్నభావాలు.

ప్రపంచంలో, ఒక్క క్రైస్తవుల్లోనేగాదు అనేకుల్లో మాసరాసులకు సంబంధించిన నమ్మకాలు. ఆచారాలు పోలికలు ఉన్నయ్. ఇవి సిక్కిమ్ ప్రజల్లోనూ ఉన్నవి.

నల్లనిబట్టలు కట్టిన పన్నెండుగురు (సంవత్సరం) నృత్యం ప్రారంభిస్తారు. వారి వీపున, బట్టలపై మృత్యు (మహాకాలుడు) చిత్రం ఉంటుంది. పక్షులు, లేళ్లు, కోతులు, పులులు మొదలగు జంతువుల తలలు తగిలించుకున్న వారంతా ఆ నృత్యంలో పాల్గొంటారు. ఆకాశంపై నక్షత్రమండలాలు, భౌమికమైన ప్రాణికోటి ఈ నృత్యంలో అంతర్భావాలు.

ఈ నృత్యాల్లో గతసంవత్సరం—రానున్న సంవత్సరం—రెంటిగూర్చిన కాల్పనికమైనా ఒక చారిత్రక—మత సందర్భం కూడా ఉంది.

తొమ్మిదో శతాబ్దంలో ఒక రాజు బౌద్ధమతప్రచారానికి ఎంతో శ్రమించాడు. అతని తమ్ముడు అన్నని చంపించి అధికారం

చేబట్టి ఆ మతవివాదనోన్ముఖుడు కాగా మహాచార్యులని వధించడం—ఆ విజయగాథ—మంచీ—చెడ్డా—ఈ నృత్యాల్లో ప్రదర్శిస్తారు.

యూరేషియా పూర్వజనాంగంలో కాలంగూర్చిన కథల్లో రెండు ఋతువులు, రెండు అయనాలు, రెండు సంవత్సరాలకు సంబంధించిన భౌతికవిషయాలు, సూర్యుని గూర్చిన నమ్మకాల్లో తండ్రికొడుకులు, అన్నదమ్ముల యుద్ధాలు (గతం చనిపోవడం వర్తమాన విజయం) ఇలాంటి విశేషం లేకపోలేదు.

నల్లబట్టల నటులు ప్రదర్శిస్తూ మధ్య నో పిండిబొమ్మను నిలిపి నృత్యంలోనే బాకులతో ఆ బొమ్మగుండెల్లో పొడుస్తారు. మృగశీర్షాలు (మృగశీర్ష నక్షత్రమండలం) ధరించినవారు బొమ్మను ఏకీలు కాకీలు విరుస్తారు.

వీరి మహాకాలుడు “యూషెగాన్ పో” త్రినేత్రుడు. ఈ పాత్రధారికి నల్లని ముసుగు. భార్య “లామో ల్హాగ్ జోర్మో”-దంపతులిద్దరిదీ ఆ పిండిబొమ్మను ఛిన్నాభిన్నం చేసే నృత్యం.

మర్నాడు విదూషకులు పూనిన వృద్ధవీరుల నృత్యం. ఛిన్నాభిన్నం అయిన పిండిబొమ్మను పోగుచేసి మహాచార్యుడు మహాకాలుని విగ్రహం ముందు చేరుస్తారు. తర్వాత ఆ పోగును విదూషకులవారి నృత్యాలు (విజయం) తో ఊరేగించి ఊరవతల పారవేసెదరు.

కొత్త సంవత్సరం వచ్చిందనుటకు గాను చీనీమహాచార్యుడు ఇద్దరు కొడుకులతో ప్రవేశం. వారి దర్శనం శుభకరం—అయితే ఆయనముఖం హాస్యాస్పదంగా ఉండడమే గాదు, పెద్ద బొజ్జతో కూడా ఉంటుంది — ఇక్కడ భౌతికవిషయాలు — సుభిక్షం ప్రదర్శితం.

## శూన్యమాసం మరుడు మరుగుపడెనా?

తెలంగాణా కోయల్లో జ్యోతిర్వైదికం ఆధ్యాత్మికభావాల అనుసరణకన్న దైనికజీవితాలకు సంబంధించినదిగా పండుగల్లో ప్రయోజనాలెక్కువ కాన్పిస్తున్నవి.

మన నాగరికులు, పండితులు మన్మథుడు మరుగైనందున మగవాలులంతా పుట్టిళ్ళకేగుతా రంటారు. కాని ఆకాశంపై మన్మథుడూ, దైనికజీవితాల్లో మన్మథుడు (చలి కారణంగా) మరుగైనా డనుకున్నంతలో ఏకాలంలోకూడా కామవిషయాల్లో కరువు ఏర్పడే అవకాశం లేదు. మన పండితాభిప్రాయాల్లో వారికి ఈ కాలంలో మదుడు దూరం అయినట్లు తోచవచ్చు—అందుకని వారి సిద్ధాంతరీత్యా శూన్యమాసం కావచ్చు.

పరిసరాల్లో పచ్చదనం లేక, ఆకులు రాలిన బోడిచెట్లు, ఏపని చేయడానికీ ఉత్సాహం కల్గించని చలి (బనీనుకూడా లేకుండా, రేపెలాగడుస్తుందో అనే ఆతృతతో, ఇల్లు, గోడలు లేక చెట్లుక్రింద చలికాలంలో పడుకున్న పరిస్థితి) శీఘ్రయానసౌకర్యాలు లేకపోవటం, వాటి నన్నిటినీ భావించి చూడండి—మకరసంక్రాంతి రాకముందు శూన్యం అనిపించడం ఏవిటో బోధపడుతుంది.

ఇవి మరుడు దూరంగావడం గాదు. మన పూర్వజనాభాలో (సోషల్ ఎకనమిక్స్) సామాజికమైన ఆర్థికవ్యవస్థాసూత్రం అనెందుకనుకోగూడదు!

ఇప్పుడూ మనం డిసెంబరు—జనవరుల్లో సార్వాపంట కోతలు చూస్తున్నాం. దీపావళి దినాల్లోనూ వరికోతలుంటున్నాయి.

అల్లుళ్ళనూ కూతుళ్లనూ పండుగలకు పిల్చుకోడం అప్పుల పాలవడం—అల్లుడ్ని దశమగ్రహం అనుకోడం మన నాగరికత విద్యావిజ్ఞానాలు బలిసిపోయి తయారైన భావాలు.

కొత్తపంటలకాలాల్లోనే పండుగలు చేసుకోవడం గమనించదగిన సంగతి. రాజకీయాలు ఊసరవెల్లిగా మదరమెంతల్లా వ్యక్తుల స్వలాభాపేక్షవల్ల పెరిగింది కాని, “వ్యవసాయకూలీ” అనేవర్గం ఆర్థిక సామాజిక రంగాల్లో ఆనాడు లేదనే సంగతి సర్వులకూ విదితమే.

ఆడవాళ్లు అమ్మలింట్లకు చేరడం, అల్లుళ్ళు వారి వెంట రావడం లాంఛనాలు మధ్యలో ఏర్పడినవి. ఒకప్పుడు కుటుంబం అనిపించుకున్నవారింటికి వీరితోపాటు ఇతర బంధువులుకూడా పండుగలకు రావడం ఆచారం.

కొందరిలో దీపావళికి వచ్చి మకరసంక్రాంతివరకూ ఉండిపోడంకూడా ఉంది.

ఇదో సమష్టి సాముదాయక శ్రేయోదాయక ప్రణాళిక; ఆధునికంగా “శ్రమదానం, సంపత్తిదానం” అంటే మాత్రం మన పండితులూ మేధావులు చప్పున వప్పుగోరు.

## ‘ముందున్న’వారు ‘వెనుకబడిన’ వారి నుండి నేర్వండి

పండితులకు శూన్యం అనిపించిన కాలం—తెలంగాణా కోయల్లో—ఫాల్గునంలో పంక్తిభోజనాల పండుగ—బంధువులు అంతా పాల్గొంటారు.

ఈ పంక్తిభోజనాల్లో పాల్గొన్నవారెవరూ కోతలు పూర్తయ్యేవరకూ ఆగ్రామం విడిచి పోకూడదు.

చైత్రంలో వాళ్లు చెత్త చెదారం తగులబెట్టడం (కామదహనం పండగ ఇంతే) మళ్లీ పంటకు భూమిని సిద్ధపర్చడమే.

అప్పచ్చులు, ఉల్లిపాయలు తగిలించిన (వెదురుపేళ్ళ) పాలవెల్లి రెండు వెదురుగడలకు వేలాడవేసి, వేర్వేరుగా ఊరేగించి, రెంటినీ చేర్చి ఏటవాలుగా పాతి క్రింద నిప్పు రగిలిస్తారు. ఆ గడల చుట్టూ మగ్రాళ్ళు నోరు కొట్టుకుంటూ ప్రదక్షిణ చేస్తుంటారు. మొదళ్ళు కాలి వెదురుగడలు వాలిపోయేప్పుడు పాలవెల్లుల క్రింద పడకుండా అందుకుని వాటికట్టిన భక్ష్యాలు ప్రసాదంగా స్వీకరిస్తారు.

ఉల్లిపాయలు కొరుక్కుంటూ జొన్నరొట్టెలు తినే ఈ మనుష్యుల నమ్మకాలు నాగరికులకు హాస్యాస్పదంగా ఉండవచ్చును. కాని ఈ నమ్మకాల్లో ఆకాశాన్నీ, స్వర్గాన్నీ, నరకా

పతిని భూమిని పంటను పూజించే పద్ధతి అంటే మాత్రం ఊ కొట్టరు.

కాలి వాలిపోయిన ఆ పిడుల్లో రెండూ దంపతులు. ఆ కాలిన స్థలాన తలో పిడికెడు గింజలు చేసి జొన్నకూడు వండేదరు. పొలాల్లో ఒక మొక్కకుందు జొన్నచొప్ప కుప్పమీద ఆ జొన్న సంకటి తలో ముద్ద పోసి ప్రక్కగా ఒక గొడ్డలి ఉంచుతారు నివేదన.

పంటలు బాగుండాలనీ భూమాతనూ సస్యలక్ష్మినీ ప్రార్థించి, అతివృష్టి అనావృష్టీ రాకుండా రావణాసురుణ్ణి ధ్యానించి ఆ గొడ్డలితో ఒక్క వేటుకొ మొక్క నరుకుతారు.

ఈ వన్యజాతులను కడఅంతస్థులో నిలబెట్టిన మన పూర్వులు వర్షాలగూర్చిన ప్రార్థనము, దైవాలు, నరకాసురుడు, వృత్రాసురుడు వైదిక సాహిత్యం చదువుకుంటే అంతరార్థం వొకటే—అడవులు కాల్చి సేద్యం చేయడం ఇదే.

ఇప్పచెట్టు సిరి భీమన్న దేవుడు (ఇంద్రుడు, వర్షాధిపతి)-భార్య 'సిరో'-రెండు ఇప్ప స్తంభాలు-వైశాఖంలో వీటికి (దేవుళ్లు) పెండ్లి. పెండ్లిపందిరముందు వేణువిహానం-ఆ మంటలపైనుంచి ఉత్సాహంగా దూకడం-అమ్మ పాత్రధారి ప్రవేశం. పిల్లలు అమ్మా ఆకలి అంటూ వేధిస్తూ వెంటబడతారు. అమ్మ వారందరికీ వడిచేతులతో ఉత్తుత్తిగింజలు పంచుతుంది.

మంటలు ఆరిపోగానే ఆ బూడిదను విస్తరించి ప్రదక్షిణ చేస్తారు. అక్కడే గింజలు పంచినట్లే దుక్కి, విత్తుట, కోతలు, కట్టేతలు, ఎగరేతలు, కొలతలు అభినయించి పంట బాగుందంటే బాగుందంటారు.

అమ్మ, అయ్య పాత్రధారులు (దైవాలు) ఆ ఉత్తుత్తిగింజల పంట గ్రామస్థులందరికి పంచుతారు. గ్రామ రైతులపై ఆధారపడిన చేతిపనులవారికీ కొల్చి అప్పగిస్తారు. వీరంతా ఉత్తుత్తిమూటలు వీపున వేసుకుని పందిరిలోని సిరో భీమన్నల దర్శించి పోతారు.

పొరుగు పచ్చ ఓర్వలేని మనం, కృతఘ్నత, దగా స్వార్థాలను గౌరవకేళిగా మార్చుకుని మసలుతున్న మనం ఈ వన్యజాతుల నుంచి నేర్వదగినవున్నాయంటే ఎంత అప్రతిష్ఠ!

తిర్నాతిరోజుల్లో—మువ్వలు కట్టిన కొరడాలతో కొట్టుకోడం, పశువుల గంటల పటెడలు మెడవేసుకుని గంతడం, ముసెమ్మ పూజ, సంవత్సరఫలితాలు, నాగలిపూజ, తెల్లటిఎద్దుల వనక తెల్లనిబట్టలు కట్టుకుని ఊరేగడం, అమ్మవారికి మూడు తెల్లజెండాలు, పొలాల్లో నాల్గుగింజ లేరుకొనిచ్చి తెల్లని కోడిపుంజును సూర్యునికి కైంకర్యం చేయడం.

తిర్నాతి-అల్లుడ్నీ కుమారుడ్నీ ముందు ప్రారంభించమని దున్నడం, విత్తడం-యథార్థ కార్యాచరణ.

## అసలు సంగతి

మకరసంక్రాంతి అనంతరం అమ్మలక్కలంతా (ప్రకృతం ఏకులానికాకులం ప్రత్యేకంగా కొన్ని కులాలవారు) బొమ్మల కొలువు పట్టడం సృష్టినిగూర్చిన నమ్మకం గాదా?

అసలాబొమ్మలస్థానంలో జతలు జతలుగా నిలుపుకొయ్యలు (తప్పక్కవసులాలవారి పోతురాజు కొయ్యలవలె) ఉండేవని ఎంతమం దెరుగుదురు? ఆపూజలో సూర్యుని స్థానం?

మహాశివరాత్రి జాగరణం-తప్పతాగి పేకాటలతోనూ, సినిమాలతో నుండడమా-జాగరణం ఉంటే మోక్షం వస్తుందా? అసలా జాగరణం ఒకనాటి జ్యోతిర్వైదిక చలనాలు శోధించేందుకూ, కాలంగూర్చిన నమ్మకాలు కాదా?

రథసప్తమి—చిత్రరథస్వామి — సూర్యునికి చిక్కుడుకాయల పచ్చని రథం తోయడం వసంత సంపాతం—అశ్వనేయులు—సూర్యగమనాలగూర్చి నమ్మకం కాదా?

కామదహనం మనలో కాముంగూర్చి, కథల్లో కల్పనల్లో కామునిగూర్చి ఏమైనా ప్రత్యక్షప్రయోజనంగా కన్పించేది చెత్తాచెదారం తగులేయడం—పారిశుధ్యం అనండి, పొలాలకు ఎరువనండి — మరేదైనా కృషీవలజీవనాన్నే ప్రాతిపదికగా సూచిస్తుంది. కన్నడనాడున కామదహనంమంటల్లో అంతా చెత్తాచెదారం ఉంటుంది.

అధునికంగా పట్టణాల్లో పారిశుధ్యానికిరకం కామదహనం పండుగలు చేయించడం ప్రజారోగ్యశాఖవారాలోచించదగినది. కామదహనంలో కామదేవునివిషయం కాదనలేము. కాగా ఇండూరు (మధ్యప్రదేశ్) "నాథూరాం" దేవుడు—లింగాకృతి. వట్టిబూతు—ఊరేగింపులు..

సృష్టి—ప్రకృతి—వసంతం అంతా బూతు అనుకోడం సాధారణం—కామదేవుని పూజలు, వసంతోత్సవాలు ఒకనాటి రాజులకథలు—కవిత్వాలు—అంతా కాముకవ్యాపారం అనిపించకపోదు.

అయితే ఈ బూతుల్లో నీతుల్లేకపోలేదు.

నేడు దేశంలో వివిధ "అభ్యుదయ" "సంక్షేమ" కార్యక్రమాలు చెవులు గింపర్లెత్తిపోతూ కళ్లు పచ్చబడేట్లు అచ్చయిపోతున్నాయి. ప్రదర్శనాలు, బహుమానాలు, పోటీలు—ఉద్యమాలు—కాని అంతటా ఎవరినుండో ఎక్కడినుండో ఎరువు తెచ్చుకున్నట్లు తద్దినం పెడుతున్నట్లు జరగడం మాత్రం ఏమీ బాగా లేదు.

వసంతోత్సవంకూడా పునరుద్ధరించిన నేటి సమాజంలో ఆపాతపద్ధతులు సరిక్రొత్తవిగా ఉండడమేకాదు. సాముదాయక శ్రేయోకార్యాలు నిర్వర్తించడంకూడా ఉంటుంది.

## ఉగాది - వసంతం - ఆచారాలు

ఈ ఋతువిశేషాలు మరికొన్ని చూచి ప్రకృత సమాజానికి అవసరమైన వసంతోత్సవం చర్చిద్దాం.

మన ఉగాదికి వసంతోదయం. ఈ ఋతువు—పండుగలు సాయన మేషంనుండి మిథునంవరకు సాగడం ప్రపంచ సారస్వతం పట్టియిస్తోంది. కాని కొన్నిదేశాల్లోమాత్రం మన ఉత్తరాయణం నాటికే వసంతారంభం. ప్రాదేశిక—శీతోష్ణ వాతావరణభేదాలు ఇందుకు కారణం.

ఉగాది అనే పండుగ సహస్రాబ్దాలనుండీ అనేకజాతుల్లో ఉన్నా ఆదిలో ఆంగ్లేయులకు ఉగాది లేదు. వారు నార్మన్లనుండి నేర్చి జనవరిలో ఉగాది పండుగ ప్రారంభించారు. స్కాట్సు కూడా అంతే.

బైబిల్ యూదులు చైత్రాన్నే "అబిబ్—నిసం" తొలి మాసంగా ఎన్నుకున్నారు. యవ (బార్లీ) ధాన్యం కోతలు పండుగ. శాయన మేషం సూచించే "గొర్రెపిల్ల బలితీత" పండుగ క్రొత్త పంట దేవునికి సమర్పించుకోవడం. "శివన్" జ్యేష్ఠమాసంవరకూ వసంతానికి సంబంధించిన విందులు, వినోదాలు పండుగలు.

మన ఉగాదిపచ్చడి వంటకంవలెనే 'బైబిల్' ప్రజలు రక రకాల పండ్లు కలిపిన గుజ్జు పంచుకునేవారు. గ్రీకుల "హాగ్గిస్" కూడా ఇలాంటి రకరకాల రుచుల కలగలుపే.

రాత్రింబవలు సమానమయ్యే వసంత సంపాతమే వేద యుగంలో కూడా ఉగాది.

మనకంతో సాన్నిహితసంస్కృతిగల సుమేరియన్లుకు కూడా నాల్గున్నర సహస్రాబ్దాల పూర్వమే చైత్రిసంక్రాంతే ఉగాది.

ఫ్రాన్సులో కూడా చిరకాలం ఉగాది పండుగ మార్చి మూడోవారంలో చేసుకునేవారు. కాని పంచాంగాల సవరణల్లో 1564 సంవత్సరంలో ఉగాదిని జనవరికి మార్చుకున్నారు.

రోమన్లలో ఉగాది జనవరి నెలలో చేసుకోవడం—గణపతిని పోలే వారి "జానస్" దేవుని అర్చించటం పరిపాటి.

వసంతసంపాతం (మార్చి 21) సందర్భంలో పూర్వం పర్షియా (పారశీకం)లో సూర్యునికి (మిత్రదేవ) తెల్లని ఎద్దుని సమర్పించుకోడం కూడా జ్యోతిర్వైదికవిషయంలో వచ్చినసమ్మకం. తెలంగాణా కోయల తెల్లని కోడిపుంజే కాదు తెల్లనిపసువన నేటికీ వన్యజాతుల్లోనూ ఉంది.

రెండున్నర సహస్రాబ్దాల పూర్వం వసంత సంపాతం వృషభరాశి సంబంధం-అదే వలుగు. వేడికి సంబంధించిన దేవుళ్లకు, సృష్టికి సంబంధించిన దేవుళ్లకు వృషభవాహనాల రూపకథ— ఈజిప్టు "ఒసిరిస్", కృష్ణుడు, రుద్ర శివ కథలు.

యూదులి మేష వృషభరాశి విషయకంగా "పాస్ఓవర్" (గతించిన) పండుగ జేసుకుంటారు.

నిలువు—ఏటవాలు ఎదురుగనిలు, స్తంభాలు నిట్టాళ్ళ పూజలు కాలంగూర్చినవిగా, సృష్టి సూర్యుని గూర్చినవిగా, అంతటా బూతుపూజ ప్రపంచం అంతటా ఉన్నదే. మరి ఇంగ్లాండులో నిలువుకర్రల "మేడే డ్యాన్స్" అలాంటిది కాదా?

అసలీ పూజలో సృష్టి—బూతు భావాలున్నా లేకపోయినా కాలం కొల్చే విధానం ఒకటి కనుపిస్తుంది. (నీడనుబట్టి గంట తెలియడం)—ఈ ఏర్పాటే నల్గొండజిల్లాలో ఛాయల సోమేశ్వరలింగమూర్తి. ఎటునుండి చూచినా గర్భగుడిలో ఛాయ కన్పిస్తుంది. కాగా లింగమూర్తులు—పానవట్టాలతో సహా అరుబైట నే వుండడం—అనంతరం ఆలయాలేర్పడడం గమనించండి—కాలాన్ని కొలిచేపద్ధతి.

ఏరువాక, పాలప్రవహణం, నాగలిపూజలు మనలో, మన ఆటవికజాతులలోనే కాదు అనేక దేశాల్లో వుంది.

పాశ్చాత్యుల "నాగలి సోమవారం", ఐరోపాలో "యవ మేక", బైబిల్ యహోవాకు దూడ, సిరియా బంగారుదూడ, ఈజిప్టు "అపిస్ బుల్" నంది ఇదంతా కేవల జ్యోతిర్వైదికవిషయాలే గాక కారణాలలో భూమిక వ్యవసాయక విషయాలున్నాయి.

సృష్టి—వ్యవసాయం—అందుకే మన పూర్వులు మానవుల సృష్టికార్యం—ఒక యజ్ఞంగా, వ్యవసాయంగా వ్యవహరించారు సృష్టి, బీజము, ప్రాణి. చీనీయులు మనవారికో ముందడుగు వేసి—వైజ్ఞానిక దృక్పథంలో ఈ "గ్రామ్యధర్మా"న్ని (బూతు అనుకునే పని కిదో (పారిభాషికపదం—పట్నవాసస్థుల కేసంబంధం లేదని కాదు.) సృష్టికార్యక్రమంలో ప్రాణిదానం, వినాశనం కూడా ఉన్నదనడం (పురుషుడు తిన శక్తి కొంత కోల్పోడం—పెనగులాట—పట్టుదల) చీనీయులీ సంబంధం "యుద్ధం"గా పోల్చారు.

శృంగారచేష్టలలో వారు వాడే పదాలు యుద్ధం సైన్యాలకు సంబంధించినదిగా వుంటాయి. బైబిల్ సోల్మన్కథ—అదో ఉద్యానవనం — వసంతం — యీ పత్రికలో చర్చిస్తే బూతులంటారు.

ఈ బూతు — వసంతకాలపు సూర్యుడు వసంతుడు—ఇంద్రుడు—ప్రాకృతిక సృష్టికార్యతత్పరతలో పంట, కాముక భావాల్లో ఇంద్రుడ్ని మన పూర్వులు పచ్చి చీకటి వేటగాణ్ని చేశారు. కన్యాప్రియుడు అన్నారు.

మన పొరుగు దేశాల్లో 'అడోనిస్, తమ్ముజ్, ఒసిరిస్' అటిస్' మొదలగువారంతా వసంతకాలపు సూర్యులే—ఇంద్రుని లక్షణాలు, శివుని లక్షణాలు, కృష్ణునిగూర్చిన కథలవంటివి వారికీ ఉన్నాయి. చెట్లు చిగుళ్ళు, విందులు వినోదాలు—అనేక బూతు పూజలు-ఇంద్రుడు మనకు పుంలింగం. కాని కొందరు స్త్రీగా భావించారు. (చంద్రునిసంగతికూడా ఇంతే) ఇంద్ర, 'అంద్ర, అందర శబ్దంలో కొందరి అర్థం దీర్ఘకాయుడు (దీర్ఘమైన పగలు కూడా అనవచ్చును. శీతాకాలం రాత్రికాలం హెచ్చుగదా.)

మనం—ఆంధ్రజాతి—అలగాజనం అనీ, పతితులనీ ఒకవాడు ఒకరిచే అనిపించుకున్నప్పటికీ, రాజకీయాల్లో ఆంధ్రులు అంధులుగా వ్యవహరించినప్పటికీ—గత వైభవాలకు బుజాలు తడుముకోడానికి అంద్ర ఇంద్ర శబ్దార్థాలు ఆంధ్రకు ముడిపెట్టడం బాగుండదా?

"ఇందు" మనకిప్పుడు సోముడు—జలబిందువుకూ ఇదే పేరు కాని ఒకప్పుడు ఇందు అర్థం రేతోబిందువు......ంతా బహు పూర్వకాలపు సృష్టినిగూర్చి ఏర్పడిన అర్థాలు ... ...లు.

ఆదిలో సంవత్సరం అంతకాలం వసంతంగానే ...ం లేదట. గ్రీకుల కథ—వారి దేవుడు జూపిటర్ (ద్యు... ...పిత—ఇంద్ర—సూర్య—రుద్ర) సంవత్సరాన్ని విభ... ...లుగా విభజించి ఆయాకాలాల కనుగుణంగా మానవుల మను... ...—కాలగిభజన చేయడం—వ్యవసాయం, పసుపాలన మొదలైనవే—

నాగరికత—కథలు—ఇలాంటి పోలికలు మన ఇతిహాసాల్లోనే గాదు అనేక దేశాల పౌరాణిక కథల్లో ఉన్నాయి.

పశువులు, జంతువులు, క్రిములు, కీటకాలు చూడండి. వాటి బ్రదుకు తినడం, పుట్టించి చనిపోడం—కొండముచ్చులు, పిచ్చికలు వీటిలాంటి ప్రాణులకు తినడం, సృష్టికార్యంతప్ప మరేదీ తోచదు—అలాగే ఆదిలో మనుష్యులూ వీటిసమానంగానే ఉండేవారు. దుష్పిత మానవజన్మ కిదే ధ్యేయం కాదని బోధించి ఆచరింపచేశా డన్నమాట.

మనకు వసంతం పండుగ. ఉగాది ఫలాల కుజ్జు—మధుమాసం క్రైస్తవుల్లో 'పెంతుకోస్తు' శాఖవారికి వసంతోత్సవం. కోతల పండుగ.

పర్షియా మిత్రదేవుని పూజలనేకం క్రిస్మస్‌లో కలిసి పోయాయి. ఆయన పండుగలు వసంతోత్సవం—"ఏప్రిల్ ఫూల్, ఫాపన్ సండే, గుడ్ ఫ్రైడే"—ఈ లక్షణాలు మన వసంతోత్సవాల్లో ఉండేవి. క్రైస్తవులు ఉగాది అర్ధరాత్రి "ఫస్ట్ ఫుటింగ్" ఆచారం.

వారి గత సంవత్సరం (నశించినది) పొడవైన నల్లటిరూపం అంటే దీర్ఘరాత్రి (దక్షిణాయనం). కొత్త సంవత్సరం అర్ధరాత్రి నిశ్శబ్దంగా నిప్పురాజేసి వెలుగు కల్పించే ఆచారం ఉగాది రావడం, ఉత్తరాయణారంభం.

అయితే ఒకప్పుడీ క్రైస్తవుల పండుగ కేవలం శృంగార కామప్రవృత్తి కలదై జరిగింది. దీన్నే గ్రీకులు "అగపీ" అన్నారు.

ఈస్టర్ పండుగ మిత్ర (సూర్య) దేవుని సంబంధం-వసంతోత్సవంగా జరిపేవారు. తర్వాతి కాలంలో మధుమైథునాల పండుగగా మారింది. అదే మధ్యకాలపు వ్యవసాయిక విషయకభావకల్పనలు, సృష్టి, జీవహింస త్రాగుడు, వ్యభిచారాలకు దారితీయించినవి.

గతించిన సంవత్సరాన్ని పరిహసించడమే "ఏప్రిల్ ఫూల్" వినోదం—అంటే ఒకప్పుడు వసంతంలో వారి ఉగాది అన్నమాట. చలి, దీర్ఘరాత్రులు పోయి ఉత్తరాయణం, వసంతం—సంతోషాల్లో బహుమతులు పంచుకోడం.

గ్రీకులు 'ఈస్టర్' ను పవిత్రాగ్ని పర్వంగా చేసుకున్నారు.

సంపాతాలకు సంబంధించిన పండుగల్లో అగ్ని సంబంధం అనేకదేశాల్లో, మతాల్లో వేడి వెలుగులనుగూర్చిన ఉపాసన అయి వుంది.

క్రైస్తవుల కది "పాదప్రక్షాళన" పండుగ—పన్నిద్దరి మత్త మానవుల వాసీనులచేసి వారికాళ్లు కడుగడంలో వారి 12 అపొస్తలులు, ద్వాదశరాసులు మాసాలు భావాలు—అదే సిక్కిం ప్రజల ఉగాది ఉత్సవాల్లో పన్నిద్దర నృత్యాలు. కొత్త సంవత్సరం రాసుల్నీ మాసాల్నీ ఆహ్వానించి పూజించడం.

ఆదిలో క్రైస్తవులకేంద్రం ఆర్మీనియా—అక్కడి ఈస్టర్ వసంతోత్సవమే, ఆదేశంలో క్రీస్తు జన్మదినోత్సవం, ఏప్రియల్ (వసంతం) లో జరిపేవారు. మిత్రదేవుని పోలికలు.

ఉగాది పచ్చడి పంచుకున్నట్లే పోలెండ్ ప్రజలు వారి ఉగాదికి అప్పడాలు చిదిపి కుటుంబసభ్యులంతా పంచుకుంటారు.

భూతకాలం అనుభవైకవేద్యం కావడంలో పాతగోత—భవిష్యత్కాలంగూర్చి భయాలు, శుభకరం కావాలనే ఆశలు, నమ్మకాలు, రానున్న సంగతులు తెలియాలనే కుతూహలం ప్రపంచంలో అన్నిదేశాల్లో, అన్ని తరగతుల, జాతుల ప్రజల్లో ఎప్పుడూ ఉంది. అది మానవుని మనస్తత్వం. ఇదే గతాన్ని దూషించుకోడం, ద్వేషించడం, రాబోవు విషయంగా ఆశలు, జోస్యాలు, సంవత్సర ఫలితాలు, బోగీలు, కోడిపందాలు.

వైదికయుగంలో దాంపత్యాధిపతి ఆర్యమనుడు "అవెస్తా"లో, అయిరీమాన-వసంతకులు. మన్మథుడు, ఇంద్రుడు, కృష్ణుని గుణాలు వారికంట లేదుకాని వైవాహికజీవనం. సృష్టికార్యాల్లో వీరి సంబంధం ద్యోతమానమై వుంది.

గ్రీకుల బూతుపూజల దైవం డియోనిసస్ (దివోనిశశి) కూడా మన వసంతుడైన ఇంద్రునిలక్షణాలున్నాయి. ఆయనకూ పశువులకు, పెళ్లిళ్లకూ సంబంధం వుంది. ఈయన పూజలు మాత్రం పుష్యమాసంలో జరిగేవి. ఈయనే నహుషుడై యుంటాడని పండితాభిప్రాయం.

వ్యవసాయికంగా కొన్నిన్నూ—సృష్టి — వెలుగులగూర్చిన పండుగల్లో—ఎట్రూస్కన్ (ఇటలీ) కాటర్నాలియా", గ్రీకుల "థెస్మోఫోలియా" మధుమైథునాల పండుగలే.

రోమనులు డియొనిసస్ స్థానే బాకస్ నుంచి "బక్కనా లియా" వసంతోత్సవం చేసేవారు. ఇదీ అంతే. దీని దిగుస్థాయిది మన దేశంలో "హోలీ" పండుగ.

సిరియా "బాల్" మహాదేవుని పూజలుకూడా వసంతంలోనే జరిగేవి.

వసంతఋతువు — ఉత్సవాలు — అధిదైవాల్లో స్త్రీలూ ఉన్నారు. వాసంతి.

చీనావారికి వాసంతి కన్యారాశి సంబంధం. "రైన్ హో" పండుగలో కాముకకార్యాలు బూతులూ ఉన్నట్లు కన్పించదు.

వాసంతినే పూర్వం రష్యాలో "వెస్నా" అనేవారు. ఈజిప్టు వాసంతి 'అమన్' (అమని) పురుషునిగా కూడా పూజించారు (సూర్యుడు).

రోమనుల వాసంతి వీనస్ — అందాలభరిణ — అరితేరిక జారిణిగా ఊహించుకున్నారు. ఆవిడ పండుగల్లోనూ కాముక వ్యాపారాలే సాగేవి.

వీరే పువ్వుదేవి అంటూ మరోకామెను (ఫ్లోరా) పూజించేవారు. ఆవిడ పండుగ ఫ్లోరాలియాకూడా కాముకవిషయాలకు దూరంకాదు.

## ముగింపు

వసంతం అంతా బూతులబుంగా అనిపించటం అనాటి సమాజం, భావాలు, జ్ఞానం, వాటిని అవగతం చేసుకోలేకపోవటం వల్లనే.

వసంతంలో మన తెలుగునాటకూడా ప్రభువులు పరాంగనా సంభోగపరాయణత్వంగూర్చి, మన్మథపూజలు, ప్రథమ సురతోత్స

నాలు, రాజుల కావ్యాలు, రకరకాల వినోదాలుగూర్చి వివరా లుండవచ్చును.

ఈ కామకార్యక్రమాల వసంతోత్సవం పునరుద్ధరించ మనను—ఆ సారస్వతంకూడా అవసరం—కారణం నాగరికలో మలువుగా ఉద్రిక్తులైపోతూ వాతావరణం రావడం. ప్రేరణా ప్రోత్సాహాలకు సందుగలక్కర్లేదు. నేను అంటే గొట్టుకొస్తున్నాడు నేటి మనుష్యుడు. అంట్లూతోమే అతిథి చేలాంచల స్పర్శతో పద్య సందర్భం తయారించగల రసికసాహిత్యం సృష్టి అవుతుంటే మన నాటి బూతుల వసంతోత్సవం ఎందుకు? దమన పౌర్ణమి, వసంతపంచమి, హోలకవవప్రతిక, కదంబయుద్ధాలు మదన త్రయోదశి మన కవసరం లేదు.

అన్ని శృంగారం, బూతు, రసజ్ఞత అనుకున్న ఆనాటి వసంతోత్సవాల్లో ఇతర ప్రత్యేకతలు లేకపోలేదు.

చతుష్షష్టి కళలు—ఆటలు పాటలు, అలంకరణలు, అందాల పోటీలు, ప్రదర్శనలు.

పండుగల్లో మతప్రసక్తి తగ్గించి యువతీయువకుల ప్రాధాన్యం కల్పించి కనీసం వారంరోజులైనా ఆబాలగోపాలానికీ ఆటవిడుపు సెలవులిచ్చి వసంతోత్సవాలు జరపడం పంచవర్ష ప్రణాళికలు వారికి అవసరం అనిపించకపోవచ్చును.

కాని ఉద్యానవన కృషి, అందాల పోటీలు, లలితకళలు, ఉపన్యాసాలు, అలంకరణలు, చేతిపనులు, అంటరానితనం, శ్రేయోదాయకకార్యాలు, సంక్షేమాలు, శ్రమదానాలు, వ్యాయామాలు, ఫలప్రదర్శనలు ఇలాంటి అనేకం ప్రోత్సహించే అవకాశం వసంతోత్సవంలో కల్పించవచ్చు. వివరణకో గ్రంథం అవుతుంది

**కథానిక:**

# విజ్ఞానం: అజ్ఞానం

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

అర్జంటుగా ఓ వంద రూపాయలు కావాలి.

పోనీ డెబ్భయి, ఎనభై మధ్యగనున్నా సరిపెట్టుకోవచ్చు. అవసరం నాకే. డబ్బు కావాలి. రేపటిలోగా కావాలి. తప్పని సరిగా కావాలి.

అంత డబ్బంటే తమాషా కాదని తెలుసు. అంత స్వల్ప వ్యవధిలో అంతకంటే ఎక్కువ ఖర్చుచేసిన దినాలు చాలా వున్నాయి యిదివరలో. కాని ఫస్టుతారీఖు దాటి పదిరోజులన్నా కాలేదు. అప్పు చేయటం అలవాటు లేదు. తీరవలసిన బాకీలు తీరటం లేదు. ఎలా ? ఎలా ? ఎలా ?

బయట చాలా ఎండగా వుంది. లోపలకూడా వేడిగా వుంది. ఏళ్ళు ముదిరి, కీళ్ళు సడలిన పాత సైకిలును తొక్కుకుంటూ మళ్ళీ ఓ గంటలో ఆఫీసుకెళ్ళాలి. చనిపోతూ నాన్నగారు ఇచ్చిపోయిన ఆస్తి అదే. ఆయన జ్ఞాపకచిహ్నంగానూ, నా అవసరానికీ యింతవరకూ పదిలంగా దాన్ని వాడుకుంటున్నాను.

దాన్ని గురించి ఓ సమయంలో ఓ స్నేహితుడు జోక్ కూడా విసిరాడు.

"సైకిలును నువ్వు తోసుకెడుతున్నావా? సైకిలు నిన్ను మోసుకెడుతోందా?"

దానికి ఆలోచించి యిలా సమాధానం చెప్పాను.

"రెండూ జరుగుతున్నాయి. నాకు నీరసంగా వుంటే నన్నది మోసుకెడుతోంది, దానికి నీరసంగా వుంటే నేను తోసుకు తీసుకెడతాను."

పాపం! దెబ్బ తినేందుకు అందులో ఏమీ లేకపోయినా, ఎడమ చెంపమీద కుడిచేతితో ఓ దెబ్బ కొట్టినట్లుగా బాధపడి వెళ్ళిపోయాడు.

కాని ఆ విషయాలన్నీ యిప్పుడు నాకెందుకు? కొంచెం ఎక్కువగానే డబ్బుకావాలి.

కిటికీలోంచి ఎండవచ్చి నెత్తిమీదిగా బల్లమీదపడుతోంది. తలుపులు మూద్దామని వుందిగాని బద్ధకంగా వుంది. ఉపాయాలను నెమరువేస్తున్నాను, క్రొత్తవాటిని కల్పిస్తున్నాను. కాని అన్నీ మధ్యలోనే విరిగిపోతున్నాయి. కొన్ని చివరివరకూ కొనసాగాయి కాని మరీసాగటంవల్ల పలుచనై బలహీనమైపోయాయి. పదిహేను పాతిక మధ్య ఫలితంకనిపించే ప్లానులు చాలావచ్చాయి. కాని అవి చాలవు. కనీసం డెభ్భై కావాలి.

మూడు సంవత్సరాలక్రితం [illegible] ఓరోజున యిలా రాశాను, డైరీలో.

"నిన్న నాన్నగారు చనిపోయారు. పోతూ యిలా అన్నారు. నాయనా ఎవరిదగ్గరా అప్పుచేయబోకు, ఎట్టి స్థితిలోనైనా సరే"

మూడు సంవత్సరాల తరవాత జనవరి రెండో తారీఖున ఎన్నోసారో యివాళ తడుతోంది." అప్పుచేసినందుకు ఫలితం ఆయనకు బాగా తెలుసు. అక్కయ్య పెళ్ళికోసం చేసిన అప్పుతోనే ఆయన వచ్చీరాని జరలో పడరాని పాట్లు పడ్డారు. అప్పు తీర్చి నాకోసం యీ చిన్నయిల్లు మిగిల్చేసరికి నవనాడులూ కృంగిపోయాయి. ఇంకా ఏదో యీ ఒక్క కొడుకుకోసం పోరాడదామని తాపత్రయపడుతూండగా స్టాలిన్ లాంటి మహానుభావుడికి దాపురించిన భయంకరవ్యాధి సంక్రమించింది. ఆయనకూ మాకూ ఋణం తీరిపోయింది.

ఆపదలో వున్నప్పుడు గడిచిపోయినరోజుల్లో చవిచూసిన కష్టాలూ, సుఖాలూ రెండూ జ్ఞప్తికి వస్తాయన్నమాట నిజమే. కాని కష్టాలకే బరువు ఎక్కువ. ఒక సుఖం [illegible] కష్టాలను మరిపించగలదు. ఒక కష్టం వంద సుఖాలను మరిపిస్తుంది.

ఆసమయంలో ఆలోచనకు అంతరాయం - కలగజేస్తూ సున్నితంగా ఎవరో తలుపు తట్టారు. "ఎవరు?" అన్నాను.

తలుపుతోసుకుని పదేళ్ళ పిల్ల లోపలకు వచ్చింది.

జాలిగా, ముద్దుగా "ఏం కావాలమ్మా?" అన్నాను.

"ఓ రూపాయుంటే యిమ్మంది అమ్మ" ముద్దుగా, జాలిగా జవాబు.

జేబులు తడిమాను. మూడు రూపాయలు వున్నాయి. వాటిలోంచి ఒకటి తీసియిచ్చి ప్రేమగా చెక్కిలిమీద చిటికవేశాను. నవ్వి వెళ్ళిపోబోతోంది. చప్పున ఏదో తోచి, "పాపా మాట" అన్నాను.

పాప వచ్చింది.

"మీ నాన్నగారున్నారా యింట్లో?"

"ఆఫీసు కెళ్ళారుగా"

జవాబు విని "సరే వెళ్లు" అన్నాను.

పాప వెళ్ళిపోయింది.

అదృష్టవంతుడి పరిసరాలు యిలానే వుంటాయి. పాప మంచిదే. కాని ఆమె వేసుకునేందుకు మంచి పరికిణీ, గౌనూ లేవు. పాప తెలివైందే. కాని ఆమె ఆరోతరగతి మించి చదువుకునేందుకు అవకాశంలేదు.

పాపనాన్నగారుకూడా మంచివారు. మాటకారి కాదు. ఆయనలో వున్న లోపమల్లా ఏమిటంటే బీదవాడు కావటం. ఈ బీదవాడు ఆ బీదవాడికి యిల్లు అద్దెకిచ్చాడు. అద్దె యిరవైరూపాయలూ మూడునెలలనుంచీ బకాయి.

మూడు యిరవైలు అరవైలో సగం అయినా ఆయన యిస్తే ఎంతో బాగుండును? ఇచ్చేందుకు ఆయనకు శక్తిలేదు. అడిగేందుకు నాకు శక్తిలేదు.

మౌనంగా గడుస్తోంది కాలం. విసుగ్గాకూడా గడుస్తోంది. ఉపాయాలు ఆలోచించటంవల్ల ఫలితం లేదని గ్రహించి మానివేశాను. ఏదో ఒకటి చేసేయగలగటం ముఖ్యం. అద్దెకోసమన్నా ఏడిపించాలి; అప్పన్నా చేయాలి.

మొదటిది సంభవం కాదు. రెండవది అసంభవం.

గంట గడిచింది. బరువుగాలేచి, తలుపులు తాళం వేసి సైకిలను ప్రయాసమీద స్టార్టుచేసి బయలుదేరాను. దారో— ఓముసలమ్మగారు శాపనార్థాలు విసిరింది. ఏం జరిగిందో ఓయువతి ముసిముసి నవ్వులు నవ్వింది. ఇంకా కొన్ని ఘోరాలు జరగబోయి ఆగిపోయాయి. ఆఫీసుకు చేరాక బ్రేకు వేసినా చక్రాలు తిరగటం మానటం లేదు. సింహద్వారానికి పదిహేనుగజాల దూరంగా దయతల్చి, అప్పటికైనా విశ్వప్రయత్నం చేస్తే ఆగింది. మళ్ళీ వెనక్కి తోసుకొస్తూంటే ఎవరో యిద్దరు నవ్వారు. నన్నుచూసి నవ్వారో, సైకిలునుచూసి నవ్వారో నా కర్థం కానేలేదు.

మెట్లమీంచి సైకిలు మోసుకొస్తూంటే ప్యూన్ ఎదురై యిలా అన్నాడు: "మీరేం మోస్తారు? బాబూ! నేను మోస్తాను."

సీటులో కూర్చున్నా ఆలోచన్లు మానవని తెలుసు. మానేందుకు ప్రయత్నించి ప్రయోజనం లేదని కూడా తెలుసు. అలా బాధపడుతూ అయిదింటివరకూ గడిపి ఫైల్సు అసంపూర్తిగా వొదిలేశాను.

వచ్చేటప్పుడు ఓపికలేక, సైకిలు నడిపించుకుంటూ వస్తున్నాను. కాఫీ త్రాగుదామని అనిపించినా బద్ధకంవేసి మానేశాను. అరగంటలో యింటికివచ్చాను.

ఇంత విచారం! అబ్బ! ఎలా భరించటం!

పంతులుగారు గుమ్మం యివతల చాప వేసుకుని, పేపరు చదువుకుంటున్నారు. ఇది రోజూ జరిగేదే. రోజూ అయితే "విశేషాలేమిటండీ?" అని నేను అడగటం, పత్రిక వార్తలన్నీ ఒకదాని తర్వాత ఒకటి ఏకరువు పెడుతూ, ఆయన స్వంత అభిప్రాయాలు కూడా వెలిబుచ్చటం, ఎక్కడైనా నేను ఆయన మాటల్తో అంగీకరించకపోతే, సున్నితంగా వాదించుకోవటం జరగడం రివాజు. ఇవాళ కూడా నేను పాతప్రశ్న అరగదీస్తానని తలంచి వుంటాడు. కాని నేను తొందరపడ్డాను.

"పంతులుగారూ ఓసారి యిలా వస్తారా?" అన్నాను.

ఓ విధమైన ఉద్రేకపు సన్నివేశాలకు నాందీవాక్యాలు యిలానే వుంటాయి. "నిన్నోవిషయం అడగమంటావా?" అని అమ్మ హఠాత్తుగా ఉపక్రమించినప్పుడు ఆ రోజుల్లో అలాగే ఉలిక్కిపడేవాడిని. "ఒరేయి యిటురా" అని నాన్నగారు పిలిచినప్పుడూ గుండె గబగబ కొట్టుకునేది. ఇప్పుడు నా మాటల్ని వినగానే ఆయన ముఖంలో ఆ మాదిరి భయం స్పష్టంగా గోచరించింది.

"ఏమిటండీ?" అని దగ్గరకు వచ్చాడు.

భయంతో, బాధతో, సిగ్గుతో చచ్చినచావయింది. ఎంత కష్టమో. యిటువంటి సంఘటనలను ఎదుర్కోవటం! మరి కథల్లో చదివే, సినిమాల్లోనూ, నాటకాల్లోనూ చూసే ఆ కఠినత్వాలూ, దయాదాక్షిణ్యాలు లేకపోవటాలు నిజాలు ఎలా ఔతాయి? పంతులుగారిలాంటిమనిషి, ఆ కళ్ళజోడు అలా క్రిందకు జారిపోతూండగా, దీనమైనచూపులు చూస్తూండగా, ఆ అదురుతూ, వణుకుతూన్న కళ్ళూ.....ఏ మానవుడి హృదయం ద్రవించదు? కనీసం...నాలో యిహ కాఠిన్యానికి తావులేదు.

"కొంచెం...కొంచెం...డబ్బు...సర్దగలరా?"

ఎలా వేశాను యీ ప్రశ్న? నేను కఠినుణ్ణి కాదుగా. లేదు లేదు. ఈ ప్రశ్నలో ఆ భావంలేదు. ప్రతిమిలాడాను, వేడుకున్నాను, అర్థించాను—ఆ నాలుగు మాటల్లో.

"నాదగ్గర యిప్పుడెక్కడిది నాయనా?"...

చాలు—ఇంక నా నోరురాదు. "అవడంలోలేని ప్రేమ, జాలి, దీనత్వం యీ చివరి మూడక్షరాలలో అమితంగావున్నాయి.

"ఫర్వాలేదు. ఏమీ అనుకోకండి. ఎంతో అవసరంవుంటే అడిగాను" అనేసి లోపలకువచ్చి కూలబడ్డాను. అసహ్యంగా వుంటేనే మనశ్శాంతిగా వుంటోంది. ప్రయోజనంలేదని చాలాభాగం తెలిసీ, నోరుజారి, మరోగుండెను గాయపరిచాను. కనీసం ఆత్మసంతృప్తిఅయినా లేకపోయింది.

ఏడుపు, కోపం, వైరాగ్యం, ఉద్రేకం అన్నీ ఒకదాని తర్వాత ఒకటి ఆవహిస్తున్నాయి. వరుసగా వాటితో కుస్తీపట్టి అలిసిపోతున్నాను. కాని చివరి విజయం నాదికాలేదు. నన్ను ఉద్రేకం చిత్తుచేసింది.

"ఏమయినాసరే డబ్బుసంపాదించి తీరతాను" అని చివరిసారిగా దృఢంగా నిశ్చయించుకున్నాను. తలుపు తాళంపెట్టి సైకిలు తీసుకుని బయటకువచ్చాను. అప్పుడే చీకటిపడింది. పాత కాలంలేనప్పుడు టైము గబగబా గడిచిపోతుందన్నమాట నిజమే. ఆయాసంమాట మరిచిపోయి సైకిలు ఎంతవేగంగా త్రొక్కానో చెప్పలేను. భయంకరమైన పోలీసువాడి యీల వినబడగానే ఎడం చేత్తో బలంగా బ్రేకునొక్కాను. అతిప్రయాసమీద ఇరవై గజాలు దాటాక సైకిలు ఆగింది.

పోలీసువాడు రొజుకుంటూ వెనకనుంచి పరిగెత్తుకువచ్చి నన్ను వేసిన మొదటి ప్రశ్న యిది.

"నేను ఆగమనగానే ఎందుకు ఆగలేదు?"

నేను భయపడి "బ్రేకు పడలేదు" అని చెప్పాను.

పోలీసు స్ట్రీట్ లైటు వెలుతురులో నావంక క్రూరంగా చూసి "బ్రేకులు పడకపోవటం రెండవతప్పు" అన్నాడు.



బాలిక పిలుపు

చిత్రకారుడు : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

తెలిసి, చిత్తరపోయి "నా పొరపాటేమిటి?" అని అడిగాను.

"తెలియకుండానే పోతున్నావన్నమాట. లైటుఏదయ్యా?"

అప్పుడు గుర్తువచ్చింది. పోలీసువాలకంచూస్తే గంభీరంగా వుంది. సులభంగా వదిలేటట్లు కనబడలేదు. అయినా ఎట్లా? అనవసరంగా జంజాటంలో యిరుక్కున్నానే.

"తొందరగా వెళుతున్నాను. పొరపాటయింది. పోనీయండి" అన్నాను తగ్గి.

పోలీసు వదల్లేదు సరికదా, దబాయించటం ప్రారంభించాడు. నామీద రెండు నేరాలు యిందాకనే మోపాడాయె. "చదువుకున్నవాడిలా కనిపిస్తున్నావు; ఆ మాత్రం తెలియదుటయ్యా" అన్నాడు, "నిన్ను వదిలిపెడితే యివాళ, రేపటినుంచీ నెత్తికెక్కుతావు" అన్నాడు పదాలప్రయోగం నాస్తిగాచేస్తూ. నా కర్థం కాకుండా కొన్ని నిమిషాలు ఏవేవో మాట్లాడాడు. పోనీ-అతని మాటలన్నీ భరిస్తూ వూరుకుంటే, వదిలిపెడతాడని మౌనం వహించాను. అయిదు నిమిషాలు అలాతిట్టి "స్టేషన్‌కిపద" అన్నాడు.

నా వళ్లు ఝల్లుమంది. నా ఆలోచన్లు! ఆశలు! ఏమిటో పీకులాట? ఇంకా తగ్గి, దీనాతిదీనంగా "ఇంకెప్పుడూ చెయ్యను. వదిలేయండి" అన్నాను.

"అనేం లాభంలేదు. పద!"

నాకేం అర్థంగాక ఏమి చేయటమా అని ఆలోచిస్తున్నాను. ఇంతలో ప్రక్కనుంచి ఓ కీచుగొంతు వినిపించింది.

"ఏదో పోనివ్వండి. ఇంకెప్పుడూ చెయ్యనంటున్నారుగా."

చిన్న కిళ్లీ దుకాణం. ఒక తీగకు లాంతరు తగిలించివుంది. వెలుగుతోంది. ఇద్దరు ముగ్గురు ప్రక్క నేలమీద వేసివున్న బెంచీమీద కూర్చుని మాకేసి వినోదంగా చూస్తున్నారు. దుకాణదారు ఎవరికో కిళ్లీ కట్టి యిస్తూ, మళ్లా యిలా అన్నాడు. "పాపం. వదిలేయండి".

"నీకేం తెలుసయ్యా, కూర్చుని కబుర్లు చెబుతున్నావు. అది నా డ్యూటీ!"

కిళ్లీకొట్టు అతను అసహ్యంగా నవ్వి అన్నాడు. "ఎంతడ్యూటీ అయినా పాపం-ఆయన ఏదో పనిలో వున్నట్లున్నారు. అర్జంటుగా వెళుతున్నట్లున్నారు!"

"అయితే లైటు వెలిగించుకో నక్కర్లేదా!"

కిళ్లీకొట్టు అతను మళ్ళీ నవ్వి "ఏదో. పోనీయండి" అన్నాడు.

నాకు శరీరమంతా చెమ్మా, జ్వరంలా కాలుతున్నట్లుగా వుంది. రోడ్డుమీద యింత అవమానం ఎలా భరించేది? ఇంకా కొంచంకాలం యిదే హేయపరిస్థితిలో వుంటే కన్నీళ్లు కారటానికి అడ్డంకి ఏముంది? ఛీ. విలువైనకాలం వృథా అయిపోతోంది. ఎనిమిది దాటితే నా పని నెరవేరదు. మళ్ళీ రేపు ఆదివారం. కష్టాలన్నీ ఒకసారే వస్తాయన్నమాట నమ్మక చేసేదేముంది?

"చూస్తూ నిల్చుంటావేమయ్యా. పద" అన్నాడు మళ్ళీ పోలీసువాడు.

దిక్కుమొహంతో "సైకిలు స్టేషన్‌కాడ తీసుకుపోతే ఏం జరుగుతుంది" అన్నాను.

అతను వికటంగానవ్వి "రేపు కోర్టుకు పిలుస్తారు. అయిదో పదో ఫైన్ వేస్తారు" అన్నాడు.

"తప్పక వెయ్యరా?"

"ఏమో నీ అదృష్టం."

ఎంత అసహాయత నాకు, ఇన్నాళ్ళనుంచి యిక్కడ గడిపాను. ఒక పోలీసువాడిబారినుండి తప్పించుకోలేకపోతున్నాను. నిజానికి యింత హఠాత్తుగా మనిషిని పరిస్థితులు ముళ్లకంచెలా చుట్టివేస్తాయని ఎవరైనా ముందుగా ఊహించగలరా?"

మళ్ళీ కిళ్లీకొట్టుఅతను కలగచేసుకుని "పోనీ. నేనో ఉపాయం చెబుతాను. అలాచేయండి" అన్నాడు యిద్దరినీ ఉద్దేశించి అన్నట్లుగా.

నాలో ఆశ జనించింది. దీనికి మారుపేరే అమాయకత్వం.

"ఇప్పుడు మీరు పనిమీద వెడుతున్నారా పంతులుగారూ!"

తల బలంగా ఊపాను.

"నేను మంచివాడ్ని. అపాయంలో వున్నవాళ్ళనిచూస్తే నాకేమిటో సహాయం చేయాలనిపిస్తుంది. చూడండి. రేపు నేను మీ బదులు కోర్టుకి వెడతాను. రెండో మూడో ఫైన్ వేస్తారు. అది యిప్పుడు మీరు నా కిచ్చెయ్యండి. ఏమండీ పోలీసాయనా, యిష్టమేనా?"

పోలీసు అయిష్టంగానే తలవూపి "నాకసలు యిటువంటి పనులు యిష్టంలేవు" అని కొంచంసేపాగి "అయినా నీమాట కాదన లేకుండా వున్నాను" అన్నాడు.

"ఏదో నా మొహంమాటకి వొప్పుకోండి."

"సరే" అన్నాడు యీసారి పోలీసు.

"అయితే మీరు నాకు మూడురూపాయిలిలా యివ్వండి."

శరీరం ఓ రెండు పరిచితభాగాలతో దహిస్తుండగా నేను జేబులో చెయ్యిపెట్టి, తడిమి, "నాదగ్గర రెండు రూపాయలే వున్నాయి" అన్నాను.

"కష్టం" అన్నాడు పోలీసు.

"కష్టమే" అన్నాడు కిళ్లీకొట్టు అతను.

"ఏంచేసేది? నాదగ్గర అంతకంటే లేదు."

వాళ్ళిద్దరూ కొంచంసేపు ఆలోచించాక, ఒక నిర్ణయం లోకి వచ్చి "సరే. యిలా యివ్వండి. నేనేదో ఏర్పాటుచేస్తాను" అన్నాడు కిళ్లీకొట్టు అతను. నేను మారుమాట్లాడకుండా రెండు రూపాయిలుతీసి అతని కిచ్చేశాను.

"సరే యిక వెళ్లండి. ఇంకెప్పుడూ లైటులేకుండా వెళ్లకండి" అని పోలీసు బహువచనంలో నాకింక ఇచ్చాక పాలిపోయిన మొహంతో యివతలికి వచ్చిపడ్డాను. "చావుతప్పి...." అంటే యిదే. "వాళ్ళభాష అర్థంకానంతటి మూర్ఖుడ్నా' అని ప్రశ్న వేసుకుంటే సిగ్గులేక నవ్వు రాబోయింది.

నేను సైకిలును నడిపించుకుంటూ వెళ్ళేసరికి రామారావు ఇంట్లో నేవున్నాడు. అతనిదగ్గర నాఅవస్థనంతా వెళ్ళబోసుకున్నాను. వాళ్ళయింటికి కొంచెందూరంలో సైకిలుషాపు వుంది. రమ్మని చెప్పి అక్కడకు తీసుకుపోయాడు. అరగంట అటూయిటూ వర్తాక బేరం కుదిరింది.

“నాన్నా! నన్ను క్షమించు” అనుకున్నాను మనసులో. అతికష్టంమీద డెబ్భయిరూపాయలకు ఆరాత్రి ఎనిమిదిగంటల ఐదు నిముషాలకు అమ్మేశాను. మొదట డబ్బుకు మరునాడు రావాలని అన్నాడు. ఈరోజే కావాలని పంతంపట్టాను. చివరకు ఒప్పుకున్నాడు. నాజేబులోకి రూపాయలు వచ్చాయి. రామారావుకి ధన్యవాదాలు చెప్పి యింటిదారి పట్టాను.

ఎనిమిది దాటిపోయింది. ఇహ! ఈరోజు దుకాణాలు మూసి వేసి వుంటారు. రేపు ఆదివారం. అయినా నాకు తెలిసిన షాపులు రెండుమూడు వున్నాయి. ఆమాత్రం సాధించలేకపోను.

బజారులో వెలుగూ, చీకటీ కలగలుపుగా వున్నాయి. మరి కొంచెంసేపటిలో యీవెలుగును చీకటి జయిస్తుంది. కొన్ని పనులకు చీకటి మంచి సహాయకారి అయినా నాస్థితిలో వున్నవాడికి యెంత చికాకు కలిగిస్తుందో ఏంచెప్పను?

పంతులుగారి భాగం తలుపులు వేసివున్నాయి. లోపలమాత్రం మిణుకుమిణుకుమంటూ దీపకాంతి కనిపిస్తోంది. ఎలక్ట్రిసిటీవున్నా భరించలేక హరికేన్‌లాంతరులో సరిపెట్టుకుంటున్నారు వాళ్ళు.

నాభాగం నిమ్మళం. ఎక్కటానికి రెండుమెట్లు యెక్కాలి. ఒకటి పెద్దమెట్టూ. రెండవది చిన్నదీ. పెద్దమెట్టుమీద ఓ స్త్రీ కూర్చునివున్నట్లు కనబడింది. కొద్దిగాజంకాను. “ఎవరూ” అన్నాను స్వరం చిన్నదిచేసి.

ఆస్త్రీ దప్పున లేచినిల్చుని “నేనురా మధూ” అంది.

ఓక్షణంపాటు నేను నివ్వెరపోయాను. “తేరుకుని, వేగంగా తలుపులుతీసి, లైటువేసి “లోపలకురా అక్కయ్యా” అన్నాను.

అక్కయ్య లోపలకు వచ్చింది. ఎంత దీనవదనం! మా అక్కయ్య వయస్సు ఇరవైఅయిదేళ్ళే అని ఎట్లా చెప్పగలను? మా అక్కయ్య గొప్ప అందగత్తె అని ఎట్లా గర్వించను? సంవత్సరాల తరబడి అవలోకిస్తున్నట్టే యీనాడూ కన్నీటిచారలు అవలోకించ గలిగాను.

“కూర్చోవే” అన్నాను.

రూపంలో నేకాదు. అక్కయ్య కంఠస్వరంలోనూ మార్పు వొచ్చింది. ఇలా అంది. “నేను కూర్చునేందుకు రాలేదురా మధూ.”

“ఏమయింది?” అన్నాను ఆదుర్దాగా.

“బావకు మరీ ఎక్కువగా వుంది.”

అబ్బ! ఎంత వేదన ఆ నేత్రాల్లో! అమ్మలాంటి అక్కయ్య దుఃఖాన్ని చూడటం నా కింతవరకూ చేతకాదు. అందుకే ఆమె రాకగానీ, ఆమె యింటికి పోకగానీ నా కిష్టంలేదని గట్టిగా అంటే యీ ప్రపంచం నన్ను కఠినుడ్నని నిందిస్తూ, [illegible] కుంది.

ఒక్కసమయంలో ఆమె నాకంటే ఒక ఏడు పెద్దదన్న విషయం మరిచిపోతాను. సానుభూతికీ, వాత్సల్యానికీ అదే అంతిమ స్థాయి.

“ఏంచెయ్యాలమ్మా?” అన్నాను.

నావంక సజలనయనాల్లో జాలిగా వీక్షించింది. “ఈ పూట గుండెల్ని కోయదు. మన్నిదంగా వ్యాపిస్తుంది. అంది” “డాక్టరు వచ్చి గితే చాలా అపాయం అన్నాడు. అర్జంటుగా నూరురూపాయలు పెట్టి యింజక్షన్లు కొని యిస్తేనేగాని బ్రతకటం కష్టమని చెప్పాడు.”

ఓ నిట్టూర్పు వొచ్చింది నానుంచి. ఎంత అమాయకురాలు ఆమె! ఎంత తీపి, ఎంత భ్రాంతి యింకా ఆ పనికిరాని భర్త అంటే. ఏళ్ళతరబడి యిలా అంతులేనిచాకిరీ చేస్తూ, ఆ భర్తను కేవలం మంచంమీద కదిలి మెదిలేవరకైనా బ్రతికించుకోవటానికి తాపత్రయ పడుతోంది. బావకు యిటువంటి ప్రమాదం యిదివరకు అయిదు సార్లకుపైగా వచ్చింది. అన్నిసార్లు నా సహాయమే కోరింది. నేనే సాయంచేశాను.

ఒక ఆలోచన స్ఫురణకు వచ్చేసరికి వళ్ళు ఝుల్లుమంది. ఓ అర గంటక్రితంవరకూ డబ్బుకోసం నేను ఎంత మథనపడ్డాను?

ఒకానొకరోజు నాన్నగారు ఆప్యాయంగా కొనిచ్చిన సైకిలు, నాకు రోజూ అవసరం అయ్యే వస్తువు యీవేళ ఒకానొక పనికోసం అమ్మేశాను. దిగులుగానే వుంది అందుకు. “నాయనా! సైకిలు ఏదీ?” అని అడిగేవాళ్ళు లేనంతమాత్రంచేత విచ్చలవిడిగా ప్రవర్తిస్తే నాలో హృదయం ఏదీ? జ్ఞాపకచిహ్నాలను అవసరాల కోసం అమ్ముకుంటే నాలో ప్రేమకు జాగా ఏదీ? కాని ఓ నిశ్చయం-కాదు ఓ నమ్మకం నాలో రగిలిన బాధనూ, దుఃఖాన్నీ శాంతింపచేసింది. ఉంది. నాలో ప్రేమకు స్థానం వుంది. అందుకే యివాళ యీ పనిచేశాను.

అక్కయ్యకు యిదివరకు చాలాసార్లు సహాయం చేశాను. కాని ఆ పరిస్థితులు వేరూ, యీ పరిస్థితులు వేరూ. అటువంటి కొన్ని సమయాలలో నేను అనేకబాధలకులోనై ఆమెకు సహాయం చేసినా ఆ బాధలు నాతోనే నిలిచిపోయాయి. కాని యీసారి అలా జరగదు. ఈ బాధకూ, ఆ బాధకూ ఎంతో వ్యత్యాసం వుంది. అద్దెకున్న పంతులుగార్ని అద్దెకోసం అడిగినప్పుడు నాలో గిర్రున తిరిగిన వేదనా, నడిబజారులో పోలీసువాడు నన్నల్లరిపాలు చేసి, కీలుబొమ్మనుచేసి ఆడించిన వైనమూ, ఏళ్ళతరబడి కాపాడుకుంటూవచ్చిన ఆప్తమిత్రుడికన్నా ఎక్కువైన నా సైకిలుకు దూరమౌతున్న తరుణంలో చలించిన నాలో ప్రజ్వలించిన అగ్నిలాంటి ఆవేదనా యీ క్షణంలో వాయువేగంతో మనోనేత్రంముందు మెదిలి, అంతర్ధానమైనాయి. అనిపించింది నాకు :— ఇదంతా దేనికోసం? ఎవరికోసం? నేను ఉన్మత్తుడ్ని కావటంలేదు కదా. అయితే అవనీ. యీ సమయంలో పరిస్థితులకు దాసోహం అంటాను. కాని మూర్తీభవించిన శోకంలా వున్న అక్కయ్య ప్రముఖమైనస్థానం హృదయక్షేత్రంలో ఏర్పరుచుకుంది. ఈ స్థానాన్ని కదిలించలేక నాలో వుందా...ఉంటాది.

చివరకు ఈ మాటలు పెగిలాయి, నోటినుంచి "అక్కయ్యా, యిప్పుడు ఉద్యోగం దొరుకుతుందా?"

"నాకు నువ్వుతప్ప యింకెవరున్నారు మధూ!"

మౌనంగా తల వంచుకొని ఊరుకున్నాను.

"లాభం లేదంటావా మధూ?"

నాకోసం ఎంతడబ్బు వెచ్చించినా వ్యర్థమేనని తెలుసు. శూన్యమైన యీ ప్రయోజనంకోసం చూస్తూ, చూస్తూ, ఇటువంటి విపత్కాలంలో ఎలా త్యాగం చేసేది.

అయినా "లేదు" "కాదు" అనటానికి మనసొప్పక "కొద్దిరోజుల్లో యింటర్వ్యూకి వెళ్ళి ప్రయత్నిస్తాను" అని చెప్పాను.

అపస్వరాలతో ఆమె యిలా అంది: "నువ్వు తమ్ముడివే అయినా అంతకంటే ఎక్కువగా నిన్ను గౌరవిస్తాను. ఇదివరకు ఎన్నోసార్లు నన్ను ఆదుకున్నావు. జబ్బుతో అయినాసరే, బావ లేనిదే నా బ్రతుకు ఎంత దుస్సహంగా వుంటుందో నీకు తెలియక పోలేదు. నీవల్లతప్ప నాకు మరెవరివల్లా సహాయం లభించదు."

కొంచెం ఆగి ఓ నిట్టూర్పు విడిచి "నీస్థితి నాకూ తెలుసు. నిన్నెక్కువ బలవంతపెట్టేశక్తి నాకు లేదు. బావ వొంటరిగా వున్నాడు. తలుపులు తీసేవచ్చాను. అట్లో, ఇట్లో నీ చేతుల్లోనే వుంది. నిన్నింకా అంతకంటే ఎక్కువేం బ్రతిమిలాడను! వస్తా నమ్మా, సిగ్గులేని యీ అక్కయ్య అవస్థను మరిచిపోబోకు" అంటూ కళ్లు తుడుచుకుని, గబగబ బయటికి నడిచి, చీకట్లో కలిసిపోయింది.

నేను నిర్ఘాంతపోయి నిల్చున్నాను. ఆమెగారి చివరి మాటలు గుండెల్ని నిలువునా చీల్చాయి. ఎవరైనా ఘోరంగా ప్రవర్తిస్తే ప్రజలు వెలెత్తిచూపే వ్యక్తిలాంటి కఠినుడ్నా? నాలో యింత క్రూరత్వం ఎలావుంది? ఇటువంటి సందర్భాలలో మనసులో చెలరేగే బ్రహ్మాండమైన సంక్షోభాన్ని, పెనుతుఫానులనీ, ద్వంద్వయుద్ధాలనీ అంటారు. కొంతమందిలా వీటిని అరికట్టేశక్తి నాకు లేనిమాట నిజమే.

ఆవేశంతో ముందుకు నడిచాను. ఇరుకైన యీ హృదయ స్థితిలో సరిక్రొత్త ఆలోచనలకు యిహ తావులేదు. అది అపూర్వమైన క్షణం. స్వాగతం పలుకబోయే అత్యద్భుతమైన మాలతి చిరునవ్వు, దానికోసం తాపత్రయపడే నా చిత్తభ్రాంతి యివన్నీ మటుమాయ మయ్యాయి. నాకు కావలసింది ఒకటే. నేను చేయబోయేది అదే. అక్కయ్య కోరికతీర్చటం. ఫలితం ఎలావున్నా సాయంచేశానన్న సంతృప్తి మిగిలితే చాలునన్న స్థితికి వచ్చాను. కదలబోయాను.

అదేనిముషంలో చెప్పులులేని కాళ్ళతో చలపతిరావు లోపలికి వచ్చాడు. అతనిముఖం వెలా తెలా పోతోంది. భీతితో, అసమర్థతతో, ఆర్తితో వెంటాడితే మానవుడు అలా వుంటాడు.

చప్పున ఆగి "కూర్చో" అన్నాను.

చలపతిరావు కూర్చోలేదు. వగరుస్తున్నాడు. ఆ స్థితిలో అతన్నిచూస్తే జాలివేస్తోంది నాకు. అంత దిగులు దేనికి అతని కళ్ళలో?

"అలా వున్నావేం?"

అతనో చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. చేతిరుమాలు తీసి ముఖం మెత్తగా తుడుచుకున్నాడు. సామాన్యంగా చూసి మనిషి బెదిరినా అలావుండడు. భగవంతుడి అధరణం దొంగిలించినా మనిషి అలావుండడు.

ప్రేమగా అతని భుజంమీద చేయివేసి లాలనగా "ఎందుకంత యిది? నా ముందు భయందేనికి? ఏం జరిగిందో చెప్పు" అన్నాను.

చలపతిరావు నా ముఖంవంక చూడటానికి ప్రయత్నించి మళ్ళీ తత్తరపాటుతో తలదించుకున్నాడు.

నేను యింకా ఏదో చెప్పబోతున్నాను.

అతను ఆటబొమ్మలా పెదవులు కదిపాడు. కష్టంమీద అర్థం చేసుకుంటే ఆ మాటలతీరు యిలావుంది.

"నాకో సహాయం కావాలి."

సహాయం కావలసివస్తేనే చలపతిరావు నా దగ్గరకువచ్చే స్నేహం కాదు మా యిద్దరిదీ. అందుచేతనే ఆ మాటలువిని జంకాను. ఆపదలో వున్నవాడికి సహాయం చేయగలిగే సామర్థ్యం నాలో ఎంతనివుంది?

ఎమిటో చెప్పమన్నాను.

ముందుగా యిలా ఉపోద్ఘాతం చెప్పాడు. "నేనసలు నీదగ్గరకు వచ్చేవాడిని కాదు. ఎంతమందిచుట్టూనో తిరిగాను. ప్రయోజనం లేకపోయింది. ఇహ నిన్ను కష్టపెట్టటం తప్పనిసరి అయింది. నామాటకు నీవిచ్చేవిలువ తెలుసు కనుకనే ధైర్యంచేయగలిగాను."

అర్థమవుతోందినాకు. ఆమాటల్లోని అంతరార్థం గ్రహించగలిగే సామాన్య తెలివితేటల్ని భగవంతుడు నాకు ప్రసాదించాడు.

"ఓ వందరూపాయలు కావాలి."

నేను శిలావిగ్రహంలా నిల్చున్నాను.

"అర్జంటుగా ఓ వందరూపాయలు కావాలి."

కదల్లేదు; మెదల్లేదు నాశరీరం.

"పోనీ డెబ్బయి ఎనభై మధ్యనున్నా......"

ఇవాళ చాలా విచిత్రమైనరోజు అంతేకాదు. చిత్రరోజు. దుర్భరమైన యీ అవస్థను భరించడం అసాధ్యమే.

"మాలతీ!"

"అక్కయా!"

"చలపతిరావూ!"

సాధారణంగా జరిగేదే అది. మొదట జరిగిన సంఘటనకన్నా తర్వాతదానికి బలం ఎక్కువగావుంటుంది. మొదటినుంచీ విషాదపూరితమైన సంఘటనలు గడిచినా, చివరకు ఓ సంతోషప్రదమైన సంఘటనతో ముగిస్తే దాన్ని కామెడీ అనే అంటారు. లేదా అది మంచి నవ్వులతోగడిచినా అంతంలో ఓ సన్నివేశంవచ్చి ఛిన్నాభిన్నం చేసిందంటే అది ట్రాజెడీ. ఈ సిద్ధాంతానికి నేను లోబడిపోయాను.

మాలతికీ నాకూ వున్న అనుబంధానికీ, అక్కయ్యకూ, నాకూ వున్న బాంధవ్యానికీ, చలపతిరావుకూ నాకూ వున్న స్నేహానికీ యిది కొలతబద్ద అని అనలేను. నిగ్రహశక్తి సడలిపోతూన్న యీ అంత్య దశలో, ఏ విలువకు ప్రాధాన్యత యివ్వాలో తెలియక విచక్షణా జ్ఞానంకూడా నశించిపోతున్న యీ హీనదశలో, నాకున్న ఓపిక, ముక్కవ యిది విపరీతమైన ఆలోచన్ల తాకిడికి తట్టుకోలేక మారించి పోతూన్న సమయంలో చలపతిరావు వచ్చి సాధించబోతున్నాడు. ఇది నా తప్పుకాదు.

అప్పటికీ హీనస్వరంతో "అంత అవసరమా!" అని అన్నాను.

దీనంగా నాచేతులు పట్టుకున్నాడు. ఎంతో ప్రాధేయ పడ్డాడు. "ఎంత అవసరమో వివరించి చెప్పగలిగే శక్తి నాకు లేదు" అన్నాడు చివరకు.

ఇంక నాలో అలస్యానికి తావు ఏదీ? చెప్పరాని వేగంతో జేబులోంచి రూపాయల నోట్లు బయటకుతీశాను. కన్నీళ్లు కారటం లేదు గాని కంఠం వొణుకుతోంది. గాద్గదికంగా "ఇదిగో, నాదగ్గర యివే వున్నాయి. తీసుకువెళ్లి అవసరాన్ని గడుపుకో" అని వాటిని యిచ్చేశాను.

చలపతిరావు కళ్లలో ఓక్షణంపాటు గగుర్పాటు. తరువాత మెరిశాయి. ఆనందోద్రేకంతో యించుమించు కావలించుకున్నంత పని చేశాడు, "ఎంత ఉదారహృదయం నీది?" అని అభినందించాడు. అంతకంటే ఎక్కువ నాకు వినబడలేదు. అతను యెప్పుడు వెళ్ళిపోయాడో కూడా నా కంతగా గుర్తులేదు.

ఓ పావుగంట నిశ్శబ్దంగా. ఆలోచనారహితంగా గడిచింది. అప్పుడు బుద్ధిపుట్టి బయటకు వచ్చాను. వీధి నిర్మానుష్యంగా వుంది. గగనంలో చుక్కల్లా చీకటిలో దీపాలతో రాత్రి అందంగా వుంది. పంతులుగారి భాగంలో చడీచప్పుడూ లేదు. ఒంటరితనం భయాన్నే కాకుండా బాధనూ కల్గిస్తోంది. కాని వాటిని తీర్చగలిగే హృదయాలు యీ సమయంలో లభించటం కల్ల.

"ఇదేమిటి? ఏడుస్తున్నావు?"

అనాలోచితంగా చెయ్యి తగిలేసరికి తడిస్పర్శతో నాకు స్ఫురించింది. అమ్మాయిలాగా యీ అబ్బాయి ఏడుస్తున్నాడు. జీవితంమీద విరక్తి, మనుషులమీద అసహ్యమూ కలిగింది. అమ్మ లేదు. నాన్న లేదు. నేనే ఓదార్చవల్సిన అక్కయ్య వుంది. కోరికలు పెంచుకోరాదు. సమర్థత లేదు. ఎవరన్నా తన్ను తలుచుకుని "అయ్యో పాపం" అని నిట్టూరిస్తే బాగుండును.

కొంచంసేపు కన్నీటిని అలానే కారనిచ్చాను.

రేపు కొంతమందికి ఎలా ముఖం చూపించాలో తెలియడం లేదు. ఎగ్జిబిషన్లో చూసిన విచిత్రంలా యిద్దరుముగ్గురు వ్యక్తులు కళ్ళముందుకు వచ్చి, పోయి వస్తున్నారు. భూమి గుండ్రంగానే తిరుగుతోంది. సూర్యుడు తెల్లవారుఝామునే ఉదయించి, సాయంత్రానికి వెళ్ళిపోతున్నాడు. చంద్రుడు పాపం! అప్పుడప్పుడూ సూర్యుడు వెళ్ళిపోకముందే వస్తున్నాడు. నాముందు వ్యక్తులు వచ్చి, నవ్వి, ఏడిచి వెళ్లిపోతున్నారు. కోరికలు పెరిగి, విరిగి, తరిగిపోతున్నాయి. నా కంఠం ఆగిపోయింది.

మనసులో వృత్తంలా ఉంగరం తిరిగింది.

చిన్నారి ఉంగరం. ముద్దుగా, ముచ్చటగావున్న ఉంగరం. ప్రేయసి చిటికెనవ్రేలుకు తొడిగితే ప్రియుడిలాంటి పిచ్చివాడికి, అమాయకమైన ఆనందాన్నిచ్చే ఉంగరం.

కొనకుండానే బంగారు ఉంగరం విరిగి ముక్కలై పోయింది. రాయి మసి అయిపోయింది.

ఉక్కు కాగితంగా మారి, కాగితాలు బంగారంగా మారక ముందే పెనుగాలికి కాగితాలు ఎగిరిపోయాయి.

చలిగాలిబాధ అప్పటికి తెలిసి, లోపలకువచ్చి, రగ్గు కప్పుకుని పడుకునేసరికి ఉక్కపోయటం ప్రారంభించింది. రగ్గుతీసి చూశాను. ఎముకలుకొరికే చలి. ఎట్లా భరించను యీ అవస్థ?

"మాలతీ! మాలతీ! మాలతీ!

"అక్కయ్యా! అక్కయ్యా! అక్కయ్యా!"

"చలపతిరావూ! చలపతిరావూ! చలపతిరావూ!"

తెల్లవారింది తీరని కోరికలతో. అద్దంలో ముఖం చూసుకుంటే కళ్లు ఎర్రగా వున్నాయి. మత్తుగావున్న ముఖం అందంగా వుంది నాకు. తలుపులుతీసి నిల్చున్నాను. పంతులుగారు—పాపం చప్పున నన్ను చూసేసరికి, సిగ్గుతో ముఖం త్రిప్పుకోబోయి, లాభం లేక "ఏమండీ, కళ్ళు ఎర్రగా వున్నాయేం?" అని అడిగారు.

"రాత్రి నిద్ర పట్టలేదండీ" అని నిజం చెప్పేశాను.

ఆయన ఆశ్చర్యంతో "ఆదేం? వంట్లో బాగులేదా?" అని అడిగారు వెంటనే.

"బాగానే వున్నట్లుంది. ఎందుచేత నిద్రపట్టలేదో?"

కొంచంసేపు వుండి ఆయన లోపలకు వెళ్ళిపోయారు. తర్వాత నేనూ, ముఖం కడుక్కుని కాఫీకి వెళ్ళిపోయాను.

అసలు యివాళ పార్టీకి వెళ్ళకూడదనుకున్నాను. ఎవరికీ కనిపించకుండా తిరుగుదామనుకున్నాను. కాని ఎక్కువసేపు గడిచి పోకముందే ఆ పని చేయలేనని తెలిసింది. సుందరవదనారవిందం ఒకటి హృదయద్వారంనుంచి తొంగిచూస్తూ కవ్విస్తోంది. ఆ క్షణంలో ఆలోచన్లు మధురంగా వున్నాయి. కాని ఆ తీపి ఎక్కువసేపు అనుభవించటానికి నేను నోచుకోలేదు.

ఆ మధ్యాహ్నం, అరగంటనుంచీ కథలపుస్తకం ఒకటి పట్టుకుని ఒక్కవాక్యం అయినా బోధపడనిస్థితిలో, నా గదిలో, కుర్చీలో కూర్చున్నప్పుడు నా చేతిగడియారంలో తొమ్మిదిన్నరయింది.

"పాపా!" అని పిలిచాను.

రెండోసారి పిలిచాక పాప వచ్చి ప్రశ్నార్థకంగా చూస్తూ నిల్చుంది.

"టైమెంతయిందో చెబుతావా?"

మాట్లాడకుండా వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగివచ్చి "రెండున్నర" అని చెప్పింది.

"పక వెళ్ళొస్తా"

అప్పటిదాకా వెళ్ళకూడదనే నిశ్చయంతో భీష్మించుకు కూర్చున్నాను. ఇంకో అరగంటలో అక్కడికి పోవాలి అన్న యోచన మెరుపులా తట్టింది.

వెళ్ళనా? వద్దా?

హఠాత్తుగా అమాయకమైన ఓ స్త్రీ విశాలనయనాలు వక్కని జలబిందువులతో నాలో తగిలిపోయాయి.

ఒక్క ఉదుటున లేచినిల్చుని అద్దంలోకి చూశాను. మత్తుగా వున్న ముఖం అందవిహీనంగా కనబడింది. గడ్డం గరుగ్గావుంది. చప్పున లోపలకుపోయి చాలా కొద్దివ్యవధిలో తయారైపోయాను.

ఆలస్యంగా వెళ్ళింది నేనే. అప్పటికే అతిథులందరూ వచ్చేశారు. ఎక్కువభాగం ఆడవాళ్ళు. అసలు యీ మొగవాళ్ళందర్నీ ఆహ్వానించకుండావుంటే ఒక పెద్ద తెలివ తప్పేదికదా అనుకున్నాను.

పద్దెనిమిది నిండి పంథొమ్మిది వస్తోందిట మాలతికి. వచ్చిన స్త్రీలలో యిద్దరు ముగ్గురు మినహా ఎక్కువమంది తెలిసినవాళ్ళు లేరు. వాళ్ళయినా యిదివరకు నాతో చదువుకున్నవాళ్ళు. విస్తుపోయారు నన్ను చూసి. నా ముఖంలో మాలిన్యం ఎవరైనా పసిగడ్తారేమోనని భయంగా వుంది. ఉన్న కొద్దిమంది మొగఅతిథులలో ఎక్కువభాగం పరిచయంవున్నవాళ్ళే. కాని......నన్ను చూసి తెలబోయి, తలవంచుకుంటూన్న చలపతిరావును చూసి చకితురాల్నయాను. నా ముఖంలోలాగానే అతనిలోకూడా మాలిన్యం చాలావుంది. నిన్నరాత్రి అంత విపత్తులో వుండి యీ రోజు పార్టీకి ఎలా వచ్చాడా అని ఆశ్చర్యం వేసింది. కాని అతనిలానే నిన్న నేను లేనా? ఇవాళ రాలేదా?

ఈ సోదరింపుతో అతనిదగ్గరకుపోయి పలకరించాను. పైగా అతనిప్రక్కనే కూర్చున్నాను.

ఇంతలో మాలతి లోపలినుంచి వచ్చింది. ఒకసారి గబగబ అందరివంకా పరకాయించి చూసిన ఆమె వదనం నన్ను చూడగానే ప్రఫుల్లమైనట్లు గమనించాను.

నవ్వాను.

మాలతి నా దగ్గరకువచ్చింది. చలపతిరావు ఎందుకో కంగారు పడుతున్నాడు. ఆమె మందహాసంచేసి "ఇంత ఆలస్యమైతే ఎలా? రావేమోనని భయపడుతున్నాను. అంది.

"రాలేనని నేనూ భయపడ్డాను?"

మాలతి విచారంగా నవ్వింది. "నువ్వెప్పుడూ యింతే. అందుకనే ప్రొద్దున్న మీయింటికి వచ్చాను. లేవు నువ్వు" అంది.

"ఎందుకంత శ్రమ నీకు? నేను రాకపోతే పార్టీ ఆగిపోదు కదా."

ఆమె ఏదో చెప్పబోయి "పో! నువ్వెప్పుడూ యింతే" అని మౌనంగా అక్కడినుంచి స్త్రీలదగ్గరకు వెళ్ళిపోయింది.

చలపతిరావు నాతో మెల్లగా "నేనుకూడా నువ్వు రావనే అనుకున్నాను" అన్నాడు.

అతనివంక విచిత్రంగా చూసి "కారణం?" అన్నాను.

"క్రితంసారికూడా నువ్వు రాలేదు."

"కాని ఆసారికీ యీసారికీ చాలా భేదం వుంది."

ఆడవాళ్ళంతా ఏదో చెప్పుకుని నవ్వుకుంటున్నారు. వాళ్ళ మధ్య కూర్చుని మాలతి నావంక చూస్తోంది. చలపతిరావు ఆమెవంక తినివేసేటట్టుండా చూస్తున్నాడు. మాలతి తండ్రి మరో వృద్ధుడితో కులాసాగా ఏవో కబుర్లుచెబుతున్నాడు. వాళ్ళప్రక్కన ఓ కుర్చీ ఖాళీగావుంది. ఆయనతో కొంచంసేపు మాట్లాడాలని సరదాపుట్టి లేచివెళ్ళి కూర్చున్నాను.

నా భుజంమీద చేయివేసి నిమిరి "కులాసానా?" అన్నారు.

తల ఊపాను.

కొంచంసేపు ఏదో లోకాభిరామాయణం మాట్లాడుకున్నాం.

తర్వాత పార్టీ ప్రారంభమైంది.

మాలతి తండ్రి హఠాత్తుగా యిలా అన్నారు "ఈ ఏడు మా అమ్మాయిపెళ్ళి చేద్దామనుకుంటున్నాను.

నాకు ఆదుర్దా హెచ్చింది. "వరుడు కుదిరాడా?" అని అడిగాను.

"నా దృష్టిలో ఒకరు వున్నారు. ధనవంతుడు. మొన్ననే ఎమ్. బి. బి. ఎస్. పాసై ప్రాక్టీసు పెట్టాడు!

"మంచిదే" అన్నాను.

"అమ్మాయి నింకా అడగలేదు. కాని దానిహృదయం నాకు తెలుసు. దానికి చాలామంది స్నేహితులున్నమాట నిజమే. నా మనస్తత్వం దానికి తెలుసనే నా విశ్వాసం. చాలామందిలా అది పొరబడకూడదు. మరీ కొంతమంది వ్యక్తులతో అమితంగా స్నేహం చేసినా, అది స్నేహంకంటే మరో అడుగు ముందుకు వేయలేదనే నా నమ్మకం."

కాని యిదేమిటి? ఆ మాట అంటూ ఎందుకు నాకేసి ఓ వింత చూపు ప్రసరించారు?

మాలతి యింకా నావంక చూస్తూనేవుంది. బాధకన్నా ఎక్కువగా జాలివేస్తోంది నాకు. అవి బహుమతులు కాబోలు. ఓ ప్రక్క ఖరీదైన పుస్తకాలు వస్తువులూ చాలా పడివున్నాయి. బహుశా నేనే చేతులు ఝాడించుకుంటూ వచ్చింది. కొయవంతుడినైతే అంత కన్నా అవమానం వుండబోదు. మనసులో ఉంగరం తిరుగుతోంది.

మొగఅతిథులలో మాటకారివాళ్లు ఎవరూ వున్నట్లు లేదు. వాళ్ళలో వాళ్లు ఏదో గొణుక్కుంటున్నారంతే. వాతావరణం ఎక్కువ సరదాగా లేదు. నేను యింతకంటే ఎక్కువ సంతోషంగా యిక్కడ వుంటుందని ఆశించాను.

హాసాలతో, మాటలతో, నవ్వులతో, ఆవేదనలతో ఓ అరగంట గడిచిపోయింది. నాకు కొంతసేపు చలపతిరావుతో మాట్లాడాలని వుంది. నిన్న అతన్ని చుట్టుముట్టిన ఆపద తీరిందో లేదో, లేచి మాలతిదగ్గరకు వెళ్ళాను. అప్పటికి టీ తీసుకోవటం కూడా పూర్తి అయిపోయింది. కిల్లీలు నమిలాక స్త్రీల పెదవులు మరీ అందంగా వున్నాయి.

"లిప్‌స్టిక్ కన్నా యిదే బాగుంది" అన్నా ఒకమ్మాయితో.

ప్రక్కనే కూర్చున్న ఓయువతి ముఖంకూడా వెంటనే ఎర్రబారింది మాలతి పెదవుల్లా. మాలతి పాపం ఏదో అవస్థపడుతోంది. నాలిక కొరుక్కుంటూ, ఊరుకోమని సౌంజ్ఞచేస్తోంది. నా మాటలు విన్న ఒకరిద్దరు అమ్మాయిలూ చేతిరుమాళ్లు నోళ్లకడ్డంపెట్టుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. నాకేం తెలుసును అప్పటిదాకా, ఎర్రబడిన యువతి అధరాలకూ లిప్‌స్టిక్ రంగుకూ ఎన్నాళ్ళనుంచో స్నేహం వుందని.

నేను అట్టే సిగ్గుపడక, చింతించక మాలతితో "ఓసారి యిలా వస్తావా?"

ఆమె వొచ్చింది. "ఇవాళ నిన్ను ఏమని ఆశీర్వదించమంటావ్?" అని ప్రశ్నించాను.

ఆమె సిగ్గుపడింది "నువ్వే చెప్పు."

నేను కొంచెం ఆలోచించి "వచ్చే ఏడు నీ జన్మదినానికి ఆయనగారి తరఫు బంధువులూ, స్నేహితులూ కూడా రావాలి" అన్నాను.

మాలతి శిరస్సు పైకెత్తి అర్ధనిమీలితనేత్రాలతో, బాధగా, విషాదంగా చూసింది. "సారీ. నీకు నేను థ్యాంక్సు చెప్పలేను" అన్నది.

"నా ఆశీర్వాదానికి నీవు కృతజ్ఞత అర్పించలేనన్నమాట అయితే." ఆమె తల ఊపలేదు. మాట్లాడలేదు.

"మరి నా బహుమతీ అందుకోవా?"

"నాకేం వొద్దులే" అంది.

"అంత కోపమా?"

"నీమీద నాకు యిదివరకు ఎన్నిసార్లు కోపం వచ్చిందేం?"

కొన్ని సెకన్లు మౌనంగా గడిచాయి.

"మాలతీ నేనూ ఓ వస్తువు ప్రెజంటు చేద్దామనుకున్నాను మొదట."

నేత్రాలు చూశాయి.

"కాని మనస్నేహానికి విలువ కట్టలేకపోయాను."

ఆ నిముషంలో విశాలమైన ఆమె నయనాల్లో అవతరించిన మెరుపును నాబుద్ధి పసికట్టింది.

మాలతి విచిత్రమైనగొంతుకతో "నీకట్లా థ్యాంక్సు చెప్పను" అంది.

"ఆమాట చాలు నాకు."

అకస్మికంగా నాచూపు ఆమె చిటికెనవేలుకు తొడిగిన చిన్నారి అంగుళీయంపైన బడింది. కిటికీనుంచి దూసుకువచ్చిన మధ్యాహ్నపు యెండకు నీలపురాయి ధగధగ మెరిసింది.

నా మనసులో సుదర్శనంలా ఉంగరం గిరగిర తిరిగింది.

నాలో మొన్నా, నిన్నా అలుముకున్న, అల్లుకున్న ఊహాచిత్రానికి సరియైన రూపం యిదే. నాదగ్గరనుంచి డబ్బుపోకుండా వుంటే యిటువంటిదాన్నే మాలతికి ప్రెజంటు చేసేవాడ్ని.

"మాలతీ! ఇది నీకు ఎవరు యిచ్చారు?"

"చలపతిరావు."

ఒక్కసారిగా హృదయం విచ్ఛిన్నమైంది. వెనుదిరిగి అతనివంక చూశాను. మా యిద్దరిమధ్యా అతన్నిగురించే సంభాషణ జరుగుతుందని ఊహించాడు కాబోలు. తైలంలేని దీపంలా వెలవెలా పోతోంది అతనిముఖం.

మధుర మందహాసంతో ఆమె అడిగింది నన్ను: "బాగుందా?"

"చెప్పలేనంత బాగుంది."

కాని నా పరిస్థితి హృదయవిదారకంగా వుంది. సామాన్య మానవుణ్ణి. నా హృదయం విశాలమైందిగానీ, ఉన్నతమైందిగానీ కాదని అప్పుడు తెలిసింది. అవకాశంవుంటే చలపతిరావును నమిలి మింగివేయాలన్నంత కోపం వస్తోంది. నేను శాంతిమూర్తినని ఎవరయినా భావిస్తే అది వాళ్ళ పొరపాటు.

దిగులు ఏడుపుగా మారుతోంది.

నీచుడు చలపతిరావు. ద్రోహి చలపతిరావు. ఏ కార్యం కోసం నేనాడబ్బును అష్టకష్టాలుపడి సాధించానో, అదే అవసరం కోసం మాయమాటలు చెప్పి నన్ను నిలువునా మోసగించాడు. ఈ ద్రోహివల్ల అమాయకమైన ఓవ్యక్తికి సహాయంచేసి, ఓత్యాగాన్ని నాకు నేను నిరూపించుకోకుండా భంగపడ్డాను. మాలతి ఉంగరంకన్నా, బావ జబ్బుకన్నా వెయ్యిరెట్లు అధికంగా చలపతిరావు అపాయాన్ని ఊహించాను. దీనివల్ల నాకెంతనష్టం కలుగుతుందో గ్రహించలేడా అమూర్ఖుడు? తెలిసే ఈ అకార్యానికి పూనుకున్నాడు. ఇద్దరం రెండుదార్లు త్రొక్కాం. గమ్యస్థానం ఒకటే. ఆమాటల్లో బెదురు, ఆకళ్ళలో అదురు యిప్పటికి నాకు గ్రాహ్యమైంది. కాని యింతిసాహసం ఎలావచ్చింది అతనికి? ఆ నిముషంలో నాబుద్ధి చురుకుగా పనిచేసింది. అంతవరకూ అస్పష్టంగావున్న అతన్ని హృదయాన్ని అప్పుడు చదవగలిగాను. స్వార్థం సాహసానికి దారితీసింది. అంతేకాక వొట్టిచేతుల్తో నేనిక్కడికి రాలేనని భ్రమచెందాడు.

"ఇదేమిటి?" అని మాలతికంఠం ఆశ్చర్యంగా వినిపించింది. "అంత వెంటనే నీకళ్ళు ఎర్రబడ్డాయేం?"

మాయిద్దరిమధ్యా వున్న చనువు, అక్కడున్న చాలామందికి తెలిసివుండడంచేత మా ప్రవర్తన విడ్డూరంగా కనిపించలేదనుకుంటాను. ఒక్క చలపతిరావుతప్ప మిగిలినవాళ్ళంతా ఎవరిధోరణిలో వాళ్ళు వున్నారు.

"బహుశా నాకళ్లు ఎర్రబడటాన్ని నువ్వు చూడటం యిదే ప్రథమం అనుకుంటాను."

"మధూ!"

"ఏమంత ఆశ్చర్యం?"

ఆమె జవాబు చెప్పలేదు. సందిగ్ధంగా చూస్తుంది. నేను వాంఛించిందికూడా అదే.

"నాకు యింక సెలవు యిప్పిస్తావా?" అన్నాను.

కష్టంగా తల ఊపింది.

చలపతిరావుకేసి క్రూరంగా ఓ చూపుచూసి బయటకు వచ్చాను. ఇంతకు ముందువరకూ ఒక్క ఆవేదనే. ఇప్పుడు క్రోధం కూడా-అబ్బ! మనుష్యులు ఎంత దుర్మార్గులు! నా యీ అనుభూతులకు కారణం వీళ్ళే.

ఇంట్లో ఒంటరిగా కూర్చున్నాను. మాటిమాటికీ అక్కయ్య గుర్తుకొస్తోంది. నిన్న రాత్రినుంచీ ఆమె జాడే తెలియదు. బావకు ఎలా వుందో? వాళ్లయింటికిపోయి చూసిరావాలనిపించింది. కాని... అక్కడ నా అవస్థ మరీదుర్భరంగా వుంటుంది. అందులోనూ రిక్త హస్తాలతో వెళ్ళటం.

వెళ్ళగానే అక్కయ్య యిలా అడుగుతుంది." డబ్బు దొరికిందా తమ్ముడూ?"

జవాబుగా తలవొంచాలి.

అక్కడినుంచి ఏడుపు, గందరగోళం.

చలపతిరావును దెబ్బతియ్యాలి. అతను ప్రతీకారం అనుభవించాలి. బహుశా యివి చాలా హేయమైన, ఘోరమైన కార్యాలు. అయినా నేను దానికి లోబడ్డాను.

నామీద నాకే అసహ్యంకలిగేటట్లు, నా అంతరంగాన్ని ఎవరైనా చదవగలిగితే వాళ్ళకు నామీద రోతకలిగేట్లు కొంచం సేపు నా ఆలోచన్లు వికృతంగా సాగాయి.

కాని అలా ఎక్కువకాలం సాగిపోకముందే ఎవరో అజ్ఞాన వ్యక్తి వీపుమీద చరిచినట్లయింది. ఉలుక్కిపడ్డాను.

ఎందుకు నాకింత సంచలనం? ఏంజరిగింది? చలపతిరావు నన్ను మోసంచేసినమాట నిజమే. కాని అతను నాకేమి అపకారం చేయగలిగాడు? ఏమి సాధించగలిగాడు?

ఈ చివరియోచన ఊరట కలిగించింది. హఠాత్తుగా కలిగిన యీ ఊహతో నన్ను గర్వం ఆవహించింది. ఎంత ప్రయత్నించినా, ఎంత తంటాలుపడినా నిర్మలహృదయంలో చలపతిరావుకు చోటులేదు. కేవలం ప్రయాస. భ్రాంతి, చివరి కతనికి విచారమే, మనస్తాపమే మిగిలేది.

ఈ గర్వంతో నాకు బాగా ఉత్సాహం వచ్చింది. చలపతిరావును క్షమించగలిగేస్థితిలో వున్నాను.

వీధితలుపు చప్పుడైంది. లేచివెళ్ళి తలుపుతీశాను. అభిముఖంగా చలపతిరావే నిలబడివున్నాడు. నాకు జాలి, కోపం రెండూ వేయలేదు.

"లోపలకు రా" అన్నాను.

మానవుడు! నిర్జీవంగా కూర్చున్నాడు లోపలకువచ్చి.

"అలావున్నావేం? మళ్ళీ ఏదైనా విపత్తులో యిరుక్కున్నావా?" అన్నాను.

క్షమించమని అడగటానికే వచ్చాను. ఆమె నన్ను పార్టీకి యిన్వైట్ చేసినప్పటినుంచీ నాలో ఏదో చెప్పలేని ఆకర్షణ. మంచిది, చిరకాలం జ్ఞాపకంవుండేటట్లుగా ఏదైనా ప్రెజెంట్ చేసి నా ఆధిక్యత నిరూపించుకుందామనుకున్నాను. మూడురోజుల్నుంచీ చెప్పరాని వేదనకు గురిఅయ్యాను. డబ్బు ఎక్కడనన్నా పుట్టుకుంటేబావుండునని ఎంతయినా ప్రయత్నించాను. లభించలేదు. చివరకు నువ్వే కనిపించావు. నీ స్థితి నాకుతెలుసు. ఏదో అవసరం వున్నట్లు నటిస్తే, ఎక్కడనన్నా కష్టపడి సంపాదించి సహాయపడతావని అలా నాటకమాడాను."

"మంచిపని చేశావు. నీఅవసరంకోసం అవతలవాడిని యిబ్బందిపెట్టటం నీ అభీష్టమా ఏమిటి? నేను నీకు డబ్బయి రూపాయలు చేతుల్లో పోసినప్పుడు ఎక్కడిదనన్నా అడగలేదే. కౌగిలించుకుంటే సరిపోయిందనుకున్నావా? నీలాంటి జీవితమే నాది. ఎటువంటిపరిస్థితిలో నీకు సాయంచేయగలనో ఆలోచించావా?"

చలపతిరావు వ్యథాపూరితంగా ప్రశ్నార్థకంగా చూశాడు.

ఉద్వేగం అణుచుకుంటూ "మహోత్తరమైనదని నేను దృఢంగా నమ్మిన ఒకానొక కార్యంకోసం ఏళ్ళ తరబడి వాడిన నా సైకిలును అమ్మాను. ఆ రూపాయలు అలావచ్చినవే. ప్రాణాపాయస్థితిలోవున్న అత్యంత దగ్గరబంధువును కాపాడటానికైనా ఆ డబ్బుని వినియోగించటానికి నేను తెగించలేకపోయాను. నువ్వు నన్ను విపరీతపరిస్థితుల్లోకి లాక్కువెళ్ళావు. స్నేహానికి, మిత్రప్రేమకూ ద్రోహం చేశాను. మూర్ఖుడా! నీకు విశ్వాసంలేదు. అంతేకాదు. ఎలా వినియోగపర్చటానికి ఆ డబ్బు సేకరించేందుకు తాపత్రయపడ్డానో నీకు తెలియదు.

"ఏం...ఎందుకు?"

"అది నువ్వు తెలుసుకోకపోతేనే మంచిది. నువ్వు అప్పుడప్పుడూ ఆకర్షణలకు లోనై విపరీతంగా ప్రవర్తించినా విలన్లాంటి వాడివి కాదని నాకు తెలుసు. ఆ కారణం తెలుసుకోవాలని ఎందుకు ఉత్సాహపడతావ్? పశ్చాత్తాపం, పరితాపం చెందటానికి సరిపోయిన మానవత్వం నీలో వుంది. ఆమాత్రం చాలు. ఆ కారణం గనుక నేను బయటపెడితే నీవు ఈరాత్రి అంతా నిద్రపట్టక కుమిలికుమిలిపోతావు. అందుచేతే అది బయటపెట్టటం నాకిష్టంలేదు."

కొంచం ఆగి విషాదపూరితంగా చలపతిరావు ఇలా అన్నాడు: "నన్ను క్షమించు. నిన్ను నేను అర్థంచేసుకోలేకపోయాను."

"అదే మంచిపని. అర్థంచేసుకుంటే నీ వేదనకు పరిహారం ఉండేదికాదు."

నిశ్శబ్దం గంభీరంగా వుంది. అలా అయిదు నిముషాలు గడిచాయి. నాకు అంతకంటే ఎక్కువ సంభాషణ జరపటం ఇష్టం లేదు. అతనికి మాట్లాడేందుకు సాహసంలేదు. ఆసన్నివేశం దుస్సహంగా తోచిందికాబోలు, ఏమీ మాట్లాడకుండానే మౌనంగా బయటకు వెళ్లిపోయాడు.

లిప్తమాత్రం నాకళ్లు విజయగర్వంతో ప్రకాశించాయి. నా పాత్ర చాలా నేర్పుగా నిర్వహించాను. అజ్ఞానంలో పడికొట్టుకుపోతూన్న ఓ యువకుడ్ని, అతడి అవివేకం అతడికి తెలియపర్చకుండానే బుద్ధిచెప్పాను.

ఈ సంఘటనతో నాలో కలిగిన సంక్షోభం చాలావరకూ తగ్గిపోయింది.

సాయంత్రం ఆరుగంటలకు వీథిలోకి వచ్చాను. కనుచీకటి పడుతోంది. వలి చిన్నగా ఆరంభమైంది. ఓ దృఢనిశ్చయంతో అడుగులు వేలికగా పడుతున్నాయి.

నేను మాలతి యింటికి చేరేసరికి, అంతా నిశ్శబ్దంగా వుంది. ఆమె తండ్రి కొలువలో బయటకు వెళ్ళినట్లున్నాడు. మేడమెట్లు ఎక్కాను. సాయంత్రాలు సరదాకోసం ఆమె బయటకు పోలేదని నాకు తెలుసు. గదిలో లైటు వెలుగుతోంది. తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. లోకాను; తెరుచుకున్నాయి.

"ఎవరూ?"

ఆ ప్రశ్న పూర్తి కాకుండానే నన్ను చూసి "నీవా!" అంది. నవ్వి కుర్చీలో కూర్చున్నాను.

ఇవాళ పుట్టినరోజు కదా. ఫ్రెండ్స్‌తో ఏ సినిమాకో పోక యిలా వొంటరిగా వున్నావేం?" అన్నాను నేనే.

"ఇహ జన్మలో పుట్టినరోజు పండుగలు చేసుకు నేను తల పెట్టను" అంది.

"ఎందుకో!"

"అదేమో. కారణం తెలియదు. ఇంత గంద్రగోళంతో నిండిన సరదాలు నాకు నచ్చటంలేదు. స్థిమితంగా వుంటేనే బాగుంటు నవిపిస్తోంది?

"పుస్తకాలు అతిగా చదువుతూంటే నీకు యిటువంటి బుద్ధులు పుడుతున్నట్లున్నాయి".

"ఏమో, నాకు తెలియదు".

కొద్దిసేపు ఎవరూ మాట్లాడకుండా కూర్చున్నాక "మాలతీ! నువ్వు ఎంత మంచిదానవ్?" అన్నాను.

"మహా నువ్వు మంచివాడివి కానట్లు!"

"నాలో ఏమిమంచి వుంది? నేను ఎవరికీ సంతోషం కలిగించ లేకుండా వున్నాను. పైపెచ్చు నన్ను ప్రేమించినవారికి దుఃఖాన్ని యిస్తున్నాను."

"నువ్వు యీ మాటలు ఎవరిని ఉద్దేశించి అంటున్నావో తెలుసుకోవచ్చా?"

"నేను నీతో మాట్లాడుతున్నాను."

తెలివితక్కువగా అన్న యీ మాటలు ఆమెకు అంత ఆందోళన కలిగిస్తాయనుకోలేదు. ముఖం ముడుచుకుంది.

"మాలతీ కోపమా?"

"నాకు కోపమని అంటే అతివాక్యాలు యింతలో కోపంవస్తుందని ఆక్షేపిస్తావుగా."

నేను వెంటనే నవ్వేస్తూ "నువ్వు మంచిదానివే కాదు తెలివైనదానివికూడా".

"మహా నువ్వుమాత్రం తెలివైనవాడివి కానట్లు?"

"అలా అంటావుగాని నేను మెచ్చుకొంటే నువ్వు ఎప్పుడైనా మెచ్చుకున్నావా?"

మాలతి విచిత్రంగా నవ్వి "సరే యీసారి నువ్వు నోరు జారకుండానే ఏమని మెచ్చుకోమంటావో చెప్పు" అంది.

స్త్రీలలోవున్న చిత్రమైన గుణానికి యిప్పటికి మాలతి రూపమే తార్కాణం. "ఇంతకుముందెప్పుడూ ఇంత సౌందర్యంగా లేదు" అని ఎప్పటికప్పుడు భ్రాంతి కలుగజేయటం వాళ్ళసొత్తు.

ముగ్ధుడ్నై "మాలతీ! నువ్వు తెలివైనదానివే కాదు; అంత మైన దానివికూడా" అన్నాను చప్పున.

"మహా నువ్వుమాత్రం అందమైన..." ఆ వాక్యం అంతటితో ఆగిపోయింది. తరువాత నాలిక కొరుక్కోవటం కనిపించింది. బహుశా కోమలమైన ఆ చేతుల్లో ముఖాన్ని దాచుకోవాలని అని పించి వుంటుంది ఆమెకు. సిగ్గుతో సుందరవదనం రాగరంజిత మైంది.

నేను ఏమీ అనకుండానే "పో" అంది.

ఆ ఒక్కమాటతో నా మనసంతా సంపుల్లమైనట్లుగా తోచింది. కాని నిర్భాగ్యుడ్ని నేను. పిడికి, ఆ ధోరణికి ఎక్కువ పొత్తు కలవదు.

ఉంగరం యింకా మాలతి వ్రేలికే వుంది. "ఏదీ ఉంగరం! చూడాలనివుంది" అన్నాను.

ఆమె నిర్లక్ష్యంగా చేతిని ముందుకుపెట్టి "తీసుకో" అంది. సున్నితమైన ఆమెహస్తంనుండి ఉంగరాన్ని విడదీశాను. నా వ్రేలికి తొడిగాను.

"నాకన్నా నీకే బాగుంది" అంది.

"అవును. నల్లనిశరీరంమీద బంగారం మెరిసిపోతోంది."

"ఛీ, నువ్వు నల్లగా వుంటావని ఎవరు చెప్పారు?"

"మరి దీన్ని తెలుపంటారా ఏమిటి?"

అతికష్టంమీద నవ్వాపుకుంది. "నలుపైతేనేం? అరంగు బాగానేవుంటుంది."

నా కింకా మాటలుచేతకాక "ఇచ్చిన వస్తువులు తీసుకోవటం మీ ఆచారం కాదుగా" అన్నాను.

"అని ఎవ్వరన్నారూ?"

"ఏమని?"

మాలతి కొంచం ఆలోచించి "తీసుకుంటారని" అంది.

"ఎవరూ అనలేదు కాబట్టే ఆమాట అన్నాను."

"అవును. ఆచారం కాదు."

"అయితే తీసుకుంటున్నాను."

ఆమె ఆశ్చర్యంగా చూసి "అది నీకు యిందాకే యిచ్చేశాను" అంది.

"నీకు నేను యింకో ఉంగరంయిస్తే దాన్ని ఏమంటారో తెలుసా?"

"పో."

"పోతున్నాను" అంటూ లేచి నిల్చున్నాను.

కంగారుగా ఆమె "అదేమిటి? అర్థాంతరంగా?"

"పొమ్మన్నావుగా."

ఫక్కున నవ్వేసింది.

"అయితే నేను అకారణంచేత పోవటంలేదు. అర్జంటు పని వుంది. మళ్ళీ రెండు రోజుల్లో కనిపిస్తాను" అని ఆమెను ఓదార్చి, బయటకు నడిచాను.

మళ్ళీ ఒకసారి నాటకాన్ని చాలా నేర్పుగా నిర్వహించాను. ఇప్పుడు చాలావరకూ ప్రశాంతంగా వుంది. సరాసరి బజారుకేసి వెళ్ళాను.

నిన్న చలపతిరావు ఉంగరాన్ని డెబ్భయిరూపాయలకు ఒకటో రెండో తక్కువగా కొన్నాడు. ఇవాళ అప్పుడే అయిదు రూపాయల ధర తగ్గింది. అరగంటలో పని ముగిసింది. జేబులోకి అరవైఅయిదురూపాయలు వచ్చాయి.

అక్కయ్యయిల్లు యిక్కడికి అరమైలుపైగా వుంది. నిన్న రాత్రి ఆమె నాదగ్గరకువచ్చి వెళ్ళాక ఏంజరిగిందో తెలియదు. నేనుతప్ప, రోగిష్టిబావ తప్ప ఎవరూలేని అక్కయ్య ఎనలేని దుఃఖంలో వుండివుంటుంది. వెయ్యికళ్ళతో నేను వస్తానేమో నని ఎదురుచూస్తూ వుంటుంది. నిర్భాగ్యుడూ వీడు. అభాగ్యురాలు అక్కయ్య.

పావుగంట గడిచాక మలుపు తిరిగి ఓ సందిలోకి ప్రవేశించాను. చీకటి సుయ్యారం. వీధిదీపంకూడా లేదు. మనుషుల సందడి అసలేలేదు. రెండుసార్లు బురదలోకి కాలువేశాను. రెండుమూడు ఎదురు దెబ్బలు తగిలాయి. మరికొంత దుర్వాసన విపరీతంగా వుంది.

ఓ చిన్న పెంకుటింటిముందు ఆగాను.

లోపల గుడ్డిదీపం వెలుగుతోంది. చడీచప్పుడూ లేదు. తలుపుమీద కొడదామని చెయ్యివేశాను. దగ్గరగావేసి వున్నాయి, తెరుచుకున్నాయి.

మసకవెల్తుర్లో బావ నులకమంచంమీద పడుకుని వున్నాడు. కంఠంవరకూ దుప్పటి కప్పివుంది. నిద్రలో వున్నాడో, తెలివితప్పి వున్నాడో తెలియదుగాని కళ్ళు మూసుకుని వున్నాయి. ప్రక్కన చాపమీద గోడకానుకుని అక్కయ్య మోకాళ్ళమీదుగా రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకుని కూర్చునివుంది. సవ్వడి విని చేతులు తొలగించి చూసింది.

స్వరం బాగా చిన్నదిచేసి "అక్కయ్యా, ఎలావుంది?" అడిగాను.

"ఆ విషయం నేనెలా చెప్పగలను?"

"మాట్లాడుతున్నాడా?"

"లేదు."

"స్మారకం వుందా?"

"అదీ లేదు."

"డాక్టరు వచ్చాడా?"

"రాలేదు."

ఆమెకళ్ళు ఏడుపుకన్నా ఎర్రగా వున్నాయి. మనిషి చెప్ప లేనంత క్షీణించిపోయింది.

నాకింకా ఏం మాట్లాడాలో తోచలేదు. కాలం వ్యర్థం చేయటం అంతకన్నా యిష్టంలేదు. "అయితే నేనువెళ్ళి డాక్టరుని పిల్చుకువస్తాను" అని ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండా బయటకు వచ్చేశాను.

రాత్రిసమయంలో వెళ్ళి పిలుస్తే విసుక్కోవటం ఏ డాక్టరుకైనా సహజం.

తర్వాత "ఇన్‌జక్షన్‌లు చెయ్యండి కష్టం" అన్నాను.

"రాసి యిస్తే తీసుకువస్తాను" అని చెప్పాను.

రాసి యిచ్చాడు ... బజారుకు వెళ్ళేసరికి మెడికల్‌షాపు మూసివేయబోతున్నాడు. ఎనభైఅయిదురూపాయలు వాటి ఖరీదు అని తెలిసింది. నాదగ్గర యిరవై తక్కువగా వున్నాయి. షాపు అతను నాకు తెలిసిన మనిషే కావటంచేత తర్వాత యిప్పిస్తానని ఒప్పించాను.

తిరిగి డాక్టరుని తీసుకుని, అక్కయ్య యింటికి వెళ్ళేసరికి నాకోసం ఎదురుచూస్తోంది. డాక్టరు అక్కడ ఓ అరగంట వుండి రెండు యిన్‌జక్షన్‌లు యిచ్చాడు. మళ్ళీ మరునాటి ఉదయంవచ్చి మిగిలినవి యిస్తానని చెప్పాడు. ఆయన్ని పందుం మొదలుదాకా తీసుకువెళ్ళి కట్టి వద్దామని వెళ్ళాను.

"డాక్టర్! బ్రతుకుతాడంటారా?"

"రేపు కూడా ట్రీట్‌మెంటు పూర్తిఅయాక యీసారికి ఏమీ భయంలేదు. కాని యిలా ఎన్నాళ్లో జరగదు. మళ్ళీ అయిదారు నెలలయినా గడవకముందే రోగం తిరగబెడుతుంది. ఎలా అయినా యిలా ఎక్కువకాలం జరగదు."

నిట్టూర్పు అణుచుకున్నాను.

తర్వాత ఆయన్ని రిక్షా ఎక్కించి వెనక్కి తిరిగి వచ్చాను. "ఏమన్నాడు?" అడిగింది అక్కయ్య కంపితస్వరంతో.

"భయం లేదుట."

పన్నెండింటివరకూ అక్కడే బావ ముఖంవంక చూస్తూ కూర్చున్నాను. సంవత్సరాల తరబడి మంచంమీద పడివున్నట్టే యివాళ పడివున్నాడు. అతనికోసం చేసుకున్న భార్య ఎన్ని తంటాలు పడుతుందో అతనికి తెలియదు. కానీ అదీ మంచిదే. తెలిసి ఏం చెయ్యగలడు గనుక?

చివరకు భయంలేదని ఓదార్చి, ఆమెదగ్గర సెలవుతీసుకుని, బయటకు నడిచాను. చీకటి జీబూతంలా వుంది. మాసంలో, ఒక పక్షంలో కొన్నిరోజులు యీ "రాజ" వీధికి విద్యుద్దీపాలు.

నాలో ఏదో సంతృప్తి. బహుశా నిన్నా, యివాళ మరుపురాని, మరువలేనిరోజులు. పెద్దవాడ్నిఅయాక, ఒంటరిగా ఏ చీకటి రాత్రో యిలాగే ఎక్కడో నడిచిపోతూ "ఆరోజుల్లో...ఒక రోజు యిలాచేశాను" అనుకుంటానుకాబోలు.

"అయ్యో" అనిపించింది.

అసమర్థుడి గుండె ఎంతబరువు! పిరికివాడి ఆలోచనలు ఎంత ధైర్యవంతమైనవి!

ఎక్కడో వెలుగు. ఏదో కాంతి ఎక్కువసేపు నిలవలేదు. అంతరించిపోయింది వెంటనే.

"ఈ మనుషులు......!" కొత్తగా విరామం. "ఎంత అమాయకులు!"

"కాదు. ఎంత అజ్ఞానులు!"

అజ్ఞానమనే ఓ సముద్రంలో మొగ్గలు మనుషులు పడిపోయి, యీదులాడుతున్నారు.

ఓ స్త్రీ అరుస్తోంది. పాపం జాలిగా ప్రేమగా "మధూ! మధూ మధూ!"

అయ్యో! మధుర కలశం ఆమెకు అందదనీ, సముద్రంలో మరి కొంతసేపటిలో పెనుతుఫాను రేగబోతూందని గ్రహించదేం?

విషాదాల విరామసంగీతాన్ని ఆలాపించాయి.

అరుస్తున్నాడు ఓ యువకుడు. "మాలతీ! మాలతీ! మాలతీ!"

నీళ్ళు మింగుతున్నాడు. ఒకసారి మునిగి పైకి తేలి "ఈ బహుమానం స్వీకరించవా?" అంటూ మళ్ళీ మునిగిపోయాడు.

ద్రోహంతో సంపాదించిన యీ బహుమానం వ్యర్థమేననీ, స్త్రీ హృదయం చాలా యిరుకైనదనీ, అందులో తనకు చోటు చాలదనీ గ్రహించడానికి ఎంత ఆత్మవిమర్శ కావాలో! తనకూ, ప్రేమించిన ఆమెకూ దూరం కొలవలేనిది అని యిప్పటికిప్పుడే తెలియలేదు.

ఈ సారి విరామం మితంగా వుంది. యువకుని ప్రార్థనలోనే మరో స్త్రీ ఏడుపూ వినిపిస్తోంది.

ఆ అపస్వరాలకు కవిత తొడిగితే అర్థం యిలా వుంది.

బ్రతకాలి! బ్రతకాలి!! బ్రతకాలి!!!

బ్రతకడం. బ్రతకడం. బ్రతకడం.

నిశీథంలో వచ్చిన ఓ చిన్న నిద్ర. నిద్రలో కల. కలలో ఓ సముద్రం. సముద్రం పేరు అజ్ఞానం.

"మధూ! మధూ! మధూ!"

"మాలతీ! మాలతీ! మాలతీ!"

"బ్రతకాలి! బ్రతకాలి! బ్రతకాలి!"

సముద్రం మాయమయింది.

కల చెరిగింది.

నిద్ర విచ్చింది.

ఇల్లు సమీపించింది. పొరపాటున ఆర్పివేయకుండా విడిచి వచ్చిన దీపం వెలుగుతోంది. నాలో లేని మగతకు వికసించిన గులాబీహృదయమే గుర్తు.

నేను విజ్ఞానిని, విజ్ఞానిని.

ఆత్మవిమర్శ అపారం. పరహృదయాల జిగిబిగిని అవలీలగా అర్థం చేసుకుని, పర్యవసానాలు ముందుగా వూహించి, భయంకరమైన భావిని దూరదర్శినిలో పరిశీలించిన విజ్ఞానిని.

తలుపులు తీసి, బట్టలు మార్చుకుని, దీపం ఆర్పి, నిద్రకు ప్రయత్నం ఉపక్రమించాక హఠాత్తుగా ఓ క్రొత్త ఆలోచన మతిని చలింపచేసింది.

ఆశ్రయించిన నిర్భాగ్యులను అంధకారంలోనే వుంచి, అజ్ఞానాన్ని అజ్ఞానంగానే సమాప్తం చేస్తూ, అజ్ఞాతంగా, విజ్ఞానమనే యీ గర్వంతో, చేతగానితనానికి మారుపేరైన యీ గర్వంతో, వెలుగును దరిచేరటానికి తెగించని యీ పిరికితనంతో కుమిలి, కుళ్ళేది నాది జ్ఞానమా?

నేను అజ్ఞానిని, అజ్ఞానిని.



# ఐక్యరాజ్యసమితి : మానవసంక్షేమం

**శ్రీ మంథా శ్రీధరరావు**

ఐక్యరాజ్యసమితి అనునది ప్రపంచ శాంతిభద్రతలు మానవాభ్యుదయము నిమిత్తము ఇటీవల ఏర్పడిన ఒక అంతర్జాతీయ మహాసంస్థ. అది 1945 సం. జూన్ 26 వ తేదీన శాన్‌ఫ్రాన్సిస్కోలో అధికారపురస్సరముగా తయారయిన నియమావళిని సూత్రప్రాయముగా ఆమోదించిన వివిధ స్వతంత్రదేశముల (ఇప్పటి సంఖ్య 76) ఐక్యవ్యవస్థ. ఈ సంస్థ ఆవిర్భావమునకు పూర్వరంగ మొకటి కలదు. అదియే 1914 నాటి మొదటి ప్రపంచ సంగ్రామానంతర మేర్పడిన రాజ్యకూటమి (*League of Nations*). అది ద్వితీయ ప్రపంచ సంగ్రామము నరికట్ట లేకపోయినది. ఆ ద్వితీయయుద్ధముతో దాని పరపతి రూపుమాసినది. ఆ ద్వితీయయుద్ధానుభవఫలితముగనే ఇదివరకటి రాజ్యకూటసంస్థకన్న దృఢతరములగు ఆశయములతో, అనుబంధములతో ఏర్పడిన దీ ఐక్యరాజ్యసమితి.

ఈ సమితి కార్యవిధానము ఈ క్రింద వింగడింపబడిన ఆరు శాఖలద్వారా నిర్వహింపబడును.

(1) సర్వసభ్య సంఘము (*General Assembly*)
(2) భద్రతా సంఘము (*Security Council*)
(3) ఆర్థిక, సామాజిక విషయ విచారణ సంఘము (*Economic & Social Council*)
(4) ధర్మకర్తృత్వసంఘము (*Trusteeship Council*)
(5) అంతర్జాతీయ న్యాయస్థానము (*International Court of Justice*)
(6) కార్య పర్యవేక్షణ సంఘము (*Secretariat*)

ఒక్కొక్క శాఖయొక్క కార్యక్రమమును సంగ్రహముగా పరిశీలింతము.

## సర్వసభ్యసంఘము

దీనిని ఒకవిధంగా ప్రపంచ పౌరమహాసభ (*Town meeting of the World*) అనవచ్చును. ఇందు అన్ని దేశములకు సభ్యత్వము గలదు. దీనికి అన్ని విషయములతో నిమిత్తము గలదు. ఇందు ముఖ్య విషయములపై తీర్మానములు సమావిష్టులైన సభ్యులలో 2/3 వంతువారి ఆమోదమునుబట్టి మాత్రమే జరుగును. అందుచే ఐక్యరాజ్యసమితిలో ఈ ప్రజాస్వామికధర్మము ప్రకృష్టమైనదిగా ఎన్నబడుచున్నది. కాని దీనికి శాసనకర్తృత్వనిర్వహణాధికారములు లేవు. ఈ సమితిలో క్రొత్తగా ఒక దేశమునకు సభ్యత్వమిచ్చుట అనునది ఒక సమస్యగా పరిణమించినది. కారణము ఇదివరకే సభ్యత్వము వహించియున్న ప్రబలమైన రెండు అగ్రరాజ్యముల నడుమ తగిన సామరస్యము లేకపోవుటయే; ఇది నిజముగా సమితినియమావళిలో ఒక లోపమే. అదినులో తగిన సవరణ చేయబడకున్నచో అనేక దుష్ఫలితములకు దారితీయవచ్చును.

ఈ సర్వసభ్యసంఘము దానికి అదనపు అధికారములు కొన్ని చేకూరినందుకు కొంతమట్టుకు సత్ఫలితములను సాధించినదనియే చెప్పవచ్చును. కాని ఇంకను మరికొన్ని లోపములు మిగిలియే యున్నవి. మానవసంక్షేమదృష్ట్యా అవియు సకాలమున సవరింపబడవలసియున్నవి. అవెట్లనగా ?

(1) ఈ సంఘము ఎట్టి ప్రచారమునకు సాధనము కారాదు.

(2) ఈ సంఘాధ్యక్షుని యాదేశములు నిరసింపబడిన సందర్భము లనేకములు గలవు. ఇట్టివి సమితియొక్క సంస్థితికిభంగకరములని వెంటనే గుర్తింపబడవలెను.

(3) సంఘకార్యకలాపముతంతులో అనావశ్యకముగా ఆలస్యము జరుగుట కద్దు. ఇట్లగుటచే బహుదూరదేశములనుండి ఈ సమితి సమావేశముల నిమిత్తము వచ్చు ప్రతినిధులు తమతమ దేశములలో తమకున్న ప్రభుత్వోద్యోగబాధ్యతలను నిర్వహించుటలోగూడ కాలయాపన జరుగుచున్నది. అట్లు జరుగకుండ చూడవలసిన బాధ్యత సమితిపై నున్నది.

(4) సాముదాయకమైన ఓటింగు పద్ధతి (*Bloc Voting*) అప్పుడప్పుడు సమితి పరిస్థితికే విరుద్ధముగా పరిణమించవచ్చును. గనుక దానిని పరిహరించవలెను. పై పద్ధతిద్వారా అగ్రరాజ్యములకు మద్దతు నిచ్చినందువలనగాని, మానినందువలనగాని మరియొక దేశమునకు ప్రత్యేకముగా లాభమేమియు కలుగబోదు.

సర్వసభ్యసంఘము చేసిన పనులలో అతిముఖ్యమైనది ఒక ఉపసంఘపు టేర్పాటు (*Little Assembly*) ఈ ఉపసంఘము శాంతిభద్రతలు కాపాడుటయందును, దర్యాప్తు ప్రణాళికలను తయారుచేయుటయందును సంఘమువారికి తోడ్పడుచుండును. సమితినియమావళిలోని 13వ సూత్రము ప్రకారము అంతర్జాతీయ న్యాయశాస్త్ర సిద్ధాంతములకు సంబంధించిన విషయములను ప్రతిపాదించుటకు, పరిశీలించుటకు, న్యాయశాస్త్రాభివృద్ధినిమిత్తము సమితి సభ్యత్వము గల దేశములకన్నిటికిని ఆ సిద్ధాంతములగూర్చి సిఫారసులు పంపుటకు, అందుగురించి నివేదికలు తయారుచేయుట కొర చిన్న సంఘము నేర్పాటు చేయుటకును తగిన యధికారము సర్వసభ్య సంఘమునకు గలదు. అట్లొక నివేదికసంఘ మప్పుడే ఏర్పడియున్నది కూడ. ఇట్టి అదనపుటధికారములతో సర్వసభ్యసంఘము సక్రమముగ సమర్థముగా పనిచేయగలదని యాశింపవచ్చును.

## భద్రతా సంఘము

సమితి కిది మూలస్తంభమువంటిది. సమితినియమావళి 24 వ సూత్రము ప్రకారము ప్రపంచ శాంతిభద్రతలనుగూర్చిన ప్రాథమిక బాధ్యత దీనిపై నున్నది. ప్రపంచ శాంతిభద్రతలకు భంగక

ము ప్రతి చిన్న సన్నివేశమును ఇది పరిశీలించును. సైనికాశక్తి కలిగియుండి బలహీనమ్ములకును, సాయపడుటకును ఒక సైనికోద్యోగసంఘము దీని అధికారముక్రింద నుండును. కాని కార్య నిర్వహణవిషయమున భద్రతాసంఘములో ఒక లోపము గలదు. అది వివాదపరిష్కారవిషయమై, ఒక నియతము, నిశ్చితము, అయిన పద్ధతి లేకపోవుటయే. అదిగాక నియమావళిలో అంతర్జాతీయశాంతిభంజకము "వివాదము" "అపాయాత్మక సన్నివేశము" అను విషయముల భేదము స్పష్టముగా నిరూపింపబడలేదు. అసలు లోపమున్నదల్లా ఎక్కడనంటే భద్రతాసంఘము ఒక వివాదమును పరిశీలిస్తున్నప్పుడు ఆ సంఘపు ప్రతిపాదనలను వ్యతిరేకిస్తూ (*Veto*) 'వీటో' అధికారమును ప్రయోగింపగల హక్కు సమితిలో శాశ్వతసభ్యత్వము గల దేశములకు ఉండడము లోనే యున్నది. అగ్రరాజ్యాలతో హాతల్లా అందులోనే ఉంది.

ఇలా అగ్రరాజ్యాలు వీటో (*Veto*) ప్రయోగించిన సందర్భాలనేకము లున్నవి. అందుకు 4-2-1946 వ తేదీన సిరియా, లెబనాన్ ప్రభుత్వాలు తమదేశాలలో ఉంటున్న ఆంగ్లేయ, ఫ్రెంచి, సైన్యాలతిరలింపునుకరించి సమితికి విజ్ఞప్తి చేసుకున్న సందర్భములో అందుకు ప్రతికూలముగా రష్యా వీటోను ఉపయోగించి యుండుటయే తార్కాణము. అలాగే స్పెయినులో జనరల్ ఫ్రాంకో ప్రభుత్వవిషయమై చర్చింపవలసినదిగా పోలండు ప్రతినిధులు సమితి 34, 35 వ సూత్రముల (పసిఫిక్ ఒడంబడికలు) ప్రకారము విన్నవించుకొన్నప్పుడు ఆ విషయమై తొమ్మండుగురు సభ్యులు ఆమోదించి సిఫార్సు చేయడం జరిగింది. కాని రష్యా తన వీటో అధికారముతో వ్యతిరేకించినది. అందుచే ఆయా విజ్ఞప్తులు నిష్ఫలములైనవి. ట్రీస్టీకి చాలకాలమువరకు ప్రత్యేకము ఒక గవర్నరు లేకపోవడముకూడ రష్యాతాలూకు వీటో వినియోగమువల్ల నే జరిగినది. ఇలాంటి వీటో ప్రయోగాలు భద్రతాసంఘనిర్వహణానికి ప్రతిబంధకాలు కావా యని ఎవరైనా ప్రశ్నించవచ్చు. కాని వీటివల్ల వీటోని ప్రయోగించే దేశాల స్వార్థము కొంత సంరక్షింపబడటము, విజ్ఞప్తులు విఫలమైన దేశాల ఆశయాలు నిరర్థకాలవడమే కాని ప్రపంచవ్యాప్తమైన, శాంతిహాని అట్టే జరుగలేదు. కాబట్టి భద్రతాసంఘముయొక్క ప్రాథమిక బాధ్యతానిర్వహణానికి అట్టే తకరారు లేదన్నమాట. ఈనాడు ప్రపంచమంతా రెండు ప్రబలమైన అధికారవర్గాలక్రింద క్రమంగా విభక్తమైపోతూ ఉండటం వల్ల, తత్ఫలితంగా, భావిప్రపంచస్థితి అశాంతిభయావహంగా తోస్తూ ఉండటంవల్ల భద్రతాసంఘము బాధ్యతవిషయములో ఏ విధమైన తకరారు లేకుండా ఉండాలంటే ప్రపంచములోని ప్రతి దేశము 28-6-51 నాటి చౌ—నెహ్రూ బాండుంగ్ సమావేశపు "పంచశీల" సూత్రాలను హృదయపూర్వకంగా ఆమోదించి ఆచరణలో పెట్టడమే గత్యంతరంగా తోస్తున్నది.

## ఆర్థిక, సామాజిక విషయవిచారణసంఘము

మానవసమాజపు కనీసపు హక్కులు, స్వేచ్ఛ మొదలగు విషయములను పరామర్శించుట, తద్వారా శాంతిభద్రతలను సాధించుటయందు సమితిలో దీనికొక విశిష్టస్థానము. అంతర్జాతీయములైన ఆర్థిక సామాజిక, సాంస్కృతిక, విద్యారోగ్యాది వివిధ విషయముల గూర్చి పరిశీలనము జరిపి సర్వసభ్యసంఘమునకు ఆయా ప్రత్యేక కార్యనిర్వాహకశాఖలకును సిఫారసులు చేయుట దీని ప్రధాన కార్యభారమై యున్నది.

ఆయా ప్రత్యేక కార్యనిర్వాహకశాఖలలో ముఖ్యమైనవి యేవనగా, అంతర్జాతీయశ్రామికసంస (*I. L. O.*) ఆహార వ్యావసాయిక సంస్థ (*F. A. O.*) విద్యా వైజ్ఞానిక, సాంస్కృతికవ్యవస్థ (*U. N. E. S. C. O.*), ప్రపంచ ఆరోగ్య సంస్థ, (*W. H. O.*) సాంకేతిక సహాయ సంస్థ, (*U. N. T. A. A.*) అంతర్జాతీయ శిశునిధి (*U.N.C.E.F.*) ఈయాశాఖల కార్యనిర్వహణ ప్రపంచమునందలి వివిధరంగములకు సంబంధించిన దగుటచే అత్యంత ప్రాముఖ్యము వహించి యున్నది. వీని నిర్వహణకు జాతి మత, భాషాది, విభేదములతో ఎట్టి నిమిత్తములేదు. ఇందు యునెస్కో (*U. N. E. S. C.O.*) చాల దేశములలో గ్రంథాలయములు స్థాపించినది. పత్రికలు, రేడియో, సినిమా, మొదలగువానిద్వారా విజ్ఞానాభివృద్ధికి పాటుపడుచున్నది. ఈశాఖ 1946 లో ఆరంభింపబడినప్పటినుండి అద్భుత విజయములు అనేకము సాధించినది, సాధించుచున్నది, సాధింపనున్నది.

ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ 1948 లో ప్రారంభింపబడినది. ప్రపంచ మానవారోగ్యస్థితియందు గరిష్ఠప్రమాణములు సాధించుటయే దీని పరమాశయము. దీని సిద్ధాంతముప్రకారము, ఆరోగ్యమనగా, వ్యాధిరాహిత్యము మాత్రమే కాదు. శారీరక మానసిక సామాజిక సంస్థితియే ఆరోగ్యము. ఈ సంస్థ లోగడ మిత్రరాజ్యములందు 1946 లో కోరింతదగ్గుజాడ్యము విజృంభించినప్పుడు తన్నివారణార్థము నిపుణులను పంపి యుండెను. ఇరాన్‌లో తోడేళ్ళవల్ల రేబీస్ వ్యాధి ప్రారంభించినప్పుడు ప్రత్యేకమైన సీరము పంపి యుండెను. లండనులో ఇన్‌ఫ్లూయెంజా జాడ్యము ప్రబలినప్పుడు దానిని ప్రతిఘటించు నిమిత్తము ఒక్కొక్క పెద్ద రక్షణకేంద్రము నేర్పరచియుండెను. 27 దేశములలో ఆరోగ్య పరిశోధనాకేంద్రములు ఏర్పాటుచేసియున్నది.

ఆహార వ్యవసాయిక వ్యవస్థ 1945 లో నెలకొల్పబడెను. ప్రపంచప్రజ జీవితప్రమాణములు, ఆహారపు విలువలు, వ్యవసాయ విధానములు, అటవీ, గ్రామ, మత్స్య పరిస్థితులు మొదలగు అనేక విషయములందు అభివృద్ధి కలిగించుటకు పాటుపడుచు తద్వారా అనేక నిర్మాణాత్మక కార్యక్రమములకు అవకాశము కలుగచేయుచున్నది.

అంతర్జాతీయ శ్రామికసంస్థ 1955 లో సిరియా, లెబనాన్ దేశములలో శ్రామికసమస్యాపరిశీలకుల శిక్షణకు ఏర్పాటుచేసినది. యుగోస్లావియాలో ఇట్టిదే ఒక జాతీయ శిక్షణశిబిరమును నెలకొల్ప సంకల్పించియున్నది. ఈ సంస్థయొక్క ముఖ్య ఆశయమేమనగా, ప్రపంచమందంతట పారిశ్రామికశ్రేయస్సు సాధించుటయే.

సాంకేతిక సహాయసంస్థయు అంతర్జాతీయ శిశునిధి ఒకటిగా చేర్పడి ఇండియా, పాకిస్థాన్ సిలన్ దేశములలో డి. డి. టి.,

పెన్సిలిన్ స్వంతముగా తయారుచేసికొనుటకు సహాయము చేసినది. తరు అభివృద్ధి కలిపించినది. అట్లే భారతీయ ప్రభుత్వముయొక్క బృహత్—యాంత్రిక యత్నములలో ఒకటగు సింద్రీ ఫెర్టిలైజర్ ఏర్పాటు సందర్భములో ఈసంస్థ ముగ్గురు సాంకేతిక నిపుణులను సలహాదారులుగా పంపియుండెను.

## ధర్మకర్తృత్వ సంఘము

విశ్వరాజ్య సమితిలో ఇది యొక ముఖ్య విభాగము. అనేక దేశముల ప్రతినిధికూటము. అది, దాని యాజమాన్యముక్రింద ఉన్న ప్రాంతములను అప్పుడప్పుడు పరిశీలించుచుండును. మొట్టమొదట పడమటి సమోవాకు ఇట్టి ఒక ప్రత్యేక పరిశీలనాసంఘమును పంపించియుండెను. ఆయా ప్రాంతవాస్తవ్యులకు స్వవిషయముల గూర్చి సెక్రటరీ జనరల్‌కు అర్జీలు పెట్టుకొనుటకుగాని తమ ప్రతినిధులను పంపుకొనుటకుగాని హక్కు గలదు. ఈ సంఘము వెనుక మాండేటరీపద్ధతిక్రింద యుండిన అనియత వ్యాపారవ్యవస్థను రద్దు చేసినది. ఈ సంఘపు ఆధ్వర్యమున వివిధ ప్రాంతములలో నడుపబడుచుండిన ఆర్థిక రవాణా మొదలైన శాఖలవలన ఆయా ప్రాంతవాస్తవ్యులు యథార్థముగ ఎంతెంత ఉపకారము పొందుచున్నది ఈ సంఘమునకు తెలియజేయవలసినదిగా ఆయా ప్రాంతీయాధికారులను సర్వసభ్యసంఘము 1952 లో కోరియుండెను. అనగా, సమితి కార్యకలాపములో ప్రజాభిప్రాయమునకు తగిన ప్రతిపత్తి గలదని తేలుచున్నది. ఈ ధర్మకర్తృత్వసంఘములో 4-10-1953 వ తేదీన ఇండియా ఒక ప్రతినిధిగా ఎన్నుకోబడి చేర్చబడినది. విశ్వరాజ్య సమితి చరిత్రలో ఇండియా తనపాత్ర మహోజ్జ్వలముగా నిర్వహించగలదని ఆశించవచ్చును.

## అంతర్జాతీయ న్యాయస్థానము

సర్వసభ్యసంఘమువలెనే ఇందును ప్రతి ప్రతినిధి దేశమునకును సభ్యత్వము గలదు. అట్లు సభ్యత్వముగల ప్రతిదేశమును దీని న్యాయ సూత్రములకు బద్ధమై యుండవలెను. అది సమితిలోని వివిధశాఖలకు సర్వసభ్యసంఘముయొక్క ఆదేశానుసారము వివిధ న్యాయ విషయములపై ఉపదేశాత్మకమైన అభిప్రాయముల నిచ్చుచున్నది. ఇజ్రేయిల్ లో జరిగిన కౌంటు బెర్నడెట్ హత్యావిషయములో ఆంగ్లో ఇరానియన్ నూనెపరిశ్రమ తగవు విషయములోను ఇచ్చిన తీర్పులే నిష్పాక్షిక సుందరమైన దీని ఉదాత్తతను చాటుచున్నవి.

## కార్య పర్యవేక్షణ సంఘము

ఇదియొక మహోన్నతమైన అంతర్జాతీయ ప్రజా సహకార సంస్థ. సెక్రటరీ జనరలే దీని అధిష్ఠాత. భద్రతా సంఘమునకు చేదోడు వాదోడుగా యుండుటయు, సర్వసభ్యసంఘముయొక్క వార్షిక నివేదికలు తయారుచేయుటయు దీని ముఖ్యమైన పనులు.

ఇట్టి విశాలతత్వము, ప్రకృష్టబంధము, గల విశ్వరాజ్య సమితి ద్వారన మానవసంక్షేమమునకు ఎట్లు తోడ్పడగలదో పరిశీలింతము. అసలు సంక్షేమమనగా, భిన్న భిన్న తత్వములు, మతములు, ఆచారములు, అభిరుచులు గల దేశముల మధ్య అనురక్తి తేర,



అనేక విషయములలో ఏకవాక్యత, పరస్పర సహకారభావము, సంబంధబాంధవ్యములు ప్రబలి ప్రపంచమందంతట ప్రశాంత వాతావరణము నెలకొనియుండుట ఒకటి. అంతమాత్రమున అది సంక్షేమ సమగ్రస్వరూపము కాదు. సంఘాభ్యున్నతికి ఉన్ముఖముగా వ్యక్తినిష్ఠములైన జీవితప్రమాణస్వామ్యములలో అభివృద్ధి పటిష్ఠత ఏర్పడి అది వ్యక్తికి విశ్వమునంతటిని ఏకబీజముగా చూడగల విశాల దృష్టిని కలిగించునదిగా ఉన్ననాడే మానవాళికి నిజమైన సంక్షేమము. ప్రపంచశాంతియను పునాదిపై నిర్మింపబడు మహాభవనమే మానవసంక్షేమము. సమితి నియమావళిలోని 14,55 వ సూత్రముల లోని పరమార్థమిదియే.

ఈ 55 సూత్రము లో ఆర్థిక సాంఘిక సంక్షేమ మానవ స్వామ్య స్వరూపములు నిరూపించబడినవి. ఆర్థిక సంక్షేమమనగా— సాధారణముగ ఈనాడు అనేక దేశములు ఆర్థికముగ ఒకదానిపై నొకటి ఆధారపడియున్నవి. ఒకదానితో నొకటి వ్యాపారాది విషయములందు ఒడంబడికలు చేసుకొనుచున్నవి. కాని, దేశాలన్నిటికి ప్రాతినిధ్యము, మధ్యవర్తిత్వము వహించగల కేంద్ర సంస్థ అంటూ ఒకటి ఉండేటట్లయితే ప్రపంచములోని ఉత్పత్తిసరఫరాలకు నియతవిధానముల నేర్పరచి ప్రపంచపు టార్థికావకాశములను పెంపొందించుకొనుటకు అవకాశమేర్పడును. ఈనాడు ఆర్థిక సంక్షేమున్నది ఒక గగనకుసుమముగనే కన్పించుచున్నను, ఐ. రా. స. ఆర్థిక సామాజిక విషయ విచారణ సంఘము దానియొక్క ప్రత్యేక శాఖల (I. M. F.), (I. B. R. D) ద్వారా విశ్వార్థిక ప్రపంచాదర్శము కొంత రూపు కట్టినదనే చెప్పవచ్చును.

సాంఘికసంక్షేమమనగా—వివిధదేశములమధ్య సహకారము పెంపొంది వెనుకబడిన దేశములను జాతులను, జాతివిభేదము దురాక్రమణ మున్నగువానిబారినుండి కాపాడి అభివృద్ధిమార్గగాములుగా ప్రజాజీవితప్రమాణములు పెరుగునట్లు చేయవలెను. ఇందులకు సాంకేతికసాహాయ్యము అందులకు పెద్దపెద్ద పెట్టుబడులు అవసరము. అభివృద్ధిప్రణాళికలు అమలు జరుపుటకు చిన్న దేశములకు ఆర్థికస్తోమత చాలదు. ఒడంబడికలపై పెట్టుబడులు వానికి పెట్టుటకై పెద్ద దేశములు కొన్ని సిద్ధపడవచ్చును. అయితే, అట్లు ఒడంబడికల ద్వారా పెద్దదేశములతో చిన్న దేశములు సంబంధము పెట్టుకొన్నచో తాత్కాలికముగా, వాని ఆర్థికాభివృద్ధి చేకూరవచ్చును. కాని, వాని సహజస్వాతంత్ర్యమునకు లోటు వాటిల్లుటకు అవకాశములు ఏర్పడవచ్చును. అందుచే ఆర్థికముగా ఒక దేశముపై మరియొక దేశము ఆధారపడుటకన్న ఆర్థికస్తోమత గల వివిధదేశముల మద్దత్తుతో సహకారపద్ధతిపై అంతర్జాతీయపరపతిసంస్థ (*World Bank*) ఒకటి ఏర్పడుట మంచిది. ఇది ఐ. రా. స. వంటి అంతర్జాతీయసంస్థ ద్వారానే సాధింపబడగలదు.

మానవస్వామ్యములు — ప్రతివ్యక్తియొక్క ప్రతిష్ఠయు దాని, నియతము, స్వామ్యముల సక్రమపరిపాలనాపద్ధతిపై ఆధారపడియుండును. ఐ. రా. స. యొక్క జీవలక్షణమును ఇదియే. సమితి వివిధదేశముల హక్కులగురించియే కాదు. వ్యక్తి స్వేచ్ఛ, స్త్రీపురుషుల సమాన హక్కులు గౌరవప్రతిపత్తులగురించికూడ శ్రద్ధ తీసుకొనును. 9.12-1948 నాడు సమితి మానవస్వామ్యముల గురించి విశ్వజనీనమైన ప్రకటన చేసియుండెను. 1950 లో 24 దేశముల మధ్య అది అమలులోనికి వచ్చినది.

సమితి ఈ ప్రకటనలోని ఆశయములను ఎంతవరకు ఆచరణలో పెట్టగలదు అనునది ప్రశ్న. ఈ విషయమై సమితి కృషికి తార్కాణాలుగా కొరియా, పర్షియా, పాలస్తీనా. కాశ్మీరు, గ్రీసు, మొదలగు దేశముల సమస్యలలో సమితి తీసుకొన్న చర్యలను గ్రహించవచ్చును. మరొక మహోదాహరణము ఈనాటి తీవ్రసమస్యయగు అణువిజ్ఞానవిషయము తీసుకొందము. ఈనాడా విజ్ఞానరహస్యము కొన్ని దేశములకే పరిమితమై ప్రత్యేకపు హక్కుగా పరిగణింపబడుచున్నది. అది మానవ వినాశమునకే దారితీయగల మహామారి. ఆ దేశములేగాని యింకొకదానితో నొకటి తలపడినచో మరొక ప్రపంచ మహాసంగ్రామము తప్పనిసరి. ఈసారి మరో ప్రపంచ మహాసంగ్రామమే కాని తటస్థించినచో ప్రపంచము పని సరి. యుద్ధమనునది భిన్న రాజకీయ దృక్పథములు గల కొందరి బుర్రలకు పట్టిన జాడ్యము. వారి మానసికారోగ్యవికాసమే ప్రపంచశాంతికి మూలము. ప్రపంచములో నిరంతరాయమైన ప్రశాంత వాతావరణ మేర్పడాలంటే ఆ విజ్ఞానము ప్రత్యేక మొకరిసొత్తు కాకూడదు. ఆ రహస్యము అన్ని దేశాలవారికినీ తెలియవలసిన ఆవశ్యకత యొకటి, అంతేకాదు, ఆ మహోజ్వలశక్తిని శాంతిమార్గాలద్వారా ప్రపంచ మానవావసరములకు తగినట్లు మలచవలసిన ఆవశ్యకత యొకటి గలదు. రెండవది గురుతర బాధ్యత. ఈ విషయమును గురించియే 8-8-1955 న జెనీవాలో జరిగిన 66 దేశాల అణువిజ్ఞాన శాస్త్రవేత్తల మహాసభలో ఐక్యరాజసమితి జనరల్ సెక్రటరీ శ్రీ డాగ్ హేమర్ షెల్డ్ నొక్కి నొక్కి వక్కాణించియున్నారు.

ఇట్టిది ఈ మహాసంస్థయగు ఐక్యరాజ్యసమితి స్వరూపము. ప్రపంచములో ప్రతిదేశమునకును ఇందు సమప్రాతినిధ్యము లభించి, సమితి మహాదాశయములతో అన్ని దేశములు ఏకముఖముగా సహకరించగలిగిననాడే సర్వతోముఖ ప్రపంచ శాంతిసౌభాగ్యములకు పరిపూర్ణతాసిద్ధి.

# ఆస్తిహక్కుల పరిణామము

**శ్రీ వి. లక్ష్మణరావు**

## ఆస్తి : వివేచనాత్మక నిర్వచనము

ఒక వస్తువు లేక పదార్థముపై ఒకవ్యక్తికి స్వామ్యము (Ownership) ఉన్నయెడల ఆ వస్తువు లేక పదార్థమును 'ఆస్తి' అని సాధారణముగా ప్రయోగించుటకద్దు. ఉదా: ఈ యిల్లు వారిది. ఈ భూమి ఫలానావారిది. ఈ కుర్చీ నాదీ అని. కాని న్యాయశాస్త్రరీత్యా ఆస్తి అనగా స్వామ్యము. ఒక వస్తువుపైగల హక్కులన్నియూ ఒక వ్యక్తిలో కేంద్రీకరింపబడినపుడు ఆ వ్యక్తి, ఆ వస్తువుయొక్క స్వామి అగును; స్వామ్యము ఆ వస్తువుపట్ల ఆ వ్యక్తియొక్క స్థితిని తెలియజేయును. కనుక ఆస్తి అనగా స్వామ్యమని గ్రహింపవలెను. సామాన్యప్రయోగములో ఆస్తి అనుపదము స్పర్శవేద్యములైన (Tangible) పదార్థములపట్ల వాడబడుచున్నప్పటికీ, న్యాయశాస్త్రమందు విశాలార్థములో ప్రయోగింపబడినప్పుడు, ఆస్తి అను పదములో, స్పర్శవేద్యములైన వస్తువులేకాక, స్పర్శవేద్యము కాని (Intangible) హక్కులన్నియునూ కూడ యిమిడివుంచును. ఈ అర్థములో కేవలము స్థిరచరాస్తులే కాక, సమస్తవిధములైన ఆస్తి సంబంధమైన హక్కులు ( Proprietory rights) కూడ ఆస్తియే.

## స్వామ్యము

స్వామ్యము ఒక వ్యక్తికి ఒక పదార్థముపట్ల యావత్ప్రపంచమునకు వ్యతిరేకముగ అమలుజరుప వీలగునట్టి హక్కు (Right in rim) ఆ హక్కును వర్ణిస్తూ, జాన్ ఆస్టిన్ (John Austin) ఉపయోగదృష్ట్యా అస్పష్టమైనదనీ, దానక్రయస్వత్వాధికారముల విషయములో ఎట్టి నిరోధనము లేనిదనీ, కాలపరిమితిదృష్ట్యా అనంతమైనదనీ చెప్పియున్నాడు. అనగా ఒక పదార్థము 'నాది' అయినప్పుడు నేను నా యిష్టప్రకారము అనుభవించి, ఉపయోగించుకొనగలను. యిచ్ఛగా నా దానక్రయస్వత్వాధికారములను చలాయింపగలను. నా హక్కునకు కాలపరిమితి లేదు. నా జీవితకాలమందేకాక, తరములు, యుగములు, మన్వంతరములు గడచినప్పటికినీ, నా ఒక్కనికే కాకుండ, నా దాయాదులు, వారసులు, లేక వారినుండి గ్రహించినవారికి కూడ చలాయింప వీలయినట్టిన్ని, ఆ వస్తువున్నంతకాలమూ గూడ, శాశ్వతముగ నుండెడి హక్కు.

పై వర్ణన స్వామ్యముయొక్క పరిమితులను, లేక పరిమితులు లేమిని బాగుగా వర్ణించినప్పటికీ, యిందలి వివిధాంశములు సామాన్యముగా, శాసనములు, లేదా ప్రభుత్వము విధించు యితర నిరోధములకు, కట్టుదిట్టములకు లోబడియుండునని మాత్రము అర్థముచేసికొనవలయును.

నా ఆస్తిని, యితరుల హక్కులకు ఏవిధముగానూ భంగము కలుగకుండ నున్నంతవరకు స్వేచ్ఛతో నేను వాడుకొనవచ్చును. అటులనే దానక్రయస్వత్వాధికారాలుకూడా శాసననిబంధనలకు లోబడియే యుండును. ఉదా: హిందువులలో సమష్టికుటుంబ ఆస్తులను అన్యాక్రాంతము చేయు (Alienate) విషయములో కొన్ని నిరోధములు విధింపబడినవి. మహమ్మదీయ న్యాయశాస్త్రములో మతైక, ధర్మాధిక ప్రయోజనములకొరకు అంకితము చేయబడిన ఆస్తుల (Wakf Property) విషయమందుకూడ కొన్ని నిరోధము లున్నవి. ట్రాన్స్ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఏక్టు 6 వ సెక్షన్ (Section 6 - Transfer of property Act.) లో అనన్యాక్రాంతమైన (Untransferable) ఆస్తిహక్కులు వివరింపబడినవి. ఉదా: పెన్షన్ హక్కు అనన్యాక్రాంతమైనది.

స్వామ్యము నేకమైన హక్కుల సాకల్యము. అందు అనుభవము, (Enjoyment) స్వాధీనము, (Possesion) మొదలగు హక్కులన్నియు యిమిడివున్నవి. ఈ హక్కులన్నియూ, వివిధ వ్యక్తులమధ్య విభజింపబడి వారిచే అనుభవింపబడవచ్చును. కౌలు కివ్వవచ్చును; కౌలుదారు తిరిగి తన హక్కును వేరొకనికి కౌలు కివ్వవచ్చును (sub - lease). అటులనే ఒక భూమి తనఖా పెట్టబడి యుండవచ్చును; తనఖాదారుడు తిరిగి తన హక్కును తనఖా పెట్టవచ్చును (sub-mortgage). లేదా అదే భూమిని మరల మరల తనఖా పెట్టవచ్చును (Perisue mortgage). అదే భూమిపైని యిరుగుపొరుగులవారికి త్రోవగా ఉపయోగించుకొను హక్కు (Right of way) ఉండవచ్చును. A యొక్క భూమిపై యిన్ని భారములు (Encumberances), బాధ్యతాపరంపర లున్నప్పటికీ, చట్టదృష్ట్యా, A ఆ భూమియొక్క స్వామి. తనఖాలవలన కౌలులవలన, విపరీతముగ వడ్డీలు పెరిగిపోవుటవలన, స్వాధీనభ్రష్టుడగుటవలన, A తన భూమివలన ఎట్టిదైన లాభమును పొందలేక పోవచ్చును; ఎట్టి ఫలమును ఆశింపలేకపోవచ్చును; ఆ భూమికి అతనికి ఎట్టి లాభదాయకమైన సంబంధమూ లేదు; ఆ భూమిని A యొక్క 'ఆస్తి' అనుటకంటె 'ఒక భరింపరాని భారము' అనవచ్చునేమో! అతని స్వామ్యము కేవలము లాంఛనప్రాయము, నామమాత్రావశిష్టము అయినది. అయినప్పటికీ, A తన విడుదలహక్కు (Right of Redemption) నశించనంత కాలము, ఆ భూమికి స్వామియే. ఒక ఆస్తిపై కట్టే బాధ్యతలు, భారము ఉన్నప్పటికీ ఆ బాధ్యతలు భారములు పోగా, ఆ ఆస్తియందు శరిశిష్టమైన హక్కు (Residuary right) గలవాడే స్వామి."

పై పరిశీలనవలన తేలిన విషయములు: 1. ఆస్తి అను పదమునందు స్పర్శవేద్యములైన పదార్థములే కాక స్పర్శవేద్యములుకాని పదార్థములు (ఉదా: హక్కులు) కూడ యిమిడివున్నవి. 2. స్వామ్యమనగా హక్కులపై స్వామ్యము (Ownership of rights) ఉదా: కౌలుదారుడు కౌలు హక్కునకు స్వామి. తనఖా పట్టినవాడు తనఖా

హక్కుగలవాడు స్వామి. అనగా కౌలుదారుడు, తనకౌ దక్కిన వాడు కూడా తన హక్కులను తిరిగి అన్యాక్రాంతము చేయ వచ్చును. 3. స్వామ్యము - స్వాధీనము మొదలగు వివిధహక్కుల సాకల్యము. అట్టి హక్కులు వివిధవ్యక్తులమధ్య విభజింపబడవచ్చును. ఉదా: స్వామికి స్వాధీనము లేకపోవచ్చును; స్వాధీనము కలవానికి స్వామ్యము లేకపోవచ్చును. స్వామి అనుభోక్త కాకపోవచ్చును. అనుభోక్త స్వామి కాకపోవచ్చును. 4. ఆస్తియందలి పరిశిష్టమైన హక్కులు కల వ్యక్తే ఆస్తికి స్వామి.

## స్వామ్యమునకు ఆధారము కృషి

ప్రాచీన సమాజములో ఆస్తికి మూలాధారము స్వాధీనము' కృషి. ప్రాచీన రోమన్ న్యాయశాస్త్రమందు 'ఆక్రమణ సిద్ధాంతము' (Occupation) ప్రకారము, భూమిని మొట్టమొదట ఆక్రమించిన వ్యక్తికే అందలి స్వామ్యము సంక్రమించును. స్వామిహీనమైన వస్తువును (Res nullius) మొట్టమొదట స్వాధీనము చేసికొన్న వ్యక్తే స్వామి. బ్లేక్ స్టన్ (Blackstone) కూడ యిదే సిద్ధాంతమును ప్రతిపాదిస్తూ "ప్రకృతియొక్కయు, న్యాయశాసనములయొక్కయు, సూత్రముల ప్రకారము, మొట్టమొదట ఒక వస్తువు నుపయోగించిన వ్యక్తి, ఆ వస్తువులో ఒక అశాశ్వతమైన ఆస్తిని (Transient property) సముపార్జించెను. అట్టి ఆస్తి, ఆ వ్యక్తి ఆ వస్తువు నుపయోగించినంతకాలముమాత్రమే యుండెడిది. అనగా స్వాధీనపు హక్కు, స్వాధీనమున్నంతకాలమే నిలిచెడిది." అదేవిధముగా సెవిగ్నీ (Savigny) స్వామ్యమును "చిరకాలానుభవమువలన పరిణతి చెందిన ప్రతికూలస్వాధీనము (Adverse possession ripened by prescription) అని నిర్వచించెను. మనుస్మృతిలోకూడా సుమారు ఇదేభావము వ్యక్తపరచినట్లు తోస్తున్నది.

'పృథోరపీమాం పృథ్వీం భార్యాం
పూర్వవిదో విదుః
స్థాణుచ్ఛేదస్య కేదార మాహుః
శల్యవతో మృగం.'—

ఈ భూమి సర్వస్వము, మొట్టమొదటి రాజైన పృథు యొక్క భార్య అనియు, కృషిచేసినవానిదే భూమి, వేటాడి సంపాదించుకొనిన జంతువు వేటకానిదే యనియు, శ్లోకమునకు తాత్పర్యము. న్యా॥మూ॥ ముత్తుస్వామిఅయ్యరుగారుకూడా అట్లేవ్యాఖ్యానిస్తూ, "హిందూ లా ప్రకారము, మొట్టమొదటిసారిగా భూమిని లాభదాయకముగా ఉపయోగించినవానికే, ఆ భూమిపై స్వాధీనపు హక్కు కలదు. ప్రభుత్వమునకు అట్టి భూమిపై పన్ను విధించు హక్కు కలదు. అట్లాక్రమించినతర్వాత, ఆ భూమిని ఆ వ్యక్తి ఉపయోగింపని పక్షమందున్నూ, తత్ఫలితముగా ప్రభుత్వ రాబడికి నష్టము వాటిల్లినపుడున్నూ, అట్టి రాబడిని సంరక్షించు నిమిత్తము తగిన చర్యలు తీసుకొనుటకు ప్రభుత్వమునకు సార్వభౌమాధికారము కలదు." అని వచించారు.* ఈ ప్రవచనముల వ్యాఖ్యానములవలన, ఆస్తి, అందలి స్వామ్యమున్ను, మానవుని కృషికి గాఢసంబంధమున్నట్లు కనుపిస్తున్నది. స్వయంకృషిఫలితముగా సముపార్జించిన పదార్థమందు వ్యక్తికి స్వామ్యము కలదని గుర్తింపబడినది. కాని యీ సూత్రము చరిత్రలో అన్ని దశలకు వర్తించునా? ఆస్తి సముపార్జనకు వ్యక్తి కృషికి ఎల్లప్పుడును వాస్తవమైన సంబంధముంటూవచ్చినదా? ఆస్తిసముపార్జనకు స్వయంకృషికి అట్టి సంబంధము లేనప్పుడు యీ హక్కు ఎట్టి పరిణామమును చెందును? లేక చెందకలేను? అను సమస్యలు పరిశీలింపబడవలెను. అనగా వివిధ దశలలో ఆస్తి నిర్వర్తించు కార్యములు, ఒక దశనుండి వేరొక దశకు మారినపుడు, ఆ కార్యములందలి రూపాంతరీకరణ (Functional Transformation), కార్యములకు, సంస్థకు (Institution) గల సంబంధము పరికించవలెను.

## ఆస్తి: కార్యాత్మకవివేచనము (Functional analysis)

### కార్యములందలి రూపాంతరీకరణ (Functional Transformation)

ప్రఖ్యాత ఆస్ట్రియన్ సోషలిస్టు న్యాయశాస్త్రవేత్త, కారల్ రెన్నర్, మార్క్సు ఎంగెల్సుల కొన్ని ప్రవచనములను, యూరప్ ఖండమందలి సామాజిక చట్టపద్ధతులను, వ్యవస్థలను ఆధారము చేసికొని, వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయముల నిక్కడ పొందుపరుస్తున్నాను. ముఖ్యముగా యూరపుఖండమే ఆయన దృష్టిలో నున్నప్పటికీ, యీ వివేచనమందలి సత్యములు సాధారణముగా విశ్వజనీనములే.

మార్క్సు, ఎంగెల్సు ప్రత్యేకముగా చట్టము (Law) దాని యొక్క పరిణామము రూపాంతరీకరణమును గూర్చి వ్రాయక పోయినప్పటికీ, విశాల తాత్త్వికదృష్టితో కొన్ని ప్రతిపాదనలను చేసినట్లు తోస్తున్నది. వాని సారాంశమిది.

సామాజిక ఉత్పత్తిలో మానవులు కొన్ని సుస్పష్టమైన సంబంధములలోనికి ప్రవేశించుదురు. ఈ ఉత్పత్తి సంబంధములు తత్కాల ఉత్పత్తిశక్తుల ననుసరించి ఉండును. ఈ సంబంధముల సాకల్యమే ఆనాటి సమాజముయొక్క ఆర్థిక నిర్మాణము. అట్టి నిర్మాణపు పునాదులపైని ఆధారపడి రాజకీయ, చట్టవ్యవస్థలు నిర్మింపబడును. అట్టి ఉపనిర్మాణము (Super-structure) నకనుగుణముగా, దానిపై నాధారపడి వివిధస్వరూపముల సామాజిక చైతన్యము లుండును. ఆర్థిక సంబంధముల, నిర్మాణవ్యవస్థల ననుసరించి, సామాజిక చైతన్యము, సమాజముయొక్క ఆశయసముచ్చయము (Ideology) వృద్ధిపొందును. అట్లు వృద్ధిపొందిన భావములకు తమ ఆర్థిక మూలాధారముల (Economic origin) నుండి, విడదీయబడి, మరల ఆర్థిక వ్యవస్థపై ప్రతిఘాతము (React) చేయు లక్షణము కలదు. అనగా ఒక సమాజముయొక్క ఆశయసముచ్చయము ఆర్థికవ్యవస్థనుండి ఉత్పన్నమవుతూ, తిరిగి అదే ఆర్థికవ్యవస్థ నుండి వేరగుచూ, ఈ వ్యవస్థపైని తన ప్రభావమును ప్రదర్శించును. రాజకీయ, చట్ట వ్యవస్థలు, అందలి నిహిత భావములు, రీతులు

* Secretary of State for India. Vira Rayan 9 Mad. 175.

(Norms) ఆర్థిక కారణముల మూలముగా ఉత్పన్నమయినప్పటికీ, తిరిగి తమ శక్తిని, ప్రభావమును, అట్టి ఆర్థికవ్యవస్థపై ప్రదర్శించును. ఆర్థికవ్యవస్థకూ, తత్ఫలితముగ ఉత్పన్నమయిన భావములకూ (ఉదా: రాజకీయచట్టములందలి వివిధ రీతులకు) మధ్య నిరంతరము ఒక ఘాత ప్రతిఘాత చర్య (Action and Reaction) జరుగుచునే యుండును. ఈ భావములకు తమ ఆర్థిక మూలాధారముల నుండి విడదీయబడు ధర్మమొకటి కలదు. తత్ఫలితముగా రాజకీయ చట్టసంస్థలు (Institutions) రీతులు, ఒకానొక చారిత్రకసమయమందు కొన్ని నిర్దిష్టమైన ఆర్థికప్రయోజనములకొరకు సృష్టింపబడినప్పటికీ తత్ప్రయోజనములూ, వాని అవసరము గతించిన పిమ్మట కూడ, యీ సంస్థలు, వీని స్వరూపము (Form) మారదు. అంతేకాక అదే సంస్థయొక్క కార్యముల (Funtion)లో రూపాంతరీకరణము (Transformation) వచ్చినప్పటికీ సంస్థయొక్క బాహ్య స్వరూపముమాత్రము యథాతథముగనే యుండును. అట్టి రూపాంతరీకరణ సులభవస్తూత్పత్తిదశనుండి (Age of simple commodity production) పెట్టుబడిదారీవ్యవస్థలోనికి సమాజము పరిణామము చెందుటలో మనకు సుస్పష్టముగ గోచరమగును.

సులభవస్తూత్పత్తిదశలో ఉత్పత్తిదారుని స్వామ్యమందు ఒక సమైక్యత (Unity) ఉన్నది. తనస్వంతములైన ఉత్పత్తిసాధనములు, గృహము, పరికరములయొక్క సహాయముతో, తమ స్వయముగా కొనుక్కొనిన ముడిసరుకులను, తనయొక్క, తన కుటుంబముయొక్క కృషితో వస్తువులను తయారుచేసి, ఉత్పత్తిదారుడు సాధారణముగా తనే స్వయముగ కొనుగోలుదారునికి విక్రయించెడివాడు. ఈదశలో ఆస్తిస్వామ్యములు తమ ఆర్థిక మూలాధారములైన వ్యక్తికృషిఫలితములు. ఆస్తిస్వామ్యములు జీవనాధారసాధనములు.

పెట్టుబడిదారీవ్యవస్థాగమనముతో ఆస్తిస్వామ్యములలో ఒక వినూత్నమైన పరివర్తన వచ్చినది. స్వామ్యమందలి సమైక్యత అదృశ్యమైనది. ఉత్పత్తిదారునకు ఉత్పత్తిసాధనములపై స్వామ్యము లేదు; ఉత్పత్తిసాధనములుగల స్వాములకూ, ఉత్పత్తియందలి కృషికీ సంబంధములేదు. ఆస్తి అనునది 'పెట్టుబడి'గా రూపాంతరము పొందినది. ఉత్పత్తిసాధనములు గలవారు పెట్టుబడిదారులు; అట్టి సాధనవిహీనులు శ్రామికులు.

ఆస్తి అనునది పెట్టుబడిగా మారుటవలన, ఆస్తి స్వామ్యముల కార్యములందుకూడా చాల మార్పులు వచ్చినవి. ఆస్తి వహించిన యీ నూతనపాత్రకు, మరికొన్ని యితర సహాయకరచట్టసంస్థల (Complmenary Legal Institutions) యొక్క సహాయమవసరమయినది. ఒప్పందములకు (Agreements); కంట్రాక్టులకు, బాధ్యతలకు (Obligations) సంబంధించిన చట్టసంస్థలయొక్క సహకారముతో ఆస్తి నూతనకార్యనిర్వహణకు పూనుకొనినది. వర్తక సంస్థలు, కంపెనీలలోని షేర్ల (Shares) మూలముగా, అదనపు లాభముల నార్జించుటకూ, ఋణములమూలముగా వడ్డీలకూ, కౌలు మూలముగా బాడుగలకూ, ఆస్తి ఒక సాధనమైనది. తనఖావలన, ఆర్థికస్వామ్యమునకూ (Economic ownership) చట్టసమ్మత స్వామ్యమునకూ, (Legal ownership) విభజన ఏర్పడినది. తనఖాపెట్టిన ఋణగ్రస్తునకు తనఖా ఆస్తిపై చట్టసమ్మతస్వామ్యమున్నప్పటికీ, స్వామ్యముయొక్క ఆర్థికోపయోగము (Economic Utility) మాత్రము ఋణదాతకు సంక్రమించినది. క్రయము కౌలు, ఋణము మొదలగు సంస్థలు ఆస్తిస్వామ్యములకు ఆదిని సహాయకర చట్టసంస్థలుగా ఉద్భవించి. కాలక్రమేణ ఆస్తియొక్క స్వరూపమునే మార్చి, మూలసంస్థయిన ఆస్తియొక్క కార్యముల నిర్వహణకు పూనుకొనినవి. అట్టి సహాయకారిసంస్థలలో ముఖ్యమైనది ఉద్యోగపు కంట్రాక్టు, (Contract of Service.)

లాంఛనప్రాయముగా, న్యాయశాస్త్రరీత్యా కంట్రాక్టు అనునది యిద్దరు సమానవ్యక్తుల మధ్య జరుగు ఒడంబడిక. ఇది స్వకీయమైన చట్టసంస్థ (Institution of private law). కాని వాస్తవముగా పెట్టుబడిదారీవ్యవస్థలో యీ కంట్రాక్టు నిర్వహించిన పాత్ర మాచినచో, యీ ఒప్పందపు స్వేచ్ఛ (Freedom of contract) చాల పరిమితమయిపోయినది. ఉత్పత్తిసాధనములపై స్వామ్యముగల వివిధవ్యక్తులలో ఏ ఒక్కరినో ఎంచుకొని నిర్బంధముగా, వానికి తమ శ్రమఫలితము సాయత్తముచేయుటకు మాత్రమే, ఉత్పత్తి సాధనభ్రష్టులైన శ్రామికులకు, యీ కంట్రాక్టుపయోగపడుచున్నది. ఈ కంట్రాక్టువలన శ్రామికుడు తనకృషిఫలితమైన వస్తువును పెట్టుబడిదారుని కిచ్చివేయుట కంగీకరించును. కనుక లాంఛనప్రాయమైన స్వేచ్ఛ, సమానత్వముల వెనుక పెట్టుబడిదారునికి ఉత్పత్తిసాధనవిహీనుల నాజ్ఞాపించు ఒక సామూహికశక్తి (Public power of Command) ప్రసాదితమైనట్లుతోచకమానదు. చట్టరీత్యా, బాహ్యస్వరూపములో స్వామ్యము స్వకీయమైనచట్టసంస్థగానే వుంటూ, వస్తువులపై సర్వాధికారములను ప్రసాదించు ఒక హక్కుగానే యున్నప్పటికీ, కార్యాత్మకము (Functional)గా వేరొకరూపమును పొంది. యితర సహాయకారిచట్టసంస్థలు (ఉదా॥ ఉద్యోగపుకంట్రాక్టు) స్వామ్యముయొక్క కార్యముల నాచరించుటవలన, అన్యులపై అధికారము చలాయించుసాధనముగా, ఒక సామూహికచట్టసంస్థ (Institution of public Law) గా రూపాంతరీకరణమును పొందినది.

ఆస్తి అన్యుల నాజ్ఞాపించుటేకాక, పారిశ్రామిక విప్లవ ఫలితముగా, యితరకార్యముల నిర్వహణకు కూడ పూనుకొనినది. శాస్త్రీయవిజ్ఞానాభివృద్ధితో, కొత్తయంత్రముల ఆగమనముతో పెద్దపెద్దకర్మాగారములు, భారీపరిశ్రమలు స్థాపింపబడినవి. ఈ కర్మాగారములలో వేలకొలది కార్మికులు శ్రమించుట జరిగినది. ఒక వస్తూత్పత్తిలో అనేకమంది పాల్గొనుట, అనేకుల శ్రమ యిమిడివుండుట మూలముగా, ఉత్పత్తి వ్యక్తిగతముకాక సామాజికమయినది. వస్తువు వ్యక్తి స్వయంకృషిఫలితముకాక సామాజికఫలమైనది (Social Product). ఇట్టి సామాజికఉత్పత్తి పద్ధతిని నడపుటకు, వివిధతరగతుల శ్రామికులమధ్య శ్రమ విభజనచేసి, పరిశ్రమకు యాజమాన్యము వహించి, ఉత్పత్తిని సంఘటితము చేయుట (Organization) ఎంతో అవసరము. ఆ కార్యమును కూడ ఆస్తియే స్వీకరించినది.

అంతేకాక భారీపరిశ్రమలమూలముగా ప్రాతసాంఘికవ్యవస్థంతా ఛిన్నాభిన్నమయిపోయినది. ప్రారంభములో యంత్ర

ములు మానవునికి ఉపయోగించు సాధనములుగా ఉద్దేశింపబడినప్పటికీ, యంత్రములకు మానవు డనంతదాస్యములో బంధీకృతుడయినాడు. ఈ యంత్రసార్వభౌమత్వము, మానవుని కృషికి, శక్తులకు పోటీగా నిలబడి పనిచేయసాగినది. ఉత్పత్తిదారునికి పూర్వమున్న ఆర్థిక, యితర, స్వతంత్రములు, స్వేచ్ఛలు నశించినవి. కుటుంబ జీవితము మృగ్యమయినది. సహకారోత్పత్తికి, సామాజికోత్పత్తికి, శ్రమవిధానమును (Labour process) శ్రమపద్ధతులలో నడుపుట చాలఅవసరము. కాని అట్టి శ్రమనిర్మాణమంతయు, శ్రామికులపై విధింపబడిన ఉద్యోగపు షరతుల వికృతస్వరూపమును దాల్చినది.

పైన వివరించిన పరిస్థితులమూలముగా, ఆస్తిస్వామ్యములు, యితరసహాయకారిచట్టసంస్థలతో పనిచేసి, మొత్తము సమాజమును, సంఘటితపరచి, ఆజ్ఞాపించి, ప్రాతసాంఘికవ్యవస్థాపునాదులను కదలించు ప్రచండమైన శక్తిగా రూపొందినది.

ఇట్టి రూపాంతరీకరణమును, సామాజికపరిస్థితులందలి మార్పులను, కాలక్రమేణ చట్టముకూడ గుర్తింపక తప్పినదికాదు. సామాజిక ఆర్థిక వ్యవస్థలందలి కొన్ని తీవ్రమయిన వైరుధ్యములు గుర్తింపబడినవి. ఇందు మొదటిది ఉత్పత్తివిధానములు సామాజిక మయినప్పటికీ తత్ఫలముల పంపిణీవిధానముమాత్రము వ్యక్తిపరముగానే యుండుట. రెండవది లాంఛనప్రాయమయిన సమానత్వము, వాస్తవముగా సాంఘిక అసమానత్వముగా పరిణమించుట. కనుక నిజమైన సమానత్వమును, స్వేచ్ఛను పునరుద్ధరించుటకు, రాజకీయస్వేచ్ఛ, సమానత్వము, ఆర్థిక సామాజిక రంగములలో కూడ ప్రతిబింబింపవలెనని గుర్తింపబడినది. "చట్టములయొక్క కాఠిన్యమును, న్యాయమాత్రము అవే క్షీణింపజేయుచున్నయెడల న్యాయమునకు బదులు అన్యాయముద్భవించు ననినాడు సిసెరో. (Cicro—Summum jus summa injuria) ఈ నూతనదృక్పథము అనేకవిధములైన సంఘసంక్షేమ శాసనములకు దారితీసినది. కార్మికుల ఉద్యోగపు నిబంధనలను, వారిజీవిత సంరక్షణగురించి, చేయబడిన అనేకవిధములైన ఫ్యాక్టరీ చట్టములు, నష్టపరిహారచట్టములు, నిర్బంధ భీమావిధానముల మూలముగా, పారిశ్రామికుల ఉద్యోగపు పరిస్థితులు సామాజిక అధికారమునకు లోబడునట్లుగా చేయబడినవి. అనగా ఆస్తిస్వామ్యములు, కంట్రాక్టులు రానురాను వహించుచున్న సామూహికచట్టతత్వము (Public Law Character) చట్టముకూడ గుర్తించిన దనినమాట. లాంఛనప్రాయముగా, మనుష్యుల మధ్య జరుగు వ్యవహారములుగానుంటూ, వ్యక్తిగతమైనటువంటి హక్కులపేరిట, స్వకీయమైన చట్టసంస్థా స్వరూపములో ఆస్తిస్వామ్యములు నిర్వహించి, కొనసాగించు చర్యల, సామూహిక సామాజిక తత్వము గుర్తింపబడి, వానిని సామాజికాధికారమునకు లోబడునట్లు చేయవలసిన ఆవశ్యకత గుర్తింపబడినది. అంతేకాక ప్రజోపయోగకరములయిన రవాణా కంపెనీలు, తదితర వర్తకసంస్థలు అనేక వేలమంది కార్మికులచే నడుపబడి, వేలకువేల ప్రజలచే ప్రతిక్షణమూ ఉపయోగింపబడుటవలన, కంపెనీలకు ప్రజలకు మధ్య, కంపెనీలకు కార్మికులకు మధ్య సంబంధబాంధవ్యములను, చట్టరీత్యా నిర్వచించి, క్రమపద్ధతులలో నడుపవలసిన అవసరముకూడ కలిగించినది.

## ఆస్తి ఒక సాంఘిక సమస్య

ప్రాచీన సమాజములో ఆస్తిస్వామ్యముల కాధారము కృషి. కృషిఫలితమందు వ్యక్తికి హక్కు ఉన్నట్లు గుర్తింపబడినది. కాని భూస్వామ్యవ్యవస్థాగమనముతో మరల కొన్ని తీవ్రమైనమార్పులు వచ్చినవి. ఉత్పత్తిదారుడు తన శ్రమఫలమందు హక్కునుకోల్పోయినాడు. సమాజమంతయు సోపానప్రాయముగ వివిధ తరగతులలోనికి విభజింపబడినది. ఇంగ్లండును నార్మనులు జయించిన తర్వాత భూమియందలి స్వామ్యము రాజాదేననియు, రాజువినా మిగతావ్యక్తుల కట్టి హక్కు లేదనియు, వారిహక్కు అనేక షరతులకు లోబడి బాధ్యతల నిర్వహణకు బదులుగా, యివ్వబడినటువంటి పరిమితమైన కౌలుహక్కు (Tenure)* అనియూ ప్రకటింపబడినది. రాజు, ఆయనక్రింద భూస్వాములు, ఉపభూస్వాములు, కౌలుదారులు, రైతులు, కూలీలు అను తరగతులుగా సమాజము విభజింపబడినది. వ్యవసాయఫలముగూడ ఆ తరగతులమధ్య నిష్పన్నతముల ప్రకారము, దానిననుసరించి పంపిణీ చేయబడినది. ఆ వ్యవస్థ యొక్క అవసర మున్నంతకాలము ఆ సామాజికపద్ధతిగూడ నిలచినది. ఆనాటి సామాజికావసరములకు, రక్షణ ఏర్పాట్లకు, తదితర ప్రభుత్వ కార్యకలాపములకు, సమస్తమైన కార్యక్రమములకు, వ్యక్తులమధ్య సంబంధములకు, సమాజ సమైక్యతకు, భూమియే మూలాధారము కాబట్టి, వ్యవసాయము జీవనాధారము కాబట్టి, వాటి ఉత్పత్తివిధానము సామాజికావసరములను ప్రతిబింబించినదనే చెప్పవలెను. కాని సమాజము నూతనవ్యవస్థోదయమును దర్శించుట వలన పాతవ్యవస్థ ఒక శృంఖలముగా పరిణమించినది. నూతన వ్యవస్థతోపాటు నూతనపద్ధతులుగూడ పొడచూపుటచే కొత్త పాతలమధ్య సంఘర్షణ ప్రారంభమైనది. ప్రచండమైన పోరాటముల ఫలితముగా (ఉదా : 1789 వ సం॥ ఫ్రెంచి మహావిప్లవము.) ఉత్పత్తిదారుడు తిరిగి తనస్వేచ్ఛను సముపార్జించుకొనినాడు.

భూస్వామ్యవ్యవస్థ తరవాత దశ సులభవస్తూత్పత్తిదశ. ప్రతివ్యక్తి తనపనిముట్లు, తన యిల్లు, తన కుటుంబము, తనసొంత ఉత్పత్తిశాల (Workshop) ను నెలకొల్పుకొని, తనయిష్టము వచ్చిన రీతిని శ్రమించి, తన శ్రమఫలితమును విక్రయించుకొనుటకు స్వేచ్ఛ సంపాదించుకొనినాడు. ఇల్లు, ఉత్పత్తిశాల, కుటుంబము, బిడ్డలు, ఉత్పత్తికి చాలా అవసరమైన ప్రమాణములు. కనుక వీనియందలి స్వామ్యములో ఒక సమైక్యత చట్టమందుకూడ ద్యోతకమగును.† అనేవిధముగా ప్రతివ్యక్తి తన కుటుంబమునకు, జీవనాధారముల నిమిత్తము, కొంత ఆస్తిని సముపార్జించి పెట్టుట, న్యాయము, సమంజసము కనుక చట్టమందుకూడ ఏర్పాటు చేసినది. సోషలిస్టుదేశమైన సోవియట్ యూనియన్‌లో కూడ ఈనాటికి కొన్ని పరిమితులలో వారసత్వపుహక్కు ఈయబడినది.

* ఈ పదమునకు ఇంగ్లండులో ఒక శాస్త్రీయమైన ప్రాముఖ్యత కలదు. అది ఫ్యూడల్ ఆర్థికవిధానమువలన కల్గినది.

† 1882 వ సంవత్సరమువరకు ఇంగ్లండులో భార్యాభర్తల ఆస్తి ఒకటిక్రిందనే చట్టము భావించినది.

కాని పెట్టుబడిదారీవ్యవస్థాగమనముతో తిరిగి పరిస్థితులు తారుమారైనవి. భూస్వామ్యవ్యవస్థాంతరము ఉత్పత్తిదారునికి లభించిన స్వేచ్ఛ మరల అదృశ్యమయినది. భూస్వామ్యవ్యవస్థకన్న కఠినమైన పద్ధతులలో శ్రామికశక్తిపై అధికారము చలాయింపబడినది. ఆస్తిస్వామ్యములకు, కృషికి మధ్యగల సంబంధము తెగతెంపులైనది. ఆస్తి అనునది, యితరుల శ్రమఫలితమును, హస్తగతము చేసికొని అదనపు లాభములను సంపాదించు సాధనముగా పరిణమించినది. సమాజము మొత్తము కృషి చేసి, ఉత్పత్తి చేసిన ఐశ్వర్యము, ఎట్టిశ్రమయును పడని, కృషి చేయని కొద్దిమంది వ్యక్తులమధ్య విభజింపబడుటకు అవకాశమేర్పడినది. ఇది ఆస్తి పెట్టుబడిగా మారి, నిర్వర్తించుచున్న నూతన కార్యముల ఫలితము. శ్రమఫలముగా సమర్థనీయమైన ఆస్తి, జీవనాధారనిమిత్తము గుర్తింపబడిన వారసత్వపు హక్కులు, (పెట్టుబడిదార్ల కుటుంబములందు) తీవ్రమైన సంఘవ్యతిరేకశక్తులుగా పరిణమించినవి. ఇది ఆస్తి యీనాడు సృష్టించిన సాంఘికసమస్య. ఈ సమస్యను, అన్ని దేశములలోనూ, ఏదోఒక సమయమందు ఎదుర్కొని పరిష్కరింపవలసియుండును.

## ఆస్తి: న్యాయసమస్య

చట్టమందలి విధిరీతులు (Norms) కొన్ని నిర్దుష్టమైన ఆర్థిక ప్రయోజనములకొరకు, కొన్ని నిర్దుష్టములైన కార్యముల నిర్వహణకొరకు సమాజముచే సృష్టింపబడును. ఆ రీతుల బాహ్యస్వరూప మట్లే యున్నప్పటికీ, కాలక్రమేణ వాని కార్యములలో పరివర్తన వచ్చి, అవి కార్యాత్మకరూపాంతరీకరణమును పొందవచ్చును. అట్టి మార్పుల ఫలితముగా, ఆ రీతులు శుద్ధవ్యతిరేకములయినవిగా (Opposite) మారవచ్చును. కనుక రీతుల ప్రయోజనము సాధింపబడవలెనన్న, కార్యాత్మకరూపాంతరీకరణముతో పాటు రీతులనుకూడ తదనుగుణముగ మార్చి సవరింపవలెను. స్వేచ్ఛతో, యీ రీతి కార్యములమధ్య వైరుధ్యముల తొలగించి, తన చట్టరీతులను మార్చుకొనగలిగిన సమాజమే సామ్యవాదసమాజము.

చట్టమందలి విధిరీతులయొక్క మంచిచెడుగులు, అవి నిర్వర్తించు కార్యములపై నాధారపడియుండును. సహాయకారిచట్టసంస్థలయొక్క ప్రయోజనములు, మంచిచెడుగులుకూడ వాని కార్యములపై నాధారపడియుండును. ఉదా: ఉద్యోగపు కంట్రాక్టు స్వతస్సిద్ధముగా మంచికాదు, చెడూకాదు. ఇది ఏ సామాజికవ్యవస్థయందైనను యుండవచ్చును. అయితే ఒకానొకదశలో, ఆ కంట్రాక్టు ఆస్తి సంస్థతోకూడి, పనిచేసినప్పు డది సంఘసంక్షేమవిరుద్ధశక్తిగా మారి, అట్లు వినియోగింపబడవచ్చును. కనుకనే అది అనేకవిధములైన శాసననిర్బంధములకు, కట్టుదిట్టములకు (ఉదా: ఫ్యాక్టరీ చట్టములు, షాపు అసిస్టెంటు చట్టములు.) గురిచేయబడినది.

ఆస్తి స్వకీయమైన చట్టసంస్థ. ఆస్తిస్వామ్యములు వ్యక్తిహక్కులకూ బాధ్యతలకూ సంబంధించిన విషయములు. ప్రకృతిసిద్ధమైన హక్కుల (Natural Rights) కొరకు జరుపబడిన అనేకమైన పోరాటముల ఫలితముగా యీనాడు ప్రతివ్యక్తి స్వేచ్ఛాస్వాతంత్ర్యముల ననుభవింపగల్గుచున్నాడు. ఆ స్వేచ్ఛతో, ఆ స్వేచ్ఛాపరిమితులతో ప్రభుత్వము ఎట్టిజోక్యమును కల్గించుకొనరాదని శతాబ్దముల క్రింద తీర్మానింపబడినది. వివిధదేశములలో, రాజ్యాంగ రక్షణకూడా ఆ స్వేచ్ఛ కీయబడి, రాజ్యాంగము ద్వారా అట్టి స్వేచ్ఛతో ప్రభుత్వములకు జోక్యము కలిగించుకొను అధికారము లేకుండ చేయబడినది. ఈ స్వేచ్ఛ ప్రతి మానవునికీ, తన ఐహికసౌఖ్యమునకూ, మానసికమయిన కృషికీ, తన వ్యక్తిత్వమును సాధించుకొని, సుఖజీవనము చేయుటకు ఎంతో అవసరము. మానవునకు సుఖజీవన సాధనములుగా ఉపయోగింపబడు వస్తువులలో ఆస్తిస్వామ్యములుకూడ మానవస్వేచ్ఛలో ఒక భాగమే. వర్తమానమందేకాక భవిష్యత్తునందుకూడ యిట్టి స్వేచ్ఛ మానవునికి వుండకతప్పదు. ఎట్టి సామాజికవ్యవస్థలందైనను, ప్రతి వ్యక్తికి తనదైన యిల్లూ, కొన్ని వస్తువులూ, లేనిచో సుఖజీవన మసాధ్యము. కాని, పెట్టుబడిరూపములో ఆస్తి నిర్వహించుచున్న పాత్రకూ, సుఖజీవనసాధనకూ ఎట్టి సంబంధమును లేదన్న విషయము సువిదితమే. ఆస్తిస్వామ్యములకొరకు, మానవునికి వస్తువునకు ఏవిధమైన సంబంధము వుండనవసరములేదు. కంపెనీలందలి షేర్‌హోల్డర్లవద్ద కొన్ని కాగితములు దస్తావేజులు మాత్రమే యుండును. కొన్ని వేలమైళ్ళ దూరములో 'వారియొక్క' కర్మాగారములో బొగ్గుగనులు ఉండును. వానిపై తమకెట్టి అజమాయిషీ అధికారము (Control) లేకున్నను సంవత్సరమున కొకసారి లాభములుమాత్రము షేర్‌హోల్డర్ల పేర జమ చేయబడును. స్వామ్యము, ఆస్తి, సుఖజీవనసాధనములుగా లేక, లాభముల నార్జించు సాధనములుగా వాడబడుచున్నవి.

అంతేకాక, చిరకాలమునుండియూ, ఒక వస్తువు సమాజమున కంతటికీ సంబంధించినపుడు ఆ వస్తువు కేవలము వ్యక్తిగతమయిన విషయమనుటకు వీలులేదని సిద్ధాంతీకరింపబడినది. వేలకువేల జీవితముల వర్తమానము, భవిష్యత్తు, ముడిపడియున్నటువంటి కర్మాగారములు బొగ్గుగనులు వగైరా పారిశ్రామికసంస్థలు, వాస్తవముగా సామాజికసంస్థలే.

ఇవి సూక్ష్మముగా చట్టరీతులు సమాజమునకు సృష్టించిన సమస్యలు.

## సమస్యా పరిష్కారము

పై వివరణవలన యీనాడు ఆస్తిహక్కు అనునది కేవలము వ్యక్తులపట్ల గుర్తింపబడుట అసాధ్యము. అవాంఛనీయమని తేలినది. ఎంతటి వైయక్తికవాదులు ((Individualists) కూడ నేటి సామాజిక ఆర్థిక విధానములలోని వైరుధ్యములు కారణముగా, (సామాజిక ఉత్పత్తీ, వ్యక్తిపరమగు పంపిణీ) వాస్తవముగా సాంఘికన్యాయము లభించుటలేదని అంగీకరింపకతప్పదు. ఈ సమస్యాపరిష్కారమునకు సూక్ష్మముగా రెండుమార్గములు కలవు. మొదటిది, పరిపూర్ణ స్వేచ్ఛాస్వతంత్రములతో చట్టమందలి రీతులను మార్చుట—ఇది విప్లవ మార్గము—సోవియట్ యూనియన్, మొదలగు దేశములనుసరించి

వది. రెండవది స్థాపితవ్యవస్థాపరిమితులలోనే, చట్టమందలి రీతుల కాఠిన్యమును తగ్గించి, వ్యక్తుల నిరంకుశత్వమును సామాజికాధికారమునకు లోబడియుండునట్లు చేయుట. ఇది సంస్కరణమార్గము. ఇది సామాన్యముగా అన్ని ప్రజాస్వామ్యదేశములూ అనుసరించుచున్న మార్గము. అయినను, వివిధదేశముల సామాజిక, నైసర్గిక, యితర పరిస్థితుల కనుగుణముగా, యీ హక్కు దీనిపరిణామము మారుచుండును.

## సోవియట్ సమాఖ్య

సోవియట్ రాజ్యాంగములో ఆర్టికల్స్ 14, 10 వ్యక్తుల ఆస్తి హక్కులను సంరక్షించుచున్నవి.

ఆ॥ 14. "పెట్టుబడిదారీఆర్థికవిధానము రద్దు చేయబడుట వలన, ఉత్పత్తివిధానములయందు వ్యక్తిస్వామ్యము రద్దుచేయబడుట వలనను, మానవుడు వేరొక మానవుని దోపిడీచేయుట రద్దు చేయబడిన ఫలితముగాను, సుస్థాపితమైన సోషలిస్టు ఆర్థికవిధానము ఉత్పత్తిసాధనములపై సోషలిస్టుస్వామ్యము, సోవియట్ సమాఖ్య యొక్క ఆర్థిక పునాదులు."

ఆ॥ 10 "ప్రతి పౌరునికీ, తన శ్రమఫలితమైన రాబడులలోను, సంచితములందును (Savings) నివాసగృహమందును, గృహమందు సలిపిన సహాయకరమైన కృషి (Subsidiary enter. prise) యందును, గృహపరికరములందును, వ్యక్తుల సదుపాయము కొరకు, ఉపయోగముకొరకు ఉద్దేశింపబడిన వస్తువులందును, వారసత్వమునకును, గల వ్యక్తిగతమైన ఆస్తి హక్కునకు చట్టరక్షణ ఇవ్వబడినది."

ఇందు ముఖ్యముగా గమనింపదగిన విషయము ఉత్పత్తిసాధనములలో వ్యక్తిస్వామ్యము రద్దుచేయబడుట. అనగా, ఆస్తి పెట్టుబడిగా వ్యవహరించుట రద్దుచేయబడినదన్నమాట. అయినను, సుఖజీవనసాధనకు, కుటుంబపోషణకు, గృహజీవనమునకు, అవసరమైన వస్తువులందు వ్యక్తిస్వామ్యమునకు రక్షణ యీయబడినది. ఇది సోవియట్ యూనియన్‌యొక్క ప్రత్యేక చారిత్రాత్మక రాజకీయ పరిస్థితుల ఫలితము.

## ఇంగ్లండు

బ్లేక్‌స్టన్ (Blackstone) తన వ్యాఖ్యానములలో, ప్రతి వ్యక్తికీ, అన్యులఅధికారమునకు లోబడకుండ తన సముపార్జనములను స్వేచ్ఛగా ఉపయోగించుకొనుటకూ, అనుభవించుటకు హక్కు కలదని చెప్పియున్నాడు. అట్టి హక్కును సంక్షిప్తముచేయు అధికారము శాసనములకు మాత్రమే కలదనివాదు. "ఇంగ్లండుదేశపు శాసనములప్రకారము, వ్యక్తియొక్క ఆస్తుల అక్రమణ ఎంత స్వల్పమైనప్పటికిని, అనధికారప్రవేశము (Tresspass) క్రిందనే భావింపబడును. నా భూమిపై నా అనుమతిలేనిదే ఏ వ్యక్తియును అడుగు పెట్టజాలడు. అట్లడుగు పెట్టినట్లతను ఒప్పుకొనిన పక్షమందు, తన చర్యను ఏదో ఒక శాసనాధికారముక్రింద సమర్థించుకొనవలయును.* శాసనాధికారమువినా, ఇతరమార్గముల వలన, ఏ వ్యక్తియొక్క ఆస్తియు అపహరింపబడజాలదు. అనగా వ్యక్తుల ఆస్తులను ప్రభుత్వము తీసుకొనేముందు, అట్టివ్యక్తుల సమ్మతముగాని లేదా యావత్ప్రజలకు ప్రాతినిధ్యము వహించు పార్లమెంటు యొక్క సమ్మతిగాని యుండవలెను.

పార్లమెంటుకు ప్రజాక్షేమ దృష్ట్యా (1) ప్రభుత్వ రాబడుల వృద్ధిచేయునిమిత్తము పన్నుల విధింపునూ, (2) శాంతికాలమందు పరిశ్రమలు వగైరా నెలకొల్పుటకున్నూ, యుద్ధకాలమందు రక్షణ ప్రయోజనములకొరకున్నూ భూములను, తదితరమైన ఆస్తులను స్వాధీనము చేసికొనుటకున్నూ అధికారము (Eminent domain) కలదు. కాని వ్యక్తుల ఆస్తులను హస్తగతము చేసికొనుటకు ముందు పార్లమెంటు సుస్పష్టమైన భాషలో అట్టి ఉద్దేశమును వ్యక్తము చేయవలెను—లేదా అట్టి ఉద్దేశము పార్లమెంటు చేసిన శాసనము యొక్క సామాన్యఫలితముగా ద్యోతకము గావలెను.† అంతేకాక, నష్టపరిహారము చెల్లించియే పార్లమెంటు వ్యక్తులఆస్తులతో జోక్యం కలిగించుకొనునని కూడ న్యాయస్థానములు ఊహించును.

## అమెరికాలో

అమెరికన్ స్వాతంత్ర్యసంగ్రామము, తత్ఫలితమైన స్వాతంత్ర్య ప్రకటనపైని లాక్, రూసో మొదలగువారి భావముల ప్రభావ మెంతో కలదు. జీవితమునకు స్వేచ్ఛకు, సౌఖ్యసాధనకు ప్రతిమానవునికి పవిత్రమైనటువంటివీ, అనన్యాక్రాంతమైనటువంటి ప్రకృతిసిద్ధమైన హక్కు (Inalienable natural right) కలదని ప్రకటింపబడినది. ఈ ఉన్నతాదర్శములదృష్ట్యా అమెరికను రాజ్యాంగచట్టము రచింపబడినది. అందు వివరింపబడిన ప్రాథమిక హక్కులలోని ముఖ్యోద్దేశముకూడ స్వేచ్ఛకు, సమానత్వమునకు, సమానచట్టరక్షణకు ప్రతిమానవునికిగల హక్కులను ఉద్ఘాటించుటే. ఆస్తిహక్కుకూడ ప్రతి మానవుని స్వేచ్ఛకు, జీవితమునకు సౌఖ్యసాధనకు అవసరమైనదిగా గుర్తించి, అమెరికన్ రాజ్యాంగచట్టమందలి, 5, 14 సవరణలలో, ఆ హక్కును రాజ్యాంగ నిర్మాతలు ప్రతిపాదించిరి.

5 వ సవరణ: "క్రమమైన చట్టపద్ధతి (Due process of Law) లేకుండ ఏ వ్యక్తియొక్క జీవితము, స్వేచ్ఛ, ఆస్తి అపహరింపబడజాలదు."

14 వ సవరణ: ఏ రాష్ట్రముకూడ క్రమమైన చట్టపద్ధతి లేకుండ ఏ వ్యక్తియొక్క జీవితమును, స్వేచ్ఛను, ఆస్తిని అపహరింపజాలదు. రాష్ట్రపు పరిమితులలో ప్రతి వ్యక్తికీ, చట్టముల సమాన రక్షణ (Equal protection of Laws) యివ్వబడవలెను.

5, 14 సవరణలయొక్కయు, అందలి "క్రమమైన చట్టపద్ధతుల" యొక్కయు ముఖ్యోద్దేశము నిరంకుశాధికారములనుండి ప్రజలను రక్షించి, మానవుల స్వేచ్ఛాసమానత్వములను చట్టములోకూడ ఉద్ఘాటించుటే. కాని కాలక్రమేణ, సుప్రీంకోర్టు వారి వ్యాఖ్యానముల ఫలితముగా దీనిఅర్థము తారుమారైనది.

మరియొక విషయము. అమెరికను రాజ్యాంగములో వ్యక్తుల మధ్య చేసుకొన్న ఒప్పందముల బాధ్యతలను చెరచుటకు గాని,

* Entick V. Carrington. † Juglewood pal Co. V. New Brunswick Commission. A. J.R. 1928 P. C. 287.

PIONEERS IN TRANSPORT

1840

రవాణా సాధనముల నిర్మాణంలో మేము అగ్రగణ్యం
మగుటచేత, ఇప్పటి అవసరములను, రా
అవసరములను నిరంతరం పరిశీ
లిస్తూ, ఉత్తమ పద్ధతులను
అవలంభించుటయే
నిత్యము మేము
చేయుచున్న
ది.

1954

ఈ సాధన సంపత్తి
అనుభవములను
నాణ్యత—సేవ అనే
లక్ష్యముసాధించుటకు
వినియోగిస్తున్నాము.

MADRAS-2.

బ్రాంచీలు:
బెంగుళూరు-ఉదకమండలం-తిరుచిరాపల్లి-సికిందరాబాద్-లక్నో

బలహీనపరచుటకు, (Impair) గాని ప్రభుత్వమునకు హక్కు లేదు. వ్యక్తులకు ఒప్పందపు స్వేచ్ఛను (Freedom of contract) రాజ్యాంగము హామీచేస్తూ సంరక్షిస్తున్నదన్నమాట. ఈ సూత్రమును సుప్రీంకోర్టువారు, "ఆస్తులకు సంబంధించిన ఏ ఒప్పందము మూలముగానైనను, ఏ వ్యక్తికైనను కొంత లాభదాయకమైన హక్కు సంక్రమించినప్పుడు", ఆ ఒప్పందములకుకూడ, పైన వివరించిన "క్రమమైన చట్టపద్ధతి" నియమము వర్తించునని వ్యాఖ్యానము చేసిరి. వ్యక్తుల కీయబడిన పై స్వేచ్ఛలు, రక్షణలు, చట్టదృష్ట్యా "వ్యక్తులైన" (Juristic persons) పెద్ద పెద్ద కంపెనీలకు, గుత్తవ్యాపారసంస్థలకుకూడ పొడిగింపబడినవి.* "వ్యక్తి" అను పదముయొక్క అర్థములోనికి గుత్తవ్యాపారసంస్థలు కూడా తేబడినవి. తత్ఫలితముగా, వ్యాపారసంస్థలకూ, వానిలో పనిచేయు కార్మికులకు మధ్య సంబంధబాంధవ్యములలో, వానికి సంబంధించిన విషయములలో ప్రభుత్వము ఏవిధమైన జోక్యము కలిగించుకొనుటకూ వీలులేకుండా చేయబడినది. యజమాని, ఉద్యోగస్తులమధ్య (Employer Employee) వ్యవహారములన్నియూ, ఒప్పందములకు సంబంధించినవగుటవలన, వాటితో ప్రభుత్వ జోక్యము చట్టవిరుద్ధమన్నమాట. అందువలన, కార్మికుల క్షేమము కొరకు చేసిన ఎట్టి సంఘసంక్షేమకార్యక్రమములు, శాసనములైనను సుప్రీంకోర్టువారిచే రద్దుచేయబడు ప్రమాదపరిస్థితి ఆసన్నమైనది. ఈ విధముగా వ్యక్తిహక్కులు, వ్యక్తిస్వేచ్ఛ, అనన్యాక్రాంతమైన ప్రకృతిసిద్ధమైన హక్కులందలి ఉన్నతాశయములు, వ్యాపారసంస్థలనుగూడ 'వ్యక్తులు'గా గుర్తించుటవలన పెడదారిని పట్టినవి. రాజ్యాంగ రక్షణలు చాల అభ్యుదయ నిరోధకసాధనములుగా చేయబడినవి. ఇట్టి పర్యవసానములకు మరికొన్ని పరిస్థితులుకూడ దోహదము చేసినవి.

19వ శతాబ్దాగమనములో అమెరికను సామాజిక పరిస్థితులలో తీవ్రమైన మార్పులు వచ్చినవి. భూగర్భమందలి ఖనిజ సంపదలను కనుగొనుటవలన, వ్యవసాయకస్థితినుండి దేశము బ్రహ్మాండమైన పారిశ్రామికదేశముగా పరిణామము చెందినది. దేశముయొక్క వర్తకవ్యాపారములు, ఖనిజసంపదలు, రవాణా, ధనము మొదలగు ప్రజోపయోగకరములైన వెన్నియో, గుత్తవ్యాపార సంస్థల అధీనములోనికి వచ్చినవి. ఈ దశలో రాజ్యాంగమందలి 5,14 సవరణలపై సుప్రీంకోర్టువారు చేసిన వ్యాఖ్యానములు చాల ఆశ్చర్యకరమైన పరిస్థితులకు దారితీసినవి.

19వ శతాబ్ద మధ్యభాగములో, రవాణా సౌకర్యాభివృద్ధి కొరకు, ప్రజాసమ్మతితో, వివిధ రాష్ట్రీయ ప్రభుత్వములు కొన్ని ప్రయివేటు సంస్థలకు సహాయముచేయుట ప్రారంభించినవి. అనేకపర్యాయములు, యీ సంస్థలవలన నష్టము సంభవించి, తత్ఫలితముగా ప్రజాధనము దుర్వినియోగమైన మాట కూడ నిజమే. కనుక ప్రభుత్వాధికారదుర్వినియోగము నరికట్టు మార్గముల నన్వేషించుట కొక ఆవశ్యకత ఏర్పడినది. ఈ పరిస్థితులలో ప్రఖ్యాత న్యాయశాస్త్రవేత్తలు కూలీ (Cooly) డిల్లాన్ (Dillon) మొదలగువారు కొన్ని సిద్ధాంతములను ప్రతిపాదించిరి. ఆ సిద్ధాంతముల సారాంశము:—1. వ్యక్తులకు సంక్రమించి (Vested) ఆస్తిహక్కులు అనన్యాక్రాంతమైనవి. వీనితో శాసనములు జోక్యము కలుగచేసికొనరాదు. 2. సామూహికప్రయోజనములకొరకు (public purposes) మాత్రమే పన్నులు విధింపబడవలెను. కాని ఏది సామూహిక ప్రయోజన మనునది నిర్ధారణ చేయవలసినది న్యాయస్థానములే. కూలీ సిద్ధాంత ప్రభావముల క్రింద రైల్వే వస్తుసామగ్రిని కొనుట,† ప్రయివేటు సంస్థలకు సహాయముచేయుట, లేదా ఒక పట్నమును పారిశ్రామికప్రయోజనములకొరకు అభివృద్ధిపరచుట‡ సామూహిక ప్రయోజనములు కావని నిర్ధారణచేయబడినది. 3. కాని ఆస్తి హక్కుల పవిత్రతకూడా కొంతవరకూ ఎమినెంటు డొమెయిను (Eminent domain) సిద్ధాంతము మూలముగా తగ్గింపబడిన విషయముకూడ వాస్తవమే. అయినను, యీ విషయములోకూడ ప్రకృతిసిద్ధమైన న్యాయము (Natural justice) పేరిట, న్యాయస్థానములు ప్రభుత్వముయొక్క ఎమినెంటు డొమెయిను అధికారమును కొన్ని పరిమితులకు లోబడునట్లు చేసినవి. అట్టి పరిమితులలో ముఖ్యమైనవి రెండు 1. ఎమినెంటు డొమెయిను అధికారముమూలముగా వ్యక్తుల ఆస్తులను సామూహికప్రయోజనములకొరకుమాత్రమే ప్రభుత్వము తీసికొనగలదు.

2. అప్పుడుకూడ, అపహృతులకు సరిపడినంత నష్టపరిహారము (adequate compensation) యివ్వబడిన పిమ్మటనే, ఆస్తులు స్వాధీనము చేసికొనబడగలవు.

పై వ్యాఖ్యానముల నిరోధముల ఫలితముగా ప్రభుత్వమునకు దేశముయొక్క ఆర్థికాభ్యుదయములో పాల్గొనుటకు అవకాశము లేకుండ చేయబడి, ఆర్థికరంగమంతయు వ్యక్తుల హస్తగతమయినది. వ్యక్తులకు రాజ్యాంగమిచ్చిన స్వేచ్ఛనూ, రక్షణనీ, గుత్త వ్యాపార సంస్థలకుగూడ పొడిగించుటవలన కోట్లకొలది విలువలను హస్తగతం చేసికొని, లక్షలాది ప్రజలను తమ సంస్థలందు నియమించి పని చేయించు, పెద్ద కంపెనీలపై ప్రభుత్వాధికారము క్షీణించినది. పెట్టుబడిదారీ గుత్తవ్యాపారము ఎట్టి కట్టుదిట్టములకు లోనుకాకుండ, విచ్చలవిడిగా వదిలివేయబడి, బలపడి, తీవ్రమైన సాంఘిక సమస్యగా పరిణమించినది. 'సామూహిక ప్రయోజనము'న నిర్ధారణ చేయుటకు న్యాయస్థానములు పూనుకొనుటవలనకూడా తీరని నష్టము కలిగినది.

సామాజికపరిస్థితులలో మార్పుల ననుగుణముగా ప్రతిదేశమందునకూడ ప్రభుత్వములు కేవలము న్యాయపరిపాలన, ప్రజారక్షణ కార్యములతోనే తృప్తిపడక, అనేకవిధములైన సాంఘిక ప్రజా సమస్యల పరిష్కారమునకు పూనుకొనినవి. క్రమేణ పోలీసు రాజ్యవ్యవస్థానె సంక్షేమరాజ్యస్థాపనాశయము ముందుకు వచ్చుచున్నది. కనుక ప్రభుత్వములు ప్రజారోగ్యము గృహవసతులు, భీమా, గ్రామీణక్షేమము మొదలగు ఎన్నియో సమస్యల పరిష్కారమునకు పూనుకొనుచున్నవి. శాసనసభలకు సర్వాధికారమున్నయెడల ప్రభు

* Dartmouth College V. Woodward.

† People V. Salanu

‡ City of Ottawa.

త్వమేమైనను చేయగలరు. కాని శాసనములు చట్టసమ్మతములగునా కాదా అని విచారించుటకు, ప్రభుత్వ కార్యకలాపములను తీవ్రపరీక్షలకు గురిచేసి, వానిపై తీర్పు చెప్ప సర్వస్వతంత్రశక్తి న్యాయస్థానముల కున్నప్పుడు, ఎట్టి సంఘసంక్షేమశాసనములను, కార్యక్రమములనైనను, న్యాయస్థానములు దశాబ్దములతరబడి నిలకడ పెట్టవచ్చును. అమెరికాలో న్యాయస్థానములట్లే చేసినవి. రాజ్యాంగ చట్టమందలి 5,14, సవరణలలోను స్వాతంత్ర్యప్రకటనలలోనూ వివరింపబడిన ప్రకృతిసిద్ధమైన హక్కులలో "నిరాటంకమైన ఒప్పందపు స్వేచ్ఛ (Absolute Freedom of Contract) కూడ యిమిడియున్నదని న్యాయస్థానములు వ్యాఖ్యానము చేసినవి. యజమానికి ఉద్యోగికి మధ్య సంబంధములలో ఏవిధమైన జోక్యము కలిగించుకొనుటకు ప్రభుత్వమున కధికారము లేదని నిశ్చయింపబడినది. కనీస వేతనములు కర్మాగారములలో పనిచేయు కాలపరిమితులు మొదలగు విషయములందు ప్రభుత్వమున కట్టి అధికారము లేకపోయెను. కొలంబియా జిల్లాలో కనీసవేతనములను నిర్ణయించిన శాసనము,[1] న్యూయార్కులోని బేకరీలలో పనిచేయుకాలము పదిగంటలకు మాత్రమే పరిమితముచేసిన చట్టములూ[2] యజమానుల స్వేచ్ఛకు భంగకరముయినవిగా నిర్ణయింపబడి రద్దుచేయబడినవి. ఈ పరిణామము రూజ్ వెల్టు అధ్యక్షుని యొక్క అనేకమైన న్యూ డీల్ (New deal) శాసనములను, ముఖ్యముగా కనీసవేతననిర్ణయచట్టములను[3] యితర సంఘసంక్షేమశాసనములను రద్దు చేయుటలో చాల తీవ్రస్వరూపమును దాల్చినది.

పైన వివరించిన విధముగా రాజ్యాంగమందు హామీ చేయబడిన ప్రకృతిసిద్ధమైన న్యాయము, ప్రకృతి సిద్ధమైన హక్కులు విపరీతవ్యాఖ్యానములకు గురిచేయబడినవి. కాని అందలి ముఖ్యోద్దేశమైన వాస్తవ సమానత్వ సంస్థాపన ఏ విధముగను సాధింపబడకపోవుటయేగాక, అనేకమైన సాంఘిక అసమానత్వములు (ముఖ్యముగా నీగ్రోలవిషయములో) యథాతథముగనే వుంటున్నవి.

కాని రూజ్ వెల్టు అధ్యక్షతలో సుప్రీంకోర్టు న్యాయమూర్తులు మార్చబడిరి. ప్రఖ్యాతి న్యా॥ మూ॥ హోమ్సు కార్డోజో మొదలగువారి నూతన భావోదయములవలన మరల సుప్రీంకోర్టు దృక్పథములో తీవ్రమైన మార్పులు వచ్చినవి. నిరుద్యోగసంరక్షణ చట్టములూ[4], యితర సంఘసంక్షేమ కార్యక్రమములు చట్టసమ్మతములేనని నిర్ణయింపబడినది. సుప్రీంకోర్టు తాను పూర్వమిచ్చిన కొన్ని తీర్పులను త్రోసిరాజనడముకూ[5], కూడ జరిగినది. ఈ నూతన దృక్పథమువలన తిరిగి ఆస్తిహక్కు కొంత సబబైన నిరోధములకు లోబడునట్లు చేయబడినదని చెప్పవచ్చును.

## భారతదేశము

భారత రాజ్యాంగమందు 3 వ అధ్యాయములో ఆర్టికల్ 12 నుంచి 34 వరకూ ప్రాథమికహక్కులు వివరింపబడినవి. అందు ఆస్తి హక్కు కూడ చేర్చబడినది, ఆ॥ 13 ప్రకారం ప్రాథమిక హక్కులను, ఏ శాసనముగాని, సంక్షిప్తము చేయుటకుగాని లేక అపహరించుటకుగాని వీలులేదు. అట్టి అపహారణ లేక సంక్షిప్తము చేయబడినట్లు న్యాయస్థానముల ఎదుట ఆరోపించబడి, ఋజువు చేయబడిన యెడల, ఆ శాసనము న్యాయస్థానములచే రద్దు చేయబడును.

ఆ॥ 14 ప్రకారము సకలజనులు చట్టముముందు సమానులు. భారతావనిలో సమాన చట్టరక్షణ కందరూ అర్హులే. ఇది ప్రజలకందరికీ సామాన్యముగా అన్ని విషయములలో 'యివ్వబడిన సమానత్వపుహక్కు'.

ఆ॥ 19 పౌరులకు స్వతంత్రమునకు గల హక్కును (Right to Freedom) వివరిస్తున్నది. క్లా॥ (f) ప్రకారము ప్రతిపౌరునికి ఆస్తి సముపార్జించుటకూ, ఉంచుకొనుటకూ, అన్యాక్రాంతము చేయుటకూ హక్కు కలదు. క్లా॥ (g) ప్రకారము ప్రతిపౌరుడు తన యిష్టము వచ్చిన ఉద్యోగము, వృత్తి, వర్తకము, వ్యాపారము కొనసాగించుకొనుటకు హక్కు కలదు. క్లా॥ 5 ప్రకారము, ప్రజాక్షేమదృష్ట్యా, లేక షెడ్యూల్డు కొండజాతుల క్షేమదృష్ట్యా క్లా॥ (f) లోని ఆస్తిహక్కుపైని "సబబైన నిరోధములను" (Reasonable Restrictions) విధించుటకు ప్రభుత్వమున కధికారమున్నది. క్లా॥ 6 ప్రకారము, క్లా॥ (g)లోని వృత్తివ్యాపారస్వేచ్ఛపైనకూడ సబబైన నిరోధములను విధించుటకూ, ముఖ్యముగా, సాంకేతిక లేక వృత్తి అర్హతలను (Professional and Technical Qualifictions) నిర్ణయించుటకు ప్రభుత్వమున కధికారమున్నది.

ఆస్తికి హక్కు (Right to Property) ఆ॥ 31 —

క్లా॥ 1. ఏ వ్యక్తియొక్క ఆస్తియూ శాసనాధికారము లేనిదే అపహరింపబడరాదు.

క్లా॥ 2. ఏ శాసనాధికారప్రకారమైనను, సామూహిక ప్రయోజనములకొరకు, ఏ స్థిరచరాస్తులుగాని, ఏ వర్తకవ్యాపార సంస్థలందలి ఫలము (Interest) గాని, లేక అట్టి ఫలములపై స్వామ్యము గల ఏ కంపెనీగాని సముపార్జింపబడిన లేక స్వాధీనము చేసుకొనబడినయెడల, (acquired or taken possesion of) అట్టి శాసనము, సముపార్జింపబడిన లేక స్వాధీనము చేసికొనబడినట్టి ఆస్తులకు నష్టపరిహారమొత్తమును నిర్ణయించుటగాని, లేదా, అట్టి నష్టపరిహారమును నిర్ణయించి చెల్లించువిధానము, సూత్రములనుగాని, స్పష్టము చేయవలెను.

క్లా॥ 3:

2 వ క్లాజులో చెప్పబడినట్టి శాసనమేదైన నూ రాష్ట్రీయ శాసనసభలచే చేయబడినప్పుడు, అట్టి శాసనము రిజర్వుడ్ అధ్యక్షుని పరిశీలనకు ప్రత్యేకింపబడి, అధ్యక్షుని సమ్మతి పొందనిదే అమలులోనికి రారాదు.

1. Adkins' Case 211 U. S. 525.
2. Lochner Case 178 U. S. 45.
3. Schencter Case 259 U. S. 495.
4. Steward Machine Co. V. Davis 301 U. S. 548.
5. Westcoast Hotel Case 300 U. S. 379 over ruled Adkins' Case.

క్లా॥ 4:

రాజ్యాంగ మమలులోనికి వచ్చుసరికి అట్టి బిల్లైన రాష్ట్రీయశాసనసభలచే పాసు (pass) చేయబడి, అధ్యక్షుని సమ్మతికి ప్రత్యేకింపబడి, అట్టి సమ్మతి పొందియున్న పక్షములో, రాజ్యాంగమందలి ఏ సూత్రప్రకారముకూడ అట్టి శాసనముపై 2వ క్లాజు నుల్లంఘిస్తున్నదని ఆకారణముగా ఏ న్యాయస్థానమందునూ సవాలు చేయబడరాదు.

క్లాజు 5:

A. 6 వ క్లాజు వర్తించు శాసనముల మినహాయించి మరి ఏ యితర శాసనములకున్నూ,

B. ఇటువంటి ప్రభుత్వము

1. పన్నులు గాని, దండన (penalty) గాని విధించు నిమిత్తమున్నూ,

2. ప్రజారోగ్యాభివృద్ధికొరకు, లేదా జీవితమును లేక ఆస్తిని ప్రమాదమునుండి అరికట్టుటకున్నూ,

3. భారత ప్రభుత్వమునకూ యితర ప్రభుత్వములకు మధ్య జరిగిన ఒడంబడికలను పురస్కరించుకొని, లేదా యితర కారణముల వలన శాసనముచే, దేశమువదలి వెళ్ళిపోయినవారు విసర్జించిన ఆస్తిగా (Evacuee Property) ప్రకటింపబడిన ఆస్తులపట్లనూ, చేయు ఏ శాసనములకున్నూ, పై 2వ క్లాజు వర్తింపదు.

క్లాజు 6:

రాజ్యాంగ మమలులోనికి వచ్చుటకుముందు 18 మాసముల లోపుగా చేయబడిన ఏ శాసనమైననూ, రాజ్యాంగ మమలులోనికి వచ్చిన మూడు మాసములలోగా అధ్యక్షునికి దాఖలు చేయబడి వచ్చును; అధ్యక్షుడు బహిరంగప్రకటనమూలముగా అట్టి శాసనమును స్థిరపరచిన (Certify) యెడల, అట్టిశాసనము, పై 2వ క్లాజును గాని లేదా గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టము (1935)299 వ సెక్షనులోని 2వ సబ్ సెక్షనును గాని ఉల్లంఘిస్తున్నదనిన కారణముగా సవాలు చేయబడరాదు.

ఆ॥19 లోని ఆస్తిహక్కు పౌరులకుమాత్రమే వర్తించును. ఆ॥31 సమస్తజనులకునూ వర్తించును. క్లా॥ 1 ప్రభుత్వమునకు వ్యక్తుల ఆస్తులపై గల అధికారమును పరిమితము చేస్తున్నది. శాసనాధికారములేనిదే ఏ వ్యక్తియొక్క ఆస్తియునూ అపహరింపబడరాదు అనగా వ్యక్తుల ఆస్తుల నపహరించుటకు, శాసనసభలకు అధికారము కలదన్నమాట. 'శాసనాధికారము' అనుటలో ముఖ్యోద్దేశము ప్రభుత్వమందలి నిర్వాహకశాఖకు (Executive) అట్టి అధికారము లేదనువిషయము స్పష్టము చేయుటే. వ్యక్తుల ఆస్తులు నిర్వాహకశాఖయొక్క నిరంకుశత్వమునుండి రక్షింపబడినవి. కాని ఆస్తిహక్కు శాసనసభాధికారమునకు లోబడియేయున్నదని గ్రహింపవలెను. క్లా॥ 2 అట్టి శాసనసభాధికారముయొక్క పరిమితులను వివరిస్తున్నది. శాసనాధికారముకూడ సాముహిక ప్రయోజనములకొరకు మాత్రమే వినియోగింపబడవలెనని, అట్టి ప్రయోజనములకుకూడ, నష్టపరిహారము చెల్లింపకుండ ఆస్తులు సముపార్జింపబడుటగాని, స్వాధీనము చేసికొనబడుటగాని నిషేధింపబడినది. మొత్తముమీద ఆ॥ 31, 1935 వ సంవత్సరపు గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఏక్టు ప్రకారమున్న రాజ్యాంగ పరిస్థితినే పునరుద్ఘాటించినదని చెప్పవచ్చును.

ఆ॥ 19, 31 లు, దేశమందలి హైకోర్టులయొక్కయు, సుప్రీంకోర్టువారియొక్కయు వ్యాఖ్యానములవలన, కొన్ని వింత స్థితులు కల్పించినవి. ఆ వ్యాఖ్యానముల ఫలితము రాజ్యాంగ నిర్మాతల అభిప్రాయములకు, భారతప్రభుత్వ ఆశయవిధానములకు భిన్నముగా నుండుటచే యీ ఆర్టికల్సు సవరింపబడవలసివచ్చినవి. అట్టి సవరణలకు కారణభూతములైన కొన్ని ముఖ్యమైన తీర్పులనూ, వ్యాఖ్యానములనూ, యిచ్చట పరిశీలించి, తత్ఫలితములైన రాజ్యాంగ సవరణలను సూక్ష్మముగా గమనింతము.

ఆ॥ 19 క్లా॥ 6 సవరణ

రాజ్యాంగ మమలులోనికి వచ్చుటకుముందే, ఉత్తరప్రదేశ్ ప్రభుత్వము ప్రయివేటుసంస్థల అధీనములోనున్న బస్సుల వ్యాపారమును స్వాధీనపరుచుకొనుట కుద్దేశించినది. ప్రయివేటు వ్యాపారస్థుల పెర్మిటను మోటారు వెహికల్సు చట్టం సెం॥ 42 (3) క్రింద రద్దుచేస్తూ, ప్రభుత్వ ముత్తరువులను జారీచేసినది. బస్సుల వ్యాపారస్తులు తమ వృత్తి వ్యాపారస్వేచ్ఛకు (ఆ॥ 19 క్లా॥ g.) భంగము వాటిల్లినదని ఆరోపిస్తూ ప్రభుత్వచర్యను సవాలుచేసిరి. అలహాబాదు హైకోర్టువారు ప్రభుత్వచర్య రాజ్యాంగవిరుద్ధమేనని తీర్పు చెపుతూ, ఆ॥ 19 వివరించిన ప్రాథమికహక్కులతో, ఆ॥ 19 క్లా॥ 6 వలన సంక్షిప్తము లేక యితర విధములుగా జోక్యము కల్గించుకొనుటకుముందు, ప్రభుత్వ మట్టి అధికారము శాసనమువలన పొందవలెననీ, అట్టి శాసనముకూడ సబబైన నిరోధములనుమాత్రమే విధింప వీలగుననీ చెప్పిరి.[1] ఈ తీర్పుఫలితముగా ఏ పరిశ్రమగాని, వర్తకవ్యాపారములనుగాని ప్రభుత్వము స్వాధీనము చేసికొనదలచినప్పుడు ముందు తమచర్య 'సబబైనదే'నని ఋజువు చేసికొనవలసిన ఆవశ్యకత ఏర్పడినది. అట్టి పరిస్థితినుండి తప్పించుకొనుటకు, ఆ॥ 19 క్లా॥ 6 లో రెండవభాగ మొకటి, 1951 లో రాజ్యాంగపు మొదటి సవరణచట్టమువలన చేర్చబడినది. క్లా॥ g. కి ఒక మినహాయింపు చేర్చబడినది. ఈ సవరణప్రకారము పౌరులకున్న వృత్తి వ్యాపారస్వేచ్ఛకు గల ప్రాథమికహక్కు, ప్రభుత్వముచేయు, లేక ప్రభుత్వముచే నడుపబడు ఏ వర్తకసంస్థలైననూ చేయు వ్యాపారములకు వర్తింపదనీ, అట్లు వ్యాపారము కొనసాగించుటలో, సంపూర్ణముగా లేక అసంపూర్ణముగా గాని, పౌరులు అట్టి వ్యాపారములనుండి తొలగింపబడవచ్చును. కనుక యీనాడు ప్రభుత్వము ఏదైన పరిశ్రమను జాతీయము చేసిననూ, (ఉ॥ దరిమిలాను భీమావ్యాపారము.) వృత్తివ్యాపారస్వేచ్ఛకు భంగము వాటిల్లినదని ఆరోపించుటకు అవకాశములేకుండ చేయబడినది.

ఆ॥ 31-బీహారు జమీందారీకేసులు 2, 3

మొదటికేసులో, బీహారు జమీందారీ రద్దు శాసనములు ఆ॥ 31 క్లా॥ 6 ప్రకారము అధ్యక్షుని సమ్మతితో స్థిరపరచబడి

1. Motilal V. State of Uttar Pradesh. A J R 1951 All (F. B.) 257.

2 Kameşwar V. Province of Bihar. A I R 1950 pat 392.

3. Kameswar V. State of Bihar. A I R 1951 pat 91.

ఉప్పటికీ, అట్టిదర్య, ఆ శాసనములను ఆ॥ 31 క్లా॥ 2 (నష్టపరిహారపుక్లాజు.) నుండి రక్షించమనుగాని, యితర ప్రాథమికహక్కుల ఉల్లంఘనకు ప్రభుత్వమున కట్టి అధికారము యీయజాలదని పాట్నా హైకోర్టు తీర్పుచెప్పినది. అట్టి అభిప్రాయము ననుసరించి, 3 మాసముల కొకపర్యాయము ఒక 'ఎలొవెన్సు' నిచ్చుచూ, భూస్వాముల ఆస్తుల యాజమాన్యమును తీసికొనుచూ బీహారుప్రభుత్వము చేసిన శాసనము ఆ॥ 19 క్లా॥ (f) నందలి ఆస్తి హక్కు నుల్లంఘిస్తున్నదని హైకోర్టువారు నిర్ధారణ చేసిరి.

రెండవ కేసులో కూడ అదే అభిప్రాయము నుద్ఘాటిస్తూ, ధనికులకూ పేదలకూ మధ్య పక్షపాతము చూపుతూ ఎస్టేట్ల పరిమాణమును బట్టి నష్టపరిహారము ఏర్పాటుచేసిన కారణముగా, జమీందారీ చట్టములు ఆ॥ 14 నందలి సమానత్వపుహక్కు నుల్లంఘిస్తున్నదని తీర్పు యివ్వబడినది. ఈతీర్పులమూలముగా దేశమందలి జమీందారీచట్టములకు ప్రమాదము వాటిల్లినట్లుగా కనుపించినది. ప్రత్యేకముగా భూసంస్కరణ కార్యక్రమములను సంరక్షించుటకు రాజ్యాంగము సవరింపబడినది.

ఆ సవరణప్రకారము రెండు క్రొత్త ఆర్టికిల్స్ ఆ॥ 31 A, ఆ॥ 31-B చేర్చబడినవి. ప్రాథమిక హక్కుల అధ్యాయములో వివరింపబడిన ఏహక్కులుగూడ, ఎస్టేట్లను స్వాధీనము చేసికొనుటకు ప్రభుత్వముచే చేయబడిన ఏశాసనములకూ వర్తింపవని ప్రకటింపబడినది. దేశమందలి వివిధ జమీందారీచట్టములన్నీ ఒక షెడ్యూలులో చేర్చబడి, (9 వ షెడ్యూలు) ఆచట్టములన్నియూకూడ, వివిధ న్యాయస్థానముల తీర్పులు, ఉత్తరువులు, డిక్రీలు, ఎట్లున్ననూ, రాజ్యాంగ చట్టసమ్మతములేనవి ప్రకటింపబడినది.

ఆ॥ 31-సుప్రీంకోర్టు తీర్పులు

సుబోధ్ గోపాల్ బోస్ కేసు *

1. ఆ॥ 31 యొక్క ఉద్దేశము ప్రతివ్యక్తి యొక్క ఆస్తి హక్కును సంరక్షించుటగాని, ప్రభుత్వమునకు వ్యక్తుల ఆస్తుల నపహరించుటకుగల హక్కును ప్రకటించుట కాదు. ఆ॥ 31 లో, స్వాముల అనుమతి లేకుండగనే, ప్రభుత్వము, వారి (స్వామ్యముల) ఆస్తుల స్వాధీనపరచుకొను అధికారమునకున్న పరిమితులు వివరింపబడినవి. అట్టి నిరోధములలో మొదటిది, క్లా॥ 1 ప్రకారము, వ్యక్తులఆస్తులను సముపార్జించుటకు శాసనాధికారము ఉండవలెను. 2 వ క్లాజులో శాసనసభలపైనే రెండు ముఖ్యమైన నిరోధములు విధింపబడినవి. అవి 1. సామూహిక ప్రయోజనముకొరకు (Public Purpose) మాత్రమే అట్టి శాసనాధికారము వినియోగింపబడవలెననీ 2. అప్పుడుకూడ నష్టపరిహారము ఏర్పాటుచేయవలెననీ. 1, 2 క్లాజులను సమగ్రముగా చదివి అర్థము చేసుకొనవలయును. ఆరెండుక్లాజులందలి విషయమూ ఒకటే-ప్రభుత్వాధికారముపై కొన్ని నిరోధములను విధించి వ్యక్తుల ఆస్తులను కాపాడుట. 1 వ క్లాజులోని "అపహరణ"కూ (Deprivation) 2 వ క్లాజులోని "సముపార్జన", (acquisition) "స్వాధీనము చేసికొనుట" కు (Taking possession)ఏమీ తారతమ్యములేదు. సముపార్జన, స్వాధీనము చేసికొనుటవలన స్వామ్యముయొక్క గుణములు (Incedents of Ownership) లేక లాభములు సంక్షిప్తము చేయబడినయెడల అది అపహరణ అనిపించుకొనును. అట్లు స్వామ్యమునందలి హక్కులు సంక్షిప్తము చేయబడకపోయినయెడల క్లా॥ 2 క్రింద నష్టపరిహారము చెల్లింపవలసిన బాధ్యత లేదు.

2. సంఘసంక్షేమము, ప్రయివేటు ఆస్తులపై స్వామ్యము పరస్పరవిరుద్ధములుకావు. సంఘసంక్షేమముకొరకు ప్రయివేటు ఆస్తులను నష్టపరిహారము చెల్లించకుండ నిరంకుశముగ స్వాధీనపరచుకొనుట కవసరములేదు. వ్యక్తుల ఆస్తిహక్కుల సంరక్షణకూడ సామూహికసంక్షేమములోని ఒకభాగమే ఆ॥ 31 క్లా॥ 5 (B) నష్టపరిహారము చెల్లింపకుండ, కొన్ని నియమిత ప్రయోజనములకొరకు ఆస్తులు అపహరించు అధికారము, ప్రభుత్వము ఎట్లు చలాయింప వీలగునో చెప్పుచున్నది. అంతేకాని సంపూర్ణముగా ప్రయివేటుఆస్తిహక్కులపైగల సామాజిక అధికారమును క్లా॥ 5 (B) నిర్వచించుటలేదు.

3. ఆ॥ 31 లో 'ఆస్తి' అనునది, ప్రయివేటుఆస్తి దాని వివిధ స్వరూపములకుకూడ వర్తించును. ఆస్తి అనగా యీ సందర్భములో అనుభవయోగ్యమైన, స్పర్శవేద్యమైన భౌతికపదార్థములకే కాక న్యాయశాస్త్రరీత్యా, స్వామిక వస్తువుల అనుభవ ఉపయోగాదులలో గల హక్కుల సాకల్యమను అర్థములో వాడబడినట్లు అర్థము చేసికొనవలయును (చూ. 1 వ అధ్యాయములో నిర్వచనము). ఆస్తియొక్క ఉపయోగ, అనుభవములపైని విధింపబడిన ఏ నిరోధమైనను, స్వామ్యమందలి వివిధ హక్కులలో ఏదో ఒక హక్కును అపహరించుచున్నట్లే భావింపవలెను. ఆస్తి స్వామియొక్క అనుభవ స్వాధీనములనుండి తప్పించబడినప్పుడుగాని, అట్టి అనుభవ ఉపయోగములకు తీవ్రమైన ఆటంకములు కలిగినప్పుడుకాని, లేక వాస్తవముగా (Material) ఆ ఆస్తియొక్క విలువ తగ్గినప్పుడుకాని, ఆస్తి హక్కుల సంక్షిప్తము 'అపహరణ'క్రిందనే భావింపవలెను.

షోలాపూరు బట్టలమిల్లులకేసు †

"అశ్రద్ధవలన, అక్రమ యాజమాన్యమువలన షోలాపూరు బట్టలమిల్లులలో ముఖ్యావసరమైన ఒక సరుకుయొక్క ఉత్పత్తి సక్రమముగా జరుగకపోవుటవలన ఏర్పడిన తీవ్రమైన నిరుద్యోగకారణములవలన," ప్రభుత్వము యీ కంపెనీ యాజమాన్యమును స్వీకరింపవలసివచ్చినది. శాసనము మూలముగా కంపెనీయొక్క డైరక్టర్లందరూ తొలగింపబడినారు. మేనేజింగుఏజంట్లుకూడ తొలగింపబడినారు. కంపెని డైరక్టర్లస్థానే ప్రభుత్వము క్రొత్త డైరక్టర్లను నియమించినది. ఈ క్రొత్త డైరక్టర్లకు కంపెనీయొక్క ఆస్తుల విషయములు, కంట్రాక్టుల విషయములో సర్వాధికారము ఈయబడినవి. సుప్రీంకోర్టువారిప్రకారము. యీ శాసనముయొక్క ఫలితము కేంద్రప్రభుత్వముచే నియమింపబడి, కంపెనీలో ఎవ్విధమైన సంబం

* State of West Bengal V. Subodh Gopal Bose 1954 I M L J 814.

† Dwarakadas Shrinivas. V. Sholapur Spinning & Weaving Mills Co. Ltd. 1954 I. M. L. J. 85

తమకు లేకటువంటి వ్యక్తులచేతిలోనికి కంపెనీయొక్క స్వాధీనము, కంపెనీయొక్క ఆస్తిపాస్తులపై యాజమాన్యము వచ్చినట్లే కంపెనీల చట్టప్రకారము కంపెనీకి, అందలి భాగస్వాములకూ సంక్రమించిన హక్కులన్నియూ అంతమొందించబడినవి. ముఖ్యముగా భాగస్వాములకు డైరెక్టర్లను ఎన్నుకొను విలువైన హక్కు తీసివేయబడినది. అంతేకాక "ప్రిఫరెన్సు షేర్‌హోల్డర్లకు" (Preference Share-holders.) మూలధనమును వెంటనే చెల్లింపవలసినదిగా ఉత్తరువులు జారీచేయబడినవి. (ఈ కేసులో ఒక షేర్‌హోల్డరుకు రు. 1,62,000 చెల్లింపమని కోరుట జరిగినది.) భాగస్వాములకు కంపెనీ వ్యవహారములను చూచుకొను అధికారము లేకపోవుటయే గాక, వారు చేయు తీర్మానములు ప్రభుత్వముచే తిరస్కరింపబడవచ్చును. ప్రభుత్వము యీ సర్వాధికారములనూ "ఒక ముఖ్యమైన సరుకు ఉత్పత్తిని సక్రమముగా జరిపించి తీవ్రమైన నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకు" గైకొనినట్లు ప్రకటింపబడినది.

సుబోధగోపాల్ కేసులో వివరింపబడిన వ్యాఖ్యాన సూత్రముల ననుసరించి ప్రభుత్వచర్య చట్టవిరుద్ధముగా సుప్రీంకోర్టువారు నిర్ణయించిరి.

తీర్పునందలి కొన్ని ముఖ్యాంశములు

1. ఈ శాసనము ప్రత్యేకముగా ఒక కంపెనీవిషయములో చేయబడినది. "అక్రమయాజమాన్యము" "అశ్రద్ధ" ఒక్క యీ కంపెనీకే వర్తించునని చెప్పుటకు వీలులేదు.

2. ఈ శాసనఫలితము, కంపెనీ "యాజమాన్యమును" స్వీకరించుటకాక కంపెనీనే స్వాధీనపరుచుకొనుట. (చూ. సుబోధ గోపాల్ బోసు కేసులో 3 వ అంశము.)

3. ఆ॥ 31 క్లా॥ 2 క్రింద నష్టపరిహారము చెల్లించు బాధ్యతకు సముపార్జింపబడినటువంటి ఆస్తులందలి స్వామ్యము ప్రభుత్వమునకు సంక్రమింప నవసరములేదు. ఆస్తి అపహరింపబడుటే ముఖ్యముకాగా అపహరణానంతరము స్వామ్యము ఎవరికి సంక్రమించినదన్న విషయము కాదు.

4. క్లా॥ 1, క్లా॥ 2, సమగ్రముగా అర్థము చేసికొనవలయును. క్లా॥ 1 క్రింద శాసనాధికారమువలన ఆస్తులు అపహరింపబడినచో క్లా॥ 2 క్రింద నష్టపరిహార మీయవలసిన బాధ్యత లేదన్న ప్రభుత్వ వాదన సరియైనది కాదు. ("అపహరణ"కూ సముపార్జన స్వాధీనపరచుకొనుటకూ గల సంబంధము సుబోధ్ గోపాల్ కేసులో వివరింపబడినది.)

5. పై వివరణప్రకారము కంపెనీ షేర్‌హోల్డర్లయొక్క వాస్తవమైన, విలువైన హక్కులు స్వాధీనము చేసికొనబడుటచేత ఆ॥ 31 క్లా॥ 2 క్రిందకు ప్రభుత్వచర్య వచ్చును గాబట్టి, ప్రభుత్వ డైరెక్టర్ల స్వాధీనము కంపెనీయొక్క స్వాధీనము కాదు కాబట్టి, నష్టపరిహారమునకు ఏర్పాటు జరుగలేదు కాబట్టిన్నీ, యీ శాసనము ఆ॥ 31 క్లా॥ 2 ను ఉల్లంఘిస్తున్నది.

"నష్ట పరిహారము"

అమెరికాలో రాజ్యాంగ 5 వ సవరణ క్రింద సామూహిక ప్రయోజనములకొరకు ప్రభుత్వము ఆస్తులు తీసికొనబడినప్పుడు "న్యాయమైన" నష్టపరిహార మీయబడవలెనని న్యాయస్థానములు నిర్ణయించినవి. అనగా తీసుకొనబడిన ఆస్తికి ప్రత్యామ్నాయ సరి సమానమైన దీయబడవలెను. ఇచ్చిన నష్టపరిహారము న్యాయమా, కాదా అను విషయము నిర్ధారణ చేయవలసినది న్యాయస్థానములే. మన రాజ్యాంగములో ఆ॥ 31 క్లా॥ 2 నష్టపరిహార మీయబడవలెనని మాత్రము చెప్పుచున్నది. కాని అది "న్యాయమైన నష్టపరిహారము" (Just Compensation) అయియుండవలెనని లేదు. అయినను సుప్రీంకోర్టువారు, నష్టపరిహార మనగా, ఆస్తి సముపార్జింపబడిన నాటికి మార్కెటుధరలనుబట్టి, సమానమైన విలువ, ధనరూపేణ చెల్లించవలెనని వ్యాఖ్యానము చేసిరి.*

పై తీర్పులమూలముగా భారత ప్రభుత్వము తన ఆర్థిక కార్యకలాపములకు, ప్రణాళికలకు, సంఘసంక్షేమ కార్యక్రమములకూ, ప్రణాళికావిధానములకూ కొన్ని ఆటంకములు ఏర్పడినట్లు భావించి, రాజ్యాంగ 4 వ సవరణచట్టము 1955 వ సంవత్సరములో చేసిరి. ఈ సవరణలు రాజ్యాంగనిర్మాతల ఆశయానుసారముగా చేయబడినట్లు చెప్పబడినది. ఆ॥ 31 క్లా॥ 2. సవరింపబడి పై సుప్రీంకోర్టు ఫలితములు పూర్తిగా రద్దుచేయబడినవి.

ఆ॥ 31 క్లా॥ 2 లో ముఖ్యమయిన సవరణ నష్టపరిహారవిషయములో చేర్చబడినది. ఈ సవరణప్రకారము సామూహికప్రయోజనములకొరకు ఆస్తులను స్వాధీనము చేసుకొను ఏ శాసనముకూడా, ఆ శాసనమువలన ఏర్పాటు చేయబడిన నష్టపరిహారము 'సరిపడినంత' (Adequate) లేదను నెపముపై, సవాలు చేయబడజాలదు. అనగా నష్టపరిహారవిషయములో శాసనసభలకు సంపూర్ణాధికార మివ్వబడినది.

మిగతా సవరణలన్నియు, సుబోధ్‌గోపాల్ బోసు, షోలాపూరు బట్టలమిల్లుల కేసులలోని సుప్రీంకోర్టువారి తీర్పులను, వ్యాఖ్యానములనూ రద్దుచేయుట కుద్దేశింపబడినవి. ఆ॥ 31 లో ఒక క్రొత్త క్లా. 2 A చేర్చబడినది. దీని ప్రకారం ఏ ఆస్తియందైనను, స్వామ్య అనుభవ హక్కులు ప్రభుత్వమునకు గాని, ప్రభుత్వాధికారముక్రింద నడుపబడుచున్న ఏ సంస్థకు గాని స్వాధీనము చేయబడనిపక్షమందు, అట్టి ఆస్తులు ఒక వ్యక్తినుండి అపహరింపబడినప్పటికీ, అట్టిది 'సముపార్జింపబడినట్లు' భావింపబడజాలదు. (షోలాపూరు మిల్సు కేసు.)

క్రొత్త ఆ॥ 31 – A క్లా॥ 1. ప్రభుత్వము ఎస్టేట్లనుగాని, వానియందలి ఏ హక్కులనుగాని, సముపార్జన, మార్పుట, లేక నశింపజేయు (Extinguish) నిమిత్తమున్నూ (జమీందారీచట్టములు.),

క్లా॥ 2. ప్రభుత్వము కొంత పరిమితకాలమునకు సామూహిక లాభదృష్ట్యా లేక సక్రమయాజమాన్యముకొరకు ఏదైనా ఆస్తిని స్వాధీనపరచుకొనుటకుగాని, (షోలాపూర్ మిల్సు కేసు.)

* State of West Bengal V. Bela Bennerjee A I R 1954 S. C. 41.

క్లా॥ 3. రెండు లేక అంతకన్న ఎక్కువ వర్తకసంస్థలను సామూహిక లాభదృష్ట్యా, లేక సక్రమయాజమాన్యదృష్ట్యా సమ్మేళన పరచుటకుగాని,

క్లా॥ 4. కార్పొరేషనులయొక్క, మేనేజింగు ఏజంట్లు, కార్యదర్శులు, కోశాధికారులు, మేనేజింగు డైరక్టర్లు, యాజమానులయొక్క హక్కులను మార్చుటకుగాని, నశింపజేయుటకుగాని, లేదా భాగస్వాములయొక్క ఓటింగుహక్కులను మార్పుచేయుటకుగాని, నశింపజేయుటకుగాని, (షోలాపూరు మిల్సు కేసు.) ఒప్పందము, లీజు లేక, లైసెన్సు మూలముగా, ఖనిజములుగాని, భూగర్భమందలి ఏ లోహములనుగాని, వెదకుటకు లేక సంపాదించుటకు సంక్రమించిన హక్కులను నాశనముచేయుటకు, లేక మార్చుటకుగాని, లేక అకాలముగ అట్టి ఒప్పందములను, లీజులను లైసెన్సులను అంతమొందించి రద్దుచేయు నిమిత్తముగాని చేయబడిన ఏ శాసనముగూడ ఆర్టికల్సు 14, 19, 31 లలో ప్రసాదింపబడిన ఏ హక్కులకుగాని విరుద్ధముగానున్నదనిన కారణముగా, సవాలు చేయబడరాదు.

అట్టి శాసనమేదైనా రాష్ట్రీయశాసనసభలచే చేయబడినప్పుడు అది అధ్యక్షుని పరిశీలనకు ప్రత్యేకింపబడి ఆయనయొక్క సమ్మతిని పొందనిదే అమలులోనికి రాజాలదు.

## ఆస్తిహక్కు : భవిష్యత్తు

ఈ హక్కు, దీని తత్వము, దీనియొక్క పరిమితులు మన మింతవరకు పరిశీలించియున్నాము. పై వివరణవలన తేలిన ముఖ్యాంశము హక్కులు కూడా సామాజికసృష్టులనియు, సమాజము యొక్క ఆశయముల ననుసరించి పరివర్తన చెందగలవనియూ. మనదేశమందు ప్రస్తుత పరిస్థితులననుసరించి, వ్యక్తి స్వామ్యము కేవలము గృహపరికరములు, వస్తువులందే కాక ఉత్పత్తి సాధనములందుగూడ, దగ్గర భవిష్యత్తులో యుండునని యూహింపవచ్చును. మనది మిశ్రమార్థికవిధానము. (Mixed Economy) సామూహిక వ్యక్తిగతరంగములు (Public & Private Sectors.) రెండింటి అభివృద్ధికి ప్రయత్నములు జరుగుచున్నవి. కాని, దూరపు భవిష్యత్తులో పరిస్థితులు మారి ఉత్పత్తి అంతయూ ప్రభుత్వముచే నడుపబడవచ్చును. ఉదా:- వారసత్వపు హక్కు యీనాడు "ఎస్టేటు డ్యూటీ" (Estate duty) పన్నువలన కొంత పరిమితము చేయబడినది. అట్లే సామాజిక అవసరములదృష్ట్యా, ఆస్తి హక్కు తాని స్వరూపము మారవచ్చును. కాలక్రమముల ననుసరించి స్వరూపమందలి మార్పులుగూడ రాక తప్పదను సత్యము గుర్తింపదగినది.

పరిమిలాను మన ఆశయము సోషలిస్టుసమాజస్థాపనగా చెప్పబడుచున్నది. అదికూడ మన దేశీయపరిస్థితుల కనుగుణముగా, సంస్కరణమార్గము ననుసరించి రూపొందింపబడునని చెప్పబడుచున్నది. ప్రజాస్వామ్యము సోషలిజమందే సార్థకత్వము చెందునని మన నాయకులు గూడ గుర్తించినట్లు తోచుచున్నది. సోషలిజము లేకుండా నిజమయిన ప్రజాస్వామ్య మసంభవ మనివాడు లాస్కీ (Laski.)

## ఆధారగ్రంథములు:

1. Salmond . Jurisprudence.
2. Austin : Jurisprudence.
3. Mullah : Transfer of Property Act.
4. G. C. V. Subba Rao : Law of Property.
5 Friedman : Legal Theory.
6 Karl Renner : Institutions of Private Law and their Social functions.
7. Laski : Grammar of Politics.
8. Basu : Commentary on the constitution of India.



# ప్రకాశ్, మరియు ఏరో

## కలములు బహుళ ప్రచారమునకు కారణములు



★ మంచి పనితనము

★ అందమైన తయారు

★ నాజూకైన వినియోగము

★ వాడుకలో గ్యారంటీకలది

★ ఉచిత మరమ్మతు

ప్రతియొక్కరి అభిరుచికి తగినట్లుగా వివిధ నమూనాలు
కలముల విక్రేత లందరివద్ద లభించును.

---

ప్రకాశ్ పెన్ కంపెనీ, చౌక్, కాన్పూర్‌ద్వారా ప్రచురితము

---

## నూతన సంవత్సర అభినందనలు

"నిక్కమైన మంచి నీల - మొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్లు - తట్టెడేల?"... యోగి వేమన

చిత్రవిచిత్రపు ప్రకటనల జూచి మోసపోకండి. అనేక మార్కుల ఇంగువ కలదు కాని మా

| ఎస్.ఆర్. | S.R |
|---|---|

మార్కు ఇంగువను మించెడి ఇంగువ దొరకదు. ఒకసారి రుచి
వాసన చూచిన తెలియగలదు. ఒక ప్యాకెట్టును కొని పరీక్షించుడు.

### బాలకృష్ణా ఇండస్ట్రియల్ వర్క్సు, మదరాసు 13.

సేల్సు ఆఫీసు :

**27, స్ట్రింగ్టన్ ముత్తయ్యా మొదలి వీధి, మద్రాసు-1.**

# తెర మరుగు నీడలు

శ్రీ కొంతముడి శ్రీరామచంద్రమూర్తి

**పాత్రలు:** కనకారావు, ముత్యాలు, విశ్వనాథం, రాగిణి, రామదాసు, పోలీసులు.

అధునాతన పద్ధతులలో, కనకారావుగారు నవీనంగా నిర్మించిన మేడలోని ముందుగది అది. కుడి వేపుగా తెఱచివున్న ద్వారంగుండా వీథిలో జరిగే రాకపోకలు, మధ్యనున్న ద్వారబంధానికి నల్లపూల తెల్లకర్టెను గనుక వేసివుండకపోయినట్లయితే ఆ గృహాంతర్భాగమూ, స్పష్టంగా కన్పిస్తుంటాయి. ద్వారాలకిరుప్రక్కలా వేయబడిన కుషన్ కుర్చీలూ, గోడల కమర్చబడిన నిలువుటద్దాలూ, నేలమీద పఱచబడిన కాశ్మీరుతివాచీ, ఆ ప్రదేశమంతా భోగభాగ్యాలతో తులతూగుతున్నట్లు చెప్పక చెబుతుంటాయి.

తెర తొలగేసరికి, షష్టిపూర్తి కావస్తోన్న కనకారావు, గదిలో ఓ మూలగా వేయబడిన టేబిలుకుప్రక్కగావున్న పడక్కుర్చీలో పడుకుని "తెర మరుగు నీడలు" అన్న ప్రాతప్రతి నొకదాన్ని చదువుతుంటాడు. అతని దేహం పండుబారుతున్నా, అతని వాలకంమాత్రం, ప్రక్కనే టేబిలుమీద స్ఫటికంతో నగ్నంగా వొంపులతో మలచబడిన యువతిని పరిహసిస్తుంటుంది. ఆయువతికి ప్రక్కనున్న గాజుకుండీలోని ఎఱ్ఱపూలు వాడిన మొగాలతో తలను వాల్చుకొని వుంటాయి.

వీథిలోనికి పోయే ద్వారానికి పైగావున్న గడియారం కొట్టిన గంటలబట్టి సమయం ఏడైందనేది స్పష్టం. గదిలోని టేబిలులైటు ప్రసరిస్తున్న తెల్లని పాలకాంతీ, గదిపైని నీలంబల్బు ప్రసరిస్తున్న రంగు కాంతీ, వొకదానిలో వొకటి కలిసిపోతూ వింత వాతావరణాన్ని సృష్టిస్తుంటాయి.

కనకా : (చదువుతుంటూనే మెల్లగా) ముత్యాలూ!

నేపథ్యంనుండి : బాబూ!

కనకా : విందుకు అన్ని ఏర్పాట్లూ పూర్తికాలా?

ముత్యా : (టవలుతో చేతులు తుడుచుకుంటూ ప్రవేశిస్తూ) ఆ. దాదాపు అయిపోయినట్లేనండి.

కనకా : అంటే—ఇంకా పూర్తికావలసిన పనులింకా వున్నాయేమిటి?

ముత్యా : అబ్బే! ఏదో కొద్దిగానే నండి. స్వీట్సు, కట్లెట్సు, డ్రింక్సు—

కనకా : వంటచేసేవాళ్ళని అవేమీ అక్కర్లేదని చెప్పు. ఈరోజు విందు చేయడం మేము మానుకున్నాం!

ముత్యా : అదేమిటి బాబూ?

కనకా : అవును ముత్యాలూ! టైమెంతయింది?

ముత్యా : ఇప్పుడేకదా బాబూ గడియారం ఏడుగంటలు కొట్టింది.

కనకా : ఈ అద్దాలమధ్య, ఈ పడక్కుర్చీలో పడుకుని, యిలా ఎంతకాలంనుంచీ నిరీక్షిస్తున్నామంటావు మేము?

ముత్యా : చాలా సేపటినుంచి బాబూ.

కనకా : (కుర్చీలోనుండి లేస్తూ, పుస్తకాన్ని టేబిలుమీదకు గిరవాటువేసి) అఘోరించావులే. చాలా సేపటినుంచీ అని నీళ్ళు నములుతూ ఆ జవాబేమిటి, ఇంట్లో మొన్ననే కొన్న విశేషంలాంటి స్విస్ గడియారం పెట్టుకుని?

ము : నిజమే బాబూ.

కన : ఈ పడకకుర్చీలో మానవమూలలు లెక్కెడుతూ వాళ్ళకోసం కనిపెట్టుక్కూర్చున్నది చాలాగ్గంటలనుంచి ముత్యాలూ, చాలాగ్గంటలనుంచీ.

ము : అలాగా.

కన : ఏడు దాటింది. కానీ వాళ్లు రాలేదు. వీళ్ళంతా వొట్టి స్కౌండ్రల్సు ముత్యాలూ! వింటున్నట్లే వుంటారు. వినరు. చేస్తున్నట్లే వుంటారు. చెయ్యరు. పంక్చువల్ గా యీ

* * ఆంధ్రవిశ్వవిద్యాలయం నిర్వహించిన ఏకాంకిల పోటీలో ప్రథమ బహుమతి పొందిన నాటిక.

ఇన్‌డోర్ ప్రోగ్రాముంతా పూర్తిచేసుకుని అతింటికెళ్లి పోయిగా ఏ నాట్యప్రదర్శనానికో పోజరవుదామని చిలక్కి చెప్పినట్లు చెప్పాను. (కొంచెమాగి) అయినా ఆ రామదాసుగారికేం?

ము : ఎవరు బాబూ—ఆ నాటకాలు రాసే ఆయనేనాండీ?

కన : (తెల్లబోయి) ఏమిటీ! ఆయన నీకు తెలుసా?

ము : మా యింటిప్రక్క నేకదు బాబూ వుంటూంట.

కన : నిజం! రామదాసు — ఆంధ్రసాహితీలోకంలోని ఓ అమూల్యరత్నం మురికి పేటల్లో కనిపాడిపోతోందా? ఇంపాసిబుల్!

ము : అవును బాబూ. వకరికోలికి తను పోడు. తనగోడు మరొకరి కనవసరం. ఆ కాయితాల కట్టలు ముందేసుకుని అర్థరాత్రిదాకా ఎప్పుడూ ఏదో వొకటి వ్రాస్తూంటాడు.

కన : అలాగా?

ము : ఒకోసారి పిచ్చిగా నవ్వుతాడు. మరోసారి చూచేవారి గుండెలు పగిలిపోయేటట్లు తనలో తనే కుమిలిపోతాడు. ఏమిటో అంతా అయోమయంగా వుంది ఆయన పరిస్థితి.

కన : పెళ్ళాం బిడ్డలూ వున్నారు కదూ?

ము : ఏం చెప్పేది బాబూ. అరుక్కిణమ్మగారి కళ్లల్లోకి చూస్తాడు; వెర్రిగా వకటే నవ్వు. చావుకు సిద్ధమై మంచంలో కొట్టుకుంటున్న ఆ ముసలమ్మ దగ్గరకు పోతాడు. గంటలకొద్దీ అలాగే ప్రూన్పడిపోతాడు.

కన : ఆయనకు తల్లీ—తండ్రీ—

ము : తండ్రి లేడట్లుంది బాబూ. మంచంలో వున్న ఆ ముసలావిడ ఆయన తల్లేననుకుంటాను. (తిరిగి తన ధోరణిలో) పాపం! మరోసారి చిలిపిగా నవ్వే. ఆ రత్నంబాబు నెత్తుకుని అకేపనిగా కన్నీళ్లు కారుస్తాడు. పిచ్చివాడేమో నని భయమేస్తోంది బాబూ!

కన : పిచ్చివాడా! రామదాసుగారిని పిచ్చివాడంటూ వేమిటోయి? బహుశా అతని సున్నిత హృదయం జీవితంలోని ఎత్తుపల్లాలకు కొంచెం కలవడి వుంటుంది.

ము : కావొచ్చు బాబూ! కానీ మీరు గనుక ఆ అయ్యగార్ని వో కంట కనిపెట్టకపోతే వారి గతి మరింత అధ్వాన్న మయేటట్లుంది.

కన : నేనా?

ము : ఏమిటి బాబూ అలా అంటారు? మీ మాట కివ్వాల్లో తిరుగుండా అని. లో అంటే కోటిమంది మీ అనుగ్రహం కోసం కనిపెట్టుకు కూర్చున్నారు.

[పలధియోగ్యపడి దాటుతున్న విశ్వనాథం. చివరిమాటలు వింటూ ప్రవేశిస్తాడు. పన్నని గ్లాస్కో పంచె మెడలో వో బంగారుగొలుసు. వెండి పొన్ను చేతికర్ర మూడగానే వున్నవాడని అనిపిస్తుంటుంది.]

విశ్వ : (నవ్వుపైకి కనిపించకుండా, కొంటె ముత్యాలూ అసలు సంగతి? అయ్యగారి నింతజోరుగా కూపొరు చేస్తున్నావు?—ఆకాశంనుండి కనకవర్షం రాలే కోతులు, మూరాయి.

కన : ఓహో! మహా విశ్వనాథం! చివరకు ఇప్పటికి కనుపించింది వన్న మాట ఈ ఇల్లంటూ వొకటి వుందని చెప్పి.

విశ్వ : అలా అంటే ఎలా కనకారావుగారూ? కొత్త బిజినెస్—

కన : కొన్ని ప్రపంచంలోని యీ బాదరబందీమరఖానంతా వొదిలేసుకుని హాయిగా నవ్వుతూ కాలక్షేపం చేస్తా మంటే బిజినెస్—

విశ్వ : ఏం చేయమంటే నేను? ఎవరో కొత్త స్నిమితంవున్న వారు లాగునే వున్నారు. సరిగ్గా బయలుదేరుదామనుకుంటున్న సమయంలో, కొట్లో కాలు పెట్టి అత్యవసరంగా నాలుగు వేల రూపాయల బంగారం కావాలన్నారు. ఎలా వదిలి పెట్టగలను చెప్పండి అంత బేరాన్ని?

కన : అంటే చివరకు నీకు స్నేహం కన్నా డబ్బు ముఖ్యం అన్నమాట!

విశ్వ : అలా అనుకునేవారికి నేనేం చెప్పగలను? ముత్యాలూ కొత్త లోపలకు వెళ్ళి మంచితీర్థం దెచ్చిపెడుదూ.

కన : ముత్యాలూ-విశ్వనాథంగారికి కొత్త మంచినీళ్ళెందుకు గానీ, సర్బత్తు, పట్రాలే. (ముత్యాలు వెళతాడు.)

విశ్వ : అదేమిటు విందు పూర్తయి పోయిందా?

కన : నాలుగ్గంటలకని చెప్పిన విందు ఇప్పటిదాకా వుంటుందా.

విశ్వ : (నీరసంగా) అయితే విందు ప్రాప్తి మాకు లేదన్నమాట.

ము : (లోపలనుంచి సర్బత్తు తెస్తూ) అవ్వే! మీకోసమే చూస్తున్నారండి అయ్యగారు. ఇంకా ఎవరూ రాందే అసలూ?

విశ్వ : అంటే కనకారావుగారికి చివరకు స్నేహంకన్నా డబ్బు నాదా చేయడం ముఖ్యం.

ము : అవ్వో! చిన్న చెయ్యి కాదు.

విశ్వ : కాదు కాబట్టే ఇద్దరం కలిసి వ్యాపారంలోకి దిగాం!

కన : వ్యాపారం గొడవలు ఏకాంతంగా మాట్లాడుకోవచ్చు. ముందా సర్బత్తు త్రాగు.

విశ్వ : అంటే విందు భోజనం లేనట్లేనా?

కన : అత్తారింటి అల్లుళ్లా మర్యాదలు పొందాలంటే కనీసం గంటసేపైనా కనిపెట్టు కూర్చోవాలి.

విశ్వ : అలస్యానికి కారణం?

కన : అర్జెంట్ బిజినెస్.

విశ్వ : ఇద్దరం కలిసి మెలిసి సంచరిస్తున్నా నే తెలిసికోకూడనివి వుంటూనే వున్నాయి?

కన : ప్రైవేట్ మేటర్స్‌లోకూడాకం ఫ్రెండ్‌గానే.సంచరించాలంటా వేమిటి కొంతదీసి.

విశ్వ : ప్రైవేట్ మేటర్స్!

[తరువాయి 150 వ పేజి]

# జలకంఠేశ్వరాలయ పునరుద్ధరణ

రెండు శతాబ్దాలుగా పూజా పురస్కారాలు లేకుండా శిథిలావస్థలో పడి వున్న రాయవేలూరులోని జలకంఠేశ్వర స్వామి ఆలయాన్ని పునరుద్ధరించి తిరిగి పూజాదికాలను ఏర్పాటు చేయటానికి తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మైసూరు మహారాజా, సుప్రీమ్ కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పతంజలి శాస్త్రిగారు, ఆంధ్ర మద్రాసు రాష్ట్రాలలోని యితర ప్రముఖులు ఈ కార్యక్రమాన్ని ప్రోత్సహించుతున్నారు.

ఈ దేవాలయం దక్షిణదేశంలోని దేవాలయాలలో అత్యంత సుందరమైనది. ఇది చాలా ప్రాచీనమైన దేవాలయం. బొమ్మిరెడ్డి అనే తెలుగుసంపన్నుడు భద్రాచలంనుంచి రామేశ్వరయాత్ర సందర్భంగా ఈప్రాంతానికి వచ్చాడు. వేలూరులో మకాంచేసి, ఆ పరిసరాలను చూసి ముగ్ధుడై అనంతరం అక్కడనే స్థిరనివాసంగా వుండిపోయాడు. అతనికి అయిదు చన్నులు గల ఒక ధేనువు వుండేది. ఒకనాడు అది జలమధ్యంలో వున్న ఒక పెద్దపుట్టను ఆనుకుని నిల్చుని వుంది. ఆ పుట్టలోనుంచి అయిదు తలలుగల ఒక నాగేంద్రుడు పైకివచ్చి ఆవు పొదుగుదగ్గర పాలు త్రాగుతున్నాడు. అది చూసి బొమ్మిరెడ్డి ఆశ్చర్యచకితుడై ఆ పుట్ట చుట్టూ నీళ్లలో వెదికాడు. ఒక శివలింగం దొరికింది. ఆ ప్రదేశంలో ఈ ఆలయాన్ని నిర్మించి దానిలో ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు.

ఇది యించుమించు 16వ శతాబ్దినాటి చరిత్ర. 1612 వరకూ పూజాదికాలు జరుగుతూ వచ్చినై. అనంతరదశలో ఈ ప్రాంతం మహమ్మదీయుల పాలనలోకి వచ్చింది. అక్కడ అధికారిగావున్న మహమ్మదీయ పాలకుని కొడుకు దేవాలయపు దేవదాసిని హత్యచేశాడు. ఆ సందర్భంలో ఏర్పడిన కల్లోలంలో ఆ మహమ్మదీయ నాయకుడు పూజాదికాలను ఆపించివేశాడు.

తిరిగి ఈప్రాంతం మహారాష్ట్ర నాయకుడు తుక్కోజీ ఆక్రమించుకున్నపుడు తిరిగి పూజాదికాలు ఏర్పాటుచేయించాడు.

ఈ సందర్భంలో ఒక చిత్రమైన కథ వుంది. ఇక్కడ వున్న ముస్లిమ్ నాయకులను చంపించివేయటానికి తుక్కోజీ 1676 లో నాగయజ్ఞం చేశాడట. దాంతో ఆ వున్న వంతా పాములమయమైపోయిందట. వాటి బాధపడలేక ఆ మహమ్మదీయ నాయకుడు బట్టా బుట్టా సర్దుకుని అక్కడికి 8 మైళ్ల దూరంలో వున్న అబ్దుల్లాపురానికి వెళ్ళిపోయాడట.

కాని తిరిగి ఒక 20 సంవత్సరాల అనంతరం అధికారం చేతులు మారటం వల్ల పూజాదికాలు ఆపివేయబడటం జరిగింది.

ఆనాటి తెలుగు సోదరుడు బొమ్మిరెడ్డి కళాహృదయంలో రూపుకట్టిన ఈ శిల్పాలయం తిరిగి వెలుగులోకి రానుండటం ఆంధ్రులకు అదృష్టం.



ద్వారపాలకుడు
జలకంఠేశ్వర దేవాలయ శిల్పం
ఛాయాచిత్రం : శ్రీ శ్రీపాద వెంకన్న

లేదో, కొత్త మొహం సీరియస్‌గా పెట్టి "మా నాన్న గారికోసం వచ్చావా? మా అమ్మగారికోసం వచ్చావా?" అన్నాడు.

విశ్వ : అరె నిజమా? ఇంటికి వెళ్ళంగానే దొక్క చీరేస్తాను.

రాగి : అహా! మన కోపమంతా చిన్నపిల్లలమీదనేగా! ఆ అబ్బాయి చిలిపితనమైనా ఎంత చక్కగా వుంది.

విశ్వ : అయితే కేక్స్ కొనిపెడతాను.

రాగి : నేను కొనిపెట్టి వచ్చానండి.

విశ్వ : అయితే నేనన్నా, మా పిల్లలన్నా చాలా యిష్టమన్నమాట.

రాగి : నయం! మీ పోలికలు మీ పిల్లలకు రాలేదింకా. (బయట శబ్దం) ఓహ్! నేనింట్లో లేకపోవడం చూచి కనకారావుగారు వచ్చేస్తున్నట్లుంది.

విశ్వ : బహుశా ముత్యాలు సిగరెట్లు పట్టుకొస్తున్నాడేమో!

[బయటనుంచి కనకారావుగారూ అన్న పిలుపు]

రాగి : క్రొత్తస్వరంలా వుంది. (ఆశ్చర్యంగా) ఎవరు వారు?

బయటనుండి : నేనండీ రామదాసును.

విశ్వ : రామదాసు!

రాగి : ఎవరతను?

విశ్వ : ఓ సుప్రసిద్ధ నాటక రచయిత. పిలు పిలు త్వరగా లోపలకు.

రాగి : (అదే కంఠంతో) పర్వాలేదు, లోపలకు రండి.

[రామదాసు నెమ్మదిగా లోపల కడుగిడతాడు. మురికి ఖద్దరు లాల్చీ పైజమా, వాడిన మొహం, రేగిన జుత్తు అంతా ఏదో ఆత్రుతలో వున్నాడనిపిస్తుంది.]

రామ : కనకారావుగారు లేరా అండి?

రాగి : ఏం వారు లేకపోతే లోపలకు రాకూడదూ?

రామ : అబ్బే! అటువంటిదేమీ లేదు. కొత్త వారితో—

విశ్వ : అత్యవసరంగా మాట్లాడవలసిన పనేమైనా వుండి వుంటుంది.

రామ : బాగా చెప్పారు!

రాగి : ఇందులో బాగా చెప్పటమేముంది? మీ వాలకం చూస్తుంటూనే ఏదో అవసరంగా సహాయంకోరి వచ్చివుంటారనిపిస్తుంది.

రామ : నిజం! రచయితనన్న పేరే గాని రాగిదమ్మిడీ లేక నానా అవస్థా పడవలసివస్తోంది.

రాగి : (ఆలోచనగా) అంత బాధపడుతున్నారా?

రామ : (పిచ్చిగా నవ్వుతూ) బాధ! హు. అది బాధ కాదు. నరకం ఎలా వుంటుందో ఇక్కడే ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాను.

విశ్వ : అయితే స్వీయానుభవంమీద బహు చక్కని నాటకమొకటి సృష్టించవచ్చు.

రామ : నాటకాలు వ్రాయడం పవన్ పర్చీల్లో కూర్చొని కలల్లాడుతూ నవ్వుకోవడమంత సులభం కాదండీ!

విశ్వ : ఊహూ!

రామ : ప్రశాంతత కావాలి. లేదనే బాధ లేకుండా అన్నీ సమకూరే సదుపాయాలు కావాలి. కనీసం కాయితాలు కొనుక్కోడానికైనా తాహతులేదు ప్రస్తుతానికి నాకు.

రాగి : ఎవర్నయినా అడిగిచూడకపోయినారా?

రామ : ఎవరిదగ్గరో చేయి జాపవలసినంత దుర్గతి పట్టలేదింకా. నా నాటకాన్ని సినీమాగా తీసేందుకిస్తానన్న వెయ్యి రూపాయలూ యిస్తే చాలు కనకారావుగారు. కష్టాలన్నీ విడిపోతాయి.

రాగి : కష్టాలా?

రామ : కష్టాలు. కష్టాలనే మాటను బహుశా ఎవరో చెప్పగా వింటూంటే వినివుంటారు మీరు. తన ప్రాణంలో ప్రాణంగా పెంచిన తల్లి పుక్కు సులకమంచంలో చివరిశ్వాస పీల్చుకుంటోంది. తనకోసం తన సర్వస్వం అర్పించిన భార్య, హృదయవిదారకంగా ప్రసవవేదన పడుతోంది. ఈ సమయంలో కనీసం వారి కొక్కక్షణమైనా సుఖం కల్గించాలంటే డబ్బు కావాలి డబ్బు!

విశ్వ : అవును. తప్పకుండా డబ్బు కావాలి.

రామ : ఆగండి. కనీసం నా హృదయంలోని వేదనంతా మీ ముందన్నా వెళ్ళబోసుకోనీయండి. కావలసినవారి కాళ్లు పట్టుకున్నాను. తెలిసిన ప్రతి ప్రాణినీ అడిగాను. లేదనిపించుకున్నాను.

రాగి : పాపం!

రామ : ఈ కనకారావుగారు వెయ్యి రూపాయలకుగాను నా ముందు గిరవాటు వేసింది యాభై రూపాయలు.

రాగి : ఆ!

రామ : నాల్గు రోజులనుంచీ కాళ్ళకు బలపాలు కట్టుకు తిరుగుతున్నాను. ప్రతిరోజూ 'రేపటి' తోనే సరిపోతోంది. పైగా ఈ రోజు విందు కాహ్వానించాడు నన్ను. రెండు నిండు ప్రాణాలు చావు బ్రతుకులమధ్య కొట్టుమిట్టాడుతుంటే విందులకు హాజరు కావాలి నేను?

విశ్వ : మీ తల్లిని వదిలిపెట్టి వచ్చావా ఇప్పుడు?

రాగి : మీ భార్య నీళ్ళాడిందా?

రామ : నా తల్లి చనిపోయింది. (ఏడుస్తాడు)

రాగి, విశ్వ : ఆ!

రామ : నా భార్య కూడా చనిపోబోతోంది. కనీసం ఆ ప్రాణమన్నా నిలబెట్టాలి. ఆమె—నా ప్రాణం. నా కోసం

తను మరణిస్తోంది. పిల్లేరు. ఆమె—ఆమె బతికేందుకు వీల్లేదు.

విశ్వ : కంగారుపడకండి రామదాసుగారూ! స్థిమితంగా ఆలోచించండి.

రామ : స్థిమితమా? నాకా?

రాగి : (టేబిలుమీదున్న ప్రాత్రపతిని చూసి దాని దగ్గరగా వెళ్ళి పరిశీలిస్తుంటుంది).

విశ్వ : ఇటువంటిసమయాల్లోనే ధైర్యంగా జీవితాన్నెదుర్కోవాలి. 'ఏం చేయాలి' అన్నదాన్ని గూర్చి ఇప్పుడే ఆలోచించాలి.

రాగి : (అకస్మాత్తుగా రామదాసును సమీపించి) చూడండి రామదాసుగారూ! నేనెవరో మీకు తెలీదు. కానీ మీకు నేను సహాయం చెయ్యదల్చుకున్నాను. స్వీకరిస్తారా?

రామ : మీరా?

రాగి : అవును. నేనే. ముక్కూ మొహం తెలియని వ్యక్తి సహాయం చేయడమేమిటని సందేహిస్తున్నారా?

రామ : (మౌనం).

రాగి : సందేహం. ఏ మాత్రం అనవసరం. ఇచ్చి పుచ్చుకునే పద్ధతిమీదనే మీరు మానుండి సహాయాన్ని పొందవచ్చు.

రామ : అంటే?

రాగి : ఈ 'తెలుసుగు నీడలు' మీరు వ్రాసిందే కదూ?

రామ : అవును. దీనికే కళా సమితివారి ప్రథమ బహుమతి కూడా లభించింది.

రాగి : అయితే మరీ మంచిది. ఈ నాటకాన్ని మా బృందంతో మేము వాడవాడలా ప్రదర్శిస్తాం. అందుకు అన్ని హక్కులూ మీరు మా కివ్వండి. మీ ప్రతిఫలాన్ని మీరు తీసుకోండి.

విశ్వ : ఓహ్! అద్భుతమైన సంగతి. ఊ! అనండి రామదాసుగారూ! మీ కింక అనుమానం అక్కర్లేదు.

రామ : కానీ—కనకారావుగారు—

విశ్వ : కనకారావుగారి విషయాలూ మీ కెందుకండీ? మేం మాట్లాడుకొంటాం! ఆ. ఈ యాభైరూపాయలూ ప్రస్తుతాని కుంచుకోండి. (పర్సు తెరిచి డబ్బు లెక్కించి) తగ్గించాలి. ఇరవయ్యే వున్నాయి. రాగిణీ—నీ దగ్గరేమైనా—

రాగి అసలు మొదట్లో నేనే ఇద్దామనుకున్నాను. మీ రింత చొరవ తీసుకుంటుంటే నే నెందుకని ఊర్కున్నాను. ఊ! తీసుకోండి.

రామ : థాంక్యూ! థాంక్యూ! (వెళ్ళిపోబోతాడు).

విశ్వ : రామదాసుగారూ! యిలా రండి.

ముత్యా : (ప్రవేశిస్తూ) ఈ సిగరెట్లకోసం పెద్ద బజారుదాకా వెళ్ళవలసివచ్చింది బాబూ!

విశ్వ : (అటువేపు చూడకుండానే) అక్కడ పెట్టు. రామదాసుగారూ! ఈ కాయితంమీద సంతకంచేసి వెళ్ళండి.

ముత్యా : రామదాసుగారా:

రామ : తెల్లకాయితంమీద సంతకమా?

రాగి : అంత భయం దేనికి రామదాసుగారూ? అందరం పెద్దమనుషులం కదూ!

ముత్యా : బాబుగారూ?

రాగి : మీ భార్యకు మందు త్వరగా అవసరమా?

విశ్వ : మించిపోయిం తర్వాత అనుకొని యేం లాభం చెప్పండి.

రామ : (గాభరాగా) పెడతాను. తప్పకుండా సంతకం పెడతాను. ఏదీ ఆ కాయితం? (సంతకంచేసి ద్వారం దగ్గరకు వెళ్ళి) ముత్యాలూ!

ముత్యా : బాబూ!

రామ : వక్కసారి ఇంటికివెళ్ళి పిల్లలను చూస్తుంటావా? ఈ లోపున బజారునుంచి మందు కొనుక్కొస్తాను. నీకు పుణ్యం వుంటుంది.

ముత్యా : (ఆలోచించి) సరేబాబూ!

[ఇద్దరూ త్వరత్వరగా వెళ్ళిపోతారు]

విశ్వ : రాగిణీ!

రాగి : ఆ!

విశ్వ : అకస్మాత్తుగా ఈ నిర్ణయమేమిటి?

రాగి : విశ్వనాథంగారూ! ఇదివరలో మీరు నాకోసారి చెప్పారు జ్ఞాపకంవుందా? ఎవరినుండో ఓ నాటకాన్ని మీరు తీసుకోవా లనుకుంటుంటే, అదే నాటకాన్ని కనకారావుగారు పోటీగా సర్వహక్కుల్తో మీ కందకుండా కొనుక్కున్నారని. బహుశా ఇదే నాటకం అయి వుండాలి అది. కదూ?

విశ్వ : ఆ! ఆ! కోనాను.

రాగి : కనకారావుగారి మీద పగతీర్చుకోవాలని లేదూ?

విశ్వ : (మౌనం)

రాగి : పౌరుషహీనులు. చర్యకు చర్య ప్రతీకారం తీర్చుకోవాలి పురుషులైనందుకు.

విశ్వ : ఒక్కమాట అడుగుతాను. నిజం చెబుతావా రాగిణీ?

రాగి : నాయిష్టమైతే.

విశ్వ : తలిదండ్రులెవరూ లేరా నీకు?

రాగి : అది నా కుటుంబవిషయం.

విశ్వ : నన్ను నమ్మలేవా?

రాగి : నీవూ పురుషుడివేగా!

విశ్వ : రాగిణీ! పురుషుడైనంతమాత్రాన ద్వేషించాలని లేదు. ప్రతివారిలోనూ మంచీ-చెడూ-

రాగి : అంటే మీరు మంచివారని-

సర్వేజనాః సుఖినో భవంతు

## పండుగలు-సాంప్రదాయము

# ఎల్. జీ ఇంగువ

ఉగాది పండుగ దినమున తెలుగువారందరు నూతనోత్తేజముతో, నూతనోత్సాహాలతో కలకల లాడుతుంటారు. ఇతరపండుగ దినములలాగే మంగళస్నానము చేయుట, క్రొత్త వస్త్రాభరణములను ధరించుట, మృష్టాన్నమును భుజించుట మొదలగు సాధారణ ఆచారములు కలిగియుండుటయేగాక, గృహములోని ప్రతిఒక్కరు ప్రొద్దున వేపపువ్వు పచ్చడి తప్పనిసరిగా రుచిచూచుట, మధ్యాహ్నం పంచాంగం శ్రవణం చేయుట— ఈ రెండు ప్రత్యేక అంశములతో కూడిన సాంప్రదాయము ఉగాది పండుగకు సంవత్సరాల తరుబడి యున్నది.

గ్యారంటీగల నాణ్యత, చక్కని సువాసన గల ఎల్. జీ ఇంగువ నిత్య వంటకాలలో నేగాక, పండుగ, పబ్బాలకు చేయు పిండి వంటలలో వాడబడుటచే, వాటికి రుచి, వాసనలు పెంపొందించుటయేగాక, గృహములందు సంతృప్తి, ఆరోగ్యభాగ్యమును కలుగచేయు సాంప్రదాయమును ఎల్. జీ ఇంగువ 60 సంవత్సరాల పైగా కలిగియున్నది.




*
మీరు ఎల్. జీ ఇంగువనే అడిగి మార్కు పేరు సరిచూచి పుచ్చుకొనండి
*

## లాల్ జీ గోధు & కో.,

సాహుకారు పేట, మద్రాసు - 1.

హెడ్డాఫీసు : బొంబాయి.

## మా స్కో న్యూస్

* సోవియట్ యూనియన్ నుండి వచ్చే ఏకైక వార్తా పత్రిక.
* వారానికి రెండుసార్లు వస్తుంది.
* సోవియట్ జీవితానికి సంబంధించిన వార్తలు ఉంటవి.
* ప్రసిద్ధ పత్రికారచయితలు వ్రాసిన విలువైన విలక్షణమైన వ్యాసాలు.
* స్పోర్ట్సుకాలం ఒక ప్రత్యేక ఆకర్షణ.
* చందాదారులకు విమానటపాద్వారా డెలివరీ.

చందా రేట్లు :

| | |
|---|---|
| సంవత్సరానికి - | రు. 9-0-0 |
| అర్ధ సంవత్సరానికి - | రు. 4-8-0 |
| విడి కాపీ - | రు. 0-1-6 |

క్రింది చోట్ల చందాలు తీసుకోబడును :

| | |
|---|---|
| విశాలాంధ్ర ప్రచురణాలయం, బకింగ్‌హామ్ పేట పోస్టు, విజయవాడ. | పీపిల్స్ బుక్ హౌస్, నిజామ్‌షాహిరోడ్ : హైద్రాబాద్ (దక్కన్) |

## మాడరన్ ఎలెక్ట్రిక్ కంపెనీ,

ఎలెక్ట్రికల్ డీలర్లు, కంట్రాక్టర్లు

801, లింగిచెట్టి వీధి, మద్రాసు-1.



* ఎలెక్ట్రిక్ పంపుసెట్లు * ఆయిల్ ఇంజనులు
* విడిభాగాలు * ఎలెక్ట్రికల్ పరికరాలు
* మిషినరీ * హార్డువేర్ సామగ్రి * జనరేటర్లు
* కన్‌వర్టర్లు, విక్రయించువారు.

విశ్వ : అలా చెప్పబోవటల్లేదు నేను. నాలోనూ అందరిలో వలెనే చెడుగే ఎక్కువగా వుండవచ్చు. కానీ నువ్వు చెప్పింది సానుభూతితో అర్థం చేసుకోగలను. కనకారావుకు కావలసింది డబ్బు. నాకూ డబ్బు కావాలి. కాని డబ్బు తోబాటు స్నేహంకూడా కావాలి.

రాగి : అలాగా ?

విశ్వ : నమ్మి నీ చరిత్ర చెబితే చెప్పు. లేకపోతే నీ ఇష్టం.
(ఇదేసమయంలో కనకారావు వీథిద్వారంవగ్గరకు వచ్చి నిలబడతాడు. కానీ ఎవరూ గమనించరు.)

రాగి : విశ్వనాథంగారూ ! కడుపులో వుండగానే తండ్రి పోయాడు. పురిటిలోనైనా గడవకుండానే తల్లి పోయింది. ఏ అమ్మపాలతోనో పెరిగాను. ఎలానో పెరిగాను.

విశ్వ : ఊఁ ! తర్వాత ?

రాగి : అందరిలాగునే నాకూ యౌవనమొచ్చింది. నన్ను పెంచిన వాళ్ళు నన్నొక అయ్యకిచ్చి పెళ్ళిచేసేంత సమర్థులుకారు. వకరోజున మాయింటికొచ్చిన కనకారావుగారు ఏవో ఆశలు నాకు చూపారు. అంతే ఈవూరొచ్చాను.

విశ్వ : పాతకథ !

రాగి : తొందర పడకండి. అయిపోలేదింకా. ఈ కనకారావు గారు మాటలైతే చెప్పేవారేకాని డబ్బుమాత్రం ఇచ్చే వారుకారు. అప్పుడు- అర్థరాత్రి మీరు కట్టుకున్న ఈ గ్లాస్కో పంచె నే కట్టుకుని ఓ పెద్దమనిషి నాయింట్లో ప్రవేశించి, నోట్లకట్టను నాముందు పడేసి, నాలోని బలహీనతను రెచ్చగొట్టాడు.

విశ్వ : ఎవడు వాడు ?

రాగి : ఎవరా ? విశ్వనాథంగారు.
(ఈ మాటవిన్న కనకారావు అదుటున లోపలకు ప్రవేశించి) మోసం ! పచ్చిమోసం ! నిన్ను నమ్మినందుకు ఇదేనా ప్రతిఫలం ?

విశ్వ : కనకారావు ?

కన : దుర్మార్గుడా—స్నేహితుడనే పేరుతో

విశ్వ : కనకారావ్ ?

కన : నీదికాదు తప్పు. దానిది. దాన్ని—ఏంచేస్తే పాపం వుంది ? హత్యచేస్తే బావుండదూ ?

విశ్వ : రోగిణిమీద చెయివేసే సాహసానికి దిగబోకు !

కన : ఓహ్ ! ఆ తుచ్ఛురాలికన్నా ముందు నిన్ను హత్య చెయ్యాలి. నీలాంటివారుండబట్టే ప్రేమకూ, వాత్సల్యతకూ విలువలేకుండా పోతోంది !

విశ్వ : హత్య చెయ్యడం నువ్వనుకొన్నంత సులభం కాదోయ్ ! దానికి తగిన మనోధైర్యం నీకూ నాకూ వుంటే ప్రపంచంలో యీనాడింతమంది మన కళ్ళముందు తిరుగుతూ వుండేవారు కారు.

కన : చేసి చూపిస్తాను.

విశ్వ : హత్య చెయ్యడంతో సరిపోదోయ్ ! చేసిం తర్వాత వుంటయ్ నీ పాట్లు. పోలీసులు వస్తారు. అష్టదిష్టమైన ప్రశ్నలన్నీ విన్నడుగుతారు. అపరాధం చేసినవాడివి సహజంగా తబ్బిబ్బు పడతావు. ఏదో వక కిటుకు వాళ్ళు కందిస్తావు. ఆ తర్వాత నీవే వూహించుకో !
[ఇంతలో ముత్యాలు హడావిడిగా ప్రవేశిస్తాడు. ముఖంలో భయం, ఆవేదన స్పష్టంగా కనిపిస్తుంటాయి.]

ముత్యా : బాబుగారూ !

కన : ఏమిటి ముత్యాలూ !

ముత్యా : రామదాసుగారి భార్య చనిపోయింది. పాపం ! అతను పిచ్చివాలకం పడి మీ యింటివేపే వస్తున్నారు.

రాగి :
విశ్వ : } చనిపోయిందా ?

కన : లోకంలో ఎందరో చనిపోతూంటారు. వాళ్ళందరికోసం మనం విచారిస్తుంటామా ముత్యాలూ ?

ముత్యా : అదేమిటి బాబూ ?

కన : అవును ముత్యాలూ ! ఒక ఆడది చనిపోయినందుకు హృదయపూర్వకంగా నవ్వక దుఃఖిస్తున్నాడా పిచ్చి రామదాసు !

ముత్యా : బాబూ !

కన : అవుననుకొన్న యువతి నన్ను కాదన్నది. స్నేహితుడని నమ్మిన వ్యక్తి గోముఖవ్యాఘ్రమైనాడు. ఇవన్నీ జరుగుతోంది ఆడదాని చపలహృదయంవల్ల. అయినప్పుడు స్త్రీకోసం కన్నీరు కార్చడం పిచ్చితనం కాదూ ?

ముత్యా : రామదాసుగారు వస్తున్నారు బాబూ !

కన : రమ్మనమను. ఆడదానికోసం కలవరించే ప్రతివ్యక్తికి చివరికి ఏం జరుగుతుందో చెప్పి మరీ అతన్ని రమ్మనమను.

రాము : (పిచ్చిగా ప్రవేశించి) నా భార్యను నానుండి వేరు చేశారు. ఇందుకు మీరంతా కారణం. (కనకారావు దగ్గరకు వెళ్ళి) మా అమ్మ—ఎంత చల్లని హృదయం ఆమెది. ఆమెను—ఆమెను నానుండి వేరుచేసింది నువ్వు కాదూ ?

కన : నేనా ?

రాము : ఆఁ ! ముమ్మాటికీ నువ్వే. మందులు కావాలని డబ్బుకోసం కుక్కలా నీ గుమ్మందగ్గర పడిగాపులు గాచినా, చివరకు మా అమ్మ చనిపోయేవరకూ నువ్వు నాకు కనబడనేలేదు.

రాగి : ఒక్క హత్యతో సంతృప్తిపడక నన్నుకూడా హత మార్చాలని సంకల్పించావా దీయన.

రాము : నిన్నా ! దయతలచి వన్నాదుకోబోయావు. అయినా సమయం మించిపోయింది. అటువంటి నిన్ను, నిన్ను వీరు హత్యచేస్తానంటున్నాడా ?

కన : హాహా !

గారికి బయటకు వెళ్లి ఇప్పుడే వస్తున్నాం. గడపలో కాలు పెట్టామో లేదో ఈ దృశ్యం!

నవి : అయితే శవం ఇక్కడ వుంచవలసిన కారణం?

కన : అసలే ఈమున్శి అంతగా అతనికి మనస్థిమితం లేదుట. ఈ మాట పల్లెలో ఎవర్నడిగినా చెబుతారు. నేను ఏదో కొంత ఇస్తానని నాకు వారంలో జాల్రకీతం చెవితే దాని కోసమని వచ్చాట్ట! అతనిక్కడకు వచ్చే సరికి పాపం అతని భార్య ఇంట్లో ప్రసవవేదన పడుతోందట. దాకోసం చాలా సేపు కనిపెట్టుకుని కూర్చున్నాడట! దానికి నేనేం చెయ్యను చెప్పండి? నాకు తెలిస్తేనా నేను త్వరగా ఇంటికి రానిచ్చేవాణ్ణి. ఇంతలో అతని భార్య మరణించిందని ఎవరో చెప్పారులా వుంది. ఆ వుద్రేకంలో మనిషి ఏం చేస్తున్నది ఆలోచించకుండా ఈ ఘనకార్యం చేసి కూర్చున్నాడు!

నవి : అలాగా! (రామదాసును పరిశీలిస్తూ) పాపం రెండు కాసులున్నాయి జేబులో ఓహ్! ఈ కాయితంలో ఏదో వ్రాసాడులా వుంది. (చదువుతు) "జీవితాన్ని ఎదుర్కో-లేక పిరికివాణ్ణయి ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఇందుకెవరూ బాధ్యులు కారు. ఇట్లు రామదాసు వ్రాలు" కనకారావుగారూ! మీరు చెప్పిందంతా నిజంలాగానే వుంది.

ము : అంతా మాయగా వుంది. ఈ అయ్య తనకు తాను ప్రాణం తీసికున్నాడా పాపం. ఆ కుఱ్ఱాడికింక ఏం కావాలని.

నవి : అతనికి పిల్లలున్నారేమిటి?

ము : ఆ! కొడుకొకడున్నాడు బాబూ.

నవి : అయితే కడసారిగా వాళ్ళ నాన్నను చూసుకోడానికి ఆ అబ్బాయిని.

ము : ఇప్పుడే తీసుకొస్తాను బాబూ! (ముత్యాలు వెళ్లిపోతాడు)

నవి : కనకారావుగారూ మళ్లీ వస్తా. ఎక్కడపట్టినా ఇటువంటి కేసులే. శోధించలేక నా ప్రాణాలు పోతున్నాయి. ఆ 444. మేమొచ్చేవరకూ నువ్వు బయట వీధిలో వుండు!

కన : తప్పకుండా రండి. మీకీయింట్లో ఎప్పుడు వచ్చినా స్వాగతం లభ్యమౌతూనే వుంటుంది.

నవి : సరే! సెలవు. (సిబ్బందితో వెళ్ళిపోతాడు)

విశ్వ : ఇక మేము వెళ్ళిరావచ్చుకదూ కనకారావుగారూ?

కన : మృత్యుగండంనుంచి బయట పడేశారు. ఏలా మీపట్ల నా కృతజ్ఞత తెలపాలో అర్థంకాకుండా వుంది.

విశ్వ : చేసిన వాగ్దానాలు మరువకుండా వుంటే చాలు.

కన : మీ చేతిలో చిక్కినవాణ్ణి.

రాగి : బ్లూరెట్ దాకా వస్తారా?

కన : అడిగినప్పుడు రాకతప్పుతుందా?

[వీరిలా మాట్లాడుకుంటూండగానే రామదాసు కొద్దిగా కదులుతాడు. కానీ చూడకుండానే అందరూ వెళ్ళిపోతారు]

రామ : (మెల్లిగా లేస్తూ) అబ్బా! ఊ! ఏమిటిది — ఎవరూ లేరే ఇక్కడ? తలంతా దిమ్ముగా వుంది. అరె! గుడ్డల మీద రక్తం! (జేబులు చూసుకుని) ఏమిటీ కాయితం? ఆ! నేను ఆత్మహత్య చేసికున్నానా?

ము : (బయటనుంచి ప్రవేశిస్తూ) బాబూ!

రామ : ముత్యాలూ!

[తెర]



నాట్యభారతి

హొయిసాళేశ్వర దేవాలయంలోని కుడ్యశిల్పం హళెబీడ్ (మైసూరు రాష్ట్రం)

ఛాయాచిత్రం : కుమారి కె. బి. కృష్ణవేణి

# సురభి యాత్ర

శ్రీ సి. నారాయణ రెడ్డి

ఇవి నా ఎదలో చుక్కల
పువ్వుల పరిమళమ్ములా? నభోంగణ వీథుల
స్నవ కింపాతరుణీ గా
త్రవల్లికా సౌరభమ్ములా? పొరలాడెన్.

ఈ సౌరభసమీర మూ
లా సర్పణమున హృదంతరజ్వలనశిఖల్
భాసిలె వెన్నెల వత్తులు
గా, సుమకోమల దళాలుగా, చిత్రముగా.

నాగుం బడగలవలె చెల
రేగిన మాత్సర్యధూమరేఖల నేవో
రాగామృతభావమ్ములు
తీగెలుగా సాగిపోవు తీరులు పోయెన్.

కనులముందు నిల్చిన అంధకార సాంద్ర
యవనికలు క్రమక్రమముగా నవిసిపోవ;
కనబడెను వెల్గురవ్వల చినుకు మిణుకు
మిణుకు మనియెడు జ్యోతిరింగణ గణమ్ము.

ఎదను ద్వేషము కెరటాలు లేచినపుడు
ఎదుట చీకటి దవ్వ కన్పించ దొండు,
ఎదను స్నేహము సురభిళమై కదిలినపుడు
ఎదుట వెన్నెల తొలుకులే తొణుకుచుండు.

చంచుటాకులు రాలు శబ్దములు వినక
నా మనశ్శ్రీవనాల కీనాడు లేత
మల్లియల పెండెయందెలు ఘల్లుమనిన
పదము లల్లనల్లన వినంబడుచునుండె.

తన్ను లోలోపల దహించుచున్న ద్వేష
వహ్ని నమృతీకరించిన పరిమళములె
పదములై రసాస్పదములై చిదికిపోవు
నా మనోంగణమును నందనముగ మార్చె.

ఎన్ని ఋతువులు గడచె నా కన్నులెదుట
మబ్బులవలె, వెన్నెలవలె, మంచులవలె,
ఎన్నడైన నేటివలె నాయెడద సురభి
ళించెనా? నందనము మోము దించుకొనగ

ఈ సురభిళాత్మతకు నేది హేతువగునో?
ఈ మసృణరాగమున కేది హేతువగునో?
ఐననౌను వాసంతిరమా నిబద్ధ
చారుఘుసృణచేలాంచల చాలనమ్ము.

పుడమిని పరిమళప్లుతముగ నొనర్చు
విపులకారుల రాక లబ్బురము గాదు;
ఎడదను పరిమళాల ముంచెత్తునట్టి
పూలనెల పుల్కరింత యపూర్వమగును.



# సంస్కృతవాహిని

**శ్రీ సి. యస్. నరసింహారావు**

భారతీయ సంస్కృతి బహుపురాతన మయినది. ప్రత్యేక విశిష్టత కలది. అనాదిగ, శాంతి, అహింస, స్వాతంత్ర్యము, సౌభ్రాత్రము, సత్యము, ధర్మములను ప్రవర్తిల్ల జేసినది యీ దేశ సంస్కృతి.

ఇదియే నేడు మన రాజ్యాంగమునందలి, మూలసూత్రములు కూడను.

ప్రపంచములో, పూర్వమున్నయీ నాగరికతలు ఈజిప్ట్, అస్సీరియా, బాబిలోన్, రోము, గ్రీసు దేశముల నాగరికతలు వర్ధిల్లి నశించినవి. మన సంస్కృతి, అత్యుత్కృష్ట మయినది, గనుక నే గడచిన వేయి సంవత్సరముల కాలములో, స్వరాజ్యము లేకున్నను నిలిచియున్నది.

ఒక వ్యక్తి, తన శక్తిసామర్థ్యముల నెట్లు బహిర్గతము చేయవలెనో అట్లే ఒక గొప్ప దేశము, నూతన సంస్కృతి సభ్యతలను, పరదేశములకు తెలియబరచి వ్యాపింపచేయనియెడల, ఆ దేశము, సృష్టికర్త దృష్టిలో పనికిమాలినదై, భగ్నమైపోవునని విశ్వకవి రవీంద్రుడనియున్నాడు. మన భారతము, తన సంస్కృత సాంప్రదాయములను, దగ్గర,దూర దేశములలో స్థాపించి సంస్కృతీ సామ్రాజ్యములు నెలకొల్పియుండుటచేతనే, యీనాటికి సంస్కృతీప్రపంచమునం దగ్రతాంబూలము నందుకొనుచు, ఉన్నతస్థానము లభింపచేసికొన్నది.

పూర్వ భారతీయ సంస్కృతి, ఉదధి పర్వత సరిహద్దులను గమించి, పూర్వ పశ్చిమ దేశములలోకి ప్రవహించి, ఆయా దేశములను పునీతము గావించినది.

ప్రాగ్దేశములకు, భారత సంస్కృతీప్రవాహములు తరలించుటలో, ఆంధ్రుల కృషి అపారము. భారత సంస్కృతి ఇతర దేశములకు వ్యాపించుటకు ఇదియే మొదలు. మనము ఇండోచైనా, సయాము, బర్మా, మలయా, ఇండోనీషియా, మొదలగు దేశములలోని పేర్లను చూచి, మన పేర్లవలె నుండుట గమనింతుము. 'సింగపూరు' మనదేశములోని ఊరివలె అన్నట్లున్నది; 'కాళీమంటన్' బోర్నియో ద్వీపంలో ఒక భాగం. జావావద్ద, 'మదుర' యను చిన్న ద్వీపము, బలిద్వీపము, పేర్లు అచ్చము భారతీయమైనవిగా వున్నవి. సుకర్నో ఇండొనీషియా అధ్యక్షుడు. సయామ్‌లోని ప్రముఖ రాజకీయవేత్త సంగ్రామ్. మానవపుత్ర, ఆదిత్య, ఇత్యాదిపేర్లుకూడా అక్కడ కనిపించును. ఇండొనీషియాలో ప్రజలు చాలామటుకు మహమ్మదీయులు. పదునేనవ శతాబ్దములో మహమ్మదీయ దండయాత్రానంతరము ఇస్లాంమతస్థులైరి. కానీ ఇప్పటికిని తూర్పున ఇంచుమించు ఆస్ట్రేలియాఖండమువరకు గల ద్వీపములన్నియు ప్రాచీన భారతీయ పురావస్తుశాల లనునట్లు ఉండుటకు కారణము క్రీస్తుశకారంభమున ఆంధ్ర శాతవాహన మహీధవుల కాలములో వర్తకవ్యాపారులతోపాటు భరతవర్షమునుండి, ముఖ్యముగ ఆంధ్రమునుండి మతప్రవర్తకులు, శాస్త్రవేత్తలు, కళాకారులు తదితరులు తమ జ్ఞానసంపదను వెదజల్లుటకు ఓడలపై పయనించి సుమిత్రా జావా, బలి మొదలగు ద్వీపముల కేగి ఆ ద్వీపములన్నిటిని జ్ఞానజ్యోతులతో శిల్పదీపములతో చిత్రకళాకాంతులతో దేదీప్యమానమొనరించి యుండుటయే. వారి యాశయము హింసలో కూడిన సైనికసామ్రాజ్యస్థాపన కాదు; ప్రజలను పీడించి బానిసలను చేసుకొనుటకాదు; వారి సంపత్తును కొల్లగొట్టుట కాదు—చరిత్రలో యితరులవలె. మనవారి యాశయము, సంస్కృతీవ్యాప్తి.

పూర్వపు జావా భాష పేరు కవిభాష. రామాయణ, మహాభారతాదులు, ఆ భాషలో వెలసినవి. భారతీయభాషలవలనే, ఆ భాష సంస్కృతముతో సంబంధముగలది. ఆ ద్వీపపు రాజులు తాము చంద్రవంశమువారమని, యదువంశమువారమని చెప్పుకొనెడివారు. భారతీయ గ్రంథములకు వ్యాప్తి జనసామాన్యములో సులభముగ లభించెను.

భారతదేశమునకు జావాదేశమునకు ఒక విచిత్రసామ్యము పొడకట్టుచున్నది. జావాలో అగస్త్యసాంప్రదాయమని ఒకటి యిప్పటికి చాలా ప్రతీతిలో నున్నది. వారి సంస్కృతికి మూలపురుషుడు అగస్త్యమహర్షియని తెలిసినవారు చెప్పుచుందురు. అగస్త్యమహర్షి దక్షిణ భారతమును సంస్కృత సంస్కృతితో పునీతము గావించెనని మనదేశమందు ప్రతీతిగలదు.

ప్రాగ్ద్వీపములలో, పూర్వ భారత సంస్కృతి స్థాపనలో, కృషి, దక్షిణభారతీయులది. అందులో ప్రధానముగా, ఆంధ్రులది. ఆ ద్వీపములలో శైవము, వైష్ణవము, బౌద్ధము కూడను సమాదరము పొంది సమభివృద్ధి చెందినవి. అది భారతీయ మతసహనము. మధ్యజావాలోని చరిత్రప్రసిద్ధమైన బోరోబుదూరు బౌద్ధస్తూప శిల్పమునకును, ఆంధ్రుల అమరావతీ, నాగార్జునకొండ స్తూప శిల్పములకు సన్నిహితసంబంధ మున్నది. నాగార్జునకొండ శిల్పకళయొక్క ముద్ర, బర్మా శిల్పచిత్రకళమీదను, కొంచెము చీనా శిల్పకళపైనను కన్పించునందురు. ఇటుల ఆంధ్రుల శిల్ప చిత్రకళ, ప్రాచ్యదేశములకు బౌద్ధ భిక్షులద్వారా, శిల్పులద్వారా, భిక్ష పెట్టినది.

జపాన్ దేశస్థుల నిరాడంబరత, నిగ్రహము, సౌందర్యపిపాసలకు, మనదేశమునుండి ప్రవహించిన బౌద్ధసంస్కృతే కారణమని. ఆ దేశస్థుల విశ్వాసం

మన సంస్కృతివాహిని ప్రవహించిన ప్రాన్తేశములలో దయ, సత్యం, శౌచములు కన్పట్టుచున్నవి; లేని దేశములలో రాక్షసత్వము తాండవించుచున్నదని, గురుదేవుడు వక్కాణించెను.

చరిత్రకందని దినములనుండియు, సంస్కృతము వ్యావహారికభాషగా అత్యున్నతదశ నుండినప్పటినుండియు, మనకు ప్రాగ్ద్వీపవాసులతో సంస్కృతిపరిచయము కలదనుటకు ఆధారములు కలవు. పాశ్చాత్యదేశములనుండి మనదేశములో ప్రవేశించిన పొగాకుకు, సంస్కృతములో పర్యాయపదము లేకుండుట, ప్రాగ్ద్వీపములనుండి వచ్చిన, సుగంధద్రవ్యములకు 'జాజికాయ,' 'జాపత్రి,' అని పేర్లు వుండుట, మన ప్రాచీన ప్రాచ్యసంబంధములను రుజువు చేయును.

సుమత్రా జావాలో 'కాటు బాకా' అనేచోట గెంపిన చంద్రగుప్తుని బంగారునాణెము దొరకుటనుబట్టి, యితర ఆధారములను బట్టి దాక్షిణాత్యులతోపాటు, ఔత్తరాహులుగూడ ఆ ద్వీపములలో మన సంస్కృతివ్యాప్తికి కృషి చేసినట్లు చెప్పవచ్చును.

పాతిక ఏండ్లక్రిందట, బటేవియా నగరములో శాస్త్రవిద్యాడని ఒక పండితుండెను. ఈ పండితుని పేరు మన సంస్కృతి సంస్కృతికి సంబంధించినది. మానవాభ్యున్నతికి శారీరకశక్తికాక, శాస్త్రీయమైనశక్తి కావలెనని స్ఫురించెడి పేరు యిది. ఇప్పటికి భగవద్గీతాశ్లోకములు జావాలో చాలామంది గౌరవముతో విందురని ప్రతీతి. వైదికపూజావిధానమును పంచాంగమును పూర్వము భారతీయ, సంస్కృతిస్థాపకులు ముఖ్యముగ 'త్రితిష్ట' యను మహనీయునివలన ప్రవేశ పెట్టబడినదని జావాలో చెప్పకొందురు.

అక్కడ మండపములను 'పండపము'లందురు. భారతయుద్ధము అనుటకు 'బ్రతిశోయ్యా' అందురు. 'వాయంగ్' వినోదములని ఒలి, జావా ద్వీపములలో ప్రచారములో నున్నవి, మన వీధినాటకముల వంటివి. 'వాయగ్ వోంగ్'లు మన తోలుబొమ్మలాటలవంటివి. భారత రామయణాదులలోని గాథలు తీసుకొని ఆడుచుందురు. వాయంగ్, పూర్వ 'వాయంగ్ గెదక్' అనునవి మన ఛాయాక్రీడలు. తోలుబొమ్మలాటలను పోలినవేయని 1906 లో పిశ్చెల్ అను దొర స్పష్టముగా చెప్పెను. మన పౌరాణిక ఐతిహాసిక గాథలన్నియు, అక్కడ ఆబాలగోపాలములకు చిరపరిచితములు. అక్కడి సంపన్నాధీశులైన సుల్తానులుగూడా యీ వినోదములను, భారత పౌరాణిక గాథలను పోషించుచూ వచ్చిరి.

భారతదేశ ప్రాగ్ద్వీప సంబంధములు పరిశీలించినచో వేద మతములో అన్యజన్ములకు స్థానములేదను వాదము నిరాధారమని తెలిసిపోవును.

బటేవియాలోని పురాతనవస్తుశాలద్వారముకడ సుందరమందహాసముతో స్వాగతమిచ్చుచున్నట్లు విఘ్నేశ్వరుని విగ్రహము కలదు. మనకువలె జావాలో వరియన్నము ప్రధానమైనది. వరిధాన్యమును దివ్యధాన్య మంటారు. జావాలో వరి బాగా పండే భూమి 'సుఖ భూమి.' అక్కడి జంత్రవాద్యములు మన వాద్యములను పోలియుండును. జావాలో కొంతకాలముక్రిందటివరకు, బలిద్వీపములో యిప్పటికినీ, మనుధర్మశాస్త్రము చాలా పలుకుబడి, ప్రాముఖ్యము వహించియున్నది. తంత్రశాస్త్రమునకు సంబంధించిన ప్రాచీన వ్రాతప్రతులు ఆ ద్వీపములో కలవు. 'సెలిబసు' ద్వీపములో, మన దేశాన్ని 'రామాయణ దేశం' అంటారు. రామాయణకథలను అక్కడ వస్త్రములపై చిత్రించుదురు.

బలిద్వీపములో వారి భాషలో మహాభారతము, బ్రహ్మాండపురాణం విష్ణుపురాణం, మనుధర్మశాస్త్రం, భృగుధర్మశాస్త్రం, కామందకుని రాజనీతి యిత్యాది గ్రంథముల వ్రాతప్రతులు కలవు. ఆ ద్వీపములోను యితర ప్రాగ్ద్వీపములలోను ప్రాచీనకాలమునుంచి, 9,10 శతాబ్దులకాలమునాటివరకు సంబంధించిన సంస్కృతి శాసనములు యెన్నియో బయల్పడినవి.

ఆ ద్వీపములకు మనకు రాయబారసంబంధములు గాఢముగ నుండెడివి. ఆ దేశముల రాజులు సమస్తవిషయములందును భారతీయ విధానములనే అవలంబించుచూ వచ్చిరి. పదునాల్గవ శతాబ్దములో 'జయనగర్' అనే జావారాజొకడు పాండ్యులదైన, 'సుందర పాండ్య' అనే బిరుదు వహించెనట; పాండ్యరాజుల 'మీనద్వయం' అనే మొహారు ఉపయోగించెనట. శ్రీకృష్ణదేవరాయల రాజ్యములో మలయా రాయబారి వుండెనని చరిత్ర చెప్పుచున్నది.

1475 లో జావా మహమ్మదీయుల వశమైనప్పుడు అక్కడనుండి స్వాతంత్ర్యకాముకులు కొందరు బలిద్వీపమునకు కాందిశీకులుగా వెళ్లుట తటస్థించినది. ఆ ద్వీపములోని పండితులను 'పాదండు'లంటారు. భారత సంస్కృతిచ్ఛాయలు బలిలో విశేషముగా కానవచ్చును. మనకళలు, శాస్త్రములు, శిల్పము, వేదాంతముతోపాటు క్షాత్రతేజము కూడా ప్రాగ్ద్వీపములకు భారతమునుండి పరుగులువారినది. దక్షిణబలిలో రాజులనేకులు మనదేశములోని సుక్షత్రియులవలె 1906, 1908 సంవత్సరములలో వచ్చినవారితో పోరాడి వీరస్వర్గ మలంకరించిరి. ఇది క్షాత్రతేజమునకు ఒక నిదర్శనము.

బలి ద్వీపములో దేవాలయప్రాకారములపై చెక్కబడిన గరుడ నాగ విగ్రహములు, గొప్ప శిల్పకళానైపుణ్యమును సూచించును. చంద్రుని మింగు రాహువు, రాక్షస సంహారము కావించు చక్రధారి మొదలగు చిత్రములు ఆలయములో కాన్పించును.

బలిద్వీపపు పల్లెసీమలు మనదేశములోని ఆదర్శముగ వర్ణింపబడిన గ్రామములవలె, కళకళలాడుచుండును. దేవాలయములలో గ్రామపంచాయతీ సభలు జరుగుచుండును. బలి, జావాలలోని గ్రామపంచాయతీవిధానము, ఆంధ్రదేశమును పాలించిన రాజుల చోళరాజుల రాజ్యములలోని గ్రామపంచాయతీవిధానము పోలియున్నదని "హిస్ కెల్ బెల్" అను వతడు వర్ణించియున్నాడు.

జావాలో గృహస్థుకొవిదే ఇప్పటికి ఏ వ్యక్తికి సంపూర్ణ పౌరస్వత్వము లభించదట. మనదేశములోవలెనే గేస్తునకు గౌరవము హెచ్చు. ఇక్కడవలెనే సంఘమునకు ప్రమాణము కుటుంబమే కాని వ్యక్తి కాదు.

మలయాములో బౌద్ధమతము యీ నాడు యెంతో పతితముగ కనిపించును. పాపము అనుటకు అక్కడ 'బాప' అంటారు. మలయాములో 'మెనామ్' నది ప్రవహించును. వీరు ఆ నదిని 'మెనామ్ ఛావో ప్రాయా' అనుచు భక్తిశ్రద్ధలు చూపుదురు. దానికి నదీదేవత నదీమతల్లి అని అర్థము. మనకునూ నదులు కడు పవిత్రములు. మనము గోదావరితల్లి గంగమ్మతల్లి యని పెద్దనదులనుగురించి పాడుకొందుము.



ఆగ్రాలోని రాధాస్వామి దేవాలయం

ఛాయాచిత్రం : శ్రీ వి. కేశవశర్మ

ప్రసిద్ధ పత్రికారచయిత కాళిదాస నాగ్ బలిద్వీపములో 1920 ప్రాంతమున ఒక ఉత్సవము సందర్శించి ఆ ఉత్సవము ఉత్తరహిందూస్థానములోని 'మేళా' వలె వుండెనని వర్ణించెను. ఆ సందర్భమున జరిగిన నాట్యప్రదర్శనములోని నటుల హస్త విన్యాసములు, సర్పమువలె వంపులతో సొంపులతో తిరుగు వారి దేహవల్లుల సౌందర్యములు కాంచి 'భుజంగప్రయాతవృత్తము' యొక్క నడక యందము, రీవి, తనకు స్ఫురించెనని నాగ్ తెలిపి యున్నాడు. అక్కడి ఉత్సవాలు, మన దేశములో ఇప్పటివాటి లాగు కాక అదిర్మప్రాయముగ రామాయణ మహాభారత కాలము లను స్ఫురించునట.

ఇవన్నియు ప్రాగ్ద్వీపములలో ఆనాటి సాహసిక భారతీయ కళాభిజ్ఞులు, వేదమతోద్ధారకులు, బౌద్ధభిక్షువులు, కావించిన కృషి ఫలితావశేషములు, నిస్వార్థులు, పరహితతత్పరులునై ప్రాచ్యదేశ ములలో లేవనెత్తిన భారతసంస్కృతీభవన నిర్మాణశిథిలములు. సృష్టికర్తయగు సృష్టియర్థమును సింహావలోకనము చేసుకొని సంతసించునట్లు వారు పెంపొందించి భగవంతునికి సమర్పించిన ప్రాచీన భారతౌన్నత్యనందనోద్యానపు కడపటి సువాసనలు.

'సిలె వన్ లేవి' యను ప్రసిద్ధ చరిత్రకారుడు ఆసియాఖండమున యూరపులో గ్రీసుదేశము కల్గించిన చైతన్యము గ్రీకు నాగరికతయను కంటె, తూర్పు ఆసియాలో భారతము కల్గించిన చైతన్యము భారతీయత, కనుకనే అధికమైనదని భాషించెను.

భారతమునకు, ప్రాగ్దేశములకు గల సాంస్కృతికసంబంధ మును ఇంగ్లండునకును, అమెరికాకును గల సాన్నిహిత్యముతో పోల్పదగును.

ఇండొనీషియాలోని వివిధద్వీపముల ఐక్యతకు ఏకీకరణకు ఆయాద్వీపములన్నిటిలో ప్రాచీన భారతీయులు స్థాపించిన సమాన సంస్కృతి సభ్యతలు, సంప్రదాయములు, సమాన విద్యావ్యాసంగాలు కళలు శిల్పములే, సాధనములైనవి.

19 వ శతాబ్దపు ప్రఖ్యాత అమెరికన్ పండితుడు, కవియైన, 'విట్ మన్' భారతదేశమును ఉద్దేశించి, పూజ్య ఆసియాఖండము, భారతదేశ సంస్కృతినాక ఆధారముగా, ఇప్పటికీ జీవితయాత్ర చేయుచున్నదన్నాడు.

ఏనాడో మన తాంబూలచర్వణమును సువాసనభరితము చేయు జాజికాయ, జాపత్రులను మనకు ప్రసాదించినది—ఇండొనీషియా. ఈనాడు మన ప్రధాని శ్రీ నెహ్రూ యాజమాన్యమున, నవభారతము ప్రపంచములో సాధించుచున్న శాంతి సౌభ్రాతృత్వముల ప్రచారమునకు ఆకర్షణీయమైన నినాదమును, పాంచ్ షీల్—'పంచశీలను' అందించినది—ఇండొనీషియా. ఇట్లు పరస్పరము సంస్కృతి వాహిని—జీవనది.

# అక్షయపాత్ర

శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

బుద్ధదేవుని సన్నిధానంలో ఒకసారి జరిగిన అతికరుణాకరమైన సంఘటన ఇది. క్షామనివారణం చెయ్యాలి. పెద్దలంతా గుండెలు పట్టుకు చూసుకుంటున్నారు. శ్రావస్తీపురం—ఆ ప్రాంతమంతా సంక్షోభించిపోతున్నది; ఆ ఘట్టంలో. సామాన్యురాలు 'సుప్రియ' అనే భిక్షుకి ముందుకొచ్చి ఆకలిమంట లార్పింది!

'నూకల కేడ్చి యేడ్చి ఇకనోతెగ యేడ్చిరి గంజికోస, మ
త్యాకలితో జనంబు! ఒకరైనను పాపమటంచు బల్కరే!!
ఆకసమందు నీలజలదంబులు తొంగియుచూడ, వా మహా
భీకర బాధలో జరయు మృత్యువు కౌగిలి నింపుకొన్నవో!!

కనుగొనుడీ కనుంగొనుడి కాటకమున్' అని మూసియున్న చ
ల్లని సువిశాల లోచనములన్ దెరువన్ కరుణాపయోనిధుల్
తొణికెను బుద్ధదేవుని మృదుప్రవిశుద్ధ కపోలపాళిపై—
వినయము పొంగి శిష్యులు ద్రవీభవదాత్మకులైరి చూచుచున్!

'ఎవరోయీ! ఎవరైనగాని చను దెంచీ ముందుకున్, క్షామధూ
మవిపద్ఘూర్ణ జగజ్జనావనఘృణా మాధుర్య లిందెవ్వరో
నవలోకింతు' నటన్న గౌతము సుధాస్యాంభోజగంభీర సా
ధువులౌ వాక్కులవెంట నర్థములుగా దోతెంచి రొక్కొక్కరై!!

'ఒ ప్రభూ! ప్రభు! దుర్భిక్షమూడ్చుగాని—
నయము వినయము ప్రజలకు నచ్చ దసలు!
ఆనతిందు నిరంకుశాధ్వాన బోవ
దీర్తు క్షామమున నొక ధీరమంత్రి!'

'స్వామి! దైవికమైన విపత్తు దీర్ప
మానవాళికి తరమ! భూమండలమున
ఒక్క ఖండానికైన నాకున్న ధనము
చాలునా!? అనియె నొక్క లక్షాధికారి!!'

'ఓ దయామయ కాటక 'తృష్ణ' యనుచు
నూదివైతునె,—సంసార మీదువరకె
చావుదప్పి కన్నులు లొట్టబోవుచుండ!
అనుమతిండని చూచె గృహస్థు డొకడు!!'—

ఆ గంభీర సభాసముద్రమున దీవ్యద్గర్భదారిద్ర్య కే
ళీ గాఢద్యగళాగ్రిమన్వరతరంగం బూగి ప్రోగాగన్, 'ప్రభూ
సాగింతున్ గృపసేయుడీ కరువుదీర్పన్ భిక్షుకీసేవలో
మూగింతున్ ప్రజ' నంచు సుప్రియ మనోముక్తార్ద్రితారంబునై!

వికటముగా సదస్స్యులు గభీమని నవ్విరి! ఈ దరిద్రసే
విక మసిపాతపీలికలు, బిచ్చపుచిప్పయు దీర్పు కాటకం
బిక నని, ధర్మమూర్తి కను లింతలుగా వికసించి కొల్కులన్
ఒకొక్కటె జాచు రాలెను రసోల్బణచిహ్నిక లశ్రుబిందువుల్!

'అమ్మా! క్షామనివారణం బెటుల సేయన్ దల్చినా వీ అసా
ధ్యమహాత్మమార్గము మంత్రులున్, ధనదులున్, గార్హస్థ్యులున్, ద్రొక్కరే!
ఎమ్మాడ్కిన్ దరియింతు భిక్షుణివి! ఏమీ సాహసం!' బన్న దై
వమ్మున్ గాంచుచు బల్కె సుప్రియ కృపాపాథోధులన్ దాకుచున్!

'ధర్మమే శరణమోయి తథాగతవిభు!
సంఘమే శరణమోయిక శాక్యముని!
బుద్ధుడే శరణమోయి ప్రసిద్ధమూర్తి!
ఎంత స్వాదువు నీ దయాదృష్టి తండ్రి!!

స్వార్థము లేని నీ ప్రభుత స్వర్గము దింపినదోయి భూమికిన్—
వ్యర్థవివాదముల్ సలుపువారికి అందవు దివ్యభావ లో
కార్థము, లీ క్షుధావ్యథితకర్మము మర్మ మెఱింగివచ్చె! నీ
చార్థములో దగుల్కొని ప్రజార్ణవ మెంతగ క్షోభ జెందెనో!!

బిచ్చపు గిన్నెలో నమృతమే గురిపింతు ననుజ్ఞ నీయవే
సచ్చరితా! జగత్పథము వాడలలో నిరుపేదవాడలన్
హెచ్చిన మేడనీడలను ఏగెద ప్రేమ మహత్తు దెల్పుచున్
రిచ్చపడంగ మేకను పులిన్ ఒక రేవుకు దెత్తు నా మునీ!!

నా దేమున్నది స్వామి! సర్వము జగన్నాథంబు, మీ ఆశిష
మ్మే! దాసిన్ గద! శక్తివంచనము రానీకుండ ప్రాణంబులే

చేదై క్రుంగిన మూగజీవులను నే సేవింతు! నైష్ఠమ్య నీ
శ్రీదగ్ధాంగుల సామ్యసూత్రమున శాంతిన్ గూర్తునా ఓ మునీ!!"

చిరునగవుల్ చిగిర్చెను కృశించిన గౌతమ మౌని మోముపై!
ఇరవుగ పక్షి తుండమును ఎత్తిన రీతిని సుప్రియా శిరో
పరి తులసీదళంబుకొన బాహువుకు శోకము మెత్తి తాకి సాం
తర బహిరంగ సర్వకరుణామయమూర్తి వచించె నిట్టులన్!

"నేల నాలుగు చెఱగుల నియతమతిని
ఆర్తజనుల ఆకలిమంటలార్పి రమ్ము!
భిక్షుకీ నీవు పట్టిన అక్షయకృతి
పాత్ర దీనుల జీవనయాత్ర పోమ్ము!!—"

* * * * *

సోదర మానవ ప్రణయశోధన జేయుచు నేగు సుప్రియా
సాదర తత్త్వగానము నిశామహాతిరుతి యాచు క్షామ సం
ధ్యా దురదృష్టముల్ చెరిపి ధార్మికదీపము వెట్టెనో! నవాం
భోదము లీదులాడెను శుభోదయహేమపయోధివీచులై!!

# బ్యాంక్ ఆఫ్ బరోడా, లిమిటెడ్.

(స్థాపితము 1908)



అనుమతి పొందిన మూలధనము ... రు. 2,40,00,000/-

జారీచేసిన & చందావేసిన మూలధనము ... రు. 2,00,00,000/-

పిలువబడిన మూలధనము రు. 1,00,00,000/-

చెల్లించబడిన మూలధనము రు. 1,00,00,000/-

రిజర్వు నిధి&ఇతర రిజర్వులు రు. 1,28,00,000/-

## హెడ్ ఆఫీసు: బరోడా

దక్షిణ ఇండియా బ్రాంచీలు:-

* బెంగుళూరు * కోయంబత్తూరు
* గుంటూరు * హైదరాబాదు
* మద్రాసు * త్యాగరాయనగర్ (మద్రాసు)



ఇండియాలోని అన్ని ప్రధాన కేంద్రాలలో బ్రాంచీలు ఏజన్సీలు గలవు.



ప్రపంచములోని అన్ని ప్రధాన నగరాలలో కరెస్పాండెంట్లు గలిగి, ఈ బ్యాంకు ఎగుమతి, దిగుమతి వర్తకులకు అవసరమైన సేవచేయ సంసిద్ధముగా నున్నది.



వివరములకు వ్రాయండి:

కే. గోపాలరావు, మేనేజరు, మద్రాసు. || మాత్యూ ఎస్. డి'సౌజ, జనరల్ మేనేజరు.

మానవుని బాధ

# కుష్ఠరోగము

కుష్ఠము భయంకరమైన వ్యాధియని. చాలా కాలముగా ప్రపంచ మెరిగినది. విశేష సంబంధ అనుభవమువల్లనే అంటు వ్యాధి అనవచ్చును. అది మెల్లగా ప్రబలుచున్నది. మంచి యోచనలో దక్కని ఔషధమువల్ల వాటిని ఖండించవచ్చును.

ఈ వ్యాధియొక్క మొదటి ఆనవాలు దేహమందు ముఖ్యముగా చెవులపై ఏర్పడును. చిన్నచిన్న కురుపులు లేక పొడలు, ఇవి ముక్కునందును, మోచేతియందును, తొడలలోను యేర్పడును. పిదప దేహమంతియు నల్లుకొనును. కురుపులు పెద్ద పుండుగా మారును. కుష్ఠము నరములనుకూడా పీడించును. అందువల్ల నరములు ఆ వ్యాధికి లోనై తన శక్తిని పోగొట్టుకొనును. పొడుపు బాధ కూడ యేర్పడవచ్చు.

చర్మసంబంధము:—దేహముపై ఎర్రని వర్ణముగల పొడలు, దద్దులు యేర్పడుట, పొడుపు, బాధ, గజ్జి, మొదలైనవి. నరములసంబందము—పొడలుగల చోట్లలో తిమురుకలుగుట, దుర్ నీరు సర్వ అవయవములందు వ్యాపించి రక్తమునందు కలిసి మత్తు కలుగజేయుట, సూదితో పొడిచిన బాధ కనబడకుండుట, చేతి వ్రేలు ముడుచుకొనుట, ముక్కు బంధనములు మొదలైనవి. అస్థి సంబంధము—పాదమునందు పల్లపు పుండు యేర్పడుట, కాలు చేతులు వ్రేళ్లు తిగ్గుట, చూచువారికి విసుగు జెందువట్లు మరికొన్ని బాధలు యుండును.

కుష్ఠమునకు అనేక ఔషధములు తయారు చేయుడమైనది. ఇంకను తయారు చేయుటకు ప్రయాసపడుచున్నాము. పూర్వముననే హిందూదేశమున మాత్రము సిద్ధ ఆయుర్వేద భాగమున కుష్ఠరోగమునకు ఔషధముకని పెట్టబడి జయమునొందుచు వచ్చుచున్నది. వీట్లలో మా యొక్క "మేల్ మాయిల్ మందు" మిక్కిలి శ్రేష్ఠమెనదనుట ప్రపంచమునకు విశదమే. ఏలయన, చాలా పరిశోధనలు పూర్తిగా కుష్ఠరోగ నివారణమునకు దీనిని ప్రధానముగా వాడుచున్నారో అటువంటి శ్రేష్ఠమైన మూలిక వగైరాలతో సిద్ధఆయుర్వేదభాగమునను సరించి మాయొక్క 'మేల్ మాయిల్ మందు' తయారుచేయబడుచున్నది. ఈకఠినవ్యాధి వల్ల బాధపడు మానవులు మా 'మేల్ మాయిల్ మందు'ను సేవించి బాగుపడి భగవత్ కృపకు పాత్రులగుదురుగాక.

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారిగారి

## మేల్ మాయిల్ మందు

ప్రపంచములో ప్రఖ్యాతిగాంచిన మేహ, కుష్ఠరోగనివారిణి.

———వివరములకు వ్రాయండి:———

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి అండ్ సన్సు

5/22 మేల్ మాయిల్, వయా P. O. (N. A. Dt) కాట్పాడి.

# సత్యాగ్రహ సమర స్మృతులు

శ్రీ వాసిరెడ్డి పార్థసారథి

సత్యాగ్రహము జరిగి ఇప్పటికి, సుమారు ఒక పాతిక సంవత్సరములు గడిచినవి. ఇప్పటివారికి, ముఖ్యంగా క్రొత్తతరం విద్యార్థులకు సత్యాగ్రహంలో ఏంజరిగిందో తెలియదు. అనేకమంది అడుగుతుంటారు. చెప్పితే, ఇంకా చెప్పమని చెవి కోసుకుంటారు. ఇంకొక 25 సంవత్సరములు జరిగినయెడల, ఈ సత్యాగ్రహసమరమంతా గతించిన చరిత్ర ఔతుంది. అందువల్ల నాకు జ్ఞాపకం వున్నంతవరకు ఉప్పు సత్యాగ్రహము, జెయిలూ, ఈకథ నంతటినీ సంక్షిప్తంగా మనవి చేసుకుంటాను.

వేసవికాలంరోజులవి. 1930 సంవత్సరము ఏప్రియల్ 15 వ తేదీన రెండుబారల ప్రొద్దు ఎక్కింది. గాలిదుమారం వచ్చేటందుకు వున్నట్లుంది. ఉప్పు సత్యాగ్రహము భారతభూమినంతటా జోరుగా సాగుతున్న రోజులవి. గుంటూరు పట్నంలో యడవల్లి వారి సత్రము జిల్లా సత్యాగ్రహసమరమునకు ఆశ్రమంగా వున్నది. సమర సైనికులంతా, తెల్లవారుజామున, గంట వినపడుటతోనే, లేచి, ప్రార్థనలను చేసికుని, కాలకృత్యాలు తీర్చుకుని, వూళ్లోకి వెళ్లుతారు. కొందరు జాతీయ కీర్తనలు పాడుకుంటూ వూరంతా తిరిగేవారు. కొందరు విదేశీవస్త్రాలయములవద్ద, విదేశీవస్త్రాలను బహిష్కరించండని చెప్తుతూ, కల్లు సారా అంగళ్లవద్ద కొందరు మద్యపానంవద్దనీ, కొందరు నిషిద్ధమైన ఉప్పును అమ్ముతూ వుండేవారు. వీరంతా భోజనాలవేళైనందున, ఆశ్రమానికి తిరిగి వస్తున్నారు. ప్రథమ జిల్లా డిక్టేటరుగా వున్న వున్నవ లక్ష్మీనారాయణ గార్ని జెయిలుకు పంపగా, ఇప్పుడు కల్లూరి చంద్రమౌళి గారు ఆ పదవిలో వున్నారు. వీరూ, నేనూ, ఇంకా కొందరము సత్రం ముందు వేయబడిన పెద్ద పందిరిలో కూర్చొని మాట్లాడుకుంటున్నాము.

ఇంతలో రెండు బస్సులు విసురుగావచ్చి ఆశ్రమం వాకిట్లో ఆగినవి. అందులోనుండి జిల్లా కలెక్టరు, సూపరింటెండెంటు వగైరాలు దిగి మావద్దకు వచ్చారు. జిల్లా కలెక్టరు, సూపరింటెండెంటులు మిలిటరీ దుస్తులతో భయంకరంగా వున్నారు. పైన శిఖరము వలెవున్న టోపీని ధరించి, నడుము తోలుపటాకాలో రివాల్వర్లతో వున్నారు. ఇందులో వకరు మీలో నాయకుడెవరని ఇంగ్లీషులో అడిగాడు. చంద్రమౌళిగారు ఏమికావలెనని ముందుకు వెళ్ళారు. మీరంతా శాంతికి భంగం కలుగచేస్తున్నారు కనుక ఇక్కడ 144 సెక్షన్ వేయబడ్డది. మీరంతా ఇక్కడ వుండకూడదు ఖాళీ చేయమని చెప్పారు. చంద్రమౌళిగారు నావంకకు తిరిగి, అరండల్ పేటకు వెళ్ళి కృష్ణారావుగార్ని పిలుచుకురమ్మనమని చెప్పారు. సత్యాగ్రహికి అతని సామానంతా అతని మెడకు తగిలించుకునే సంచిలోనేవుంటవి. నేను నా సంచితో అరండల్ పేట వెళ్లి కృష్ణారావుగార్కి చెప్పి, వెంటనే తిరిగి ఇక్కడికి వచ్చాను. ఇక్కడికి వచ్చి ఈ ఆశ్రమాన్ని చూడటంతోనే, నా కళ్లు భైర్లుకమ్మినవి. గజ గజా వణికిపోయినాను. గుండె ఆగినంత పనైంది. శాంతినిలయంవలె ఉన్న ఆశ్రమం, వక్క నిమిషంలో మండుతున్న శ్మశానభూమిగా మారిపోయింది. ఆశ్రమం చుట్టూ రిజర్వుపోలీసులు నిలబడి లాటీలు విసురుతున్నారు. పందిరిక్రింద, యుద్ధభూమిలో కాళ్లువిరిగి, తలలు పగిలి, నడుములు విరిగి నెత్తురుమడుగులో పడివున్నట్లు భయంకరంగా వున్నది. దీనికి తోడు, మా భోజనాలకై చేయబడిన సామగ్రినంతటినీ, రోడ్డుమీదికి తీసుకువచ్చి పారవేశారు. అన్నము, కూరలు, మజ్జిగలను తినేవాటిని ఈ విధంగా పబ్లికు రోడ్డుమీద కుక్కలకు కాకులకు పారవేయటం చాలా హృదయవిదారంగా వున్నది. ఈ స్థితిని చూడటంతోనే నాకు వున్న మతిపోయింది. ఏమి చేయాలో తోచలేదు. ఎట్లయితేనేమని, వాడుకప్రకారము ఆశ్రమంలోకి వెళ్లుదామని ముందుకు అడుగువేశాను. ఇంతలోనే నామీదకు లాటీల విసుర్లు వచ్చినవి. ఈ తిరుణాల చూడటానికి, చెప్పుకోటానికి అనేక జనము చుట్టూ చేరివున్నారు. ఇందులో వకరు, నా చేతిని పట్టుకుని వెనుకకులాగి, బ్రతకాలని లేదా యని వెనుకకు నెట్టారు. కర్తవ్యం ఏమిటో తెలియని నేను ఎటు నెట్టితే, అటే పోయినాను. ఇంతలో మా సత్యాగ్రహులు నన్ను అవతలికి తీసికునివెళ్ళారు. ఇక్కడ వున్నందువల్ల ఏమీ ప్రయోజనం లేదనీ, తర్వాత చేయవలసింది మాట్లాడుకుందామని చెప్పారు. నేను వెళ్లిన తర్వాత ఏమి జరిగిందని అడుగగా వారు ఇట్లా చెప్పారు. పోలీసు సూపరింటెండెంటు ముందు చంద్రమౌళిగార్ని గొంతుపట్టుకుని, ఎత్తుకువెళ్లి బస్సులో పడవేశారు. చంద్రమౌళిగారు వూపిరాడక ప్రాణంపోతుందా అని అనుకున్నాము. తర్వాత సత్యాగ్రహుల మీద లాటీచార్జీ చేయించారు. సత్యాగ్రహులను లాటీలతో ఎంత కొట్టినను కదలలేదు. దానిమీద తీవ్రంగా గొడ్లనుకొట్టినట్లు కొట్టించారు. నాదెళ్ల కృష్ణయ్యగారు వృద్ధులు, లావాటి మనిషి, అసలైన సత్యాగ్రహి, భక్తుడు. వీరిని కొడుతుంటే కన్నులు చూడలేకపోయినవి. వీరు దెబ్బపడ్డప్పుడల్లా రామా, కృష్ణా, మహాత్మా అన్నారేగాని కదలలేదు వళ్లంతా రక్తమయమై స్పృహలేనివరకు కొట్టుతూనేవున్నారు. ఇట్లే ఆడ, మగ సత్యాగ్రహుల నందరినీ కొట్టి వదిలారు. హృదయం భరించలేకపోయిందన్నారు. చాలా మందిని లాక్కువెళ్లి రోడ్డు అవతలకు నెట్టారని చెప్పారు. మానవత్వంవున్న ఎవరూ ఇది చేయలేరనీ, పోలీసులను బాగా తాగించి తీసికువచ్చి ఈ పశుత్వపుపనిని చేయించారని చెప్పారు. కనుక అపాయస్థితులలోవున్న మనవాళ్లనుగురించి ఏమిచేయవలెనో వ్యథపడ్డాము కొందర్ని ఆసుపత్రులకు చేర్పించారు. పట్టణంలో సాయుధులైన పోలీసుల బస్సులు తిరగటం ప్రారంభించినవి. ఖద్దరు వస్త్రధారి కనుపించకూడదు. కనుపించినా, వాడిని విరుగకొట్టుతున్నారు. అందులో పట్నంలో విచ్చలవిడిగా తిరుగుటకు వీలులేకపోయినది. పైగా సత్యాగ్రహులుకానివార్ని కూడా కొట్టుతున్నారు. సత్యాగ్రహికి ఆశ్రయం ఇచ్చినా, మాట్లాడినా వాడి ప్రాణాలు తీస్తున్నారు. చంద్రమౌళిగారు, ఇంకా కొందరూ ఏమైనారో, ఎట్లున్నారో మాకు తెలియలేదు. అందుచే ఒక పెద్దమనిషివద్దకువెళ్లి చంద్రమౌళిగార్ని సబ్ జయిలులో వుంచివుంటారు, వెళ్లి ఎట్లున్నారో చూచిరావలసిందని బ్రతిమిలాడాము. కాని వారు

భయంతో వుండటమే మేలు కాదని చెప్పారు. ఇట్లాంటి పరిస్థితిలో, మాకు అన్నము పెట్టే ఉదారహృదయులెవరూ కనుపించలేదు. ఇట్లు ముందే ఆకలితో, భారమైన హృదయంతో సాయంత్రం కావచ్చింది. భగవంతుడు ఏదో దారి చూపకపోడు. డాక్టరు చలపతి రావుగారి ఇంటివద్ద చేరాము. వారి భార్య చల్లనితల్లి మమ్మందర్ని, కేసులనుంచే, ఇంటివెనుక చీకటిగదులలో వుంచి, వంటచేసి భోజనం పెట్టింది. ఈరాత్రి ఎక్కడికిపోతారు, డాబామీద పండు కోండని స్థలం ఇచ్చింది.

గుంటూరులో జరిగిన ఈ మారణహోమము పల్లెపల్లె తెలిసింది. మనుష్యులను చంపివేస్తున్నారనీ, కొందరు చనిపోయినారని వార్తలు వ్యాపించినవి. మరుసటిరోజున, మా కొరకు ఇంటివద్దనుండి మనుష్యులు వచ్చారు. మమ్ములను ఇంటికి రావలసిందని ప్రాధేయపడ్డారు, భయపెట్టారు. మేము వెళ్లలేదు.

చంద్రమౌళిగారు తర్వాత, మాకు డిక్టేటరు కన్నెగంటి సూర్యనారాయణగారు. వీరు మమ్ము వెంటవేసుకుని సత్యాగ్రహపనులు చేయిస్తున్నారు. భీతిపుట్టిన గుంటూరుకన్నా తెనాలిలోనైతే బాగుంటుందేమోనని తెనాలికి మారాము. ఇక్కడా పోలీసువారు లాఠీలతో చాలామందిని కొట్టారు. సూర్యనారాయణగార్ని అరెస్టు చేశారు. వీరి తర్వాత మాకు డిక్టేటరు అలపర్తి సుబ్బయ్యగారు వీరూ నేనూ, మాచిరాజు రామమూర్తిగారు, ఇంకొకరము బాపట్ల వెళ్ళాము. అక్కడ పనులుగా దూరంగా వున్న సర్వితోటలో కలిసి మాట్లాడుకున్నాము. సుబ్బారావుగారి తర్వాత నన్ను డిక్టేటరుగా వుండమని నాకు ఉత్తరం వ్రాసి ఇచ్చారు. ఎవరు ఏమేమి చేయవలసిందీ మాట్లాడుకుని, మా గ్రామాలకు వెళ్ళాము.

జూలై నెలలో ప్రభుత్వమువారు నా మీద కేసు పెట్టారు. అది 24 వ తేదీన, డిప్యూటీకలెక్టరు వెంకట్రామయ్యర్ గారి వద్ద విచారణకు వచ్చింది. ముందు, మా గ్రామమునసబు సూర్యదేవర సీతారామయ్యగారు నా మీద సాక్ష్యం చెప్పారు. 1920 లోనే, స్కూల్ ఫైనల్ చదువుతూ ప్రభుత్వపు విద్యను బహిష్కరించాననీ అప్పటినుండి కాంగ్రెసుపని చేస్తుంటానని, 1928 లో గుంటూరు జిల్లా కాన్ఫరెన్సును తుమ్మపూడిలో జరిపానని, గుంటూరు సత్యాగ్రహదళంలో వున్నానని, ఉప్పు అమ్ముతుండగా తాను చూచానని చెప్పారు. ఇట్లాగే పోలీసు సబ్ఇన్స్పెక్టరు కూడా చెప్పారు. నన్ను, నేరము ఒప్పుకుంటావా లేదా అని అడిగారు. ఇది న్యాయ కోర్టు కాదని, అందువల్ల నేను సమాధానము చెప్పనని అన్నాను. కలెక్టరు నాచేత క్షమార్పణ చెప్పించవలెనని, నయాన భయాన చెప్పారు. కాని నేను వినలేదు.

చివరకు నాకు ఆరునెలలు కఠినశిక్ష వేశానని చెప్పారు. మా విచారణను చూచుటకు మద్రాసు శాసనసభ్యుడు పిల్లలమర్రి ఆంజనేయులుగారు ఇంకా కొందరూ వచ్చారు. శిక్ష చెప్పటంతోనే, ఆంజనేయులుగారు లేచి నాదొకవిన్నప మున్నదని చెప్పారు. పార్థసారథి, నామిత్రుడు, గుంటూరు, కృష్ణాజిల్లాలను జమీ ఏలిన వాసిరెడ్డి వంశస్తుడనీ, బాగా వేదాంతసాహిత్యములను చదువుకున్నాడనీ, అందుచేత, ఏక్లాసుగాని, బి క్లాసుగాని ఇవ్వవలసిందని చెప్పారు. సబ్ఇన్స్పెక్టర్ను, బి క్లాసు నిచ్చుటకు ఏమైనా ఆక్షేపణవున్నదా యని అడుగగా లేదన్నారు. అందుచే, నాకు, నాతోవున్న వాశిరెడ్డి నారాయణప్రసాదుకు బిక్లాసు నిచ్చారు. శిక్ష చెప్పడముతోనే సాయుధులైన పోలీసులు మమ్ము వశపరచుకుని సబ్ జయిలుకు తీసుకునివెళ్ళారు. సబ్ జయిలులో గదులు చిన్నవి. నలుగురుండుటకు వీలైనగదిలో, ఇరవైమందిని వుంచారు. వేసవి అవుటచేత, వుక్క వేడివల్ల వుండలేకపోతిమి. దీనికి తగినట్లు కొందరు అక్కడనే మల విసర్జన చేశారు. విపరీతపు గబ్బు పుట్టింది. ఎవరెన్నో చెప్పినా, ఏమీ ఉపయోగించలేదు. సాయంత్రం భోజనాలు పెట్టినతర్వాత, గవర్నమెంటు డాక్టరు వచ్చి మమ్ములను పరీక్షచేసి వెళ్ళారు. పొద్దు కూకిన తర్వాత, గొప్ప పోలీసు బందోబస్తుతో మమ్ములను తెనాలి రైలుస్టేషనుకు తీసుకువెళ్ళారు. ప్రభుత్వం చేస్తున్న లాఠీచార్జీలు, నిర్దాక్షిణ్యపు కార్యాలవల్ల ప్రపంచమంతా భయం పుట్టిపోయింది. ఆరోజుల్లో జయిలుకు వెళ్లటమంటే, ప్రాణంతో రాననే భయం వ్యాపించింది. శిక్షలు పడ్డవాళ్లను చూచుటకు అనేకమంది వచ్చారు. కాని పోలీసులు మాచుట్టూ లాఠీలతో నిలుచుని, కొటగొడతారు. పదిగజాలలోపు ఎవర్నీ రానీయకుండా, ప్రజలను భయపెట్టారు. పదిగంటల ప్యాసింజరులో ఎక్కించారు. తెల్లవారుజామున మమ్ములను రాజమండ్రి స్టేషనులో దింపారు. ఇక్కడా పోలీసు బందోబస్తు మాకొరకు వేచివున్నది. పోలీసు మా చుట్టూ నిలబడి మమ్ములను బండతిట్లు తిట్టటం ప్రారంభించారు. వీళ్లు బ్రతుకలేక జయిలుకు వెళ్లుతున్నారు. అక్కడ వీళ్లందర్నీ చావగొట్టే కందకాల్లోకి లాగుతున్నారు. వీళ్లు మళ్లీ తిరిగి ప్రాణాలతో రారని తిట్టారు. ఒక పోలీసు బస్సులో మమ్ముల్ని ఎక్కించుకుని రాజమండ్రి సెంట్రల్ జయిలుకు తీసుకువెళ్ళారు. కొత్తవాళ్లకు సెంట్రలుజయిలు యమమందిరం వలె భయంగా వుంటుంది. వార్డర్లు దగ్గరాలంతా ఎల్లటి దుస్తులతో వుంటారు. ఖైదీలుకూడా, మోకాళ్ళవరకు షరాయి, మోచేతుల వరకు చొక్కా, నెత్తికి టోపీవుంటుంది. వీరంతా విచారవదనాలతో వుంటారు. నవ్వుముఖం చూద్దామన్నా కనుపించదు. మా వస్తువులన్నీ పరీక్ష చేశారు. మావద్ద వుండకూడని, వుంగరం, డబ్బు జయిలువాళ్లు తీసుకున్నారు.

జయిలులో మధ్య టవర్ అనే మేడ వుంటుంది. ఇందులో జయిల్ ఆఫీసంతా వుంటుంది. ఇక్కడినుండే బ్లాకులన్నీ వస్తాయి. జయిలులో పెద్దచిన్న గదులుంటవి. చాలామంది వుండుటకు పెద్దవి ఒక్కళ్ళే వుండుటకు చిన్నవి గదులున్నవి. ఒకచోటునుండి ఇంకొక చోటకు వెళ్లుటకు వార్డర్లు వెంబడివుండాలి. లేనియెడల శిక్ష విధింపబడును. జెయిల్ శిక్షణ చాలా కట్టుదిట్టమైనది, కష్టమైనది.

నాకు బి క్లాసు ఇచ్చినందున వేరే ఒక గది ఇచ్చారు. ఇది సుమారు 8 గజాల వెడల్పు, 4 గజాల పొడుగు వుంటుంది. ఒకమూల మనిషి పండుకొనుటకు సరిపోయే అరుగువుంటుంది. పండుకొనుటకు కొబ్బరిపీచు పరుపు ఇచ్చారు. చీలమండలవరకూ షరాయిని, కోటునూ, నెత్తికి గుడ్డటోపీ ఇచ్చారు. అరచేతెడు సత్తుబిళ్లను మెడకు ఇస్తారు. దీనిమీద ఖైదీ పేరు, జయిలు నెంబరు, ఇతనికి విధించబడిన ఆక్టు నెంబరు, శిక్షాకాలం దానిమీద వుంటుంది. ఎ, బి క్లాసువారికి రోజు ఖర్చుకు రు. 0-8-6 ఇస్తారు. కాని సిక్లాసు బహుఅన్యాయంగా వుంటుంది. వారికి షుమారు రెండణాలే ఇచ్చేది. వారికి ఇచ్చే బియ్యము చాలా అన్యాయంగా వుంటుంది. అన్నము సుద్దలుకొట్టి ఇస్తారు. దీనిలో మేకులు, పురుగులూ వుంటవి. పులుసు తప్ప, కూరా పచ్చడి మజ్జిగా వారికివుండవు. ఈపులుసుకూడా చాల ఘోరంగా వుంటుంది. ఇనుపపాత్రలో తెస్తారు. చిలుముకంపు కొడుతుంది. ఏ, బి క్లాసువారందరికి ఇచ్చే సామగ్రి కలిపి ఒక్కచోటే వంటచేస్తారు. ఒక పెద్ద చెట్టుక్రింద కూర్చుని భోజనాలు చేసేవాళ్ళము. భోజనానికి ఒక పళ్లెము, నీళ్లు త్రాగుటకు ఒక లోటా ఇస్తారు. రాత్రులు మలమూత్రవిసర్జనలకు ముంతా మూకుడు, వేరే మూకుడు ఇస్తారు. ఉదయాన కాఫీవారికి, కాఫీ నాల్గురొట్టె ఇస్తారు. ఉదయాన 10 గంటలకు, సాయంత్రము 5 గంటలకు భోజనం చేసేవాళ్ళము. పొద్దు వుండగానే, గదుల్లోకి పంపి తాళం వేస్తారు. తెల్లవారే ఆ తాళంతీయుట. సాయంత్రము మేమంతా చేరి ఒకచోట ప్రార్థనలు, జాతీయగీతాలు పాడేవాళ్లము. ప్రతి

గంటకు, గంటలు కొడుతుంటారు. భోజనసమయాల్లో బూర వూదుతారు. గదివెంట గది వరసగా బజార్లు తీర్చివుంటవి. అక్కడక్కడా పూలమొక్కలూ పెద్ద చెట్లూ వుంటవి. జెయిలు చుట్టూ, తాటిచెట్టుకంటె ఎత్తయిన గొప్ప గోడలుంటవి. ఉదయాన తలుపులు తీయటం ఆలస్యమైతే, అప్పుడు ఏ అభాగ్యుణ్ణో ఉరితీస్తున్నట్టు లెఖ్ఖ. తలుపులు తీయటంతోనే కక్కసుకు పరుగెత్తుతారు. కక్కసులు చాలినన్ని లేవు. వున్నవి శుభ్రంగా వుండవు.

జయిలు అంతా సూపరింటెండెంటు అధికారం క్రింద వుంటుంది. ఇతని క్రింద జయిలరు, తర్వాత డిప్యూటి జయిలరు, హెడువార్డరు, వార్డరు వుంటారు. గొప్పశిక్షలు పడ్డవాళ్లను వార్డర్లుగా తీసికుంటారు. మా సూపరింటెండెంటు చిన్న ఉద్యోగంలో నుండి వచ్చిన ఆంగ్లేయుడు. ఇతడు ఒక వితంతువును పెళ్లి చేసుకున్నాడు. ఈమె కీర్తిశేషుడైన కలెక్టరు భార్యయట. ఈమె ప్రాపకం వుపయోగించి, ఇతనికి ఈ ఉన్నతపదవి నిప్పించిందని చెప్పుకునేవారు. దొరసానిగారికి తరుచూ దొరగారిమీద కోపం వస్తుండేది. కోపం వచ్చినప్పుడు సూపరింటెండెంటును, ఇతను వట్టి కుక్క అనేది దొరసాని. వీరి కోపతాపాలు, జయిలు ఖైదీలకు అనుగ్రహాలు. ఇక ఆ రోజు ఖైదీలను దండించాడని అనుకోవాలి. వీరికి వక కుమార్తె వున్నది. ఈమెతో బాడ్మింటన్ ఆడుటకు మాలో పిలిచేవారు. ఈమెకు కోపం, ఆఖైదీకి వీపున సున్నమే. కోపమువస్తే, ఆ ఖయిదీ నావంక చూచాడని తండ్రికి ఫిర్యాదు చెప్పేది. ఇకను అతనికి కాళ్లకూ చేతులకు బేడీలో, లేక చీకటి కొట్టువాసమో జరిగేది. ఈజయిలులోనే, వకవైపున బొంబై సత్యాగ్రహులు ఉన్నారు. వకరోజు 10 గంటలప్పుడు మా గదుల్లో వున్నాము. హఠాత్తుగా, పెంకుటిళ్లు తగులపడుతుంటే - బొంగులు కాల్తూ ఫిటా, ఫిటా మని శబ్దాలు వినిపిస్తవి—ఇటు వంటి ఫిటఫిటారావములు మాకు వినిపించినవి. ఎటూ పొగలేదు. ఇదేమిటా నిప్పులేకుండా ఇంత శబ్దాలు పుట్టుతున్నవని అనుకున్నాము. దీనికి తోడు ఏడుపులూ, పెడబొబ్బలూకూడా వినిపించినవి. విచారించగా బొంబై సత్యాగ్రహులను లాటిచార్జీచేసి కొట్టిస్తున్నాడు దొరయని చెప్పారు. ఎంతెంత దెబ్బలు కొట్టుతుంటే, అంత ఫిటాఫిటా అని వినిపిస్తుందని, విస్తుపోయాము. బొంబై సత్యాగ్రహులను దొర కొట్టిస్తున్నాడని ధిక్కరించారు. అందువల్ల కసిదీరా పశుతుల్యంగా వధచేయించాడు. ఆ దెబ్బల తీవ్రతకు మా హృదయాలు వుండపట్టలేకపోయినవి. తోటి సత్యాగ్రహులను ఈ విధంగా పశుతుల్యంగా హింసిస్తుంటే, భయపడి వూరుకోవలసిందేనా అని అనుకున్నాము. పలుగురము చేరి, దీనికి ప్రతీకారం గాంధేయమార్గంలో చేయనియెడల, ఈ దొర అక్రమాలకు అన్యాయాలకు, పశుత్వానికి అంతు వుండదని అనుకున్నాము. సత్యాగ్రహిచేతులో వున్న ఆయుధము నిరాహార దీక్ష. జెయిలులో ఇది తీవ్రమైన చర్య. ఖైదీని అన్నము తినకుండా వుండనీయకూడదు. ఇది ప్రాణాపాయం కనుక, బలవంతానైనా ఆహారము ఇప్పించే పని అధికార్లు చేయాలి. అందుచే మేము భోజనాలకు వెళ్లలేదు. సత్యాగ్రహికి ఈ పూట భోజనము చేస్తానని ధైర్యంవుండదు.

తెల్లవారి సోమవారము. ప్రతి సోమవారములందూ ఖైదీలంతా సూపరింటెండెంటు తణిఖీకి నిలబడాలి. ఖైదీలు తమ దుస్తులు ధరించి తమకు జెయిలులో ఇచ్చిన చెంబు పళ్లెము ముందు వుంచుకు లైనులో నిలబడాలి. దొర తనిఖీకి వచ్చినప్పుడు సెల్యూట్ చేయాలి. ఇంకేమి, బరువైన హృదయాలతో, ఖాళీపొట్టలతో మేమంతా లైనులో నిలుచున్నాము. దొర చిరచెరలాడుతూ వచ్చాడు. మా చేతులు అతనికి సెల్యూట్ చేయుటకు పైకి లేవలేదు. దీనితో మండే నిప్పులో ఆజ్యం పోసినట్లయింది. దీనిమీదట తడవకొక వదంతి రావటం ప్రారంభమైంది. బొంబైవాళ్లను కొట్టినట్లు మమ్ముల్నికూడా కొట్టిస్తాడని వకసారి, బేడీలు వేయిస్తాడని ఇంకోసారి, చీకటికొట్టులో వేయిస్తాడని ఇంకోసారి వార్తలు రా ప్రారంభించినవి. కాని ఇంతలో కొందర్ని ఇంకొకజెయిలుకు మార్చినగాని, ఈ ఆందోళన తగ్గదని, మాలో కొందర్ని రాయవేలూరు సెంట్రల్ జెయిలుకు మారుస్తున్నారని తెలిసింది. ఇదికూడా కొందరికి భయకారణమైనది. బెజవాడ, డాక్టరు పెనిగళ్ళ హనుమంతరావుగారు సుప్రసిద్ధ సత్యాగ్రహి. ఖైదీ విధులను వీసమెత్తుకూడా దాటి ఎరుగరు. కొందరు ఖైదీలు బయటనుండి పచ్చళ్ళు, పల్లకారము తినుబండారాలు, డబ్బు చాటుగా తెప్పించుకుంటుండేవారు. డాక్టరుగార్కి సుస్తీగా వున్నదని ఏమైనా ఇవ్వబోయినా తీసుకునేవారుకారు. అధికార్లు కూడా వారి ధర్మం మీరినప్పుడు వూరకునేవారుకారు. డాక్టరుగార్కి అధికార్లకు ఇగూవచ్చింది. దానివల్ల అధికార్లకు అపకీర్తి వచ్చేటట్లుండగా, ఇంకో జెయిలుకు మార్చామన్నారు. ఇట్లా మారుస్తామని, జయిలు వాకిట్లోకి తీసుకునివెళ్ళి, ఆ బలహీనుణ్ణి నిర్దాక్షిణ్యంగా కొట్టారు. వళ్ళంతా నెత్తురుకారేదాకా, నోటివెంట నెత్తురు పడేదాకా, కసితీరా కొట్టారు. అప్పుడే వారి ప్రాణం పోవలసింది. కొంతకాలమైన తర్వాత, వార్ని విడుదల చేశారు. తర్వాత పై ఘాతుకకృత్యాలవల్ల వారు దేహాన్ని చాలించారు. ఇట్లే మమ్ముల్నికూడా కొట్టుతారని కొందరన్నారు. ఎట్లయినా, జయిలులో ఎవరేమిచేసినా దిక్కులేని రోజులవి. దేశమంతా రాజకీయఖైదీలను చావకొట్టుతున్నారని గోలపుట్టింది.

మమ్ములను ఒకరోజు ఉదయాన పోలీసుబస్సులో ఎక్కించుకుని రాజమండ్రి రైల్వేస్టేషనుకు తీసుకుని వెళ్ళారు. ఇంగ్లీషు సార్జెంటు క్రింద, పోలీసు కాపలా వుంచారు రైలులో. 8 వరోజు, సాయంత్రమున, బెజవాడ రైల్వేహోటల్లో ప్రథమసారి భోజనాలు చేశాము. అక్కడినుండి మద్రాసుమీదుగా రాయవేలూరు జైలుకు తీసుకునివెళ్ళారు. ఈ మధ్య మమ్మల్ని అనేకమంది రైల్వే స్టేషన్లలో చూడటానికి వచ్చారు. చిలువూరు రైల్వేస్టేషన్ అనుకునే వున్నది నా స్వగ్రామం తుమ్మపూడి. రాజకీయఖైదీలు ఇటు వెళ్లుతున్నారని తెలిసి, నా కుమార్తె సరోజినిని స్టేషనుకు ఎత్తుకువచ్చారు. అప్పటికి మూడేళ్ల పిల్ల. నాకు చాలా చనువు. రైలుపెట్టెలో మా చుట్టూ వలటి దుస్తులతో, తుపాకులు లాఠీలతో రిజర్వుపోలీసులున్నారు. చిన్నపిల్లను నా దగ్గిర్లోకి తీసికు వచ్చారు. మావంక చూచి, కెవ్వన కేక వేసి, తల వెనక్కు తిప్పుకుంది. తర్వాత జ్వరమువచ్చి, చాలారోజులు బాధించిందని చెప్పారు. అంత భయంకరంగా వుండేవాళ్లు పోలీసువాళ్లు.

రాయవేలూరు జయిలు వాతావరణానికి, రాజమండ్రి జెయిలు వాతావరణానికి చాలా మార్పు వున్నది. ఇక్కడి సూపరింటెండెంటు, మంచి వున్నతవంశంలోని ఆగాఖాన్ జ్ఞాతుడట. వీరు ఇంగ్లండులో డాక్టరు చదివి, అక్కడ వక ఆంగ్లవనితను వివాహమాడాడు. ఈమె ఉన్నతవంశస్తురాలట. డాక్టరుగారు తనకు వచ్చిన డబ్బంతటినీ తన తమ్ముని చేతి కిచ్చేవారు. ఖర్చు అంతా తన తమ్ముడే చేసేవాడు. డాక్టరు బైటకు షికారుకు వెళ్ళవలెనంటే, అర్థరూపాయి చిల్లర పొట్లంకట్టి ఇచ్చేవారట. భార్య వకసారి, ఇంగ్లండునుండి 500 రూపాయిలకు గౌను తెప్పించిందట. ఈ డబ్బు ఇవ్వమని అడిగ్గా, మన తాహతుకు అంత ఖరీదైనదా అన్నాడట. దానిమీదట, తన తండ్రికి వ్రాసి డబ్బు తెప్పించుకుని, ఈ గౌను తీసికున్నదట. రాజకీయఖైదీలు ఇంతవరకెప్పుడూ రాలేదు, అందువల్ల మర్యాదగా చూడమని, తన భర్తకు చెప్పుచుండేవారు. డాక్టరుకూడా, తన నాయకులను, మీరు కాబోయే మంత్రులు,

అప్పుడు మేము మీ క్రింద ఇట్లా నిలబడుతామని నవ్వేవారు. ఇక సి క్లాసు ఖయిదీ తినటకిచ్చిన అన్నాన్ని, ఎట్లాగో తీసికువెళ్లి సూపరింటెండెంటుగారికి చూపించారు. అందులో పురుగులు మేకులూ వున్నవి. డిప్యూటీ జయిలరూ మహమ్మదీయుడే. ఇతన్ని పిలిచి నీకు పెళ్ళాము పిల్లలూ లేరా, ఇట్లాంటి అన్నము ఎట్లా ఇస్తున్నావని కోప్పడ్డాడు.

ఏ, బి క్లాసు వంటంతా ఇక్కడ కాశీనాథుని నాగేశ్వరరావు గారి క్రింద వున్నది. జయిలులో ఇచ్చిన డబ్బు చాలకపోతే, తన స్వంతడబ్బుకూడా వంటలకు ఖర్చు పెట్టేవారు. వారి బయటి దాతృత్వం జెయిలులో కూడా దాగలేదు. వీరు ఆరాధ్యులు. ఆరాధ్యులు మా నాశిరెడ్డివారికి గురువులు. అందువల్ల వీరంటే నాకు గురుభావం వుండేది. వీరు మరుపురాని మనిషి. బంగారపు ఛాయ గల శరీరం. తెల్లటిఖద్దరు వస్త్రాలు వేసికునేవారు. వారి చొక్కా, ధోవతి పై పంచె మల్లెపూవు లున్నట్లుండేవి. తెల్లటి ఖద్దరుటోపి పెట్టుకుని, కళ్ళకు అద్దాలుపెట్టుకునే వారు. కాళ్ళకు పల్చటి చెప్పులు వేసుకునేవారు. పై పంచె మెడచుట్టూ తిప్పి వెనక్కు వేసికుని, ధోవతి కుచ్చిళ్లు చేతిలో పట్టుకుని నడిచేవారు. వారి నవ్వుముఖములో దేవత వర్చస్సు వుండేది. వారు అందరికీ ఎట్టి భోజనాలు పెట్టినా, వీరు మాత్రము సాత్వికాహారాన్ని తినే వారు. వీరు గొప్పతత్వవేత్త. నాకు తంత్రశాస్త్రగ్రంథము కావలసి వచ్చింది జెయిలులో. అప్పుడు ఎక్కడా దొరకలేదు. వీరు ఇచ్చారు. అది ముప్పది రూపాయీలు ఖరీదైన కుండలినీ అనే తంత్రగ్రంథరాజము. వీరు వ్రాసిన భగవద్గీతను చదివితే వారు ఎంతటి అధ్యాత్మికవేత్తో తెలుస్తుంది. రామాయణయుద్ధమందు హనుమదాదులు ఎట్లా దేవతాంశసంభూతులై పుట్టారో ఆ విధం గానే వీరు, ఈ సత్యాగ్రహసమరంకొరకై జన్మించిన దేవతాంశ సంభూతులు.

చక్రవర్తులరాజగోపాలాచార్యులుగారు మాకు అప్పుడప్పుడూ గాంధీగారి అనాసక్తియోగంమీద వుపన్యాసాలిచ్చేవారు. కాని వీరికి భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారికి సరిపడేది కాదు. ఆచార్యులుగారు హిందూ మహమ్మదీయులు సఖ్యతగా వుండ వలెనని, తిట్టినా కొట్టినా సహించి వూరుకోవలెనని చెప్పేవారు. అందుకు పైపంచ కాజేసినా, పెళ్లాన్ని ఎత్తుకుని పోయినా చూస్తూ వూరుకోమంటారా అని రావుగారు అడిగేవారు. సూర్యప్రకాశరావు గారు మహోత్సాహవంతులు. ఎప్పుడూ నవ్విస్తుండేవారు. చెడుగుడు వారికి ప్రీతి. కూతకు వెళ్ళినప్పుడు దూకిన దూకుకు, మనిషంత ఎత్తుపైకి లేచేవారు. కృష్ణాపత్రికాధిపతి ముట్నూరి కృష్ణారావుగారు పెద్ద తలగుడ్డ చుట్టుకుని, నవ్వుముఖముతో బుద్ధ విగ్రహం వలె వుండేవారు. తరచూ మాట్లాడేవారు కాదు. రాజకీయాలమీద ఉపన్యసించమని ఎంత అడిగినా మాట్లాడలేదు. వారి నవ్వే సమాధానం. పట్టాభిసీతారామయ్యగారికి ఏ క్లాసు ఇచ్చారు. కాని సి క్లాసు డ్రస్సు వేసికునేవారు. నాకు ఆర్థిక రాజకీయాలు చెప్పుతుండేవారు. నవ్వి నవ్విస్తుండేవారు. బెజవాడ గోపాలరెడ్డి గారు సన్నగా బంగారుఛాయలో వుండేవారు. వారు నడిమి పాపిడి రవీంద్రుని గడ్డమూ వుండేది. అప్పుడు వరాయిలో డుక్కేవారు. నాటక సాహిత్యాలంటే ప్రీతి. అమరావతీ, బందరులను గురించి ఎక్కువగా అడుగుతుండేవారు. సాయంత్రములందు మంచి జాతీయకీర్తనలు పాడేవారు.

పెద్దలూ, పిన్నలూ చాలామంది సంగీతము, సాహిత్యము, సంస్కృతము, హిందీ చదువుకుంటుండేవారు.

గంగయ్యగారు ఏలూరు వైశ్యులు. ధనికులు, మంచివస్తాదు. వారు దండాలు బస్కీలలో మెడల్సులుకూడా సంపాదించారు. ఒక రోజు రాత్రి 8 గంటలకు వీరు పెడబొబ్బలు పెట్టటం సాగించారు. తాళాలు వేసినతర్వాత, జయిలరుతప్ప ఇతరులకు తలుపులు తీయ టానికి వీలులేదు. జయిలరు అక్కడలేడు. వీరి అరుపులకు కారణ మేమో ఎవరం కనుక్కోకుండానే, ఎట్లయిన తలుపులు తీయించ మని వార్డరును బ్రతిమలాడాము. ఆ వేళటప్పుడు అతను జయిలరు వద్దకు వెళ్ళి, ఏదో అపాయం వచ్చిందని చెప్పి తీసుకువచ్చి తలుపులు తీయించారు. గంగయ్యగారు అరుగుమీదనిలబడి, వారి టార్చి లైటును క్రిందవంక వేసివుంచారు. వళ్లంతా చెమటపోసి వుంది. ఏమిటోననుకున్నారు. కాని అక్కడ ఒక తేలుమాత్రం వున్నది. దీనికి అంతా కడుపుబ్బా నవ్వాము. వారు ఎంతవస్తాదైనా తేలంటే అంతభయమనుకున్నాము.

జెయిలులో అనేకమందిని వురితీస్తుంటారు. వారంతా దయ్యాలై, ఆ చెట్లమీద వున్నారని, ఖైదీలకు కనుపిస్తుంటారనీ చెప్పుకుంటుండేవారు. అప్పుడప్పుడూ రాత్రులందు నక్కలు వస్తుం డేవి. కొందరు అదుగో దయ్యమని కేకలు పెట్టేవారు. కొందరు కుక్క అరుపులూ, నక్కకూతలూ కూస్తుండేవారు.

మాకు డిశంబరు 30 వ తేదీన విడుదలని తెలిసింది. 29 వ తేదీన మా ఏ క్లాసు మిత్రులంతా విందుచేశారు. కాలం కులాసాగా గడిచిం దారోజు. పట్టాభి సీతారామయ్యగారివద్ద, కాశేశ్వరరావుగారి వద్ద, వడ్లంపల్లి నరసింహారావుగారివద్ద, చక్రవర్తుల రాజగోపాలాచార్యులగారివద్ద సెలవు తీసుకున్నాము. ఆచార్యులుగారు ఉద్యమాన్ని గురించి కొన్నిమాటలు చెప్పారు. తెల్ల ప్రభుత్వపు దౌర్జన్యము ఎక్కువౌతుంది, ప్రజలు ఇకను ఎదురుతిరిగేట్లుగా వున్నారన్నారు. ప్రజలు ఎదురుతిరిగినా, దౌర్జన్యానికి దిగినా, మనధర్మం మనం చేయాలి. తతిమ్మావాటికి మనం బాధ్యులముకామన్నారు.

మాకు విడుదలైన మరువాడు వైకుంఠఏకాదశి. మాకు ఇంటికి దార్లో తిరుపతి వున్నది. కనుక తిరుపతిలో దిగి, కొండమీదకు వెళ్లి తిరుపతి వెంకటేశ్వరస్వామిని దర్శనం చేసుకొని, తిరిగి ఇంటికి వెళ్ళాము. జెయిలునుండి మాస్వగ్రామము గుమ్మళ్లూడి వచ్చేవరకు మావెంట సి. ఐ. డి. లు వున్నారు. వీరు తిరుపతిలో మేమేమీ చేస్తామని మమ్మల్ని విడవక వెంటతిరిగారు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radhakrishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor S. Sambhu Prasad.




ఆంధ్ర ఏజంట్లు:

మెసర్స్.

ఏ. ఆర్. ట్రేడ్ ఏజెన్సీస్

విజయవాడ.

---

నాణ్యము ! నమ్మకము !! నాగరికత !!!

కమలములు, నవరత్నములు, బంగారు ఆభరణములు, వెండిగ్లాసులు, పళ్ళెములు, కూజాలు వగైరాలకు,



**నాదెళ్ల సంపత్తుశెట్టి అండ్ సన్**

177, చైనాబజారు రోడ్డు, మదరాసు-1.

ఫోన్: నం॥
షోరూమ్: 2002.
ఇల్లు - నం. 61725

తంతి: "నాదెళ్ల"
పోస్టుబాక్సు - 1625

---

# ప్రెసిడెంట్



"వెజిటబుల్ హేరాయిల్, ప్రెసిడెంట్ సోపు, ప్రెసిడెంట్ టాల్కం పౌడరు, నా వాడుకకు శ్రేష్ఠమైనవిగా వున్నవి" అని మా అభిమానతార...

— సావిత్రి చెబుతున్నది

తయారు చేయువారు:

**రథోడ్ ట్రేడింగ్ కంపెనీ, మద్రాసు-1.**

